# విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు

జ్యోతిషకేసరి
జ్యోతిర్వైద్యరత్న
డా. సి.వి.బి. సుబ్రహ్మణ్యం

ప్రధమ ముద్రణ 1997 ప్రతులు 1000



**వెల రు 80.00**

ప్రచురణ
**సత్యసాయి గ్రంధమాల**



**ప్రతులకు**

సి.వి. లక్ష్మి
సుబ్రహ్మణ్యం
సాయి జ్యోతిర్వైద్య పరిశోధనా కేంద్రం
101 స్వాతి కుటీర్, యూసఫ్‌గూడా, హైదరాబాద్ - 500 045. ఫోన్: 294999
(ఆరోగ్య సమస్యలకు జాతకంతో సంప్రదించవచ్చును)

సి. గోపాలకృష్ణ
శ్రీ గోపాల్ పబ్లికేషన్స్
పబ్లిషర్స్, బుక్ సెల్లర్స్ మరియు లైబ్రెరీ సప్లైర్స్
సాంస్క్రీట్ మరియు తెలుగు లిటరేచర్
3-3-860, అర్య సమాజ మందిర్ ఆపోజిట్ లేన్, కాచిగూడా ఎక్స్ రోడ్స్,
హైదరాబాద్ - 500 027.

***ముద్రణాలయం***
అమరనేని ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
6-3-387, బంజారాహిల్స్ రోడ్, పంజాగుట్ట,
హైదరాబాదు - 82. ఫోన్ 3350557

# సమర్పణ



యువనామ సంవత్సరంలో యువకుల ప్రతినిధిగా

అధికార పీఠమధిరోహించిన

యువ కేసరి

**చంద్రబాబునాయుడు** గారికి

సాదరంగా

# సంపుటి

# తలలో నాలుక

కాంతి ఎక్కడ ఉందో జ్యోతిషం అక్కడ ఉంది

జ్యోతిషం ప్రపంచంలోని అన్ని దేశాల్లో దర్శన మిస్తోంది. కాని భారతదేశంలో జాతక దోషాలను వివరించడంతో బాటు, దోషనివారణ చర్యలను గూడా ఉపదేశించడం వలన భారతీయ జ్యోతిషం ప్రత్యేకత కలిగివుంది. ఆ కారణం వలన వివిధ దేశాలలో భారతీయ జ్యోతిషానికి ప్రత్యేకత కనిపిస్తోంది.

మహర్షి వేదిక్ యూనివర్సిటీ వారి ఆహ్వానం మేరకు వేరు వేరు దేశాలలో పర్యటించిన సందర్భంలో సందేహాల సమాధానాలు, భారతీయ జ్యోతిష సూత్రాలకు సహేతుక సమన్వయం మొదలైన రీతుల్లో ఉపన్యసించిన అంశాలు ఇందులో చోటు చేసుకున్నాయి. అందరి తలలో నాలుకలా అన్ని రంగాల వారి అభివృద్ధికి దోహదం చేసే జ్యోతిషాన్ని అందరం వినియోగించుకుందాం.

ఈ విషయాలను మిత్రులు గురురాజ్ గారితో వివిధ సందర్భాలలో ప్రస్తావించినపుడు వాటినన్నిటిని ఏ కోన్ముఖం చేసి పూర్తి ప్రచురణ బాధ్యతలు వహించి దానిని మీముందుకు తెచ్చారు. వారితో ఈ కార్యక్రమంలో పాలు పంచుకున్న వారి మిత్ర బృందానికి గురురాజ్ గార్కి అమ్మవారు సకల సౌఖ్యాలను అనుగ్రహించాలని మనసారా కోరుతున్నాను.

వీని సహేతుక విధానాలను పండితులు పరిశీలించి అభిప్రాయాలను తెలుపగోరే ....

... మీ

సుబ్రహ్మణ్యం



# గ్రంథకర్త పరిచయం

**తల్లి దండ్రులు:** వ్యాకరణ వేదాంత విశారద, గీతావ్యాఖ్యాతృ చక్రవర్తి, సువర్ణ ఘంటాకంకణ భూషతేత్యాద్యనేక బిరుదు భాజనులు రాష్ట్రపతి సన్మానము నందినవారు కీ.శే. చిఱ్ఱావూరి అనంత పద్మనాభ శాస్త్రి గారు శ్రీమతి సుబ్బలక్ష్మి గారు.

**గురువులు:** తండ్రి గారు మొదలగు వారు

**పట్టములు:** భాషా ప్రవీణ, ఎమ్.ఎ (సంస్కృతము) ఎమ్.ఎ (తెలుగు) పి.హెచ్‌డి

**ఇతర విద్యలు :** వ్యాకరణ, వేదాంత జ్యోతి శ్శాస్త్రములు.

**కృషి:** జ్యోతిష సాహిత్యాలలో పరిశోధన, కవిత్వం, భారత రామాయణ, భాగవతాదులపై ప్రసంగములు జ్యోతిర్వైద్యం ద్వారా అనారోగ్యాలను నివారిండం.

**బిరుదములు:** జ్యోతిష కేసరి - హంపి విరూపాక్ష పీఠాధిపతి అనుగ్రహించినది. జ్యోతిర్వైద్య రత్న - స్టార్ ఎస్ట్రలాజికల్ రిసెర్చి సెంటర్ మరియు జ్యోతిష పరిషత్తు - హైద్రాబాద్ వారు ప్రదానం చేసినది.

**ఉద్యోగం :** జ్యోతిశ్శాస్త్రోపన్యాసకుడు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయము - హైద్రాబాద్.

**ఇతర రచనలు:** ప్రాచ్యపాశ్చాత్యజ్యోతిషాలు, జినేంద్రమాల వ్యాఖ్యానం, హోరాసారం - తెనిగింపు, విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు, జైమిని హృదయం జ్యోతిష పరిచయం, ఆనంద కల్పవల్లి, ఆనందామృతవల్లి.

**రాబోవు రచనలు:** భృగు సంహితాసారం, జ్యోతిర్వైద్యం, జ్యోతిష ప్రసంగాలు, సహేతుక జ్యోతిషం.

**నివాసం:** 101, స్వాతికుటీర్, యూసఫ్ గూడ, హైదరాబాద్ - 500 045.
ఫోన్: 294999

# శ్రీరాముని జననం - వాదోపవాదాలు

"వాఙ్మయి" వారి సౌజన్యంతో

శ్రీరామ చంద్రుదు లోకప్రసిద్ధుదు, ఇతదు జన్మించిన సందర్భంలోని గ్రహకూటమి వాల్మీకి రామాయణంలో వర్ణింపబడింది.

తతోయజ్ఞే సమాప్తేతు ఋతునాం షట్ సమత్యయు:
తతశ్చద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ
నక్షత్రేదితి దైవత్యేస్వోచ్చసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాప్పతావిందునాసహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతం
కౌసల్యాజనయద్రామం సర్వలక్షణ సంయుతం

రామా. బాల. 18 సర్గ, 7-10 శ్లో.

యజ్ఞం సమాప్తమైంది. ఆరు ఋతువులు గడిచాయి. 12 వ మాసం చైత్రంలో నవమి తిథి అదితి దేవతాకమైన పునర్వసు నక్షత్రంలో స్వోచ్చస్థానాలలో ఐదు గ్రహాలుండగా కర్కాట లగ్నంలో చంద్రునితో కలిసిన బృహస్పతి ఉదయించుచుండగా సర్వలోక నమస్కృతుదు, జగన్నాథుదు సర్వలక్షణ సంయుతుదునైన శ్రీరామచంద్రుని కౌసల్య కన్నది అని పై శ్లోకాంశాల సారాశం.

ఇందు పన్నెండవ మాసం చైత్రం అనే దానికి కొందరిలా అర్థం చెప్పుతున్నారు. "శ్రీరాముని జననానికి పూర్వం వైశాఖంతో సంవత్సరం ఆరంభమయ్యేది. అందుచేతనే సంవత్సరంలో పన్నెండవది చైత్రమాసం. శ్రీరాముని జననం అయిన తరువాత అదే సంవత్సరారంభంగా గుర్తింపబడింది."

కాని, ఆరు ఋతువులు గడిచినాయి. యజ్ఞం అయిన తరువాత పన్నెండవ మాసం అనడంవలన యజ్ఞం పూర్తి అయిన తరువాతి మాసాల్లో చైత్రం పన్నెండవదే గాని సంవత్సరంలో పన్నెండవది కాదు అని అర్థంచేసుకోవడం న్యాయం.

కౌసల్యా గర్భధారణకు పాయస భోజనమే కారణమని సంప్రదాయ వాదుల అభిప్రాయం. అట్టి స్థితిలో 12 మాసాలు శ్రీ రామచంద్రుదు కౌసల్యా గర్భంలో నివసించాదు. తొమ్మిదిమాసాలే గర్భధారణ సామాన్యం. ఈతదు 12 మాసాలు గర్భంలో నివసించడానికి కారణమేమిటి?

ఈ ప్రశ్నకు పండితుల సమాధానం ఇలా ఉంది: "వేదమే రామాయణంగా అవతరించింది. వేదంలో "సంవత్సరేణ జాయతే" అని ఉన్నందువలన ఆ వేద వాక్యాన్ని సత్యం చేయడానికి శ్రీ రామచంద్రుడు 12 మాసాలు తల్లిగర్భంలో ఉన్నాడు. 'లోకంలో సహజంగా తొమ్మిది మాసాలే గర్భంలో ఉండటం తటస్థిస్తూ ఉంటే వేదంలో సంవత్సరం అని ఎందుకుంది?' అనేది గూడ ప్రశ్నే. కాని తండ్రి గర్భంలో 3 మాసాలు, తల్లిగర్భంలో 9 మాసాలు కలసి సంవత్సరం అందరికీ పూర్తి అవుతుంది. శ్రీ రామునివిషయంలో పాయసం ద్వారా తల్లి గర్భంలో ప్రవేశించినందు వలన తండ్రి గర్భంలో లేనందువలన సంవత్సర కాలము తల్లిగర్భంలోనే పూర్తిచేసుకోవలసి వచ్చింది."

"స్వోచ్చసంస్థేషు పంచసు" అనే వాక్యానికి "పంచసు సూర్యాంగారక శని గురు శుక్రేషు స్వోచ్చస్థాన స్థితేషు" (సూర్యాంగారక శని గురు శుక్రులు ఉచ్చస్థానము లందుండగా) అని మహేశ్వర తీర్థులవారు తమ తత్త్వ దీపికా వ్యాఖ్యలో పేర్కొనగా, పంచసు గ్రహేషు స్వోచ్చ సంస్థేషు సుర్యగురు శుక్రాంగారక శనిషు స్వోచ్చస్థితేషుసత్సు" (సూర్యగురు శుక్రాంగారక శనులు తమ ఉచ్చస్థానములందుండగా) అని రామాయణ భూషణం అనే వ్యాఖ్యానంలో గోవింద రాజుల వారు తమ అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు.

వ్యాఖ్యాతల అభిప్రాయం ప్రకారం ఐదు గ్రహాలు ఉచ్చలో ఉన్నాయి. చంద్రుడు పునర్వసులో ఉన్నాడని చెప్పబడింది. కాబట్టి చంద్రుడు ఉచ్చలో లేదు (చంద్రునకు వృషభం ఉచ్చ). అది చైత్రమాసం కాబట్టి మేష ప్రాంతంలో సూర్యుడుండగా సూర్యునకు 28 డిగ్రీల దూరంలో మాత్రమే సంచరించే బుధుడు తనకు ఉచ్చరాశియైన కన్యలో ఉండడం సంభవించదు. చంద్ర బుధులు కాక తక్కిన సూర్యాంగారక శని గురు శుక్రులకే ఆ ఉచ్చ సంభవిస్తుందని ఆ వ్యాఖ్యాతల అభిప్రాయం.

కాని తిథులు ఏర్పడే పద్ధతి పరిశీలిస్తే పై గ్రహస్థితి సంభవం కాదు.

"దర్శస్సూర్యేందు సంగమః" సూర్య చంద్రులు కలసి ఒకే డిగ్రీలో ఉన్నప్పుడే అమావాస్య పూర్తవుతుంది. సూర్యునకు 180 డిగ్రీల దూరంలో చంద్రుడు ఉన్నప్పుడే పౌర్ణమి పూర్తవుతుంది. దీనిని బట్టి అమావాస్యనుండి పౌర్ణమికి తిథికి 12 డిగ్రీల వంతున సూర్యునకు చంద్రుడు దూరం కావాలి. కాగా అష్టమి తిధి పూర్తి అయ్యే సమయానికి సూర్యునకు చంద్రునకు మధ్యదూరం 96 డిగ్రీలు తప్పనిసరిగా ఉండాలి. పునర్వసు 4 వ పాదం మాత్రమే కర్కాటకంలో ఉంది కాబట్టి అచ్చట ఉండే చంద్రుడు 90 నుండి 93-20 డిగ్రీల మధ్యలో ఉంటాడు 93 వ డిగ్రీలో ఉన్నాడని భావించినా నవమి ప్రారంభం అయ్యే సమయానికి సూర్యుడు 96 డిగ్రీలు వెనుక, అంటే 357

వ డిగ్రీకి ముందే ఉండాలి. (మీనరాశి రేవతి నక్షత్రంలో ఉండాలి). సూర్యునికి ఉచ్చ మేషరాశి. సూర్యుడు ఉచ్చలో ఉంటే నవమి తిథికి పునర్వసు నక్షత్రం (చంద్రుడున్న నక్షత్రం) కావడానికి వీలులేదు. అని పైవిచారణ వలన తెలుస్తుంది.

ఈ విరోధాన్ని పరిహరించడానికి పలువురు విద్వాంసులు వేరువేరు మార్గాలను అనుసరిస్తున్నారు.

1. వ్యాకరణశాస్త్ర సంప్రదాయం ప్రకారం నావమికే తిథౌ అంటే నవమీసంబంధమైన తిథి అనే ం చెప్పాలి. నవమి తిథి అని అర్థం చెప్పకూడదు. నవమి సంబంధమైన తిథి, అష్టమి అని చెప్పిన తే పై విరోధం ఏర్పడదు అని కొందరి వాదన.

'నావమికే తిథౌ' అంటే నవమి తిథి అనే అర్థాన్ని వ్యాఖ్యాతలు సాధించారు. 'వినయాదిత్వాత్ స్వార్థేఠక్' అని గోవిందరాజులవారు 'నావమికే నవమ్యాం స్వార్థేరగార్షః" అని మహేశ్వర తీర్థులవారు అభిప్రాయపడ్డారు. పై వ్యాఖ్యాతల అభిప్రాయంతో ఏకీభవించినా ఏకీభవించకపోయినా తరతరాల సంప్రదాయమైన శ్రీరామనవమిని శ్రీరామాష్టమిగా చేయడం సాహసమే. ధర్మశాస్త్ర గ్రంథాలు గూడ ఈ అంశాన్ని వ్యతిరేకిస్తాయి.

2. రాముడు జన్మించిన సందర్భంలో మీనంలోనే రవి ఉండడం సంభవిస్తుంది కాబట్టి వాల్మీకి అభిప్రాయంలో రవికి మీనమే ఉచ్చ అయి ఉంటుందని మరికొందరి భావన.

వాల్మీకి అభిప్రాయంలో రవికి మీనమే ఉచ్చ అనడం నిరాధారమైన విషయం విశేషించి రవికి మీనం ఉచ్చ అనేమాట ఏ ఒక్క జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు చెప్పలేదు. నిరాధారమైన అంశాన్ని నిర్ధారణ చేయడం న్యాయం కాదుగదా!

3. రవి మేషంలోనే ఉన్నాడు. చంద్రుడు పునర్వసు 4 వ పాదంలోనే ఉన్నాడు. ఈ నాటికి ఆ నాటికి గ్రహ గతులలో భేదం వలన ఆనాడు నవమి తిథి సంభవించి ఉండవచ్చును. ఆ నాటి స్థితి మనకు తెలియదు కదా! అని మరి కొందరి భావన.

ఆనాటి గ్రహగతులు మనకు స్పష్టంగా తెలియవనడం మాట ఎలా ఉన్నా, ఆనాడైనా ఈనాడైనా ఆకాశమండలం 360 డిగ్రీలే. సూర్యునకు చంద్రునకు మధ్యదూరాన్ని అనుసరించి మాత్రమే తిథులు ఏర్పడాలి. అందుచేత సూర్యునకు చంద్రునకు మధ్యదూరం 96 డిగ్రీలకు లోపు ఉంటే నవమి రావడం అసంభవమే అని గుర్తించక తప్పదు.

4. స్వోచ్ఛ శబ్దానికి స్వ+ఉచ్ఛ అనే విభజన చేసి స్వక్షేత్రంలో ఉన్న చంద్రుడు ఉచ్ఛలో ఉన్న 4 గ్రహాలు కలిపి స్వోచ్ఛస్థ గ్రహ పంచకం అవుతుంది అని కొందరి భావన.

స్వోచ్ఛ శబ్దానికి స్వక్షేత్ర ఉచ్ఛక్షేత్రాలు అనే అర్థంలో ఇతరత్ర ప్రయోగం కనిపించే వరకూ ఈ వాదాన్ని అంగీకరించడం కష్టం.

5. అసంభవ గ్రహ స్థితిని వర్ణించే ఈ శ్లోకాలే ప్రక్షిప్తాలని మరి కొందరి భావన.

రామాయణంలో -

"త్రిశంకుర్లోహితాంగశ్చ
బృహస్పతి బుధావపి
దారుణాస్సోమమభ్యేత్య
గ్రహస్సర్వే వ్యవస్థితాః (అయో. 41.11 శ్లో)

అనే శ్లోకం ప్రక్షిప్తమేనని 'జర్నల్ ఆఫ్ తెలుగు స్టడీస్' జూలై 1988 పత్రికలో గుర్తించాము. అదే రీతిలో ఇది గూడ ప్రక్షిప్తంకావడంలో అభ్యంతరం ఏమీ ఉండదు. ఈ విషయంలో భోజుని శ్లోకం ఒకటి కనిపిస్తోంది.

"ఉచ్ఛస్థే గ్రహపంచకే సురగురౌ సేందౌ నవమ్యాంతిథౌ
లగ్నే కర్కటకే పునర్వసుయుతే మేషంగతే పూషణి" - రామాయణ చంపువు. బాల - 29

ఉచ్ఛలో అయిదు గ్రహాలుండగా, గురుడు చంద్రునితో కలిసి ఉండగా, సూర్యుడు మేషముండగా నవమితిథినాడు కర్కాటక లగ్నంలో పునర్వసు నక్షత్రంలో శ్రీ రాముడు జన్మించాడు అని పై శ్లోక సారాంశం.

భోజుని జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానాన్ని శంకించడం కాదు గాని పైస్థితి జ్యోతిశ్శాస్త్ర నియమాన్ననుసరించి అసంభవం కాబట్టి స్వోచ్ఛస్థ శబ్దమును వ్యాఖ్యాతల వలెనే భోజుడు గూడ సరిగ్గా అర్థం చేసుకోలేదనక తప్పదు.

వెంగుళూరు సిద్ధాంతి శ్రీ శివశంకర శర్మగారు వెనుకకు లెక్కలువేసి 3 ఉచ్ఛగ్రహాలనీ 2 స్వక్షేత్రస్థిత గ్రహాలనీ నిర్ణయించి ఇలా వివరించారు:

గారీశంభుకథా తదానవ కథా. (714086714523) - స్పష్ట్యాదికోహర్గణః

త్రేతాద్వాపర సంధికాలకలితే పశ్చాచ్ఛరాబ్దే గతే

విష్ణుర్దాశ రథిర్బభూవ భగవాన్ రామాత్మనా భూతలే

స్వభాన్వబ్దే చైత్రమాసి నవమ్యాం శుక్ల పక్షకే

పునర్వసు గతే చంద్రే లగ్నే కర్కట కాహ్వయే

మధ్యాహ్న కాలే శ్రీ రామః స్వోచ్ఛస్థే గ్రహపంచకే

ఆవిరాసీ జ్జగన్నాథః పూర్ణచంద్ర నిభాననః

స్వక్షేత్రగా చంద్రశుక్రౌతుంగే మందేజ్య భూసుతాః

ఏతే నిరయనాః ఖేటాః మేషగస్సాయనోరవి

బుధః కుంభే గ్రహస్థిత్యా రామాయణ చరిత్రతః

జ్ఞాత్వా జ్యోతిర్విదః కుర్యుః లక్ష్యేలక్షణ సంగతిం

జాతక సర్వస్వం - హోరానుభవదర్పణం 27పే. 1914 ప్రచురణ.

సృష్ట్యాది 28వ మహాయుగం వైవస్వత మన్వంతరం త్రేతా ద్వాపర సంధి 5సంవత్సరాలు గడిచినాయి సృష్ట్యాది సౌరాహర్గణం 714086 714523 శనివారం మధ్యాహ్నానికి సరియైన స్వభాను సంవత్సర చైత్ర శుద్ధ నవమీ పునర్వసు కర్కాటక లగ్నం లగ్న చంద్రుడు కుంభ బుధుడు మీన రవి వృషభ శుక్రుడు కుజ గురు శనులు ఉచ్చముల యందున్నారు ఈ గ్రహ స్థితిని రామాయణోక్త ఫలములను సరిజూడ వలసినది అని వ్రాశారు.

వారు శ్రమించి లెక్కించి సరిచూసినట్లుగా స్వోచ్ఛస్థే అనే శబ్దానికి స్వక్షేత్రములందు రెండు గ్రహములు. ఉచ్చ క్షేత్రములందు మూడు గ్రహములు ఉన్నవని అర్థము చెప్పకొనుట న్యాయముగా తోస్తోంది.

ఈ సందర్భంలోనే మరో చిన్న విషయం. శ్రీ రాముడు నవమినాడు జన్మించినను అదే శ్రీ రామనవమి. కృష్ణాష్టమినాడు రుక్మిణీ కళ్యాణం చేయడంలేదు శ్రీరామ నవమినాడు సీతా కళ్యాణం చేస్తున్నాము. ఈ విధానం సక్రమమేనా? అని ఒక సందేహం. సంప్రదాయజ్ఞుల అభిప్రాయాలను పరిశీలిస్తే శ్రీరామ నవమినాడు రామజన్మోత్సవం. దశమినాడు పట్టాభిషేకోత్సవం చేయాలి జననానికి పట్టాభిషేకానికి మధ్య కళ్యాణం తప్పనిసరి గదా! అందుచేత మధ్యలో కళ్యాణం చేయాలి. అంతేగాని జననం పట్టాభిషేకం వదిలేసి మధ్యలో కళ్యాణం మాత్రమే చేయడం సరియైన పద్ధతికాదు అని తెలుతోంది కాగా ధర్మ సింధువు "శ్రీరామ నవమినాడు కౌసల్యాదశరథులను శ్రీరామచంద్రుని పూజించాలి" అని చెపుతోంది

# భారతీయ జ్యోతిష ప్రాభవం

భారతీయ జ్యోతిశ్శాస్త్ర చరిత్రలో వేదకాలానికి పూర్వమందున్న జ్యోతిర్విజ్ఞానపు స్థితిని సమీపించే ఆధారాలు ఏవీ లేవు. కాని ఋగ్వేదాదులలో కనిపించే పరిణత వాక్యాలాధారంగా వేద కాలానికి ముందే జ్యోతిష విజ్ఞానం వికసించిందని అర్థం చేసుకోవచ్చు.

జ్యోతిషాంశాలు తెలుసుకోవడం అందరికీ అవసరమే వీటి అవసరం ప్రతిరోజు ఉంటుంది. యజుర్వేదంలోని నక్షత్రదర్శ శబ్దం జ్యోతిష్కుని సూచిస్తుంది. ఛాందోగ్యోపనిషత్తులోని 'నక్షత్ర విద్య' అనే పదం జ్యోతిషానికి మరోపేరు.

ప్రాచీన కాలంనుండి భారతీయ సంప్రదాయంలో సవన (యజ్ఞాదులు) క్రియలు ప్రాముఖ్యం వహిస్తున్నాయి. ఆ సవన కాలాన్ని గుర్తించేదే సావనమానం, పంటరావడం, యజ్ఞం చేయడం అనుబంధ విషయాలు. ఆ రెంటింటికీ కాలగమనంతోను, ఋతువులతోను అనుబంధం ఉంది.

రాత్రి, పగలు ఒకదానివెంట ఒకటి వస్తున్నాయి. ఈ స్థితి కాలగణనలో ముఖ్యస్థానం వహించింది. వాటిని వందలకొలది లెక్కించడం కష్టం. చంద్రుడు ఒకసారి పూర్తిబింబంగా కనిపించడం మరోసారి అసలు కనిపించక పోవడం గమనించి వాటిని పూర్ణిమామావాస్యలుగా గుర్తించడం కాలగణనలో మరో మెట్టు, అదే మాస గణన. ఋతువులు ఒకే వరుసలో రావడం, ఎండలు వర్షాలు, చలి మరల మరల రావడం, అది సుమారు 12 మాసాల్లో కావడం ఇది గమనించడం మూడవ మెట్టు. ఇది సంవత్సర గణన 'సంవసంతి అస్మిన్ ఋతవః' అనే వ్యుత్పత్తి ప్రకారం ఇందులో ఋతువులు ఉంటాయి కాబట్టి సంవత్సరం అని తెలుస్తోంది. అటువంటిదే వత్సరంకూడ. సంవత్సరానికి సమానార్థకాలైన వసంత, వర్ష, హేమంత, శరత్తులు ఋతువులు ఆధారంగా ఏర్పడిన నామాలు. అబ్దం అనే సంవత్సర నామం ఒకటుంది. అబ్దం అంటే నిరిచ్చేది అని అర్థం. వర్షాలపై పంటలు ఆధార పడ్డాయి. పంటలు యజ్ఞాన్ని ప్రేరేపించాయి. యజ్ఞాలు వర్షాన్నిస్తాయి అని భారతీయ సంప్రదాయం.

సూర్యోదయాలపై ఆధారపడి రోజుల లెక్క ప్రకారం ఏర్పడే సంవత్సరానికి (సావనమానం - 360 రోజులు) చంద్రుని వృద్ధిక్షయాలపై ఆధారపడి ఏర్పడే మాసాల లెక్కద్వారా వచ్చే సంవత్స రానికి (చాంద్రమానం 354 రోజులు) ఋతువుల క్రమాన్ని అనుసరించి ఏర్పడే సంవత్సరానికి (సౌరమానంపై ఋతువుల క్రమం ఆధారపడింది. సౌరమానం ప్రకారం సంవత్సరానికి 365.

2425 రోజులు) తేడా ఉంది. ఆ తేడాలను గుర్తించి ఒక లెక్క ప్రకారం సరిచేయటానికి ప్రయత్నం ఆరంభించిన సందర్భంలోనే గణితం పుట్టింది. మనుష్యునికి రెండు చేతులున్నాయి. ఆ రెండు చేతుల వేళ్ళు కలిపి లెక్కిస్తే 10 సంఖ్య ఏర్పడుతుంది. ఈ దశాంశ పద్ధతి భారతదేశంలోనే పుట్టింది. మొదట ఒక మాసంలో 30 రోజులు అనే భావన ఏర్పడింది. ఆ విధంగా రోజు, నెల, సంవత్సరం అనే గణన ఆరంభమైంది. ఆ మూడింటి సమన్వయం కోసం ఖగోళ పరిశీలన తీవ్రతరమైంది. నేటికీ మనం తేదీ, నెల, సంవత్సరం అనే వరుసలోనే గుర్తిస్తున్నాం.

ప్రాచీన కాలంలో గ్రహ వేధ అధిక ప్రచారంలో ఉండేది. ఇప్పటికీ ముస్లింలు ఈద్ పండగను చంద్రుని ఉదయాన్ని గమనించి చేస్తారు. గణితం ద్వారా సాధించిన తిథ్యాదులు గ్రహాలు దృక్తుల్యం కావాలనే నియమం ప్రాచీన కాలంలో బలంగా ఉండేది.

ఋతువులు, మాసాలు సరిపుచ్చడంకోసం పరిశీలనద్వారా సౌరచాంద్రమానాలను కలపడం కోసం అధిక మాసాన్ని లెక్కించడం ప్రారంభించారు. ఈ అధిక మాస పరిగణన ఋగ్వేదంలో ఉంది. సూర్యుని దక్షిణాయన, ఉత్తరాయణాలు, సూర్యోదయానికి ముందు నక్షత్రోదయాలు గూడ వత్సరగణనకు ఆధారం అయ్యాయి.

నక్షత్ర పరిగణన ఋగ్వేదంలో ఉంది. ప్రాచీనులు ఒక్కొక్క నక్షత్రం దగ్గర పూర్ణచంద్రుడుండగా ఏర్పడే మాసాలను గమనించారు. ఒక నక్షత్రంనుండి చంద్రుడు అదే నక్షత్రం దగ్గరకు రావడానికి $27\frac{1}{3}$ రోజులు పడుతుంది. దీనిని 27 రోజులుగా ప్రాచీనులు గుర్తించారు. మొత్తం భచక్రాన్ని 27 భాగాలు చేశారు. ఆ చంద్రుడు నడచే మార్గంలో మెరిసే చుక్కల గుంపులు గుర్తించారు. వాటి ఆకృతులను పోలిన పేర్లు పెట్టారు. 27 నక్షత్రాలు అన్నారు. తరువాతి కాలంలో గణితం వికసించిన తరువాత 27 నక్షత్రాలలో చంద్రుడు ఒకసారి తిరిగి రావడానికి $27\frac{1}{3}$ రోజులు పడుతుందని గుర్తించారు. ఆ చంద్రుడు సంచరించే మార్గాన్ని 27 సమాన భాగాలుచేసి ఆ భాగాలను 27 నక్షత్రాలు అని పిలుస్తున్నారు.

శాస్త్రాలుగాని, విజ్ఞానాలుగాని ఆమూలాగ్రంగా పరిశీలిస్తే వాని తత్త్వం స్పష్టంగా తెలుస్తుంది. ఆ సమగ్ర పరిశీలనకు వాని చరిత్ర తెలుసుకోవడం తప్పనిసరి. ఒక శాస్త్రముయొక్క చరిత్ర తెలుసుకోవడానికి అది ఎక్కడ ఆరంభమైంది ఎలా వికసించింది ఏయే సమాయాల్లో ఆ శాస్త్ర వికాసం ఎలా ఉంది దాని ప్రామాణికత విషయంలో ఏ విధంగా వర్గీకరించాలి మొదలైన విషయాలు విమర్శించాలి.

సంప్రదాయవాదుల అభిప్రాయం ప్రకారం జ్యోతిషం వేదాలతోబాటు బ్రహ్మ ముఖమునుండి వచ్చింది. మరియొక కోణంలో జ్యోతిషం వేదాంగాలలో ముఖ్యమైనది నేత్ర స్థానీయమైనది "ఋషులు యోగాభ్యాసం ద్వారా సాధించిన అతీంద్రియశక్తితో శరీరాంతర్గతమైన సౌరమండలాన్ని దర్శించి ఆకాశమండలంలోని సౌరమండలానికి సంబంధించిన రహస్యాలు కనుగొన్నారని కొందరి అభిప్రాయం".

చారిత్రికుల దృష్టి కోణంలో పరిశీలించినప్పుడు వేదాలు ఒక కాలానికి చెందినవి. ఆ వేదాలలో జ్యోతిష రహస్యాలు ఎన్నో ఉన్నాయి. ఆ జ్యోతిష రహస్యాలే వేదకాల నిర్ణయానికి గూడ ఉపకరిస్తున్నాయంటే అది జ్యోతిషాభిమానులు గర్వించదగిన విషయం.

వాస్తవ దృష్టితో పరిశీలిస్తే మానవునికి సంబంధించిన సమస్త వ్యవహారాలు జ్యోతిషంద్వారా మాత్రమే జరుగుతున్నాయి. జ్యోతిషంలోని ముఖ్యాంశం త్రిప్రశ్నాధికారం. అందలి మూడు ప్రశ్నలు దిగ్దేశ కాలాలకు సంబంధించినవి.

దిగ్దేశ కాలాల పరిజ్ఞానం లేకుండా ఏపనీ సాగదు. కాబట్టి వేద కాలంగా దేనిని గుర్తించారో ఆ కాలం కంటే పూర్వం నుండి జ్యోతిష సంబంధమైన ఆలోచన ఉందని చెప్పాలి. వేదకాలాన్ని గుర్తిస్తే అందులోనే జ్యోతిషాంశాలున్నాయి కాబట్టి, ఆ కాలంకంటే పూర్వమే జ్యోతిషాంశాల ప్రచారం, ఆచరణ ఉన్నట్లు గుర్తించవచ్చు. ప్రపంచ సాహిత్యంలో ప్రప్రథమ గ్రంథంగా ఋగ్వేదం గుర్తించబడింది. ఆ ఋగ్వేదంలో పరిణతమైన జ్యోతిషాంశాలు ఉన్నాయి. కాబట్టి అంతకుముందే జ్యోతిషాంశాల పరిశోధన భారతదేశంలో ఉంది. ఈ జ్యోతిషాంశాల పరిశీలనకు అంక విద్య ముఖ్యావసరం. అంక విద్య జ్యోతిషాంశాల పరిశీలనకు ఆవిర్భవించింది. ఆ అంకవిద్యకు భారతదేశమే జన్మస్థానమని భారతీయ జ్యోతిష పరిశోధన అతిప్రాచీనమని ఈ క్రింది వాక్యాలు నిరూపిస్తున్నాయి.

ప్రసిద్ధ సాముద్రిక శాస్త్రజ్ఞుడైన కీరో ఇలా అంటున్నారు.

"రోము దేశము, గ్రీసు దేశము, ఇజ్రాయెల్ దేశము కూడ కనివిని ఎరుగనంత ప్రాచీన కాలమున భారతీయ విజ్ఞానము ఎట్లున్నదో తెలుపునట్టి పురాతనా ధారములు ఈ జాతిలోనున్నవి. వారు క్రీస్తు శకమునకు ముందు పెక్కు శతాబ్దముల పూర్వమే విషువత్ కాలమును గుణించి సేయుట యెరుగుదురు. ఒక రాశిలో పురాణ పురుషుడు విషువద్రేఖ ప్రయాణము చేయుటకు 2140 సంవత్సరములు పట్టునని వారు గ్రహించిరి. ఇట్టి పరిశీలన చేయుటకు కావలసిన మేధాశక్తి

యెట్టిదో ఈ లెక్కలను బట్టియే స్పష్టమగును."

"మనము ప్రస్తుతం వాడే అంకెలవరుస యొక్క పుట్టుక భారతదేశంలోనే జరిగింది. ఖగోళ సంబంధమైన పట్టికలతో ఒక భారతీయ రాజదూత క్రీ.శ. 773 లో బాగ్దాదునకు వచ్చినాడు. ఆ అంకెలు అరబ్‌లో ప్రవేశించాయి. మరల క్రీ.శ. 9 వ శతాబ్ది ప్రారంభంలో ప్రసిద్ధుడైన అబుజఫర్ మహమ్మద్ ఖారజ్మీ అరబ్‌లో పైన చెప్పబడిన అంకెవరుసను గూర్చి పరిశీలన చేసినారు. ఆ సమయంలోనే అరబ్‌లో వాని ప్రచారం అధికమైంది. యూరప్ సున్నతో గూడిన పూర్తి అంకెల వరుస క్రీ.శ. 12 వ శతాబ్దిలో అరబ్బుల నుండి స్వీకరించింది" అని ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ బ్రిటానికాలో ఉంది.

శ్రీ నేమి. చంద్రశాస్త్రిగారు ఈ విషయంలో సుదీర్ఘమైన విచారణచేసి "ఋగ్వేదం, శతపథ బ్రాహ్మణం మొ||" గ్రంథాలు పరిశీలిస్తే, 20 వేల సంవత్సరాలకు ముందే భారతదేశము జ్యోతిష విజ్ఞానమును మథించింది అని అభిప్రాయ పడ్డారు.

వేదములలో ఖగోళ గణితాంశాలు ఉండడం వలన జ్యోతిశ్శాస్త్రమునకు వేదములే మూలమనే అభిప్రాయం సంప్రదాయ వాదులలో ఉంది. వేదాల కాలాన్ని గూర్చి చారిత్రికులలో పలు విధాలైన అభిప్రాయాలున్నాయి. వారి అభిప్రాయాలలో ఐక్యత ఉన్నా లేకపోయినా ప్రాచీన వాఙ్మయంగా అందరూ అంగీకరించారు.

వేదకాల నిర్ణయాన్ని గూర్చిన పరిశోధనలలో ఈ క్రింద పేర్కొన్న పాశ్చాత్య పండితులలో భిన్నాభిప్రాయాలు కనిపిస్తున్నాయి. మేక్స్ మెల్లరు క్రీ.పూ. 1200 మెగ్డోనలు క్రీ. పూ. 1500, వీట్నీ పండితుడు క్రీ. పూ. 2000, బ్రన్ హోఫరు క్రీ.పూ. 2800 అని జాకోబ్ పండితుడు క్రీ.పూ. 4000 అని తమ తమ అభిప్రాయాలననుసరించి నిర్ణయించారు.

ఋగ్వేదంలో ప్రాచీనార్యావర్తాన్ని నాలుగు సముద్రాలమధ్యనున్న దానినిగా గుర్తించడంవలన అట్టి స్థితి పూర్వంలో ఉన్నట్టిదేనని ఆధునిక విజ్ఞానం భావిస్తున్నందువలన ఆ నాలుగు సముద్రాలు ఉన్నప్పటి కాలంలోనే వేదాలు ఆవిర్భవించి ఉంటాయని, అది సుమారు లక్ష సంవత్సరాలకు ముందు మాట అని దాసుగారు అభిప్రాయ పడ్డారు!

శ్రీ బాల గంగాధర తిలక్ అభిప్రాయం ప్రకారం వేదకాలం ఉత్తరధృవ హిమ ప్రళయానంత రయుగం (క్రీ.పూ. 10000 లేక 8000) అదితియుగం (క్రీ.పూ. 8000-5000) మృగ శీర్షయుగం

(క్రీ.పూ. 5000-3000) కృత్తికాయుగం (క్రీ.పూ. 3000-2000) అనురీతిని విభజించబడింది.

యుక్తియుక్తంగా ఉన్న తిలక్‌గారి అభిప్రాయం ప్రకారం వేదకాలం అత్యంత ప్రాచీనమవి స్పష్టమవుతోంది. గ్రీకు వారిచే అతి ప్రాచీన ఖగోళ గణితజ్ఞులుగా కీర్తింపబడిన బాబిలోనియన్‌లు గుర్తించిన గ్రహణాలలో ఒక గ్రహణము క్రీ. పూ. 19-3-721 లో సంభవించింది. ఈ అంశాన్నిబట్టి వారి అర్వాచీన స్పష్టం అవుతోంది.

మధ్య అమెరికావారి మాయానాగరికత గొప్పదని వారి శాసనాల ద్వారా తెలుస్తోంది. ఖగోళ విద్యలో అపార పాండిత్యం వారు సంపాదించినట్లు గూడ తెలుస్తోంది. కాని "వారి శాసనముల భాష లిపి ఇంతవరకు పూర్తిగా అవగాహనము కాకపోవుటచే వారి ప్రతిభయొక్క పూర్తి విశిష్టతను కనుగొనలేకున్నాము".

కొందరి అభిప్రాయం ప్రకారం ఆ మాయానాగరికత సూర్య సిద్ధాంతం కంటె ప్రాచీనమైనది. సూర్య సిద్ధాంతమును సూర్యునివలన వినినట్లుగా వర్ణించబడిన మయుడు ఆ జాతివాడే. వారి అభిప్రాయంలో మయుడు మధ్య అమెరికాకు చెందిన మయజాతివాడు. కాగా ఇతడు వేదకాలంకంటే ముందు వాడు కాడు.

ఈజిప్టుకు చెందిన నైలునదీ తీరము ఖగోళశాస్త్రానికి పుట్టినిల్లు అయినా వారి కాలం క్రీ.పూ. 3000-4000.

చైనావారు గ్రహణాదుల విషయంలో అపార పరిజ్ఞానం సంపాదించారు "గ్రహణ నిర్ణయాన్ని ఖచ్చితంగా చేయలేని జ్యోతిష్కులకు చైనా రాజులు మరణదండన విధించేవారట" వారి ఖగోళ విద్యాకృతి గూడ క్రీ.పూ. 4000 నాటిదే. ఫినిషన్ల ఖగోళ విజ్ఞానం (క్రీ. పూ. 1500 నుండి 500) స్వల్పమైనదే.

పై చారిత్రకాంశాలు ఆధారంగా వేదకాలం ప్రాచీనమైనదని, ఆ విషయం కనుగొనడానికి గూడ వేదములందరి భారతీయుల ఖగోళ విజ్ఞానాంశాలే ఆధారమని తెలుస్తోంది.

భారతీయ వైజ్ఞానిక చరిత్రలో జ్యోతిషానికి మిక్కిలి విశిష్ట స్థానం ఉంది.

"అప్రత్యక్షాణి శాస్త్రాణి వివాదస్తత్ర కేవలం
ప్రత్యక్షం జ్యోతిషం శాస్త్రంచంద్రార్కౌ యత్రసాక్షిణౌ"

జ్యోతిషం తప్ప మిగిలిన శాస్త్రాలు అప్రత్యక్షాలు, వానిలో వివాదాలు మాత్రమే ఉంటాయి. సూర్యచంద్రులు సాక్షులుగానున్న జ్యోతిషం ప్రత్యక్ష శాస్త్రం.

ఈ శాస్త్రం లేకుండా భారతీయ విధానంలో అంతర్భాగాలైన శ్రౌతస్మార్తకర్మలు సిద్ధించవు అని నారద వచనం.

ఈ శాస్త్రంవలన చాలా ఉపయోగాలున్నాయి. మిగిలిన శాస్త్రాలకంటే ఈ శాస్త్రానికి ప్రవర్తకులు ఎక్కువ గ్రంధాలు ఎక్కువే.

ఈ శాస్త్రంలోని విభాగాలను దృష్టిలో పెట్టుకుంటే ఈ శాస్త్రముయొక్క ప్రయోజనాలు అవగతమౌతాయి.

ప్రాథమిక స్థితిలో జ్యోతిష ప్రయోజనంగా యజ్ఞ కాలజ్ఞానం చెప్పబడింది.

ఫలిత భాగం విస్తరించడం ఆరంభించిన తరువాత తక్కిన శాస్త్రాలకంటే జ్యోతిషం ప్రయోజనాత్మకమని అది విశ్వసించదగినదని చెప్పబడింది.

అన్యాని శాస్త్రాణి వినోద మాత్రం
నకించిదేషాంతు విశిష్టమస్తి
చికిత్సితం జ్యోతిష మంత్రవాదా
పదే పదే ప్రత్యయ మావహంతి

(ముహూర్త చింతామణి వ్యాఖ్యతో గోవింద జ్యోతిర్విత్ ఉదహరించారు. 8 వ పేజి 1925 ప్రచురణ నిర్ణయ సాగర్ ప్రెస్)

భారతీయ జ్యోతిశ్శాస్త్రము యొక్క గొప్పదనాన్ని మనం గుర్తించడానికి కొన్ని వాస్తవాంశాలను గమనించాలి.

"సూర్య సిద్ధాంతంలో భూమి వ్యాసాన్ని 1600 యోజనాలు అన్నారు. యోనం 4.9 మైళ్ళు అనే లెక్క సరియైనదైతే భూమి వ్యాసం 7849 మైళ్ళు అవుతుంది. అది నేటి లెక్కకు దగ్గర కావడం గమనించదగింది. చంద్రునికి భూమికి దూరం 51,566 యోజనాలు అన్నారు. అంటే 2,53,000 మైళ్ళు ఇదికూడా నేటి లెక్కకు దగ్గరలోనే ఉన్నది."

ఈ భూమి వయస్సు ఉరమరగా రెండువందల కోట్ల సంవత్సరములని జీన్స్ దొరగారు

అంచనా వేసినారు. మన భారతఖండములో పంచాంగ కర్తలు భూగోళ విషయములలో "సృష్ట్యాదిగతసౌరాబ్దాః" నేటికి 195,58,85,048, నూటతొంబది యైదు కోట్ల ఏబది యెనిమిది లక్షల ఎనుబదియైదువేల నలుబది యెనిమిది సంవత్సరములైనట్లు సౌరమానముచే స్థిరపరచి వ్రాయుచున్నారు.

మొదలైన అంశాల పరిశీలన మూలంగా మన భారతీయ జ్యోతిశ్శాస్త్రమునందు చెప్పబడిన వైజ్ఞానికాంశాలు ఆధునిక యంత్ర యుగంలో నేటి వైజ్ఞానికుల అంచనాలకు సుమారుగా సరిపడడం అత్యాశ్చర్యకరమైన విషయం. శ్రీ మల్లాది వారు సూర్య సిద్ధాంతమును గూర్చి వివరించే సందర్భంలో "భూగోళ గతిని తొలుత తెలిపినది సూర్యసిద్ధాంతమే.

"మధ్యే సమంతాదండస్య భూగోళోవ్యోమ్ని గచ్ఛతి
బిభ్రాణః పరమాంశక్తిం బ్రహ్మణోధారణాత్మికాం"

అని వివరించారు.

సమస్త జీవజాలముయొక్క ఆవిర్భావమునకు, స్థితికి, సూర్యకాంతి సహకారము అవసరమైనట్లుగా సమస్త విజ్ఞాన వికాసానికి, జ్యోతిషాంశాల సహకారం అవసరము. విశేషించి భారతదేశములో మానవుని అనుదిన కార్యక్రమాలలో జ్యోతిష ప్రభావం అడుగడుగున కనిపిస్తుంది. పండుగలు, పబ్బాలు, ఉత్సవాలు, మొదలైనవన్నీ జ్యోతిర్విజ్ఞానంపై ఆధారపడిన అంశాలే. చివరికి ఉత్తరం వ్రాయాలన్నా పైభాగాన తేదీని గుర్తించడం ప్రపంచమంతా అనుసరిస్తున్న విధానమే.

భారతదేశం వ్యవసాయ వృత్తిపై ఆధారపడింది. అందులో వర్షంపై ఆధారపడి పండే భూములు ఎక్కువ. చదవడం రాయడం రాకపోయినా వ్యవసాయదారునికి జ్యోతిష విజ్ఞానం అవసరమే. ప్రవర్షణాధ్యాయంలోను, సద్యోవర్షణాధ్యాయంలోను చెప్పిన శాస్త్రీయాంశాలు నేటి మాటలలో సామెతలలో ఇమిడిపోయి రైతుల శరీరాలలో అణువణువున వ్యాపించాయి. ప్రాచీన మంత్ర శాస్త్రంలోని వర్షప్రేరణ, వర్షనివారణ, పద్ధతులు నేటి కాలంలో పరిశోధించి ఉపయోగంలోకి తెచ్చుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. భద్రబాహు సంహితలో శుక్రుని గమనాన్ని బట్టి వృష్టి నివారణోపాయం వర్ణించబడిందని శ్రీ వేమి చంద్ర శాస్త్రి పేర్కొన్నారు.

ఓడలు నడిపేవారు తాము ఉన్న ప్రదేశాన్ని, ధృవ నక్షత్రముయొక్క స్థితిద్వారా గుర్తిస్తారు. నేటికీ నీడనుబట్టి, నక్షత్రాలస్థితినిబట్టి (శిరోనక్షత్రం) పగలు, రాత్రి గడియారం లేకుండా

సమయం గుర్తించగలవారున్నారు. భూగోళాధ్యయనం చేసేవారికి గూడ ఈ శాస్త్రం ఉపకరిస్తుంది. ఈ శాస్త్రంలో అంతర్భాగమైన రేఖాగణితం సమాన్యంగా కొలవడానికి వీలులేని పర్వతాల ఎత్తు, నదులలోతు, మొదలైన వాటి ఎత్తులోతులను, గ్రహాల దూరాలను కొలవడానికి ఉపకరిస్తుంది.

బాలగంగాధర్ తిలక్ జ్యోతిషాంశాలద్వారా వేద కాలాన్ని నిర్ణయించారని వెనక చెప్పాము. అలాగే చరిత్ర పరిశోధకులకు జ్యోతిషాంశాల పరిజ్ఞానం, చరిత్ర రచనలో తోడ్పడుతుంది.

సాముద్రిక శాస్త్రం ద్వారా రోగ నిర్ణయం చేసే విధానం ప్రస్తుత కాలంలో అమలులో ఉంది. అలాగే రోగ నిదానం విషయంలో జ్యోతిషం సహకరిస్తోందని విదేశీయులు గూడ గుర్తించారు. మన ఆయుర్వేదంలో రోగ నిర్ణయానికి, రోగ కాలపరిమితి తెలుసుకోవడానికి, ఓషధులు సేకరించడానికి, ఔషధములు తయారుచేయడానికి జ్యోతిష శాస్త్రసహకారం తీసుకునే పద్ధతి ప్రాచీనాయుర్వేద గ్రంథాలలో వివరించబడింది. ఆధునికమైన హోమ్యోవిధానంలో గూడ జ్యోతిశాస్త్ర నియమాలను ప్రవర్తింపచేయడం ప్రారంభమైంది. మానసిక రోగుల వికృత చేష్టలు, అమావాస్య పూర్ణిమలలో పెరుగుతున్నాయని పరిశోధకులు అంటున్నారు.

గ్రహాల స్థితి ననుసరించి రోగాలు రాకుండ జాగ్రత్తపడే పద్ధతులు జ్యోతిశ్శాస్త్రంలో వివరించబడ్డాయి. విశేషించి కుటుంబ సంక్షేమం, అంటే సంతాన నిరోధానికి జ్యోతిష పరిజ్ఞానాన్ని వినియోగించుకునే పద్ధతులు "జ్యోతిషశాస్త్ర రీత్యా కుటుంబనియంత్రణము" అనే వ్యాసం ద్వారా శ్రీ ప్రఘునారాయణ శర్మగారు వివరించారు. పురుష సంతానం కావాలంటే పురుష సంతానం స్త్రీ సంతతి కావాలంటే స్త్రీ సంతతి పొందే విధానాలు ఈ శాస్త్రంలో వివరించబడ్డాయి. ఆ నియమాలు ఆధారంగా ఆధునిక వైజ్ఞానికులు పరిశోధనచేసి విజయం సాధించారు. "1968 లో కొందరు చెకోస్లోవేకియా వైద్యులు జ్యోతిశ్శాస్త్రరీత్యా గర్భధారణను నియంత్రించగలిగారు. " చెకొస్లెవేకియా వైద్యుడు యూజెన్ జోనాస్ మగబిడ్డ కావాలన్న 8000 మందికి గర్భధారణముహూర్తాలు నిర్ణయించగా వారి నూటికి 95 మంది వంశోద్ధారకులనే కన్నారు.

భూమిపై నీటి భాగం సుమారు నాలుగింట మూడు వంతులు మానవుని శరీరంలో గూడ సుమారంతే. చంద్రుడు సముద్ర జలానికి ఆటు పోట్లు కలిగించినట్లుగానే మానవుని శరీరంలోని రక్త ప్రసరణలో వేగం పెంచుతాడు. రక్తప్రసరణ వేగం పెరగటం ద్వారా మనస్సుగూడ వేదనకు గురి అవుతుంది. అట్టి వేదన మానసిక దౌర్బల్యం గలవారిలో అధికంగా కనిపిస్తుంది. కాగా మనో దౌర్బల్యంగలవారు ఆ సమయాల్లో జాగ్రత్తగా ఉండాలి. మనస్తత్వ శాస్త్రానికి సంబంధించిన

వివరాలు గూడ జ్యోతిషంలో మనకు దర్శనమిస్తాయి.

"గణితము, ఖగోళ శాస్త్రము, జ్యోతిషము ఇవన్నియు వైదిక యజ్ఞకర్మాదులకు సహాయ కములైనటువంటి అంశములు. కనుకనే భారత దేశమునందు గణితమును మాత్రము ప్రత్యేకము పరిశీలించు గ్రంథములు 3 మాత్రమే యున్నవి. అవి బక్షాళి తాళ పత్రము, త్రిశటిక, గణిత సంగ్రహము, మిగిలిన గణిత గ్రంథములు ఖగోళ శాస్త్రమునకు, జ్యోతిషమునకు సహాయకరమైన లేదా వేది నిర్మాణమునకు ఉపయుక్తమైనవి లేదా వ్యవహార సంబంధమైనవి."

అనే అంశంద్వారా గణిత శాస్త్రవికాసానికి ఖగోళ, జ్యోతిషశాస్త్రాలే ఆధారమైనట్లు, స్పష్టమవుతోంది. ఈ విధంగా పలు విషయాలలో జ్యోతిష విజ్ఞానం ప్రత్యక్షంగా పరోక్షంగా వినియుక్తమౌతోందని తెలుస్తోంది.

మానవుడు తన జీవితాన్ని సుఖమయంగా చేసుకొందుకు ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో భవిష్యత్తును గూర్చి జిజ్ఞాస ఉంటుంది. సుఖమయ జీవనం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయా లేదా? అనే జిజ్ఞాసతో జ్యోతిషంపై ఆధారపడతాడు. భవిష్యత్తును గూర్చి కలలు గనడం వలన మానవుడు ఆశాజీవి కావడం వలన జ్యోతిశ్శాస్త్రంలోని ఫలితభాగం బాగా విస్తృతి చెందింది.

భారతీయ జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతంలో కర్మసిద్ధాంతం ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది. వరాహమిహిరుడు బృహజ్జాతక ప్రారంభంలో,

"హోరేత్యహోరాత్ర వికల్పమేకే వాంఛంతి పూర్వాపరవర్ణలోపాత్
కర్మార్జితం పూర్వభవే సదాది యత్తస్యపంక్తింసమభివ్యనక్తి"

అన్నారు.

దీన్ని వ్యాఖ్యానిస్తూ భట్టోత్పలుడు "పూర్వజన్మలో శుభం, అశుభం, మిశ్రం, అనే కర్మలద్వారా సంపాదింపబడిన ఫలాన్ని ఈ జన్మలో అనుభవించే సమయం జ్యోతిషంద్వారా వ్యక్తీకరింపబడుతుంది" అన్నారు.

లఘుజాతకంలో:

"యదు పచిత మన్య జన్మని శుభాశుభం తస్య కర్మణః పంక్తిం
వ్యంజయతి శాస్త్రమే తత్తమసి ద్రవ్యాణి దీప ఇవ" అన్నారు.

శుభాశుభములు తప్పక జరిగేవే అయినచో జ్యోతిషం ఏమి తెలుపుతుంది? అంటే శుభాశుభఫలితాలు రెండు విధాలు 1 దృఢకర్మోపార్జితము 2 అదృఢకర్మోపార్జితము. దృఢకర్మోపార్జితమైన కర్మను దశాఫలాలు వరుసక్రమంలో ఫలపరిపాకకాలాన్ని వ్యక్తీకరిస్తాయి. అశుభప్రదమైన దశాఫలాలను తెలుసుకొని యాత్రాదులు (విజయ యాత్రలు) విరమించుకోవాలి. శుభ సమయాన్ని గుర్తించి దానాదులు చేసి (శుభఫలమును పెంచుకొని) యాత్రాదులు చేయాలి. అదృఢకర్మోపార్జితమైన కర్మఫలాన్ని అష్టకవర్గం వ్యక్తీకరిస్తుంది. ఆ అశుభాన్ని తెలుసుకొని శాంత్యాదులచే దాన్ని ఉపశమింపచేసుకోవాలి.

వ్యాసులవారిలా అన్నారు.

"నిహన్యాద్దుర్బలందైవం పురుషేణ విపశ్చితా"

దుర్బలమైన దైవాన్ని (అదృష్టాన్ని లేక పూర్వ కర్మను) పురుషకారం చేత జయించాలి అని వివరించారు.

ఈవిధంగా బలహీన పడిన దుష్టఫలాలు స్వప్నాల్లో అనుభవించడం జరుగుతుందని, బలహీనంగా ఉన్న సత్ఫలితాలు గుర్తించి కృషి చేయకపోతే ఆ సత్ఫలితాలు గూడ స్వప్నంలో అనుభవించడం జరుగుతుందని పండితుల అభిప్రాయం.

మనో వైజ్ఞానిక ప్రముఖుడైన, యాడ్లర్ అభిప్రాయం ప్రకారం "కలలు అందరికీ సమానంగా రావు తాము సాధించాలనుకొన్న లక్ష్యాలకు చేరువగా ఉన్న వ్యక్తులు తక్కువగా కలలు కంటారు. ఎందుకంటే ధైర్యవంతులు సాహసులు తమ సమస్యలను జాగ్రదవస్థలోనే పరిష్కరించుకొంటారు గాన వీరు అరుదుగా కలలు కంటారు."

పైరెండు అంశాలను పరిశీలిస్తే బలహీనమైన మంచి యోగాన్ని అనుభవించడానికి కృషి చేయాలని బలహీనమైన దుష్టయోగాన్ని జయించడానికి (శాంత్యాదుల ద్వారా ఆధ్యాత్మిక) కృషి చేయాలని స్పష్టమౌతోంది. ఈ విషయంలో ప్రాచీన, ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు ఏకీభవిస్తున్నాయి.

ఈ విధంగా జ్యోతిషం వ్యక్తిని కృషిశీలునిగా చేస్తుంది. ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తుంది. భవిష్యత్తులో ఏఏ కార్యక్రమాల్ని ఏఏ వరుసలో సాధించాలో నిర్ణయిస్తుంది. అడుగడుగున దోవచూపుతుంది. అందుచేత అందరూ ఈ శాస్త్రాన్ని అభ్యసించి తమ జీవన మార్గాన్ని సక్రమంగా మలచుకోవాలి.

# జ్యోతిశ్శాస్త్రం - భారతీయత

సామాన్యంగా సమస్త భారతీయ విజ్ఞానానికి ఆత్మజ్ఞానమే లక్ష్యం. దర్శన శాస్త్రాలైనా విజ్ఞానశాస్త్రాలైనా విశ్వరహస్యాలను గుర్తించడం కోసమే కృషి చేస్తున్నాయి. జ్యోతిషం విజ్ఞానశాస్త్రంగా అఖిల బ్రహ్మాండ రహస్యాల్ని వ్యక్తీకరించడానికి ప్రయత్నించింది.

ఆత్మస్వరూపాన్ని స్పష్టం చేయడం యోగశాస్త్రానికి దర్శన శాస్త్రానికి సంబంధించిన అంశమే అయినా జ్యోతిశ్శాస్త్రంగూడా ఈ విషయంలో తనవంతు కృషి తాను చేసింది. భారతీయ సిద్ధాంత ప్రకారం ఆత్మ అమరమైనది, ప్రియమైనది. ఆ ప్రియమైన ఆత్మను తెలుసుకునే మార్గాన్ని దార్శనికులైనా వైజ్ఞానికులైనా తమ అనుభవ సామగ్రిద్వారా కనుగొన్నారు. దర్శనాలతో సమానంగా మజ్యోతిశ్శాస్త్రం ఆత్మదర్శనానికి ఉపయోగపడే శ్రవణ, మనన, నిధి ధ్యాసనలను గణిత ప్రతీకలద్వారా స్పష్టపరుస్తోంది. జ్యోతిషంలో ఆత్మసాక్షాత్కారానికి ఉపకరించే శ్రవణ మనన నిధి ధ్యాసనలు పత్రికలరూపంలో ఉన్నాయి. పత్రికల ద్వారా చెప్పే విషయం ఆహ్లాదకరంగా ఉంటుంది.

ఆత్మజ్ఞానులంతా జ్యోతిష రహస్యాలతో పరిచయమున్నవారే అలాగే జ్యోతిశ్శాస్త్రజ్ఞులంతా దర్శన శాస్త్రం పరిజ్ఞానంగలవారే అవుతారు. ఈ శాస్త్రాలను అనుబంధం అలాంటిది.

జ్యోతిషం కాంతికి సంబంధించిన శాస్త్రం. కాంతి ప్రభావం ప్రపంచ రహస్యాలు, జీవన మరణ రహస్యాలు, జీవనంలోని సుఖదుఃఖాలు వివరించేదే జ్యోతిశ్శాస్త్రం.

"మనుష్యుని వర్తమాన జీవితం అతని పూర్వ సంకల్పాల కోరికల పరిణామమే. ఈ జన్మలోని సంకల్పాలను అనుసరించి రాబోవు జన్మలోని సంఘటనలుంటాయి. ప్రాణమయ, మనోమయ, ప్రకాశరూపాలైన అన్ని కోరికలకు విషయాలకు అధిష్ఠానమైన బ్రహ్మధ్యానము కొరకే సంకల్పించండి" అని ఛాందోగ్యోపనిషత్తు తెలిపింది.

జ్యోతిషతత్త్వాలు ఆధారంగా వర్తమాన జీవనాన్ని పునర్నిర్మించుకుంటే ప్రకాశరూపమైన బ్రహ్మయొక్క సాన్నిధ్యాన్ని పొందటానికి వీలౌతుంది.

మానవ జీవనం సరళ రేఖలా సాఫీగా నడవదు. విశ్వజనీనమైన కార్య కలాపాల ప్రభావం అధికంగా ఉంటుంది.

జీవితం సాఫీగా నడిస్తే విశేషమే కనిపించదు. పాశ్చాత్య జ్యోతిషంలో కేంద్రం దుష్టమైనదని

గతంలో భావించారు. కానినేడు క్రియాశీలతా ప్రేరకంగా దానిని గుర్తించారు. ఎదురు దెబ్బలు తగిలినప్పుడే జీవన విధానము శక్తివంతమౌతుంది. సుఖదుఃఖభావన మానవుని క్రియాశీలతకు కారణము. సుఖాన్ని పొందటానికి దుఃఖాన్ని తొలగించుకోడానికి కృషిచేస్తాడు. బాహ్య అంతరంగిక జగత్తుల సంవేదన ద్వారా సుఖ దుఃఖభావనలు సంభవిస్తాయి. ఇష్టమైన వస్తువు సుఖాన్నిస్తుందని భావిస్తాం. కాని ఆ సూత్రం అన్ని వేళల సరిపడదు. గమనిద్దాం. ఒక వ్యక్తికోపంతోనో కష్టానికి సంబంధించిన విచారంతోనో ఉన్నాడనుకొందాం. ఆ సమయంలో అతనికి ప్రీతికరమైన వస్తువును అందిస్తే కోపం వస్తుంది. నవ్వుతూ మాట్లాడితే కోపం వస్తుంది. మనస్సు ఉల్లాసంగా ఉన్నప్పుడు ఏ వస్తువులు ఏ విషయాలు ఆనందాన్నిస్తాయో అవే వస్తువులు అవే విషయాలు మనస్సు చికాకుగా ఉన్నప్పుడు దుఃఖ ప్రదాలు, కోపకారణాలు అవుతాయి.

మానవ జీవనమే అనేక సమస్యల సముచ్చయం. అభివృద్ధి పతనం, ఆత్మవికాసం మొదలైన వాటికి సంబంధించిన రహస్యాలకు ఇది స్థావరం. జ్యోతిశ్శాస్త్రం ఆత్మ, అనాత్మ మొదలైన భావాలను పై రహస్యాలను వ్యక్తీకరించడంతో బాటు సమస్యల రహస్యాలను ప్రత్యక్షం చేస్తుంది. భారతీయ జ్యోతిష రహస్యం నిగూఢమైనది. జీవితంలో ఆలోచించవలసిన అన్ని విషయాలు ఈ శాస్త్రంలో ప్రతిపాదించబడ్డాయి. నిర్వచించాలంటే "జీవనాన్ని విశ్లేషించేదే జ్యోతిశాస్త్రం".

భారతీయ జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులకు వ్యావహారికం, పారమార్థికం అనే రెండు లక్ష్యాలున్నాయి. వ్యావహారిక దృష్టిలో దిక్కు, దేశం, కాలం అనేవానికి సంబంధించిన పరిజ్ఞానం ఈ శాస్త్రం ద్వారా కలుగుతుంది. ప్రకృతిలోని పదార్థాలను అణువణువున పరిశీలించి విశ్లేషించడం ఈ శాస్త్రంలో భాగమే. దిగ్దేశకాలాల పరిజ్ఞానం లేకపోతే వ్యవహారికంగా ఏ పని సరిగా సాగదు. కాగా ఏ పని ఏ సమయంలో చేయాలో ఆ పని ఆ సమయంలో చేయడానికి ఉపకరించేది జ్యోతిశ్శాస్త్రం వ్యావహారిక దృష్టిలో దీని ప్రయోజనమిదే.

ఈ శాస్త్రంలో కాలపురుషుడు బ్రహ్మ, గ్రహాల రాశుల ప్రభావంవలన ఆ పురుషుని శరీరాంగాలను ఉత్తమ, మధ్యమ, ఉదాసీన, అధమాలని విభజిస్తారు. త్రిగుణాత్మకమైన ప్రకృతి ద్వారా నిర్మింపబడిన సమస్త జగత్తు సత్వరజస్తమో గుణాత్మకమైనదే. సత్వగుణం అధికంగా ఉన్న గ్రహాల కిరణాలు అమృతమయాలు. రజోగుణం అధికంగా ఉన్న గ్రహాలు కిరణాలు మిశ్రితాలు తమోగుణం అధికంగా ఉన్న గ్రహాలు కిరణాలు విషమయాలు. మూడు గుణాలు స్వల్పంగా ఉన్న గ్రహాల కిరణాలు ఉదాసీన గుణం కలవి లేదా బలహీనాలు.

గ్రహాల శుభా శుభ విభజన ఈ కిరణ గుణాలపైన ఆధారపడి ఉంటుంది. ఆకాశములో సంచరించే అమృత రశ్మిలుగల సౌమ్య గ్రహాలు ఏయే ప్రదేశాలలో తమ కిరణాలను ప్రసరిస్తాయో ఆయా ప్రదేశాలలో నివసించే ప్రజల స్వాస్థ్యం, బుద్ధి, మొదలైన వాటిపై తమ సౌమ్య ప్రభావాన్ని చూపిస్తాయి. విషమయ కిరణాలుగల క్రూర గ్రహాలు తమ గతి ద్వారా ఆయా ప్రదేశాలలో ఉన్న వాళ్ళపై తమ చెడ్డప్రభావాన్ని చూపిస్తాయి. మిశ్రిత రశ్మిలుగల గ్రహాల ప్రభావం చేత మిశ్రిత ఫలాలు సంభవిస్తాయి. బలహీన రశ్మిలు ఎట్టి ప్రభావాన్ని స్వతంత్రముగా చూపించలేవు. పుట్టిన సమయములో ఏయే రశ్మిలుగల గ్రహాల ప్రాధాన్యం ఉంటుందో జాతకునిలో ఆ విధమైన స్వభావం ఉంటుంది. లోకములోవున్న ప్రతి వస్తువుమీద గ్రహాల ప్రభావం ఉంటుంది.

జ్యోతిశ్శాస్త్రంలో వర్ణవ్యవస్థవుంది. అది గుణ కర్మలపై ఆధారపడినదేకాని వంశపరంచే ఏర్పడేది గాదు. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః" అని కృష్ణుని పలుకులు.

కాలపురుషుని ఉత్తమాంగాలపై అమృతమయ రశ్మిల ప్రభావం ఉండగా పుట్టినవాళ్ళు పరిపూర్ణబుద్ధి. సత్యం పలకడం, పొరపాట్లు లేకుండా ఉండటం, చక్కని చదువు, ఇంద్రియ నిగ్రహము, ఉన్నత భావాలు, సచ్చరిత్ర గలిగి వుంటారు. ఇవి బ్రాహ్మణగుణాలు. కాలపురుషుని మధ్యమాంగాలపై రజోగుణాధిక్యత గల మిశ్రిత కిరణాల ప్రభావం వలన పుట్టిన వాళ్ళు మధ్యమ బుద్ధి, తేజస్సు, శూరత్వము, వీరత్వము, ప్రతాపం, భయం లేకుండా ప్రవర్తించడము, చక్కని చదువు, సజ్జనానుగ్రహం, దుష్టనిగ్రహము అనే గుణాలు కలిగి వుంటారు. ఇవి క్షత్రియ గుణాలు. కాలపురుషుని ఉదాసీనాంగాలపై, సత్వ రజస్తమో గుణాలు స్వల్పముగా ఉన్న గ్రహరశ్మిల ప్రభావంతో పుట్టిన వాళ్ళు ఉదాసీన బుద్ధి, వ్యవసాయ నైపుణ్యము పురుషార్థలయందు ఆసక్తి చక్కనిచదువు, సంపద కలిగి వుంటారు. ఇవి వైశ్యగుణాలు.

కాల పురుషుని అధమాంగాలపై తమో గుణాధిక్యత గల గ్రహరశ్మిల ప్రభావం వలన జన్మించిన వాళ్ళు వివేక శూన్యత దుర్బుద్ధి, వ్యసనాలు సేవా స్వభావం, హీనాచరణ కలిగి ఉంటారు. ఇవి శూద్ర లక్షణాలు.

జ్యోతిష శాస్త్రమందలి ఈ వర్ణవ్యవస్థ వ్యక్తి గుణాలకు సంబంధించినది. అని మనం గుర్తుంచుకోవాలి.

భారతీయ జ్యోతిర్వేత్తల అభిప్రాయం ప్రకారం మానవుడు ఏ నక్షత్రగ్రహ వాతావరణ తత్త్వ ప్రభావ విశేషం వలన జన్మించి పోషించబడతాడో ఆ తత్త్వ విశేషం గలవాడౌతాడు. గ్రహాల

స్థితి విలక్షణతచే అన్యతత్త్వాల న్యూనాధిక ప్రభావం సంభవిస్తుంది. ప్రదేశ సంబంధమైన గ్రహ సంస్కారాలు ఈ అంశాన్నే వ్యక్తీకరిస్తాయి. స్థాన విశేషానికి సంబంధించిన వాతావరణంలో జన్మించి పోషింపబడిన ప్రాణి ఆ స్థానంలో వున్న గ్రహరశ్మల విశిష్టత కలిగి ఉంటాడు. అందువలన అదే సమయంలో మరోచోట పుట్టిన వ్యక్తికంటే భిన్న స్వభావం, భిన్నాకృతి, కలవాడౌతాడు. ఈ గ్రహరశ్మల ప్రభావం మానవులమీద మాత్రమే కాదు వృక్షాలు, పశుపక్ష్యాదులు మొదలైన వాటిపై గూడ తప్పనిసరిగా ఉంటుంది.

జ్యోతిశ్శాస్త్రంలో ముహూర్తకాల నిర్ణయం ఒక చక్కని రహస్యం. ఆకాశంలోని గ్రహాలు, అమృత కిరణాలు, విషకిరణాలు, సమగుణ కిరణాలు కలిగి ఉంటాయి. రశ్మల ప్రమభావం అన్ని సమయాలలో ఒకే రీతిగా ఉండదు. గతి విలక్షణతవల్ల ఒక్కొక్క సమయంలో నక్షత్రగ్రహ వాతా-వరణం ఒక్కొక్క రీతిలో ఉంటుంది. అప్పుడు తమ గుణతత్త్వ విశేషంవల్ల ఒక విశేషకార్యసిద్ధికి ఉపకరిస్తుంది. అందువలననే విభిన్నకార్యాలకు సంబంధించిన ముహూర్తాలు మూఢవిశ్వాసం కాదు. విజ్ఞాన సమ్మతమైనదే. కాని జాగ్రత్తగా పరిశీలించక పెట్టిన ముహూర్తాలు సత్ఫలితాలివ్వవు.

గ్రహాల దుష్టప్రభావాన్ని దూరం చేసుకోవడానికి రత్నధారణచేసే విధానం జ్యోతిశ్శాస్త్రంలో వుంది. ఇది నిరర్థకంకాదు. సౌరకుటుంబంలోని వాతావరణ ప్రభావం వల్ల రాళ్ళయొక్క రంగు, రూపం, పృథివి, జలం, అగ్ని మొదలైన తత్త్వాలలో ఒక తత్త్వం యొక్క ప్రాముఖ్యం ఏర్పడతాయి. సమగుణాలున్న రశ్మలుగల గ్రహాలచే పోషింపబడి నడుపబడే వ్యక్తికి ఆ గ్రహరశ్మల వాతావరణంవల్ల పుట్టిన రత్నాలు ధరిస్తే అనుకూల ఫలితాలు కలుగుతాయి. తనకంటే వేరైన ప్రభావంవల్ల పుట్టిన రత్నాన్ని ధరిస్తే ప్రతికూల ప్రభావం కలుగుతుంది.

స్వభావాను రూపమైన రశ్మిప్రభావాన్ని పరిశీలించి తాత్త్విక సామ్యాన్ని గమనించి, రత్నాలు ధరిస్తే లాభాలు కలుగుతాయి. గ్రహాలలోని ఏ తత్త్వ ప్రభావం వల్ల రత్నం విశేషంగా ప్రభావితమైందో ఆ గ్రహాలయొక్క మంచి, ప్రభావం తక్కువగా ఉన్న మనిషికి అవసరమైన శక్తిని ఆ రత్నం ఇస్తుంది. కృష్ణ పక్షంలో పుట్టిన వ్యక్తికి చంద్రుడు దోషి అవుతాడు. అంటే అతడు చంద్రుని అమృత మయ కిరణాల మంచి ప్రభావం పొందలేదు. అతని శరీరంలో కాల్షియం తక్కువగా ఉంటుంది. ఆ లోపాన్ని సరిచేయడానికి చంద్రుని అమృతమయ కిరణ ప్రభావం వల్ల పుట్టిన ముత్యం అతనికి ఉపకరిస్తుంది. చంద్రునికి సంబంధించిన దోషాలు తొలగటానికి ముత్యం ధరించడం సంప్రదాయంలో వుంది.

జ్యోతిష శాస్త్ర ప్రకారము గ్రహాలు శుభాశుభ ఫలితాలను ఇచ్చేవి కావు. శుభాశుభఫలితాల ఇవ్వటానికి వాటికి ఆయా మానవులపై కోపంగాని ప్రేమగాని లేవు. కాని ఆయా శుభాశు ఫలితాలను గ్రహాలు సూచిస్తాయి. ఆ గ్రహాల సూచన ముందుగా గుర్తిస్తే దుఃఖాలను తొలగించు కొనేటందుకు కృషి చేయవచ్చు. సత్ఫలితాలను పెంపొందించుకోవచ్చు. గ్రహాల రశ్మి ప్రభావాన్ని జయించే అధికారము మనకు వుంది.

"అష్టం, మానుషం, ప్రోక్తం సప్తమాత్ దైవచింతనం" అనేది మన సంప్రదాయంలో ప్రసిద్ధ-మైన శ్లోకం. పదింట ఆరు వంతులు మానవుని కృషికి, నాలుగువంతులు దైవప్రభావానికి లోబడి ఉంటుంది. దైవమంటే ఇక్కడ అదృష్టం. అదృష్టమనేది కనిపించనిది. విశేషించి పూర్వజన్మలో మనం చేసిన కర్మకు ఫలిత రూపమైనది పూర్వంలో చేసిన పనికి ఎలాంటి శక్తి వుందో ఈ నాడు మనం చేసే పనికి, గూడ అలాంటి శక్తి వుంటుంది కదా. భారతీయ దర్శనాలు, ఆధ్యాత్మిక శాస్త్రాలు ఈ విషయంలో ఎటువంటి సమాచారాన్ని అందిస్తున్నాయో పరిశీలిద్దాం. గతంలో ఆర్జించిన సంస్కారమే ప్రాణికి సుఖదుఃఖాలకు కారణమౌతోంది. సంస్కారమంటే పూర్వంచేసిన కర్మయొక్క సూక్ష్మ రూపం, నిన్న మనం చేసిన పనియొక్క వాసన ఈ రోజు ఆ పనియందు మనను ప్రేరేపిస్తుంది. వాసన అంటే ఆ పనియొక్క సూక్ష్మ రూపం అని అర్థం. సంస్కార సంపాదన అన్ని సమయాల్లోను జరుగుతూంటుంది. పూర్వం సంపాదింపబడిన సంస్కారాలు నేటి సంస్కారాల ప్రభావానికి లోనౌతుంటాయి.

పూర్వజన్మలో చేసిన కర్మకు ఫలిత రూపమైన అదృష్టం (కనిపించని అవశేషం)తో బాటు నేడు చేసే మంచి లేదా చెడ్డ పనులకు గూడ శక్తి ఉంటుంది. కాని కొంత కర్మ పటిష్టమై వుంటుంది. దానిపై ఈ జన్మలో చేసే పనులయొక్క ప్రభావం ఉండదు. కాని చాలవరకు జయించడానికి అవకాశం వుంటుంది.

పూర్వ జన్మార్జితం పాపం వ్యాధి రూపేణ బాధతే తచ్ఛాంతి రౌషధైర్దానై: జప హోమక్రియా-దిభిః అనే శ్లోకం ప్రసిద్ధమైనదే పూర్వజన్మలో చేసిన పాపాలకు ప్రతిఫలంగా వచ్చిన అనారోగ్యాలను ఓషధులు, దానాలు జపాలు మొదలైన వాటిద్వారా శాంతింపజేసుకోవచ్చు. ఇందులో మందులు లౌకిక ప్రయత్నం, దాన జపాదులు ఆధ్యాత్మిక ప్రయత్నం పూర్వ కర్మకు పదింట నాలుగు వంతులు బలం ఉండగా ఈ జన్మలో చేసే ప్రయత్నానికి ఆరు వంతులు బలం ఉంటుంది. ఆ ఆరు వంతులలో మూడు వంతులు లౌకిక ప్రయత్నానికి మూడు వంతులు ఆధ్యాత్మిక ప్రయత్నానికి బలం ఉంటుంది. ఆధ్యాత్మిక ప్రయత్నంగా దైవ ప్రార్థన ఒక్కటే చేస్తామంటే దాని బలం మూడు

పాళ్ళేగాబట్టి నాలుగు పాళ్ళు బలం గలిగిన పూర్వ కర్మబలాన్ని జయించలేదు. "గాల్లో దీపం పెట్టి దేవుడా! నీ మహిమ" అన్నట్లుంటుంది

లౌకిక ప్రయత్నం ఒక్కటేచేసినా దాని బలం 3 పాళ్ళుగాబట్టి 4 పాళ్ళు బలంగల పూర్వకర్మను జయించలేదు. కాగా పూర్వ కర్మను జయించాలంటే ఆధ్యాత్మిక ప్రయత్నం, లౌకిక ప్రయత్నం రెండూ చేయాలి. కాగా జ్యోతిశ్శాస్త్రం ద్వారా తనకు రాబోయే సుఖదుఃఖాలను ముందుగా తెలుసుకొని తన పనులను సక్రమంగా నిర్వహించవచ్చు. గ్రహాల ప్రభావం అనుభవించక తప్పనిదే అయితే పురుష ప్రయత్నం వ్యర్థమే అవుతుంది. ఇక ముక్తికోసం ప్రయత్నించమనే ఆధ్యాత్మిక శాస్త్రాలన్నీ వ్యర్థం అవుతాయి. కాగా పురుష ప్రయత్నం ప్రబలమైతే పూర్వకర్మ తొలగిపోతుంది. అని అర్థం చేసుకోవాలి. అలాగే సత్ఫలితాలను పరిపుష్టం చేసుకోవడానికి నేటి పురుష ప్రయత్నం పనికొస్తుంది. వేద విహితాలైన శాంతిపౌష్టిక కర్మలంటే అవే. దోషాన్ని శాంతింపజేసుకొనేవి శాంతి కర్మలు, గుణాన్ని పరిపుష్టం చేసుకొనేవి పౌష్టిక కర్మలు. కాగా ఈ శాస్త్రం రాబోయే కష్ట సుఖాలను సూచించేదేగాని, నియమించేది కాదు. లౌకిక దృష్టిలో మిక్కిలి గొప్పదైన ఈ శాస్త్రం రహస్యం ఇదే.

ప్రపంచంలోని మొత్తం వాఙ్మయాన్ని వర్గీకరిస్తే రెండు రకాలు. ఆధ్యాత్మిక వాఙ్మయము, లౌకిక వాఙ్మయము, ఆధ్యాత్మిక విషయాలను చెప్పే శాస్త్రాలు లౌకిక విషయాలపై ప్రాముఖ్యం కలిగి ఉండవు. లౌకిక విజ్ఞాన శాస్త్రాలు ఆధ్యాత్మిక విషయాలపై ప్రాముఖ్యం చూపించవు. కాని జ్యోతిశ్శాస్త్రం లౌకిక విషయాలను, ఆధ్యాత్మిక విషయాలను సమన్వయం చేస్తుంది. అందరికీ ఉపకరిస్తుంది. దీపం అనేది దేవుని పూజ మొదలైన ఆధ్యాత్మిక కార్యాలకు ఉపకరిస్తుంది. చదువుకోవడం మొదలైన లౌకిక కార్యాలకు ఉపకరిస్తుంది. చీకటి ఏ పనికైనా ప్రతి బంధకమే. అందుకే జ్యోతిషాన్ని కరదీపిక అన్నారు. చేతిలో దీపం అన్నిటికీ ఉపకరించిన రీతిలో జ్యోతిషం అందరికీ ఉపకరించేదే.

జ్యోతిషం జీవన సత్యాలను విశ్లేషిస్తుంది. ప్రపంచంలో అన్ని శాస్త్రాలు ఒక్కొక్క అంశాన్ని మాత్రమే విశ్లేషిస్తే జ్యోతిషం ఆంతరిక బాహ్యజగత్తులతో సంబంధం గల అన్ని విషయాలను ప్రతిపాదిస్తుంది. దార్శనికులు పరమాణువువరకు పదార్థ విభజన చేస్తే జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అణువునుగూడ గణితం ద్వారా విభజించారు. కమలాకరభట్టు పరమాణువును గూడ సావయవమని నిరూపించాడు. జ్యోతిషం జీవనం, జగత్తు అనే వాటితో సంబంధం కలదే కాని అతీతమైనది.

ఇంద్రిజ్ఞానం అసంపూర్ణమైనది. అందుకనే వాస్తవాంశాలను గుర్తించడానికి ఇంద్రియజ్ఞానం సరిపోదు. తార్కికులు ప్రత్యక్ష అనుమాన, ఉపమాన, శబ్ద ప్రమాణాలను అంగీకరించారు. జ్యోతిషం శబ్దప్రమాణమే అయినా అతీంద్రియ జ్ఞానం వలె వాస్తవానికి దగ్గరగా ఉంటుంది. దీని ద్వారా మానసిక ప్రవృత్తులను విశ్లేషించి అనేక సమస్యలకు పరిష్కారాలను కనుగొనవచ్చు. మనోవిశ్లేషణ శాస్త్రం వలే ఫలిత జ్యోతిషం అనేక జీవన తత్త్వాలను వ్యాఖ్యానిస్తుంది. ఇందులో మనోవృత్తుల విశ్లేషణ ఉంటుంది. ఈ విశ్లేషణ సాహిత్యం కంటే మనోవిజ్ఞాన శాస్త్ర విశ్లేషణ కంటే భిన్నమైనది, విశిష్టమైనది అని భావించవచ్చు. దీని ద్వారా మానవ జీవనంలోని రహస్యాలు, భేదాలు స్పష్టం అవుతాయి.

దర్శనశాస్త్రాల వల్లగాని, కష్టాలను ఎదుర్కోవడంవలనగాని ఏర్పడిన నైరాశ్య వాదాన్ని ఖండించి మానవుని కర్తవ్యోన్ముఖునిగా చేయడంలో ఈ శాస్త్రం అసామాన్యమైనది. భవిష్యత్తును స్పష్టీకరించి ప్రయత్నించడం ద్వారా తనకు అనుకూలంగా మలచుకోవడానికి తగిన ప్రేరణను జ్యోతిష శాస్త్రం ఇస్తుంది. ఈ ప్రేరణకు దుఃఖాన్ని తొలగించుకోవడానికి లక్ష్యాన్ని ఏర్పరచుకోవడానికి దాన్ని సాధించడానికి ఉపకరిస్తుంది.

పారమార్థిక దృష్టితో పరిశీలిస్తే మోక్ష సాధనకు అనుకూలమైన సమయాన్ని దానికి అనుగుణమైన కృషి విధానాన్ని బోధిస్తుంది. ఈ శాస్త్రము సహేతుకమై తర్కసహమై విరాజిల్లుతోంది. దీనిలోని గణితాలన్నీ బిందువు (సున్న)తో ప్రారంభమౌతాయి. ఆది నిర్గుణ నిరాకార బ్రహ్మకు ప్రతీక బిందువులో దైర్ఘ్యంకాని, విస్తారంగాని లేవు. ఉనికి మాత్రం ఉంది. అది కల్పనాతీతం నిరాకారం వ్యవహారం కోసం దీన్ని సున్నగా (0) ప్రదర్శిస్తాం. ఈ బిందువు గతిశీలమైతే రేఖగా రూపొందుతుంది. పరబ్రహ్మకూడా ఈ విధానంలోనే "ఏకోహం బహుస్యామ" అనే కామనారూపమైన ఉపాధిద్వారా మాయకు ఆధారమౌతున్నాడు. భారతీయ జ్యోతిషంలో బిందువు పరబ్రహ్మకు, రేఖమాయకు ప్రతీకలు ఈ రెండింటి సంయోగం ద్వారా క్షేత్రగణితము, బీజగణితం, అంకగణితం మొదలైన వాని విస్తృతి కొనసాగుతోంది.

జ్యోతిశ్శాస్త్రంలో సూర్యచంద్రులు ప్రధాన గ్రహాలు సూర్యుడు పురుష గ్రహము "సూర్య ఆత్మాజగతః" జగత్తుకు సూర్యుడే ఆత్మస్వరూపుడు. చంద్రుడు మనస్సు "చంద్రమా మనసోజాతః" అనగా ఆత్మ-మనస్సు అంటే పురుషుడు ప్రకృతి. ప్రకృతి పురుషుల కలయిక సకల చరాచర జగత్తుకి కారణం. పంచభూతాలు-కుజాది పంచగ్రహ స్వరూపాలు. ప్రపంచంలో ఎక్కడ చూసినా పంచభూతాలు ప్రకృతి పురుషులు తప్ప వేరేమి కనిపించదు. అందుచేత పారమార్థిక దృష్టి

కోణంలో కూడ జ్యోతిశ్శాస్త్రం పూర్తిగా అన్వయిస్తుంది. కాగా కేవలం లౌకిక శాస్త్రాలకంటే కేవలం పారమార్థిక శాస్త్రాలకంటే లలితంగా రెండింటిని సమన్వయంచేస్తూ భారతీయ జ్యోతిశ్శాస్త్రం జ్ఞాన నేత్రమై కరదీపికగా మార్గదర్శకమై కృషి శీలతా ప్రేరకమై కృషి సాఫల్యాన్ని కల్గించి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపేదై, విశ్వతోముఖమై విశ్వజనీనమై విరాజిల్లుతోంది. దాన్ని ఆధారంగా చేసుకొని మనమంతా అభివృద్ధి పథంలో మన గమనాన్ని సాగిద్దాం.

# జ్యోతిష స్వరూపం

"జ్యోతిషాం సూర్యాది గ్రహాణాం బోధకం శాస్త్రం జ్యోతిశ్శాస్త్రం" సూర్యచంద్రాది గ్రహాలు నక్షత్రాలు మొదలైన కాంతి వస్తుదార్థాల స్వరూప స్వభావాలను జీవులపై వాని ప్రభావాలను తెలిపే విజ్ఞానమే జ్యోతిశ్శాస్త్రం. మానవుని కార్యకలాపాలు దినచర్య సూర్యోదయ సూర్యాస్తమయాలతోను చంద్రోదయం, చంద్రుని వృద్ధి, క్షయాలు నక్షత్రకాంతి, మొదలైన వాటితోను, అనుబద్ధములై, ఉండడంవలన ఆది కాలంలో వీటి పరిశీలన మానవునికి తప్పనిసరి అయింది.

సామాన్యంగా కాంతి ఆనందాయకమైనది మనిషి విచారంలో మునిగి ఉన్నప్పుడు చీకటిని కోరుకుంటాడు. సూర్యుడు కనిపించని రోజును దుర్దినంగా వ్యవహరించడం సంప్రదాయం. ఆనంద సమయంలో దీపాలంకరణ కోరుకుంటాడు. నిప్పును కనుగొనడానికి పూర్వం పగలు సూర్యుడు రాత్రి చంద్రుడు నక్షత్రాలు కాంతి దాయకాలైనాయి. పున్నమి చంద్రుడు ఆబాల గోపాలానికి నేటికీ ఆనంద దాయకుడే. గ్రహాల గమనంలో ఉన్న క్రమ పద్ధతి మానవునికి వాటిని గూర్చి పరిశీలించాలనే ఉత్సుకతను రేకెత్తించింది. క్రమబద్ధమైన గ్రహ చలనాలకు, ప్రకృతిలోని మార్పులకు సంబంధాన్ని గుర్తించాడు. ప్రకృతిలో రాబోయే మార్పులు అంచనాల ద్వారా ముందుగానే ఊహించడం ఆరంభించాడు. క్రమంగా సూర్యచంద్రాది గ్రహాలు మానవునిపైన గూడ ప్రభావాన్ని చూపుతున్నట్లుగా గుర్తించాడు. ఉత్సుకత, పరిశీలన, ఆలోచన, ప్రయోగం, పరీక్ష, ఈ శాస్త్ర వికాసానికి మూలాధారాలు. దిగ్దేశ కాలాల పరిజ్ఞానం కోసం ఆరంభమైన జ్యోతిషం దిక్కుతోచని స్థితిలో దిక్కు చూపుతోంది. కూడుగుడ్డల కాధారమై నిలువ నీడనిస్తోంది. కార్యానుకూలమైన కాలాన్ని తెలుపుతోంది. మానవుని ఉనికికే మూలాధారమౌతోంది. భాష పుట్టక పూర్వం నుండి జ్యోతిషజ్ఞానం అవసరమైంది. మానవుని ఆదిమ విజ్ఞానం జ్యోతిర్విజ్ఞానమే. శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు ఈ విషయాన్ని గూర్చి "మానవుని దృష్టి వాని యోచన వాని జిజ్ఞాస ప్రప్రథమమున జ్యోతిశ్శాస్త్రాభివృద్ధికే వినియోగమైనవి అన్ని శాస్త్రాలలో జ్యోతిశ్శాస్త్రమే

మొదటిది" అని వివరించారు. మానవుని జిజ్ఞాస సత్యదర్శనానికి తోడ్పడింది. విశ్వరహస్యాల నెన్నిటినో ఆవిష్కరించడానికి కారణమౌతోంది. కాంతి కంటిని ఆకర్షిస్తుంది. గ్రహాల్లో, కాంతి ఉంది. ఆకర్షణ శక్తి ఉంది. గ్రహించేది గ్రహం. గ్రహించేది అంటే ఆకర్షించేది అని అర్థం. గ్రహాల గత్యాదులతో బాటు గ్రహ ప్రభావాలను వివరించేది జ్యోతిశ్శాస్త్రం అన్నప్పుడు స్థూలంగా జ్యోతిషం రెండు భాగాలు. గ్రహ గత్యాదులు తెలిపేది సిద్ధాంతం గ్రహ ప్రభావాలను తెలిపేది ఫలభాగం. కాని ఫలభాగంలో గ్రహ ప్రభావాలే కాక పదార్థ ప్రభావాలు, శుభాశుభశకున ప్రభావాలు, మానవుని దినచర్యతోను, (జీవనోపాధి) వివిధ వృత్తులకు సంబంధించిన ఎన్నో అంశాలతోను సంహితాభాగాన్ని సమకూర్చారు. తరువాతి కాలంలో ప్రశ్న, శకునాలు, గూడ సంహితనుండి విడిపోయి ప్రత్యేక స్కంధాలుగా ఏర్పడ్డాయి.

**సిద్ధాంత స్కంధం:** దీనికే గణిత స్కంధం అని మరోపేరు. ఇది యుగ ప్రమాణాలు, మహాయుగ ప్రమాణాలు, త్రుట్యాది సంవత్సరాంతములైన వివిధ కాల ప్రమాణాలు, మన్వంతర ప్రమాణాలు, గ్రహాలు, సౌర, సావన, చాంద్రాది వివిధ సంవత్సర ప్రమాణాలు, ప్రయోజనాలు, రవ్యాది గ్రహాల గమన విశేషాలు, కుజాది పంచగ్రహాల వక్రాదులు, గ్రహ సమాగమాలు, గ్రహ యుద్ధం, ఉదయాస్తమయాలు, మౌఢ్యము, గ్రహాల భ్రమణ, పరిభ్రమణ కాలాలు, గ్రహాల కక్ష్యా ప్రమాణాలు, భూమినుండి గ్రహాల దూరాలు, దిగ్దేశ కాలములకు సంబంధించిన స్పష్టవివరణలు, భూగోళ పరిజ్ఞానం, ఖగోళ పరిజ్ఞానం, నక్షత్ర విభాగాలు, అగస్త్యచార, సప్తమహర్షి చార, వ్యక్త అవ్యక్త గణితాల ప్రయోజనం నాళికాది యంత్రాల నిర్మాణం, అక్షజ్యా లంబజ్యా, మొదలైన జ్యామితి గణితం, అంశాలను లెక్కవేసే పద్ధతులు మొదలైన పలు అంశాలతో ఇది పరిపుష్టం అయింది.

**జాతక ఫలభాగం:** ప్రతి మనిషికి జన్మకాల గ్రహస్థితిని అనుసరించి రాబోయే శుభాశుభ ఫలితాలు వివరించడం ఇందలి ముఖ్యాంశం. దీనికి మరోపేరు హోరా భాగం అని అంటారు. జాతక ఫల భాగంలో, ద్వాదశభావాలు, నవగ్రహాల వివిస్థితి, దృష్టి, అవస్థలు, సంయోగం, సమాగమం, మొదలైన వాని ద్వారా జీవితంలో రాబోయే శుభాశుభ ఫలితాలు తెలుపడం జరుగుతుంది.

ఈ విధానాలలో ముఖ్యంగా మూడు పద్ధతులున్నాయి. అవి పరాశరమతం, జైమిని మతం, యవనమతం అనేవి. వీనిలోని ముఖ్య భేదాలను గూర్చి శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారు ఇలా వివరించారు.

"యవన మతములో ఫలాన్వేషణము ఆరు విధములుగ నిర్ణయింపబడినది ఎట్లనగా -

1. గ్రహజము (గ్రహములు స్వతంత్రముగా ఇచ్చు ఫలము గ్రహకారకత్వములు)
2. భావజము (భావములు స్వతంత్రముగ ఇచ్చు ఫలములు భావకారకత్వములు)
3. రాశిజము (రాశులు స్వతంత్రముగ ఇచ్చు ఫలములు రాశి గుణ స్వరూపాదులు)
4. గ్రహ భావజము (గ్రహములు భావ సంబంధముచే నిచ్చు ఫలములు)
5. గ్రహ రాశిజము (గ్రహములు మేషాది రాశులయందుండుటచే నిచ్చు ఫలములు)
6. గ్రహ యోగజము (గ్రహములు రాశి భావ సంబంధముచేనిచ్చు ఫలములు)

ఈ ఆరు రకములు ఫలములను అవాంతర భేదములచేత రాశిశీల గ్రహశీలాది ఫలభేదములు, ద్విగ్రహాది యోగ ఫలములు కల్పింపబడినవి. ఈ మతములో ఆయుర్దాయ సాధన పద్ధతిని బట్టి దశాక్రమము నిర్ణయింపబడుచుండును.

పరాశర మతములో తన్వాది ద్వాదశ భావ ఫలములు దశాంతర్దశా ఫలములు ప్రధానముగా నుండును.

ఈ మతములో తను, ధన, తృతీయ చతుర్థాది ద్వాదశభావముకు సంబంధించిన ఫలములను గ్రహ భావసంబంధములచే నిర్ణయించి, ఆయా ఫలములనుభవములోనికి వచ్చు కాలమును నిరూపించుటయే దశాంతర్దశాఫల విధానముగ నుండును. పరాశమతములో రవ్యాది గ్రహముల నాధారముగ గ్రహించి వింశోత్తరి. అష్టోత్తరి, షోడశోత్తరి, ద్వాదశోత్తరి మొదలగు గ్రహదశలు తెలియజేయబడును. దశలను నిర్ణయించునపుడు జాతకుడు జన్మించిన సమయ విశేషమునుబట్టి దశానయన భేదము చెప్పబడును. సర్వ సాధారణముగ యీ మతములో వింశోత్తరి దశతో దశాంతర్దశాఫలములు చెప్పబడుచుండును.

జైమిని మతము పై రెండు పద్ధతులయందుగల విషయములను గ్రహించుచు వానిలో తెలియజేయబడని ఇతరాంశములను, విశేషాంశములను చెప్పి ఫలానుభవమును చెప్పుటకు రాశి దశలను గ్రహించి దశాఫల నిర్ణయము చేయు విధానము చెప్పియుండెను. పై రెండు పద్ధతులవలన తెలుసుకొనుటకు అవకాశములేని కొన్ని విషయములు ఈ పద్ధతిలో తెలుసుకొనవచ్చును.

పై అంశాన్నిబట్టి వివిధ విధానాలు ఉన్నాయని తెలుస్తోంది. ఒక విధానంనుండి మరొక విధానం విస్తృతి చెందినదని గూడ తెలుస్తోంది.

ఈ శాస్త్రానికి సంబంధించిన ప్రాచీన మతాల్లోని కొన్ని కొన్ని అంశాలకు ప్రాముఖ్యం

ఇస్తూ మరికొన్ని కొత్త విషయాలను అనుభవాలను చేరుస్తూ వివిధ గ్రంథ కర్తలు లెక్కకు మించిన గ్రంథాలు రచించారు. అలా స్వతంత్ర గ్రంథాలు రచించిన వారిలో వరాహ మిహిరుడు, నారచంద్రుడు, సిద్ధసేనుడు, శ్రీపతి, శ్రీధరుడు, కేశవుడు మొదలైన వారు ప్రసిద్ధులు.

మొత్తంమీద ఈ విభాగంలో రాశి, హోరా, ద్రేక్కాణాది షోడశ వర్గులు, గ్రహాల దిక్, స్థాన, చేష్టాది షడ్బలములు, నిషేకకాల, జన్మకాల నిరూపణములు, సద్యోమరణ, బాలారిష్టాది - ఆయుర్దాయ పరిమితులు, ఫలకాల నిర్ణయానికి సంబంధించిన దశాంతర్దశలు, భావఫలాలలోని హెచ్చు తగ్గులను నిర్ణయించే అష్టకవర్గు రాజయోగాదులు, చాంద్రయోగ, ద్విగ్రహాది యోగాలు వాని ఫలాలు, తన్వాది ద్వాదశ భావఫలాలు మొదలైన విషయాలు చోటుచేసుకుంటాయి.

సంహితా విభాగం: పలు విషయాలను ఒక చోట సమకూర్చటమే సంహితా శబ్దానికి అర్థం. ఇందులో గృహ, ఆలయ, శిల్ప, యంత్ర వాస్తువులు ఉన్నాయి. తిలక, అంగ, హస్త, ముఖ, పశు సాముద్రికాలున్నాయి. సర్వకార్యాలకు ముహూర్తాలున్నాయి. దేశంలో సంఘటనలు తెలిపే దేశ గోచారం వ్యక్తి భావి ఫలాలను సూచించే వ్యక్తి గోచారం గూడ ఇందులో చోటు చేసుకున్నాయి.

వ్యవసాయానికి మూలాధారమైన వర్షాలకు సంబంధించిన సద్యోవృష్టి ప్రవర్షణం అనేవి వివరించబడ్డాయి. భూగర్భ సంపదలైన జల, ధన లోహాదులను గుర్తించే పద్ధతులు గూడ ఇందులోనే ఉన్నాయి. గ్రహ దోషాలకు శాంతులు వర్ణింపబడ్డాయి. రత్నాలను పరీక్షించేవిధానాలు ఇందులో ఉన్నాయి. ఆరోగ్యానికుపకరించే వైద్యం. ప్రశ్న శాస్త్రం శకున శాస్త్రం అశ్వలక్షణాలు గజ లక్షణాలు, కుక్కుటలక్షణాలు మొదలైన ఎన్నో విషయాలు ఈ భాగంలో ఉన్నాయి. వృక్షాయుర్వేదంకూడ దీనిలో వివరింపబడింది. మనిషికి ఉపయోగించే అన్ని విషయాలు సంహితా భాగంలో చోటుచేసుకున్నాయి.

## ప్రశ్న స్కంధం:

ఇది జాతకాదుల అవసరం లేకుండానే తాత్కాలికంగా ఒక కార్యాన్ని గూర్చి ఫలితాన్ని చెప్పే శాస్త్రం. ప్రశ్నకర్త ఉచ్చరించిన అక్షరాలను బట్టి, ప్రశ్నకర్త ప్రశ్న అడిగిన సమయంలోని గ్రహస్థితిని బట్టి ప్రశ్నకర్త వచ్చినపుడు జ్యోతిష్కుని స్వర (ఇద, పింగళ, సుషుమ్నానాడులు) స్థితిని బట్టి, ప్రశ్నకర్త చెప్పిన సంఖ్యనుబట్టి ప్రశ్నకర్త హావభావచేష్టాదులను బట్టి ప్రశ్న ఫలితాలు చెప్పే విధానాలు ఈ స్కంధంలో స్థానం సంపాదించాయి.

శకున స్కంధం: శకునాలకు వేదకాలంనుండి ప్రత్యేకమైన గుర్తింపు ఉంది.

డా|| దీపచంద్ర శర్మగారు "సంస్కృతకావ్యమే శకున" అనే తమ హిందీ పరిశోధనా గ్రంథంలో శకునాలను ఆరు విధాలుగా వర్గీకరించారు.

1. గ్రహోపగ్రహాలకు సంబంధించినవి
2. ప్రకృతి తత్త్వాలకు సంబంధించినవి
3. పశు పక్ష్యాదుల గతులకు సంబంధించినవి
4. శరీర లక్షణాలను బట్టి తెలిపేవి
5. స్వప్నాలకు సంబంధించినవి
6. వివిధ శకునాలు (మనుష్యులు ఎదురు రావడం మొదలైనవి)

ఆ అంశాలన్నీ ఈ విభాగాలనికి చెందినవే.

విక్రమ సంవత్సరం 1089 ఆచార్య దుర్గదేవుడు ఆరిష్ట విషయాలను గూడ శకున శాస్త్రంలో భాగాలుగానే గుర్తించాడు.

ఈ విధంగా ప్రపంచ విజ్ఞానం సమస్తం జ్యోతిశ్శాస్త్రంలో అంతర్భూతమై వుంది. కాంతులతో సంబంధంలేనివి ప్రపంచంలో ఏమీ లేవు

# జ్యోతిషంలోని సహేతుకత - జ్యోతిషం ఆధునిక విజ్ఞానం

మన భారతీయ శాస్త్రాలన్నీ సహేతుకతను కార్యకారణ సంబంధాన్ని గౌరవించాయి. విశ్వసించాయి. "యుక్తియుక్త ముపాదేయం వచనం బాలకాదపి యుక్తిహీనం పారిత్యాజం వచనం బ్రహ్మణోదితం" అనే వచనం ప్రసిద్ధమైనదే ఎక్కడో సుదూర ప్రాంతాలలో ఉన్న గ్రహాలు మానవునిపై ప్రభావం చూపడం చాలా అసమంజసమని కొందరిభావన కాని కాంతి ఎంతదూరం వరకు కనిపిస్తుందో అంతవరకు దాని ప్రభావం ఉంటుంది. ప్రతిపదార్థం సూక్ష్మీకృతమైన కొద్దీ శక్తి పెరుగుతూ ఉంటుంది. హోమియోసిద్ధాంతం ప్రకారం స్థూలపదార్థం కంటె సూక్ష్మపదార్థం కొన్నిలక్షల రెట్లు విలువకలిగినది. చెవులకు వినిపించని సూక్ష్మశబ్దాన్ని ఉత్పత్తిచేస్తే అది చుట్టుప్రక్కనున్న మేడల అద్దాలతలుపులను పేల్చివేసింది. అణువులోని శక్తి అందరు ఎరిగినదే. సూర్యుని కాంతి స్థూలమైనదే అది ఓజోన్ పొరద్వారా సూక్ష్మీకృతమై విశిష్ట లక్షణములు కలిగిఉంటోంది. ఆ సూర్యునికాంతి గ్రహమండలములలో ప్రతిఫలించడం వలన ఒకసారి సూక్ష్మీకృతమై ఆగ్రహములనుండి వచ్చుకాంతి ఓజోన్ పొరద్వారా మరల సూక్ష్మీకృతమై వ్యక్తియొక్క మానసికస్థితిపై ప్రభావాన్ని చూపుతోంది.

కాంతి ఎందరిపై ప్రసరిస్తోందో ఆ అందరిపై ఒకే విధమైన ప్రభావాన్ని చూపాలి. ఒక్కొక గ్రహం ఒక్కొక్క వ్యక్తిపై వేరువేరు కాలాల్లో వేరువేరు ప్రభావాన్ని చూపించడం ఏ విధంగా సమంజసమౌతుంది అని మరికొందరివాదన. ఒక్కొక్క గ్రహానికి పలురకాల ప్రభావాలు ఉన్నమాటనిజం వాటిలో కూడ అవాంతరభేదాలు చాలా ఉంటాయి. ఇంకను విశేషించి ఒకేపని వేరువేరు పరిస్థితుల్లో మంచిదిగాను చెడ్డదిగాను పరిణమిస్తూఉంటుంది. ఎక్కువమందిని చంపిన సైనికుడు తనప్రభువు విజయం సాధిస్తే మహా వీరుడుగా గుర్తింపు పొందుతున్నాడు. ఆతడే శత్రువులచే జిక్కితే పెద్దదేశద్రోహిగా ఉరితీయబడుతున్నాడు. ఉరితీయడమే వృత్తిగా కల్గినవాడు దానికి తగిన పారితోషికం పొందుతున్నాడు. మామూలు హంతకుడు శిక్షింపబడుతున్నాడు. 50 మంది మనుషులు ముందుకు నడుస్తుండగా వెనుకనుండి 'సుబ్బారావుగారు' అనే మాట వినిపించినది. ఈ శబ్దంయొక్క ప్రభావము ఆ శబ్దంతోసంబంధంగల (ఆ పేరుగల) వ్యక్తిలో, వ్యక్తులలో స్పందన కలిగించి వారిని వెనుతిరిగేలా చేస్తుంది. అనగా గ్రహాలు ప్రేరేపించే భావాలు ఆయా వ్యక్తులలో ఉన్న వాసనలపై ఆధారపడిఉంటాయి. రంగుకు శక్తి ఉంది సూర్యకిరణాల్లో రంగులున్నాయి. గ్రహాల్లో

రంగులున్నాయి. రంగులు భావాలను ప్రేరేపిస్తాయి. ఎరుపురంగు సామాన్యునిలో ఉత్తేజాన్ని హంతకునిలో హింసను. బాలునిలో భయాన్ని ప్రేమికునిలో రక్తిని, కార్మికునిలో శ్రమ శక్తిని ఉత్తేజ పరుస్తుంది. ఈ లక్షణాలన్నీ కుజునివే. కుజుడు ఎర్రనివాడు. ఈతనికి ఎముకలో ఉండే మజ్జపై ఆధిపత్యం ఉంది. ఎముకపై రవి ఆధిపత్యం ఉంది. రవికి ఆధిపత్యంగల అల్పమూల్యరత్నం పగడం కుజునకు ఆధిపత్యంగల రత్నం పగడం ఆధునికవైద్య పరిశోధనలలో విరిగిన ఎముకకు పగడపుమేకులు వేయడం ద్వారా అద్భుతమైన ఫలితాలు సాధించారు. ఆ ఎముకను మరొక ఎముకతో లతికితే కొత్తగా పెరిగే ఎముక లతికినచోటు వరకు పెరుగుతుంది. తరువాత రెండు కలిసిపోతాయి. అదే కోరల్‌తో (పగడం) లతికితే ఎముకపెరిగిన కొద్దీ కోరల్ కరిగిపోతుంది. చివరికి అతుకు కనపడకుండా మొత్తం ఎముకేవస్తుంది. ఈ విషయాన్నిగమనించే పరిశోధనలు ఫ్రాన్స్‌లో 20 సం. క్రితమే మొదలయ్యాయి. విరిగిన ఎముకపెరుగుతున్న కొద్దీ కోరల్ పదార్థం కరిగి కలిసిపోతుందని పరిశోధకులు గుర్తించారు. ఎముకలలాగే పగడపు జంతువుల శరీరాలు కూడా రంధ్రాలుకలిగి ఉండడంవల్ల ఇలా జరుగుతుంది. రక్తం ఈ రంధ్రాలలోకి పోతుంది. రక్తంలోని కార్బోనిక్ ఎన్ హైడ్రేజ్ అనే ఎంజైము, కోరల్‌ని కరిగిస్తుంది. ఈ రకంగా ఇంచుమించు మూడువారాలలో కోరల్ పూర్తిగా మాయమయిపోయి ఎముక అతుక్కుంటుంది. 1982 ఈ విధానం అమలులోకి వచ్చినప్పటినుండి ఇంచుమించు 5000 మందికి పైగా జయప్రదంగా ఎకిర్స (?) చేయగలిగామని ఫ్రెంచి పరిశోధకులు తెలియజేస్తున్నారు. (1990 ఆదివారం ఆంధ్రజ్యోతి ప్రత్యేకానుబంధంలో పడింది కె. గోపాలంగారి విరిగిన ఎముకలకు పగడపుమేకులు అనే వ్యాసం) పై అంశాన్ని బట్టి అతి ప్రాచీనకాలంలో పగడంలో రవికి కుజునికి ఉన్న సంబంధాన్ని ఎకముకలలో రవికుజులకున్న సంబంధాన్నీ జ్యోతిశ్శాస్త్రజ్ఞులు గుర్తించారు. అనగా ఆ రెండు ఆ ఇరువురి శుభకాంతి సమ్మేళనాలవలన ఉత్పత్తి అవుతున్నాయని రెండింటిలో మూలపదార్థం సజాతీయమైనదని పగడపుకాంతులు ఎముకలదోషాన్ని తొలగిస్తాయని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు గుర్తించారు. ఆధునికవైద్యంలో ఆ రెండింటి సారూప్యం నిరూపించబడింది. గ్రహాలకాంతులే వ్యక్తిపై ప్రభావాన్ని చూపిస్తాయి. 'మానవశరీరంపై రంగుల ప్రభావం చాలా పనిచేస్తుంది. మన మనస్సును బట్టి పగలనకా రేయనకా రంగురంగుల ఊహలు పుట్టుకొస్తుంటాయి. అయితే మానసికస్థితిని, ఆరోగ్యాన్ని, శరీర రుగ్మతలను రంగులు తెలియజేస్తాయి. రంగు రంగు. ఏ ఋతువులో మనిషి మానసిక ఆరోగ్యాలమీద శాస్త్ర వేత్తలు పలు ప్రయోగాలు చేసి ఫలితాలు వెల్లడించారు.

ఓ గదిదో ఎరుపు మొదలు లేతనీలిరంగు వరకూ గల పలురంగుల వెలుగులలో శరీరస్థితులపై సుప్రసిద్ధ సోవియట్ శాస్త్రజ్ఞులు జరిపిన ప్రయోగఫలితాలు ఇలా ఉన్నాయి. ఎరుపురంగు మన

కండరాల్లో ఉద్రిక్తతను గుండెలదడను, శ్వాసక్రమాన్ని, బ్లడ్‌ప్రెషర్‌ని పెంచగలదు. మరోవిధ మనిషిని ఉత్సాహపరచి శక్తినిగూడా ఇవ్వగలదు. మానసికంగా తనచుట్టూ ఉన్న ప్రజలను గురిం బాధ్యతగూడా పెరుగుతుందని తేలింది. ఎనిమిక్‌గా రక్తం తక్కువయి పాలిపోయిన పిల్ల ఎర్రరంగు వెలుతురులో రంగుగోడల గదిలో అవసరమైనంత కాలం ఉంచిగమనిస్తే వారి రక్తం ఎర్రకణాలు అభివృద్ధిచెందడంతో పాటు బరువుపెరిగి ఉత్సాహంపుంజుకుంటున్నట్టుగా కూ ప్రయోగాల ద్వారా తెలిసింది. అలాగే నీలిరంగు, లేతనీలిరంగుల్లో మనకు ఎక్కువైన బ్లడ్‌ప్రె గుండెదడ శ్వాసలో ఇబ్బంది మొదలైనవి క్రమంగా తగ్గిపోయి ఆరోగ్యం కుదుటపడుతుం నీలిరంగు వెలుతురున్న గదిలో మానసికరోగులను ఉంచిచూస్తే వారిలో మానసికకోపంతగ్గి కొం నింపాదిగా వుంటోదని తేలింది. హోటళ్ళ వంటగదుల్లో వంటల రుచి లైటునుబట్టికూడా వుంటుంద శాస్త్రవేత్తలు తెలియజేశారు. రెస్టారెంట్లలో తెల్లని కాంతిఉంటే హాయిగా కొంచెం మత్తు కూడా ఉంటుందని ప్రయోగాల్లో తేలింది. అలాగని ఒకేరంగులో మొహంమొత్తేవరకూ ఉం ఆరోగ్యం పాడవుతుందనికూడా తేలింది. కనుక అవసరాన్ని బట్టి తగినంతరంగులో మాత్ర వెలుతురుండాలి. చిమ్మ చీకటిలోంచి రంగురంగుల నీడలోకివస్తే నరాల ఉద్రిక్తత తగ్గి అలసటతీ ప్రశాంతత ఏర్పడుతుంది. గదిలో ఎరుపు, పసుపుపచ్చ, వెచ్చదనాన్నీ నీలం చల్లదనాన్ని ఇస్తాయి లేతనీలిరంగు లేతాకుపచ్చ లేత వైలెట్ రంగులు గదిలో గోడలకు వాడితే గది ఎంతో విశాలంగ వున్నట్టు తోస్తుంది. ఎరుపు ఆరంజ్, పసుపు అయితే గదికొంచెం చిన్నగా ఉన్నట్టుతోస్తుంది అందుకేనేమో యవ్వనాన్ని సప్తవర్ణాల ఇంద్రధనుస్సుతోనూ, ముసలితనాన్ని నల్లటిచీకటితోను కవులు వర్ణించేవారు. (ఆంధ్రజ్యోతి 1990 ఆదివారం అనుబంధం) ఈ పరిశోధనాంశాలు రంగులకు శక్తులున్నాయని తెల్పుతున్నాయి. సూర్యకాంతిలో ఉన్న ఏడురంగులు గ్రహమండలాలపై ప్రసరించి ఓజోన్ పొరద్వారా సూక్ష్మీకృతములై వ్యక్తుల మనసులపై ప్రభావాన్ని చూపుతున్నాయి. సూక్ష్మీకృతమైన పదార్థం విశిష్టమై శక్తిని పొందుతుందను సూత్రం ఆధారంగా సూక్ష్మీకృతమైన కాంతి వ్యక్తుల మనసులపై ప్రభావాన్ని చూపుతుందనే అంశం నిరూపించబడుతోంది. పైన చెప్పిన పరిశోధనల్లో బద్ధకస్తుడైన శనికి సంబంధించిన నీలిరంగు విశ్రాంతిని ఉత్సాహోద్రేకములకు సంబంధించిన కుజుని ఎరుపురంగు ఉత్తేజాన్ని అతడే ఎముకలకు కూడా అధిపతికావడం వల్ల ఎముకల అభివృద్ధిని కల్గిస్తోంది అనడం సహేతుకమే.

ఈ విధంగా ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాలు ఆధారంగా జ్యోతిష శాస్త్రంలోని సహేతుకతను గూర్చి వివరించే అవకాశాలు చాలా ఉన్నాయి. ఆధునిక వైజ్ఞానికులలో కొందరు ఈ శాస్త్రం యొక్క స్వరూపాన్ని గమనించకుండా ఆ శాస్త్రము మూఢవిశ్వాసం అనడం తొందరపాటు చర్యగా

భావించవలసివుంటుంది. బట్లర్ మహాశయుదు మొదలగువారు జ్యోతిషశాస్త్రం సహేతుకంగాదని భావించి దాన్ని ఖండించడం కోసం శాస్త్రాన్ని అధ్యయనంచేసి దానికే దాసోహమైపోయారు. ఆల్ఫ్రెడ్ యాడ్లర్ మహాశయుదు కారల్గుస్తాఫ్ యూంగ్ మహాశయుదు మొ. సుప్రసిద్ధ మనస్తత్వశాస్త్రవేత్తలు జ్యోతిషశాస్త్రంలోని సైద్ధాంతికవాస్తవాలను అంగీకరించారు. వైజ్ఞానికంగా ప్రగతిని సాధించిన జర్మనీ దేశంలో వైద్యులకు జ్యోతిషం కూడ ఒక పాఠ్యాంశంగా ఉంది. అమెరికా దేశంలో 21 యూనివర్శిటీలలో జ్యోతిషం పాఠ్యాంశంగా బోధింపబదుతోంది విశేషించి కేన్సర్లోని రకాలను గుర్తించడానికి జాతకాన్ని వినియోగించుకుంటున్నారు. అనే అంశం జ్యోతిషాభిమానులకు ఆనందాన్ని కల్గించకమానదు. కాంతి శాస్త్రాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే కాంతే వృక్ష జాతుల్లో పదార్థంగా పరిణమిస్తోంది. ఆ పదార్థం ఆహారంగా స్వీకరించడం వల్ల జీవజాలమునకు శరీరం వృద్ధిచెందుతోంది. ఆకోణంలో ఆలోచిస్తే ప్రతిజీవియొక్క శరీరంలోని ప్రతిఅణువు కాంతియొక్క రూపాంతరమే అని చెప్పవచ్చు. "వెలుగు ఆకులకు ఆకుపచ్చని రంగునిచ్చే పసరు (పత్రహరితం) మీద పడ్డప్పుడు బొగ్గు పులుసు గాని, నీరు కలిసి పంచదారగా మారిపోవడానికి తోడ్పడుతుంది. (వెలుగు 26వ పేజి రచయిత శ్రీ వేమరాజు భానుమూర్తి) ఆకుపచ్చని ఆకులలో వెలుతురు సోకి పంచదార తయారయినపుదు జరిగినదేమిటంటే కాంతిశక్తి కొంత రసాయనశక్తిగా మారి పంచదారరూపంలో నిలువచేయబడినదన్న మాట అందుచేతనే మనం పంచదార తిన్నపుడు రసాయనశక్తిగా ఉన్న కాంతిశక్తిని మనం పొందుతున్నామన్న మాట (అదే 27వ పేజి) ఈ విధంగా కాంతి పదార్థంగా రూపాంతరం చెంది శరీరాకారాన్ని దాల్చుతోంది. అలాంటి కాంతి కాంతితో తయారయిన మన శరీరం మీద మనసుపైన చూపే ప్రభావాన్ని విశ్లేషించడంమే జ్యోతిశాస్త్రం యొక్క ప్రధానోద్దేశం. ఈ కాంతి జ్ఞానానికి సంకేతం. నేటికైనా ఆధునిక వైజ్ఞానికులు మేధావులు తమ దృష్టిని జ్యోతిశ్శాస్త్రం యొక్క ఔన్నత్యాన్ని దర్శించడం వైపు మళ్ళిస్తారని ఆశిస్తున్నాను.

"తమసోమా జ్యోతిర్గమయ"

# జ్యోతిష పఠనావశ్యకత

ప్రాచీన వాఙ్మయంలో 6 అంగాలలో జ్యోతిషానికి అతిముఖ్యమైన స్థానం ఇవ్వబడింది. వేదా యజ్ఞకర్మను ప్రోత్సహిస్తాయి. యజ్ఞము లౌకిక దృష్టికలవారికి ఉపయుక్తమైనదికాదు. వేదా గాలలో శిక్ష, వేద పఠనావశ్యకతలేనివారి కుపయుక్తమైనది కాదు. వ్యాకరణం పండితవర్గమున మాత్రమే పరిమితం. ఛందస్సు వేదాభ్యసనపరులకు కవిత్వరచనాసమర్థులకు పరిమితమైన శాస్త్ర నిరుక్తం వేదార్థ పరిజ్ఞానం అవసరమైనవారికే ఆవశ్యకము. కల్పము యజ్ఞాలుచేయువారి అవసరము. తక్కిన శాస్త్రాలలో వేదాంతం ముముక్షువులకు తర్కంవాదనా పటిమను పెంపొంది మకొనగోరువారికి పరిమితాలు. భౌతిక శాస్త్రములు భౌతికవాదులకు ఆధ్యాత్మిక శాస్త్రము ఆధ్యాత్మికజ్ఞానాభిలాషులకు పరిమితములుకాగా జాతక, ప్రశ్న, ముహూర్తాదుల ద్వారా లౌకికుల యజ్ఞకాలన్నిర్ణయము వేదాంతాభ్యసనమునకు కాలనిర్ణయం మొదలైన అంశాలలో ఆధ్యాత్మికుల ఉపకరించే శాస్త్రంగా జ్యోతిషానికి ప్రత్యేకమైన స్థానమున్నది. ఈ శాస్త్రము వైద్యులకు మూలికానే రణ, ఔషధక్రియకు ఉపకరిస్తోంది. లౌకికులకు తమప్రయత్నాలు ఫలించేకాలాన్ని నిర్దేశించడంద్వా ఉపకరిస్తోంది. ఈ విధంగా రెండుకోణాలలోను ఉపకరించే శాస్త్రం మరొకటిలే లందుకే యథాశిఖామయూరాణాం, నాగానాం మణయోయథా, తద్వత్ వేదాంగ శాస్త్రాణా జ్యోతిషంమూర్ధనిస్థితం" అని వర్ణించారు. ఇందులో లౌకిక శాస్త్రాలలో ఆకర్షణ ఉంది. నెమలిలో ఆకర్షణ పింఛంలో ప్రధానంగా ఉంది. ఆ పింఛమువంటిది జ్యోతిషం ఆధ్యాత్మికశాస్త్రాలలో భయ ఉంది పాములంటేభయం ఉంది పాముతలపైనున్న మణియందు కాంతిఉంది ఆకర్షణుంది. కాంతి మార్గాన్ని కూడా చూపిస్తుంది. కాంతి విజ్ఞాన స్వరూపమైనది కూడా. ఆ మణిస్థానీయమై జ్యోతిషం దీనిని బట్టి మనకి అర్థమయ్యేది భౌతికశాస్త్రాలలోను ఆధ్యాత్మికశాస్త్రాలలోను మిక్కి విశిష్టమైనదిగా జ్యోతిషం గుర్తించబడింది విశేషించి ఆబాలగోపాలము అపురూపంగా చూసుకు జ్యోతిషమనడం అతిశయోక్తిగాదు. ప్రాచ్యలిఖితపుస్తక భాండా గారాలలో గ్రంథసముదాయా పరిశీలిస్తుంటే మిగిలిన శాస్త్రాలన్నిటికంటే ఎక్కువగా ఉన్నవి జ్యోతిష గ్రంథాలే.

ఈ విచారణవల్ల ప్రాచీనకాలంలో జ్యోతిషానికున్న ప్రాముఖ్యం తెలుస్తోంది. ఆనాడందర చదివారంటే అన్నిగ్రంథాలు పుట్టాయంటే వారంతా మూర్ఖులని వారిని మూఢనమ్మకాలని వా మూఢులని పరిపెట్టుకోవడం మన అజ్ఞతకు నిదర్శనం కాగా గణితశాస్త్రానికి మూలాధారమై జ్యోతిషం సకలవిజ్ఞానశాస్త్రాభివృద్ధికి మూలకారణమైన చక్రం కనుగొడానికి ప్రేరణకలిగించి బింబగ్రహాలు జ్యోతిషానికి అనుబంధాలే కాగా ఆ శాస్త్రాన్ని నిరాదరించడం ప్రజ్ఞకు నిదర్శనం కాద

# ఆధునికకాలంలో జ్యోతిష్కుని బాధ్యత

అతిప్రాచీనకాలంలో సహేతుకదృష్టి ప్రబలంగానే ఉంది మధ్యమకాలంలో ఆ దృష్టితగ్గింది. ప్రస్తుతకాలంలో సహేతుకదృష్టికలవారమనుకొనేవారి సంఖ్య పెరిగింది. నాస్తికత్వం అన్న గ్రంథంలో గోరాగారు రెండుమాటలన్నారు. మనం హేతువాదులంకాదు ఎందుకంటే హేతువునంగీకరిస్తే దైవాన్ని అంగీకరించవలసివస్తుంది మనం కార్యకారణవాదులంకాదు. కార్యకారణాల్ని అంగీకరిస్తే దైవాన్ని అంగీకరించవలసిన ప్రమాదం ఏర్పడుతుంది. వారి ఈ మాటల్లో ఎంతైనా నిజాయితీఉంది. కాని హేతువుని అంగీకరించక కార్యాకారణ సంబంధాన్ని అంగీకరించక మాట్లాడేవారితో మనం ఏమి మాట్లాడుతాం. మొత్తంపైన ఈ నాడు హేతువాదులం అనుకొనేవారిలో చాలామందికి తాము హేతువాదులం కాము అని తెలియదు. అందుకనే మనం హేతువాదులమనుకొనే వారిసంఖ్య పెరిగిందని భావించాం ప్రస్తుతాంశంలో ఈ హేతువాదుల మనస్సులను తృప్తిపరచడానికి ఆధునిక జ్యోతిష్కుడు జ్యోతిశాస్త్రమునందలి సహేతుకతను నిరూపించడానికి నడుంకట్టాలి. అటు ప్రాచీన శాస్త్రాల్లో కాని ఇటు నవీనశాస్త్రాల్లోకాని పరిపూర్ణ హేతుబద్ధమైన శాస్త్రం జ్యోతిష ఒక్కటే అనే నిశ్చయంతో ఆధునిక జ్యోతిష్కుడు ముందడుగువేయాలి. విశేషించి ప్రాచీన జ్యోతిషగ్రంథాలలో ఆనాటి కాలమాన పరిస్థితులకనుగుణంగా ఫలితాలు చెప్పబడి ఉన్నాయి. ఉదా. వాహన యోగాన్ని రథయోగంగా వారు భావించారు. దాన్ని నేడు ఉన్నవాహనాల కనుగుణంగా ఆలోచనచేయాలి. ప్రాచీనంలో విద్యలు వ్యాకరణం వేదాంతం మొదలగు రీతిలో ఉంటే ఆధునిక విద్యలు శాఖోపశాఖలుగా విస్తరించాయి. ఈనాటి విద్యలకనుగుణంగా ఆలోచనచేసి గ్రహకారకత్వాలను నిర్ణయించుకోవలసిన బాధ్యత ఆధునిక జ్యోతిష్కునిపై ఉంది భారతీయ జ్యోతిషానికి, పాశ్చాత్య జ్యోతిషానికి గల విరోధాభాసలను పరిహరించుటలో సమర్థుడు కావాలి.

# గ్రహదృష్టి - సహేతుకత - క్రొత్తదృష్టులు - గ్రహస్వభాలు

గ్రహాలకు దృష్టులున్నాయి. అవి అందరూ అంగీకరిస్తున్నారు. దృష్టి అనే శబ్దానికి ఆ స్థానంపై తమ ప్రభావం కలిగి ఉండడం అనే భావాన్ని స్వీకరించాలి.

ఈ దృష్టులు వేరు వేరు మతాల్లో వేరు వేరుగా కనిపిస్తున్నా వానిలోని మూలసూత్రాలను అర్థం చేసుకోవచ్చు.

పరాశరుని అభిప్రాయంలో అన్నిగ్రహాలు తామున్న స్థానం నుండి సప్తమస్థానాన్ని చూస్తాయి. గురు, కుజ, శనులు విశేషదృష్టి కలిగి ఉంటారు. గురుదు 5,9, స్థానాలను, కుజుదు 4,8, స్థానాలను శని 3,10 స్థానాలను విశేషదృష్టిచే దర్శిస్తారు. అన్ని గ్రహాలు 4,8, స్థానాలను త్రిపాద దృష్టితోను, 5,9, స్థానాలను అర్థదృష్టితోను, 3,10 స్థానాంను పాదదృష్టితోను దర్శిస్తాయి అనేది విశేష వాక్యం.

జైమినిమతంలో రాశిదృష్టులున్నాయి. చరరాసులు, చరరాసులలోనున్న గ్రహాలు 5,8,11 రాసులను, అందున్న గ్రహాలను స్థిరరాసులు, అందున్న గ్రహాలు 3,6,9, రాసులను అందున్న గ్రహాలను ద్విస్వభావరాసులు 4,7,10, రాసులను అందున్న గ్రహాలను చూడడం జరుగుతుంది.

మేషం, అందున్న గ్రహాలు - సింహ, వృశ్చిక, కుంభాలను అందున్న గ్రహాలను దర్శిస్తాయి.

వృషభం, అందున్న గ్రహాలు - కర్కాటక, తులా, మకరాలను అందున్న గ్రహాలను దర్శిస్తాయి.

మిధునం, అందున్న గ్రహాలు - కన్య, ధనుస్సు, మీనరాసులను అందున్న గ్రహాలను దర్శిస్తాయి.

కర్కాటకం, అందున్న గ్రహాలు - వృశ్చిక, కుంభ, వృషభాలను అందున్న గ్రహాలను దర్శిస్తాయి.

సింహం, అందున్నగ్రహాలు - తుల, మకర, మేషాలను అందున్న గ్రహాలను దర్శిస్తాయి

కన్య, అందున్నగ్రహాలు - ధనుస్సు, మీన, మిధునరాసులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి.

తుల, అందున్న గ్రహాలు - కుంభ, వృషభం, సింహరాసులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి.

వృశ్చికం, అందున్నగ్రహాలు - మకర, మేష, కర్కాటక రాసులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి.

ధనుస్సు, అందున్నగ్రహాలు - మీన, మిధున, కన్యారాసులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి

మకరం, అందున్నగ్రహాలు -వృషభ, సింహ, వృశ్చికరాసులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి.

కుంభం, అందున్నగ్రహాలు - మేష, కర్కాటక, తులారాసులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి.

మీనం, అందున్నగ్రహాలు - మిధున, కన్యా, ధనుస్సులను అందున్నగ్రహాలను దర్శిస్తాయి

విశేషించి ఉత్తరకాలామృతంలో - (గ్రహభావఖండ 59శ్లో) పూర్ణచంద్రుడు, గురుడు, శని, కేతువు, తామున్నరాశి నుండి 2,12, స్థానాలను ఆచ్ఛాదిస్తారని చెప్పబడింది. ఆ చ్ఛాదన ఒక దృష్టి విశేషంగా భావించబడింది. తాజికమతంలోను, పాశ్చాత్యమతంలోను, అన్నిగ్రహాలకు శుభపాపదృష్టులు వివరించబడ్డాయి.

1. 5,9, స్థానాలపై ఉండే దృష్టి ప్రత్యక్ష స్నేహద. దీనిలో చూసేగ్రహానికి, చూడబడే గ్రహానికి మధ్యదూరం 120° డిగ్రీలుండాలి. దీన్ని పాశ్చాత్యులు ట్రయిన్ అని వ్యవహరిస్తారు. ఇది మంచి దృష్టి.

2. 3వ స్థానంపై ఉండేదృష్టి గుప్తస్నేహకరి దీన్ని అర్ధకోణదృష్టి అంటారు. ఇందులో గ్రహానికి గ్రహానికి మధ్యదూరం 60 డిగ్రీలు ఉంటుంది. దీన్ని పాశ్చాత్యులు సెక్స్‌టైల్ అని వ్యవహరిస్తారు. ఇది మంచి దృష్టి.

3. 45 డిగ్రీల దూరంలో ఉండే గ్రహాన్ని చూసే దృష్టిని మేలాపకం అంటారు. తాజికమతంలో ఇది కార్యసాధనకారి. దీన్ని పాశ్చాత్యులు సెమీస్క్వేర్ అని వ్యవహరిస్తారు. స్వల్పం దోషం, స్వల్పగుణం గలదాన్నిగా దీన్ని భావించారు.

4. 40 డిగ్రీలలో ఉండే దృష్టి శుభదృష్టిగా వ్యవహరించబడింది.

5. 4వ స్థానంపై 90 డిగ్రీల దూరంలో ఉండే దృష్టి గుప్తారిదృష్టి ఇది పాశ్చాత్యులచే స్క్వేర్‌గా వ్యవహరించబడింది. ఇది పాపదృష్టి.

6. సమసప్తకదృష్టి 180 డిగ్రీలు ప్రత్యక్షవైరం దీన్ని పాశ్చాత్యులు అపోజిషన్ అని వ్యవహరిస్తారు. ఇది దోషఫలాన్నిస్తుందని వారిభావన.

7. ఒకే డిగ్రీలో గ్రహాలున్నప్పుడు దాన్నిగూడా ప్రత్యక్ష వైర అని భావించారు. దీన్ని పాశ్చాత్యులు కన్‌జక్షన్ అని వ్యవహరించారు. దీని ఫలవిషయంలో గ్రహాలస్వభావాలను బట్టి ఫలం ఇచ్చేదిగా భావించారు. ఈ దృష్టుల పరిమితి 12 డిగ్రీలు అని వ్యక్తీకరించడం జరిగింది.

1. పాశ్చాత్యులు ఇంకా సెమీసెక్స్‌టైల్ 30 డిగ్రీల దృష్టి స్వల్పగుణప్రదం అని.

2. 135 డిగ్రీల దృష్టి స్వల్పదోషప్రదమైనదిగాను.

3. 150 డిగ్రీల దృష్టి స్వల్పదోషప్రదమైనదిగాను గుర్తించారు. దీన్ని మనవారు షష్ఠాష్టకంగా వ్యవహరించారు. ఇంకా

1. 18 డిగ్రీలు దూరం
2. 24 డిగ్రీలు దూరం
3. 36 డిగ్రీలు దూరం
4. 72 డిగ్రీలు దూరం
5. 108 డిగ్రీలు దూరం
6. 144 డిగ్రీలు దూరం

గల దృష్టులు స్వల్ప శుభప్రదమైనవిగా పరిగణించారు.

తాత్కాలిక శత్రుత్వపరిగణనలో ఏకరాశి స్థితి గ్రహాలకు తాత్కాలిక శత్రుత్వాన్నిచ్చేదిగా పరిగణించడం జరిగింది. కాబట్టి ఆ స్థితిని ప్రత్యక్షవైరంగా భావించడం అనుకూలంగానే ఉంది.

## గ్రహ దృష్టులు - హేతువు

అన్ని మతాలను పరిశీలిస్తే అన్నిగ్రహాలు అన్ని రాసులను చూస్తూనే ఉంటాయి. ఆ దృష్టులకు కొంత ప్రత్యేకత ఉంది అని అర్థమౌతోంది. సృష్ట్యారంభకాలంలో గ్రహాలన్నీ మేషం ఒకటవ డిగ్రీలో ఉన్నాయనే జ్యోతిశ్శాస్త్రజ్ఞుల కథనం. సామాన్యంగా మానవుడు ఎక్కడెక్కడ సంచరిస్తున్నా తన గృహమందు దృష్టిగలవాడై ఉంటాడు అదే రీతిలో గ్రహాలను పరిశీలిస్తే మేషం నుండి సవ్యక్రమంలో 9 వ రాశి, ధనుస్సు, (స్వక్షేత్రం) అపసవ్యక్రమంలో 5వ రాశి ధనుస్సు కాగా గురువుకు 5,9, దృష్టులు స్థిరపడ్డాయి. గురుడు పూర్ణశుభగ్రహం కావడం వలన 5,9, దృష్టులను అన్ని గ్రహాలకు శుభదృష్టులుగా పాశ్చాత్యులు పరిగణించారు. కుజునికి మేషం నుండి వృశ్చికం (స్వక్షేత్రం) 8వ రాశి, కావడం వలన అతనికి 8వ దృష్టి స్థిరపడింది. కుజుడు, శుభుడు కాకపోవడంవలన అష్టమదృష్టిదోషప్రదమైనదిగా భావించబడింది. శనికి, మకర, కుంభాలు స్వక్షేత్రాలు. సవ్యక్రమంలో మేషం నుండి 10వ రాశి మకరం, అపసవ్యక్రమంలో కుంభం 3వ రాశి కాగా శనికి 3,10 దృష్టులు స్థిరపడ్డాయి.

క్రొత్త దృష్టులు - ఈ దృక్కోణంలో పరిశీలించినపుడు తక్కినగ్రహాలకు గూడా కొన్ని క్రొత్తదృష్టులు గుర్తించవలసిఉంది. మేషం నుండి సింహం సవ్యంగా 5వ రాశి అపసవ్యంగా 9వ

రాశి సప్తమదృష్టి సర్వసామాన్యం అదే విధంగా తక్కిన గ్రహాలకు గూడా పరిశీలిస్తే.

| గ్రహం | స్వక్షేత్రం | మేషం మంచి సవ్యంగా | అపసవ్యంగా | సవ్యాపసవ్యాలు | సప్తమదృష్టి |
|---|---|---|---|---|---|
| రవి | సింహం | 5 | 9 | | 7 |
| చంద్ర | కర్కాటకం | 4 | 10 | | 7 |
| కుజ | మేషం, వృశ్చికం | 8 | 6 | 1 | 7 |
| బుధ | మిధున | 3 | 11 | | 7 |
| | కన్య | 6 | 8 | | |
| గురు | ధనుస్సు | 9 | 5 | | 7 |
| | మీనం | 12 | 2 | | |
| శుక్ర | తుల | | | 7 | |
| | వృషభం | 2 | 12 | | |
| శని | మకరం | 10 | 4 | | 7 |
| | కుంభం | 11 | 3 | | |

అనే స్థానాలపై దృష్టి ఏర్పడుతోందని గుర్తించాలి. విశేషదృష్టులు గురు, కుజ, శనులకు మాత్రమే ఎందుకని గుర్తించారు? తక్కిన గ్రహాలకు ఎందుకు గుర్తించలేదు? అనే ప్రశ్న వస్తుంది. గురుడు మేధావి. మేధావిదృష్టికి ఒక ప్రత్యేకత ఉంది.

కుజుడు సైన్యాధ్యక్షుడు అతని దృష్టిపడితే ప్రమాదమే. శని సేవకుడు అతని చూపులో దోషం ఉంది. అందుచేత అది ప్రధానమే అని ప్రాచీనులు భావించారు అనవచ్చు గాని ఆయా గ్రహాలకు ఏయే భావాలపై దృష్టుందో పరిశీలిస్తే ఆ గ్రహాల స్వభావాలు వ్యక్తమౌతున్నాయి. సప్తమభావం అందరికీ ప్రధానమే కాబట్టి అందరికీ ఆ స్థానంపై దృష్టి ఉండడం సహజం, శుక్రునికి అది ప్రత్యేకదృష్టుల్లో చేరడానికి కారణం అతనికి సప్తమభావం ప్రధానం కావడమే. రవి సమర్థుడైన ప్రభువు. రవికి 5,9 స్థానాలు ముఖ్యాలు.

పంచమం ఆలోచనాశక్తికి నవమం. తండ్రి నుంచి వచ్చిన సంపదకు స్థానాలు, ఆ రెండు సమర్థుడైన ప్రభువుకు ముఖ్యావసరాలు. చంద్రుడు సామర్థ్యం లేని ప్రభువు లేదా రాణి, కాబట్టి అతనికి చతుర్థం (సుఖం, ఆహారం) దశమం (అధికారం) ముఖ్యమైనవి.

కుజుడు సైన్యాధ్యక్షుడు అతనికి 6 (విజయం) 8 (ఆకస్మిక లాభం ఆక్రమణ) ముఖ్యం.

బుధుడు వ్యాపారి. అతనికి 3, (జన సహకారం) 6 (పోటీలో విజయం) 8 (ఆకస్మిక లాభాలు) 11 (లాభం) ముఖ్యమైన భావాలు.

గురుడు మేధావి లేక మంత్రి, అతనికి 5 (ఆలోచనాశక్తి - ఉపాసన) 9 (తృప్తి, పూర్వపుణ్యం) (ఉత్తరకాలామృతంలో చెప్పబడిన అప్పాదన) 2 (కుటుంబసౌఖ్యం, వాక్శక్తి) 12 ( దానధర్మాం కోసం వ్యయం) ముఖ్య విషయాలు.

శుక్రుడు స్వార్థం గల మంత్రి. ఇతనికి 2 (కుటుంబం, ధనం) 12 ( భోగానుభవం) 7 (భార్యాసౌఖ్యం) ప్రధానవిషయాలు.

శని సేవకుడు - ఇతనికి 3 (జనసహకారం) 4 (ఆహారసౌఖ్యం) 10 (అధికారం చెలాయించడం) 11 (లాభం) ముఖ్యాంశాలు.

ఈ పద్ధతిలో ఆలోచించినప్పుడు ఈ గ్రహాలస్వభావాలకు, దృష్టులకు, స్పష్టాది గ్రహస్థితినను సరించి వారి స్వక్షేత్రాలను దర్శించడం అనే అంశాలు సరిపడుతున్నాయి. కుజునకు చతుర్థదృష్టి లేకుండా పోతోంది. ఖర్చుకు ప్రాధాన్యం ఇచ్చే వ్యక్తులు గురు, శుక్రులు మాత్రమే అని తెలుతోంది. ఈ క్రొత్త దృష్టులను దృష్టిలో పెట్టుకొని జాతకాలను పరిశీలిస్తుంటే ఫలితాలు వాస్తవానికి దగ్గరగా ఉంటున్నాయి.

ఒక ఉదాహరణ

| | | | |
|---|---|---|---|
| | కే ల | | |
| రశు | | | |
| బు | శకు చ | గురా | |

వృషభలగ్నం షష్ఠ గురుడు
సప్తమంలో శని, కుజ, చంద్రులు
అష్టమంలో బుధుడు
నవమంలో రవి శుక్రులు

ఈ జాతకంలో దశమస్థానంపై దృష్టి ప్రభావాలను పరిశీలిద్దాం.

ఈ జాతకునికి ఉద్యోగంలో అభివృద్ధి, మార్పు అనేవి బుధ, శని, చంద్ర దశలలో సంభవించాయి. పాత దృష్టుల రీత్యా బుధునకు తృతీయ దృష్టి లేదు. కొత్త దృష్టుల ప్రకారం ఉంది. బుధునకు దశమంతోగాని, దశమాధిపతితోగాని ఇతర సంబంధాలు లేవు. కాని బుధ దశలో సహకారం వల్ల

ఉద్యోగం లభించింది. తృతీయ దృష్టి సహకారాన్ని సూచిస్తోంది.

శనికి పాతదృష్టుల్లో చతుర్ధ దృష్టి లేదు. కొత్తదృష్టుల్లో ఉంది. ఆశని తనదశలో ఉద్యోగంలో మార్పును అభివృద్ధిని ఇచ్చాడు.

చంద్రునికి దశమంతో సంబంధం లేదు. దశమాధిపతి గూడా 20 డిగ్రీల దూరంలోఉన్నాడు కాబట్టి యుతి సంబంధం కూడా లేదు. పాతదృష్టుల ప్రకారం చతుర్ధ దృష్టిలేదు పరిశీలనలో గ్రహించిన కొత్త దృష్టుల ప్రకారం చంద్రునికి చతుర్ద దృష్టి ఉంది. ఈ చంద్ర దశలో నూతనోద్యోగం వచ్చింది.

ఈ క్రొత్త దృష్టుల విషయంలో అనుభవ పూర్వకమైన పరిశీలన చేసి తమ అమూల్యమైన సవరణలందించవలసిందిగా జ్యోతిషశాస్త్రజ్ఞులైన పెద్దలను అర్థిస్తున్నాను.

ఈ సందర్భంలో సమసప్తకదృష్టి, కేంద్ర దృష్టి మొదలైన వాటిని పూర్తి దుష్టఫలప్రదాలు అనడం కంటే ఆ రెండు గ్రహాల మధ్యనున్న సంబంధాలను (మిత్రశత్రు) బట్టి దోష శుభాలను నిర్ణయించడం మంచిదని తోస్తోంది. నిజానికి కేంద్ర దృష్టి ఘర్షణనిస్తుంది. ఘర్షణ అన్ని వేళలా చెడ్డదనడం న్యాయంకాదు. అంతే సిద్ధః సిద్ధాంతః, సంవాదాత్ప్రామాణ్యం అనే సంప్ర దాయాలననుసరించి సత్యనిరూపణ కార్యసాధన మొదలైన అంశాలలోని ఘర్షణ మేలుచేస్తుందని గుర్తించాలి. అందుచేతనే మనవారు మేలాపకాలసందర్భంలో మేష వృశ్చికాలు, మిధున మకరాలు, సింహ మీనాలు, తులావృషభాలు, ధనుః కర్కాటకాలు, కుంభకన్యలు, ప్రీతిషడష్టకాలనీ, మీన మేషాలు, వృషభమిధునాలు, కర్కాటకసింహాలు, కన్యాతులలు, వృశ్చికధనుస్సులు, మకరకుంభాలు, శుభద్విర్ద్వాదశాలనీ, మేషమకరాలు, వృషభకుంభాలు కర్కాటకమేషాలు, కన్యామిధునాలు, తులాక ర్కాటకాలు, వృశ్చికసింహాలు, ధనుర్మీనాలు, శుభదశమ చతుర్థాలనీ, వృషభవృశ్చికాలు, కన్యామీనాలు శుభసమసప్తకాలని వ్యవహరించారు.

# విరాట్పురుషుడు - క్రాంతి చక్రం - మానవుడు

అణువులో కేంద్రం చుట్టూ పరిభ్రమించే కణాలు దీర్ఘవృత్తాకార కక్ష్యలో పరిభ్రమిస్తూంటాయి సౌర కుటుంబంలోని గ్రహాలు గూడా అదే రీతిలో పరిభ్రమిస్తూంటాయి. విశ్వంలో ఉన్న నక్షత్రాల గూడ తమ పరివారంలో ఒక కేంద్రం చుట్టూ పరిభ్రమిస్తూంటాయి. సౌరకుటుంబం లాటివి ఎన్నో ఉన్నాయి ఈ విశ్వంలో.

పలు సౌర కుటుంబాల్ని ఒక బ్రహ్మాండం అన్నా మన సౌర కుటుంబానికి కేంద్రమైన దాన్ని కలుపుకుంటూ ఒక బ్రహ్మాండం ఉందన్నా విశ్వాన్ని అనంతమని అందరూ అంగీకరిస్తూన్న విషయమే అనంతుడు, అని పిలువబడే విష్ణువుకు సంబంధించిన సహస్రనామాల్లో (విశ్వం విష్ణుర్వషట్కారః) విశ్వం ఒకనామమే. ం భగవానునికి ఆకారం లేదు. ఆకాశానికి ఆకారం లేదు. రంగు లేని ఆకాశం నీలిరంగులో కనిపిస్తోంది. అలాగే రంగురూపంలేని విష్ణువును నీలి వర్ణం కలవాడుగా పురాణాలు చెపుతున్నాయి. ఆకాశానికి లేని రంగు - నీలంగా కనిపిస్తూన్నట్లే రంగురూపంలేని విష్ణువు నీలిరంగువాడు కావడం చాలా గూఢార్థం గల విషయమే. ఆ నీలిరంగుకు అధిపతి శని ఆశనికి అధిష్ఠానం విష్ణువే.

శివుడు అడిగిన కోరిక తీరుస్తాడు అని భారతీయ సంప్రదాయం విష్ణువు "భక్తుని అర్హతను పరిశీలించి వరాలిస్తాడని భారతీయులైన ఋషుల అభిప్రాయం. శని ఇచ్చే ఫలాలు గూడా అలాగే ఉంటాయి. వ్యక్తిని పూర్తిగా కృషి చేసేలా చేసి ఆ కృషి ద్వారా వ్యక్తిని పరిణతునిగా చేసి దశలో చిట్టచివర ఫలాన్ని ఇస్తాడు శని. అదికూడా కోరినంతా ఇవ్వడు. శనిని మనం అర్థం చేసుకోవాలంటే అర్హతనుమించి ఎట్టి పరిస్థితిలోను ఫలితాన్నివ్వడు ఒక కోణంలో ఆలోచిస్తే అర్హతకంటే తక్కువ ఫలాన్నే ఇస్తాడనిపిస్తుంది. ఆ కార్య సిద్ధివ్యక్తిపరిణతుడైన తరువాత మాత్రమే అని అర్థం చేసుకోవాలి.

సౌర కుటుంబంలో ముఖ్యుడైన సూర్యునికి మార్తాండుడు అనే పేరుంది. మృతండుని కుమారుడు అని కొందరు అర్థం చెప్తారు. కాని దానిలో మృత-అండ. అనే రెండు పదాలున్నాయి. ఒక అండం మరణించినపుడు (పేలిపోయినపుడు) ఉద్భవించినవాడే మార్తాండుడు అనడం న్యాయం. "బిగ్ బాంగ్" పద్ధతి ప్రకారం ఆధునికులు ఒక పెద్ద అండం బద్దలైంది అలా బద్దలైనప్పుడు ఏర్పడిన ఒక శకలమే సూర్యుడు" అని ఆధునికులు చెపుతున్నారు. ఈ ఆధునికుల భావన మార్తాండ శబ్దంలో నిక్షిప్తమైంది. అనడం సక్రమమే అవుతుంది. "భాషోత్పత్తి

క్రమానికి మూలం కనుక్కొనేవాడు చివరికి సర్వజ్ఞుడౌతాడు." (ఒక యోగి ఆత్మకథ 15 పే). అన్న వాస్తవాన్ని అర్థం చేసుకుంటూ సంస్కృత భాషాపదాల మూల స్వరూపాన్ని అవగాహన చేసుకుంటూంటే మనకు ఎన్నో వైజ్ఞానికాంశాలు గోచరిస్తాయి.

నీరం అనే సంస్కృతపదం ఉంది. నీరు అనే అర్థంలో అది వాడబడుతోంది. నిర్గతం రాత్ అనే వ్యుత్పత్తి ప్రకారం అగ్ని నుండి పుట్టింది. అనే అర్థం వస్తోంది. "అగ్నే రాపః" అనే ఉపనిషద్ వాక్యం గూడా ఈ అర్థాన్నే బోధిస్తోంది. మరో అర్థంలో నిర్గతః రః (అగ్నిః) యస్మాత్ అనే వ్యుత్పత్తి ప్రకారం. అగ్నికి జన్మస్థానం అవుతోంది. అగ్నితత్త్వానికి చెందిన ఆక్సిజన్‌నుండి జలోత్పత్తి అని వైజ్ఞానికులు అంగీకరిస్తున్నారు. ఘన ద్రవ్యాలలో సువర్ణం, ద్రవ ద్రవ్యాలలో నెయ్యి, వాయు ద్రవ్యాలలో ఆక్సిజన్ అగ్ని తత్త్వం గలవి. ఆక్సిజన్ సూర్య కాంతి వలన వృద్ధి చెందుతూన్నందువలన "సూర్యాద్ధి జాయతేతోయం" అనే పురాణవాక్యం కూడా ఆ ఆలోచనను ప్రేరేపిస్తోంది విద్యుత్ స్ఫులింగంతో దగ్ధం చేయబడిన ఆక్సిజన్ కణం పేలి హైడ్రోజన్ కణాన్ని దగ్ధం చేసే సందర్భంలో ఆక్సిజన్‌లో ఒక పరమాణువు హైడ్రోజన్‌లో రెండు పరమాణువులు కలిసి ఒక జల కణాన్ని సృజిస్తాయి. జలాన్ని విశ్లేషిస్తే మరల తైజసమైన ఆక్సిజన్ విడిగా వస్తుంది. దీన్ని బట్టి నీరు నుండి అగ్ని వచ్చిందన్నా అగ్నినుండి నీరు వచ్చిందన్నా ఆ రెండు అంశాలు నీరం అనే పదంలోనే ఇమిడి ఉండడం ఆలోచించేవానికి విజ్ఞానాన్ని అందించేది సంస్కృత భాష అని వ్యక్తీకరిస్తోంది.

అణువులో ఏదుందో విశ్వంలోను అదే ఉంది అని ప్రాచీనులైన మేధావులు గుర్తించారు. ఈ శరీరంలో "ఇరవై ఏడువేల లక్షల కోట్ల కణాలు ఐదుకోట్ల అంతస్తరీయ ఆలోచనలు భావోద్రేకాలు" (- ఒక యోగి ఆత్మకథ 433 పే) కలసి కాపురం చేస్తున్నాయి.

ఈ ఇరవై ఏడువేల లక్షల కోట్ల కణాలు 27 నక్షత్రాలకు ప్రతిరూపాలుగా భావించవచ్చు. విరాట్పురుషుని శరీరాంగాలుగా 27 నక్షత్రాలు వర్ణించబడ్డాయి. ద్వాదశ రాశి చక్రం విరాట్పురుషుని శరీరాంగాలే. 5 కోట్ల అంతస్తరీయ ఆలోచనలు. 5 భూతాలకు, 5 తారా గ్రహాలకు అధీనంలో ఉంటాయని గుర్తించవచ్చు. ఉపాసన ద్వారా ఆ కణాలు, ఆలోచనలు క్రమబద్ధం చేయగలిగితే విశ్వ చైతన్యంలోని శక్తిని పూర్తిగా ఆర్జించే అవకాశం ఏర్పడుతుంది. లెక్కపెట్టడం కష్టం కావచ్చుగాని, మనకు కనిపించేవి, కనిపించనివి అయిన చుక్కలన్నీ కలిపి ఇరవైయేడు వేల లక్షల కోట్లు మాత్రమే ఉంటాయని (శరీరంలోని కణాల సంఖ్య) ఊహించవచ్చు. యోగ సాధనద్వారా తమ శరీరంలోనే విశ్వాన్నంతనీ దర్శించే అవకాశం ఉందని యోగ శాస్త్రం చెపుతోంది. ప్రాచీన ఋషులు

దూరదృష్టి దూరశ్రవణాది శక్తులు కలిగి ఉన్నారని ప్రాచీన గ్రంధాలు వ్యక్తీకరిస్తున్నాయి. అవి ఈనాడు సాధ్యాలేనని కొన్ని ఉదాహరణలు చెప్తున్నాయి. (చూ. అద్భుత ప్రపంచం శ్రీ B.V. పట్టాభిరాం. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)

స్వేచ్ఛ వేరు స్వాతంత్ర్యం వేరు తనకు కలిగిన కోరికలను సాధించే ప్రయత్నం స్వేచ్ఛ తనకు కలిగిన కోరిక ఇతరులకు ఇబ్బందిని కలిగిస్తుందా! అని ఆలోచించి ఇబ్బంది కలగనంతవరకు సాధించుకొనే ప్రయత్నం స్వాతంత్రం. తంత్రం అంటే ఆలోచన, ఇచ్ఛ అంటే కోరిక. తన ఆలోచన ప్రకారం తాను నడవవచ్చు గాని తన ఇచ్ఛ ప్రకారం తాను నడవకూడదు. లిబర్టీ అంటే స్వేచ్ఛ. స్వేచ్ఛను ప్రేమిస్తే ఇతరులకు కష్టాన్ని కలిగించిన వారమౌతాము ఇండిపెండెన్స్ అంటే స్వాతంత్ర్యం భగవంతుడు మనకు స్వాతంత్ర్యం ఇచ్చాడు స్వేచ్ఛను కాదు.

విరాట్పురుషుని శరీరంలో సూర్య చంద్రులే కన్నులు. మన శరీరంలో గూడా కన్నులకధిపతులు సూర్య చంద్రులే కన్నులలోని కాంతికి, సౌందర్యానికి, ఆకర్షణకు అధిపతి శుక్రుడు. శుక్రుడనే పేరు చాలా చిత్రమైంది. శుక్ర ధాతువుకు అధిపతి శుక్రుడు శుక్ర ధాతువు ప్రేరేపించబడాలంటే చాలా ప్రధానమైన ఇంద్రియం నేత్రం. సౌందర్యాన్ని కనులతో ఆస్వాదించినపుడే వ్యక్తి ఉద్రిక్తుడౌతాడు. చూపులనే మన్మధ బాణాలని కవులు వర్ణిస్తారు. ఆ చూపులకు శుక్ర ధాతువుకు అధిపతి శుక్రుడే అవుతూ ఆ సంబంధాన్ని గూడా వ్యక్తీకరిస్తున్నాడు.

"ప్రపంచ మూల ద్రవ్యం మనోద్రవ్యమే"

ఒక యోగి ఆత్మకథ 447 పే

"మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అంటాడు గీతాకారుడు లేనిది ఉన్నట్లు కనిపింపచేసే మాయసృష్టికి కారణం. ఆమాయ యొక్క సూక్ష్మ రూపమే మనస్సు అని ఋషులవాక్కు.

సూర్యుని కాంతి ఏడు రంగులు కలదై ఉంది. అందున్న ఆరు రంగులను ఆరు గ్రహాలు వ్యక్తీకరిస్తున్నాయి. "సూర్య ఆత్మా జగతః" అనే వేదవాక్యం విరాట్పురుషునిలోని ఆత్మశక్తి సూర్యుడని వ్యక్తీకరిస్తోంది. సూర్యుడు ఆత్మకారకుడని పరాశరుని వాక్కు. "చంద్రమా మనసోజాతః" విరాట్పురుషుని మనస్సునుండే చంద్రుడు పుట్టాడు. అని వేదవాక్యం. మనస్సుకు కారకుడు చంద్రుడు అని పరాశరుడు చెప్పాడు.

మనస్సుకు గూడా వివిధ అవస్థలున్నాయి. మనస్సు చిత్తం, అహంకారం, బుద్ధి, అనే

వాటిని అంతఃకరణ చతుష్టయం అని పిలుస్తారు. సంశయాత్మకమైనది మనస్సు, విషయాన్ని తెలుసుకొనేది చిత్తం, తాను కానిదాన్ని తానుగా భావించేది అహంకారం, నిశ్చయాత్మకమైనది బుద్ధి, మనస్సుకు అధిపతి చంద్రుడు చిత్తానికి గురుడు, అహంకారానికి శని, బుద్ధికి బుధుడు అధిపతులౌతారు. విరాట్పురుషుని శరీరంలో మేషం శిరస్సు వృషభం ముఖం, మిధునం కంఠం (బాహువులు) కర్కాటకం హృదయం, సింహం ఉదరభాగం కన్య పొత్తి కడుపు, తుల గుహ్యాంగం (తుల కటిస్థానం వృశ్చికం గుహ్యాంగాలు అని మరో భావన) వృశ్చికం గుద స్థానం. ధనుస్సు తొడలు, మకరం మోకాళ్ళు కుంభం పిక్కలు, మీనం పాదాలు. పై అవయవాలే మానవ శరీరంలోను ఆయా రాసుల ఆధిపత్యం కలవి అవుతాయి. విశేషించి లగ్నాన్ని ఆరంభించి ద్వాదశ భావాలుపైఅంశాలకు క్రమంగా ఆధిపత్యం కలవి అవుతాయి. అనేది మరో పరిశీలన.

"ద్రవ్యరాశికీ శక్తికీ గల సమానత్వాన్ని తన ప్రఖ్యాత సమీకరణంలో సమీక్షిస్తూ ఐన్ స్టైన్ పదార్థంలోని ఏ ఒక్క కణంలోని శక్తి అయినా దా.. ద్రవ్య రాశిని అంటే బరువును కాంతి వేగ వర్గంలో గుణిస్తే వచ్చే ఫలితానికి సమానం అని నిరూపించారు. పదార్థకణాల నాశనం ద్వారానే అణుశక్తుల్ని విడుదల చెయ్యడం జరిగింది."

ఒక యోగి ఆత్మ కథ 479

అంటే పదార్థం, శక్తి, కాంతి, శబ్దం, రంగు, జ్ఞానం, మొదలైనవన్నీ ఒకటే. ఒకే వస్తువు వేరు వేరు స్థితులలో వేరు వేరు రూపాలతో వేరు వేరు నామాలతో వేరు వేరు క్రియలలో అభివ్యక్తమౌతోంది. దాన్నే మాయ, అన్నారు వేదాంతులు. దానికతీతంగా ఉన్న విశ్వచైతన్యం, జీవ చైతన్యాల సమిష్టి ఆ స్వరూపాన్నే విశ్వరూపం విరాట్పురుషుడు అన్నారు చైతన్య ద్రష్టలు.

విరాట్పురుషునికి ముఖం, బాహువులు ఊరువులు, పాదాలు అనే విభజనతో వర్ణముల వర్గీకరణ రూపొందించినట్లు కనిపిస్తోంది. ఆత్మశక్తి (తాను ఏ కోరకుండా అన్ని వైపులనుండీ అందురూ సహకరించే శక్తి) ప్రధానంగా సత్వగుణం ఆధారం.. మోక్ష కాంక్షులై జీవించేవారు ముఖ శక్తి (మాటలాడే శక్తి, ఆజ్ఞాశక్తి) ప్రధానంగా గలవారు విరాట్పురుషుని ముఖస్థానం) బ్రాహ్మణ శక్తి కలవారౌతారు. ధర్మాన్ని ఆచరణలో పెడుతూ సంకల్పశక్తి ప్రధానంగా కలిగి సత్వ, రజో గుణముల ప్రేరణ గలవారు రక్షక శక్తి (బాహుబలం) ప్రధానంగా గలవారు క్షత్రియ శక్తి గలవారౌతారు అర్థం ప్రధానంగా రజస్తమస్సుల ప్రేరణ గలిగి జగత్తు యొక్క స్థితికి మూలకారణమైన ఆహారాది సకల ద్రవ్యాలను అందరికీ అందజేసే వారు వైశ్యులు. కామ పురుషార్థం ప్రధానంగా శరీర శక్తికి ప్రాధాన్యమిస్తూ తమో గుణ ప్రేరణ గ... శూద్రులు గా వర్గీకరించబడ్డారు. ఈ వర్ణాలు

జ్యోతిశ్శాస్త్రరీత్యా వ్యక్తి ప్రకృతులకు సంబంధించినవిగావి, జన్మకు సంబంధించినవి కాః
విరాట్పురుషుడు విశ్వవ్యాప్తుడు అవుతూ అణువణువున ప్రకాశిస్తూ జ్యోతిర్మయుడై సకల
జీవశక్తిలో అంతర్లీనంగా ఉండి జగదాధారుడౌతున్నాడు.

# గుణాలు - గ్రహాలు

సత్వరజస్త మోగుణాలు. మాయకు ప్రతి రూపాలు. ఆ గుణాలు గ్రహాలకు చెందినవి గూడా అవుతాయి. అంటే ఆ గ్రహాల కారకత్వాలు ఆయాగుణాలకు చెందినవౌతూంటాయి. ఆయా గ్రహాల ప్రకృతులను అర్థం చేసుకోవడానికి ఆయా గుణ వర్గీకరణ ఉపకరిస్తుంది. కాని వేదాంత శాస్త్రంలో సత్వంలో సత్వం సత్వంలో రజస్సు సత్వంలో తమస్సు అనే రీతిని ఉప విభజన గూడా గోచరిస్తుంది. జ్యోతి శ్శాస్త్రంలో రవి, చంద్ర, గురు కేతువులు సత్త్వగుణానికి చెందినవారని, బుధ శుక్రులు రజో గుణానికి చెందిన వారని కుజు శని, రాహువులు తమో గుణానికి చెందిన వారని ప్రమాణాలు కనిపిస్తున్నాయి.

గ్రహాల స్వభావాలను లోతుగా పరిశీలిస్తే పై విభజన స్థూలంగా చేసినదిగానే కన్పిస్తోంది. వేదాంత శాస్త్ర మందు వలెనే జ్యోతిశ్శాస్త్రంలో గూడా అంతర్గుణ విభజన యొక్క అవసరమున్నది.

సత్వంలో సత్వానికి గురుని ఆధిపత్యాన్ని అంగీకరించవచ్చు. ఈతదు పూర్ణశుభుడని శాస్త్రం తెలుపుతోంది కదా! రజో గుణాధిపత్యం గల శుక్రుడు బ్రాహ్మణజాతికి చెందిన వాడుగా గుర్తించబడుతూన్నాందువలన సత్త్వంలో రజస్సుకు శుక్రుని ఆధిపత్యం న్యాయంగా ఉంటుంది. చంద్రుడు సత్త్వ ప్రధానుడైనా గురు శుక్రులవలె చురుకుదనంలేక చాంచల్యం అధికంగా కనబడడం వలన సామర్థ్యం విషయంలోగూడా వారిరువురి తరువాతివాడు కావడం వలన సత్త్వంలో తమస్సుకు చంద్రుని ఆధిపత్యం సహేతుకంగా ఉంటుంది. రాజస ప్రవృత్తిగల (రాజైన) రవి రజో గుణంలో సత్త్వ ప్రాధాన్యంగల వాడుగా గుర్తించడం బాగుంటుంది. కుజుడు పూర్తిగా తమో గుణానికి చెందిన వాడుగా ప్రమాణాలు కనిపిస్తున్నా, అతనికారకత్వాలలోని అతికామం, యుద్ధప్రీతి, క్షత్రియ జాత్యాధిపత్యం మొదలైనవి దృష్టిలో పెట్టుకుంటే రజస్సులో రజస్సుకు అతని ఆధిపత్యం సహేతుకంగా ఉంటుంది. బుధుడు కోరికలు గలవాడే కాని చురుకుదనం తక్కువగా కలవాడు వ్యాపారి. వ్యాపారిలో ఉండే నిలకడా ఒక చోట కూర్చోవడం మొదలైన లక్షణాలను వర్గీకరించినపుడు బుధునికి రజస్సులో తమస్సును అంగీకరించడం న్యాయం.

కేతువు పూర్తి సాత్వికుడుగా పేర్కొనబడినవాడు. కాని అతని లక్షణాలను పరిశీలించినప్పుడు తమస్సులో సత్వ గుణంగల వాడుగా అంగీకరించవచ్చు. రాహువులో పూర్తి తమస్సును అంగీకరించడం కంటే అతని రాగ ప్రవృత్తిని బట్టి తమస్సులో రజో గుణాధిపత్యం గల వాడుగా అతనిని గుర్తించడం న్యాయం. శనిని తమోగుణాధిపత్యం గలవాడుగా గుర్తించారు. ఈ క్రొత్త విభజనలో తమస్సులో తమస్సుకు శని ఆధిపత్యాన్ని అంగీకరించవచ్చు.

# జ్యోతిశ్శాస్త్రము - ఉపయోగము

మనుష్యుని సమస్త కార్యములు జ్యోతిషము ద్వారా జరుగుచున్నవి. వ్యవహారమునకు మిక్కిలి ఉపయోగకరములైన దినము, వారము, పక్షము, మాసము, అయనము, ఋతువు, సంవత్సరము మొదలగునవి ఒక్క ఉత్సవ దివసములు మొదలగు వాని పరిజ్ఞానము జ్యోతిశ్శాస్త్రము ద్వారానే కల్గుచున్నవి. మానవ సమాజములో శాస్త్ర పరిజ్ఞానము లేనిచో ధార్మిక ఉత్సవము సామాజికపు పండుగలు, మహా పురుషుల జన్మదినములు, మన ప్రాచీన గాథల ఇతిహాసములు మొదలగువాని విషయములో ఒక విషయము గాని నిశ్చితమగు సమాచారము గాని మనము తెలుసుకొనలేము. ఏ పనిని సకాలమునకు చేయలేము. భారతీయులగు వ్యవసాయదారులు, చదువురాని వారైనప్పటికినీ వ్యవహారోపయుక్తమగు జ్యోతిషజ్ఞానములో పరిచయముగల వారే. ఏ నక్షత్రములో చక్కని వర్షము కురియునో వారికి బాగుగా తెలియును. అందుచే ఎప్పుడు నాట్లు నాటితే పంట కాలములో పంట బాగుగా వచ్చునో తెలుసుకొని విత్తనముల వేయుదురు. వ్యవసాయదారు జ్యోతిశ్శాస్త్రము నందలి రహస్యములు తెలియకున్నచో అతని శ్రమ చాలా భాగము వ్యర్థము కాగలదు.

ఈ వైజ్ఞానిక యుగములో వ్యవసాయ శాస్త్రజ్ఞులు అకాలమునందైనను అవసరమును బట్టి వర్షముల కురిపించుట, అవసరములేనిచో నివారించుట ద్వారా వ్యవసాయమును సఫలము చేయగలరు గదా! అట్టి పరిస్థితిలో వ్యవసాయదారునకు జ్యోతిష జ్ఞానము యొక్క అవసరము లేదు" అని కొందరు మహానుభావులు తర్కించుచున్నారు. దీనిలో పొరపాటులేదు కాని జ్యోతిశ్శాస్త్ర తత్త్వములను పూర్ణముగా అర్థము చేసుకొననిచో విజ్ఞానశాస్త్రము గూడ అకాలమున వర్షములను కురిపించుట అవసరము కానిచో నివారించుట చేయలేదు. చంద్రుడు ఏ సమయంలో జల చర రాశి, జల నక్షత్రములతో ఉండునో ఆ సమయములో వర్షములు వచ్చును. వైజ్ఞానికుడు ప్రకృతి యొక్క రహస్యమును తెలుసుకొని ఎప్పుడు చంద్రుడు జల నక్షత్రములలో సంచరించునో ఆ సమయమునందే వర్షములను కురిపించును. వారాహ సంహితలో ఈ విషయములో కొన్ని వివరములు గలవు. వాని ద్వారా జల నక్షత్రములలో చంద్రుడు సంచరించుచుండగా ఆ రోజులలో వర్షములను కురింపించుటకు వీలగును. ప్రాచీన మంత్ర శాస్త్రమునందు వర్షము కురిపించుట, నివారించుట కలవు. ఇందు జల నక్షత్రముల యొక్క ఆలోచన ప్రధాన క్రియ, వైజ్ఞానికుడు చంద్రునితత్త్వమును గుర్తించి జల నక్షత్రములలో ఆ చంద్రుడు సంచరించు దినములలో ఆ తత్త్వములను సంయోజన చేయగా అకాలమునందు వర్షము కురిపించును. ఇదే ప్రకారము

చంద్రుని గమనించి జలీయ పరమాణువులను చెదరగొట్టుట చేయుట ద్వారా వృష్టి నివారణ చేయగల్గును. ప్రాచీన జ్యోతిషమువందలి విశిష్టాంగమైన సంహితా శాస్త్రము నందు దీనికి సంబంధించిన చర్చ కలదు. భద్ర బహు సంహిత శుక్రచారాధ్యాయంలో శుక్రుని గతిని అవగాహన చేసుకొనుట ద్వారా వృష్టి నివారణా విధానము చెప్పబడినది. అందుచే జ్యోతిషతత్త్వముల పరిజ్ఞానములేనిదే వ్యవసాయము మేలైనదిగా చేయుట సంభవించదు.

నౌకాయానములో - కెప్టెన్‌కు జ్యోతిషము, నిత్యము అత్యవసరము. జ్యోతిషము ద్వారా సముద్రమునందు ఓడ ఎచ్చటనున్నదో తెలుసుకొనగలడు నక్షత్రములను గుర్తించి వాని స్థితిని బట్టి ఓడ ఉన్న ప్రదేశమును గుర్తించగలడు. గడియారములేని పరిస్థితిలో సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు రాశులు చూచి సమయమును గుర్తించుటకు వీలగును. జ్యోతిషజ్ఞానము లేనపుడు దూర ప్రయాణమును ఆపదలేకుండ చేయుట కష్టము. జ్యోతిష జ్ఞానము ద్వారా క్రొత్త దేశములు, ఇసుక ఎడారిలో మార్గములు, దాటుట శక్యము కాగలదు. అట్లే అక్షాంశ రేఖాంశాల ద్వారా ఆ ప్రదేశము యొక్క స్థితి, దిక్కు మొదలగు వానిని నిర్ణయము చేసికొన వచ్చును. సరిహద్దుల కొలతలు తెలియనపుడు అక్షాంశ రేఖాంశముల ద్వారా సరిహద్దులను నిశ్చయము చేయవచ్చును. భూ గోళమును అధ్యయనము చేయుట ఈ శాస్త్రజ్ఞానము లేనిచో అసంపూర్ణమే కాగలదు.

అన్వేషణ కార్యక్రమము కూడ జ్యోతిష జ్ఞానము లేకుండ సంభవము కాదు ఈ కాలమందు గూడ నవీన అన్వేషకులు, జ్యోతిష జ్ఞానము కల్గినవారై యున్నారు. లేదా ఒక జ్యోతిష్కుని వెంటనిడుకొను చున్నారు. ఒకసారి ఒక అమెరికా విద్వాంసుడు "గ్రహ నక్షత్ర పరిజ్ఞానము లేనిచో క్రొత్త దేశము యొక్క స్థానమును పరిస్థితిని గుర్తించుట సంభవము కాదు. అధికమగు ఉష్ణత, అధికమగు చలి అనువానిచే వ్యక్తి యొక్క శరీరం క్షీణించును. అట్లే అధికమగు ఉష్ణత, అధికమగు శీతలము అనువానిచే ఆధునిక వైజ్ఞానిక యంత్ర సామగ్రి పని చేయని పరిస్థితులలో గూడ చంద్ర సూర్యాది గ్రహ నక్షత్ర పరిజ్ఞానము ద్వారా దిక్, దేశ కాలములను సులువుగా తెలుసుకొనగలరు అని చెప్పినాడు.

చాలా ఎత్తైన పర్వతము యొక్క ఎత్తును, చాలా లోతైన నది యొక్క లోతును జ్యోతిశ్శాస్త్రము ద్వారా తెలుసుకొనుటకు వీలగును. ఒక పర్వతము యొక్క ఎత్తు, ఒక నది యొక్క లోతు అను విషయములు సందిగ్ధ స్థితిలో నున్నపుడు ఆ ఎత్తు, లోతును, రేఖా గణితము ద్వారా నిశ్చయింతురు జ్యోతిషము ద్వారా కాదు. కాని జాగ్రత్తగా పరిశీలించినచో రేఖా గణితము జ్యోతిషము కంటే వేరు కాని జ్యోతిషాంగమే అను విషయము తెలియగలదు. ప్రాచీన

జ్యోతిశ్శాస్త్రములో రేఖా గణితము యొక్క ముఖ్య సిద్ధాంతములను క్రీ.శ. 5,6 శతాబ్దులలోనే నిరూపించియున్నారు.

చరిత్ర విషయములో గూడ జ్యోతిషము మిక్కిలి సహకరించగలదు. వారి మాటలలోని తిధి (తేది) యొక్క సమాచారము ఇతర సాధనముల ద్వారా తెలుసుకొనుట శక్యము కాదు. జ్యోతిషము ద్వారా మిక్కిలి సులువుగా తెలుసుకొనవచ్చును. జ్యోతిశ్శాస్త్రం పరిజ్ఞానమే లేనిచో వేదముల ప్రాచీనత ఎట్టి పరిస్థితిలోను తెలియరాదు. లోకమాన్య బాల గంగాధర తిలక్ వేదమునందు ప్రతిపాదింపబడిన నక్షత్ర, అయన, ఋతువులు ఆధారముగా వేద కాలమును నిర్ధారణ చేసినారు. సూర్య చంద్ర గ్రహణములు ఆధారముగా అనేక ప్రాచీన ఐతిహాసిక తిధులను క్రమబద్ధము చేయుటకు వీలైనది.

భూగర్భము నుండి సంపాదితములగు వస్తువుల కాలమును జ్యోతి శ్శాస్త్రము ద్వారా సులువుగా ప్రామాణికమగు రీతిలో నిశ్చయము చేయుటకు వీలగును. ఈ విధముగా ఇతర శాస్త్రములచే శక్యము కాదు. ఒకసారి "శ్రీ గౌరీ శంకర హీరాచంద ఓఝా" "పురాతన వస్తువుల యదార్థ సమయము తెలుసుకొనుట విషయంలో జ్యోతిశ్శాస్త్ర జ్ఞానము అత్యావసరము" అని పలికిరి. సృష్టి రహస్యము కూడ తెలుసుకొనుట గూడ జ్యోతిశ్శాస్త్రము ద్వారానే. ప్రాచీన కాలము నుండియు భారతదేశములో సృష్టి రహస్యము పరీక్షించుట విషయంలో జ్యోతిశ్శాస్త్రము ఉపయోగపడినది. సిద్ధాంత జ్యోతిష గ్రంధములలోని సృష్టి యొక్క వివేచన తప్పునిసరిగా నుండును. ప్రకృతిలో ప్రతి అణువు యొక్క రహస్యము జ్యోతిశ్శాస్త్రములో చెప్పబడినది. దీని ద్వారా సృష్టిలోని ప్రతి వ్యక్తి యొక్క ప్రత్యేకత యందలి రహస్యము తెలుసుకొని తమ కార్యములను నెరవేర్చుకొనగలరు. జడము, చేతన పదార్థములన్నిటి యొక్క ఆయువు, ఆకారము, పద్ధతి, ఉపయోగము వానిలో ఉండే భేదములు, మొదలగు విజ్ఞాన సమ్మతములైన అంశములు ఈ శాస్త్రమందు మాత్రమే కలవు. ఇతర శాస్త్రములందు లేవు.

జ్యోతిష జ్ఞానము లేనిదే ఔషధములను సరియగు సమయములో నిర్మించుటకు శక్యము కాదు. గ్రహముల తత్త్వము స్వభావము తెలుసుకొని వాని తత్త్వములను అనుసరించి ఆ తత్త్వము, స్వభావము గల మందును తయారు చేసినపుడు అది విశేష గుణకారి కాగలదు. వైద్యుడు ఈ శాస్త్ర పరిజ్ఞానము లేనివాడైనచో అపూర్వ గుణకారియగు మందును తయారు చేయలేడు.

ఈ శాస్త్ర జ్ఞానము ద్వారా రోగి యొక్క చర్యలను చేష్టలను అర్థము చేసుకొని చాలా తక్కువ అంశముల ద్వారా రోగము యొక్క స్థాయిని, రోగి యొక్క రోగ కాలమును తెలుసుకొనుటకు పలు నియమములు చెప్పబడినవి. అందువలన ఏ వైద్యుడైనను ఆవశ్యకములగు జ్యోతిష తత్త్వములను తెలుసుకొని వైద్యము చేసినచో అతని కార్యములు మిక్కిలి సఫలము కాగలవు.

సాధారణ వ్యక్తి గూడ ఈ శాస్త్రమును చక్కగా తెలుసుకొనుట ద్వారా అనేక రోగముల నుండి తప్పించుకొనగలడు ఎక్కువగా అనారోగ్యములు సూర్యచంద్రుల ప్రభావముచే కల్గుచుండును. ఫైలేరియా అనునది చంద్రుని ప్రభావముచే కల్గుచుండును. జ్యోతిశ్శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం, చంద్రుడు సముద్ర జలమును ఆకర్షించుట ద్వారా ఆటుపోటు లేర్పడుచున్నట్లుగనే మనుష్యుని శరీరము నందలి రక్తమును ఆకర్షించుట ద్వారా నిర్బల శరీరముగల మనుష్యునకు అనారోగ్యము కల్గుచుండును. అందుచే జ్యోతిషము ద్వారా చంద్రుని తత్త్వమును అర్థము చేసుకొని ఏకాదశి, అమావాస్యల యందు ఏ రకమైన పదార్థములను స్వీకరించవలెనో తెలుసుకొని వానినే స్వీకరించుట ద్వారా దుర్బల శరీరము గల వ్యక్తి ఆయా అనారోగ్యముల నుండి తనను కాపాడు కొనవచ్చును.

ఈ శాస్త్రము అన్ని రకముల వారికిని మిక్కిలి ఉపయోగకరమైనది. సమస్త మానవ జీవనములకు సంబంధించి ప్రత్యక్ష, పరోక్ష రహస్యములనెన్నిటినో ఈ శాస్త్రము వివేచన చేయును. మరియు ప్రతీకల ద్వారా మొత్తము జీవితమును ప్రత్యక్షముగా ప్రకటించగలరు. అంధకారములో వస్తువులను దీపము ప్రత్యక్షము చేసినట్లుగా ఈ శాస్త్రము అన్ని విషయములను ప్రత్యక్షము చేయగలదు. మానవుని ఏ వ్యవహారమైనను ఈ శాస్త్ర జ్ఞానము లేకుండా ముందుకు సాగదు.

# యోగం - జ్యోతిషం

లగ్నంతో జీవనం ఆరంభం అవుతోంది. సుఖ దుఃఖ భావనల కలితంగా ఆకలో, అనారోగ్యమో హెచ్చరిస్తేనే మామూలులోకంలోకి వస్తూ ఆ బాలుడు తక్కిన సమయాలన్నింటిలో ఇంద్రియ సుఖాలకు అతీతమైన సుఖాన్ని అనుభవిస్తూ ఏ పనీ పట్టకుండా ఉండగలుగుతున్నాడు. జ్యోతిశ్శాస్త్ర రీత్యా లగ్నం సహస్రార స్థానీయమైనది. ఈ ప్రదేశంలో ఉన్న మెదడు అన్ని విషయాలను తనలో ఇముడ్చుకొనే శక్తి కలదై పరమాత్మతో పోలి ఉంటోంది. మనస్తత్వ శాస్త్రవేత్తల అభిప్రాయం ప్రకారం బాలుడు ఆ మొదటి రోజుల్లోనే భౌతిక విషయాల స్వరూపాన్ని అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తుంటాడు. సహస్రముఖాలుగా విషయ పరిజ్ఞానాన్ని ఆర్జిస్తాడు. సహజ లగ్నం మేషం. ఇందున్న నిశ్చిత స్థితి విషయార్జనకు ఉపకరించేది.

ద్వితీయ భావం ముఖస్థానీయం అందున్న వాక్కు ద్వారా భావవ్యక్తీకరణను నేర్చుకుంటాడు. సేకరణ సహజాతాన్ని వృద్ధి పరచుకుంటాడు. తనకు కావలసిన వస్తువులను అడిగే ప్రయత్నం చేస్తాడు. తన అభిప్రాయం ప్రకారం ఇతరులు నడచుకోవాలని ప్రయత్నిస్తాడు. కుటుంబ సంబంధమైన ఆత్మీయతలను పెంచుకుంటాడు. బాలుని వచ్చీరాని మాటలే అతడిని తన వారికి దగ్గర చేస్తాయి. ద్వితీయం ఆజ్ఞాచక్ర స్థానీయమైనది. ఇతరులను ఆజ్ఞాపించే అభ్యర్థించే ప్రయత్నాలు నేర్చుకుంటాడు. సహజ ద్వితీయం వృషభం ఇందున్న బాధ్యత వ్యక్తి బాధ్యతాబంధాలు కలవానిగా చేస్తున్నది.

తృతీయ స్థానం కంఠ స్థానీయం. అందున్న పరాక్రమం (పర+ఆక్రమ) అనే శబ్దానికి ఇతరులను మానసికంగా ఆక్రమించి వారి సహకారాన్ని తీసుకుంటాడు అనే అర్థం తగినది. తనతోటివాడు తనకు సహకరించాలంటే తనలో స్వచ్ఛత ఉండాలి. తనలో కపటం ఉన్నపుడు వ్యక్తి సహకారాన్ని అందించలేడు కదా! కపటం ఇతరులను దూరం చేస్తుంది. స్వచ్ఛత ఇతరుల సహకారాన్ని అందిస్తుంది. ఈ ప్రదేశం విశుద్ధ చక్రానికి చెందినది. ఈ పరిశుద్ధతకు దూరమైతే నటనను అలవర్చుకుంటాడు. తృతీయభావ కారకత్వాల్లో నటన ఉంది. సహజ తృతీయం మిథునం. ఇందున్న ద్వంద్వ వైఖరి వ్యక్తిలో సహకార స్వీకరణను పెంచుతోంది. చతుర్థ భావం హృదయ స్థానీయం. ఈ భావంలోనే ఆహారం, వాహనం, గృహం, విద్య, మొదలైన విషయాలున్నాయి. ఇక్కడ స్వార్థం అనే భావనను అలవర్చుకుంటాడు. ఈ స్వార్థం విద్యార్జనకు ఉపకరిస్తుందని భావించడం జరుగుతోంది. కాని విద్యార్జన యొక్క స్వరూపాన్ని అర్థం చేసుకొంటే విద్య పంచే కొలదీ పెరిగే ధనం అనడం

ద్వారా విద్యార్జన నిస్వార్థ భావనను పెంచుకుంటేనే విజయవంతమౌతుందని గుర్తించాలి. ఈ ప్రదేశం అనాహత చక్రానికి సంబంధించిన ప్రదేశం. అంటే వ్యక్తి క్రమంగా సహజ జీవన వికాసంలో సహస్రారానికి దూరం అవుతున్నాడు. సహజచతుర్థం కర్కాటకం ఇందున్న భయం అభద్రతా భావన ఆత్మ రక్షణా శక్తిని పెంపొందించుకుందుకుపకరిస్తోంది.

పంచమం, ఉదరస్థానీయం. ఆలోచనకు స్థానం. వ్యక్తి ఆలోచనను పెంచుకుంటున్నాడు. సహజ పంచమం సింహం ఇందున్న గాంభీర్యం తనలో రహస్యాలను దాచుకోవడం అలవరుస్తోంది. ఆలోచనను పెంచుతోంది. ఈ ప్రదేశం మణిపూరస్థానీయమైనది. మంచి ఆలోచనలను తనలో దాచుకోవడం ఈస్థానానికి స్వార్థాన్ని పెంచుతోంది. ప్రేమ భావనలకు గూడా పంచమం ముఖ్య స్థానమే ప్రతి ప్రేమ భావనలో అసూయ గూడా స్థానాన్ని సంపాదిస్తోంది. పిల్లలు గూడా ప్రేమకు స్థానమైన వారే. మొత్తంపై పంచమ భావం ఆలోచనలను పెంపొందిస్తోంది. షష్ఠం శత్రురోగ ఋణాలను జయించే శక్తికి సంకేతం కొంతలోతుగా పరిశీలిస్తే పంచమంలో వచ్చిన అసూయకు తరువాతి పరిణామమే ఈ విజయా కాంక్ష తన వ్యక్తిత్వాన్ని పెంచుకొనే ప్రయత్నం ఈ భావానికి ప్రత్యేకతను కల్గిస్తోంది. ఈ విజయ కాంక్ష ఉద్యోగాదులను, అర్జనాదులను (వ్యయానికిది సప్తమం) వ్యక్తీకరిస్తోంది. ఈ విజయాదులన్నిటికీ మూలం అహంకారమే. అహంకారమే లేనప్పుడు శత్రువేలేదు కదా! ఇది స్వాధిష్ఠానస్థానీయం తనపై తనకు అతి విశ్వాసం ఉండడమే అహంకారానికి మూలం. తనపై తనకు పరిపూర్ణ విశ్వాసం ఉన్నప్పుడు తన మార్గంపై తనకు విశ్వాసం ఉన్నప్పుడు సమాజం యొక్క అభిప్రాయంతో సంబంధం లేని స్వాభిప్రాయ నిర్ధారణ కలిగినపుదు తనపై తాను ఆధారపడగలదు అదే స్వాధిష్ఠానం. సహజ షష్ఠం కన్య. ఆ రాశి లక్షణాలను అనుసరించి జ్ఞాపకశక్తి ప్రజ్ఞ. ఇతరులను ఆకర్షించే నేర్పు తనపైతాను ఆధారపడగల ప్రజ్ఞ నందిస్తాయి.

సప్తమం గుహ్యస్థానీయం. వివాహ స్థానం, సమాజంతో సంబంధం బలపడడానికి అనువైన స్థానం. ప్రవృత్తి మార్గానికి నివృత్తి మార్గానికి ముఖ్యమైన మూలాధార స్థానం ఇదంతా అదృశ్యా చక్రార్థమే ఇంతవరకూ ఎదిగిన వ్యక్తి క్రమంగా సహస్రారానికి దూరమౌతూ వచ్చాడు. ఇంతవరకు పలువిధాలైన ప్రజ్ఞలను ఆర్జించిన వ్యక్తి వానిని ప్రకటించడం ఆరంభిస్తాడు. (దృశ్యార్థం చక్రంలో) సహజ సప్తమంతుల తులలో ఇరువురి (భార్యాభర్తల) సమప్రాధాన్యాన్ని సూచించడం జరుగుతోంది. తులాధిపతి శుక్రుడు భార్యభర్తృ సంబంధానికి సమాజంతోగల సంబంధాలకు కారకుదు కావడం విశేషం.

ఈ సప్తమం మూలాధారస్థానీయం. లగ్నస్ఫుటంనుండి సప్తమస్ఫుటం వరకూ గల ఈ అదృశ్యార్ధ చక్రం, ఆర్జనకు (విషయార్జన, విద్యార్జన, శక్తి సంపాదన) సంకేతంగా భావించగా దృశ్యార్ధ చక్రంలోని (సప్తమ స్ఫుటం నుండి లగ్న స్ఫుటం వరకు) భావాలు ఆశక్తుల వినియోగం ద్వారా సమాజంలో గుర్తింపును సాధించడానికి ఉపయోగిస్తాయి. ఇది ప్రకృతి మార్గం అష్టమంలో ఆకస్మిక లాభ నష్టాలు, నవమంలో సుఖానుభవాలు దశమంలో అధికారం ఏకాదశంలో లాభం, ద్వాదశంలో వ్యయం, మరణం అనే అంశాలు వ్యక్తీకృతమౌతాయి. ఈ ప్రవర్తన సహజమైనది. ఈ క్రమంలో వ్యక్తి జనన మరణాల మధ్య ప్రవాహంలో కొట్టుకు పోతూ ఉంటాడు. కాని, సప్తమం (మూలాధారం) వరకూ వచ్చిన వ్యక్తి మరల వెనుకకు తిరిగితే దృశ్యార్ధ చక్రంలో ప్రవేశించకుండా అదృశ్యార్ధ చక్రంలోనే తిరుగు ప్రయాణం చేబడితే అది యోగ మార్గం అవుతుంది. ప్రవృత్తి నివృత్తులకు రెండింటికీ, సప్తమమే మూలాధారం అవుతోంది. నివృత్తి మార్గంలో పయనించే వ్యక్తి అష్టమం (మృత్యువుకి భయపడి సమాజం నడిచే మార్గంలో కాకుండా అహంకార పరిత్యాగం చేసి తాను ఎన్నుకున్న మార్గంలో తిరుగు ప్రయాణం చేబట్టి స్వాధిష్ఠాన చక్రాన్ని (తనపై తాను ఆధారపడే స్థితిని) చేరుకుంటాడు. అహంకార పరిత్యాగం అనే స్థితి వలన శత్రువులు లేని వాడు అవుతాడు. ప్రవృత్తి మార్గంలో శత్రువులను జయించాడు. నివృత్తి మార్గంలో అహంకార పరిత్యాగం ద్వారా శత్రువు లేలేని వాడైనాడు.

ప్రవృత్తి మార్గం

లగ్నం

| | | | |
|---|---|---|---|
| ↑ | ద్వాదశం | ద్వితీయం | ↓ |
| ఏకాదశం | తృతీయం | | |
| ↑ | దశమం | చతుర్థం | ↓ |
| నవమం | పంచమం | | |
| ↑ | అష్టమం | షష్ఠం | ↓ |
| | సప్తమం | | |

నివృత్తి మార్గం : లగ్నం: జననం విషయ పరిజ్ఞానం - సహస్రారం

↓ ద్వితీయం వాక్కు,భావ ప్రకటన - ఆజ్ఞ.↑

తృతీయం జనసహకారం - విశుద్ధం.

↓ చతుర్థం, విద్య - అనాహతం ↑

పంచమం ఆలోచన ఉపాసన - మణిపూరం

↓ షష్ఠం విజయం - అహంకార పరిత్యాగం, స్వాధిష్ఠానం ↑

సప్తమం వివాహం సామాజిక సంబంధాలు - మూలాధారం.

అహంకార పరిత్యాగం అనే అర్హతతో ఉపాసనా స్థానానికి మణిపురానికి చేరుకొని గురూప దేశాన్ని పొందుతున్నాడు. ఆ ఉపాసనాబలం వల్ల అనాహతాన్ని చేరుకొని శబ్ద సంబంధం లేని (అనాహతం) జ్ఞానోదయాన్ని పొందుతున్నాడు. ఆ జ్ఞానోదయబలం వల్ల విశుద్ధానికి జేరుకొని పరిశుద్ధుడుగా రూపొందుతున్నాడు. ఈ స్థితిలో తన ప్రయత్నం అవసరం లేకుండానే ఇతరుల సహకారాన్ని పొందుతున్నాడు. ఈ స్థానం ప్రవృత్తి మార్గంలో జన సహకారం కోసం చేసే ప్రయత్నానికి సంకేతం తిరుగు ప్రయాణంలో (నివృత్తి మార్గంలో) జనాలు వారికి వారే ఇతనికి సహకరించడం తమకు పుణ్యమనే భావంతో ఆ విశుద్ధునికి ఉపకరించే ప్రయత్నం చేస్తారు.

ఆ పరిశుద్ధతా బలంతో ఈ వ్యక్తి ఆజ్ఞా చక్రానికి చేరుకుంటాడు. ఆ బలం వల్ల ప్రకృతి శక్తులను ఆజ్ఞాపించగలవాడౌతాడు. శాపానుగ్రహసామర్థ్యాన్ని పొందుతాడు. ప్రవృత్తి మార్గంలో ఈ స్థానంలో వ్యక్తి భావ ప్రకటనా శక్తిని వాక్ శక్తిని ఆర్జించే ప్రయత్నం చేశాడు. ఈ సందర్భంలో శాపానుగ్రహశక్తిని సద్వినియోగం చేయడం ద్వారా నిగ్రహ శక్తిని అభివృద్ధి పరచుకోవడం ద్వారా సహస్రాకారానికి జేరుకొని పరిపూర్ణ పురుషుడౌతాడు.- ఈ విధంగా సప్తమం నుండి వెనుదిరిగిన వ్యక్తి ముక్తుడౌతున్నాడు. సహజ మార్గంలో ప్రయాణించే వ్యక్తి జనన, మరణ పరంపరలో చక్రం వెంట తిరుగుతున్నాడు.

ఈ సరిజ్ఞానాన్ని జాతక చక్రంలో పరిశీలించాలంటే దృశ్యార్థంలో గ్రహాలు ఎక్కువ గల వ్యక్తి తన కున్న శక్తి సమర్థ్యాలకంటే ఎక్కువగా ప్రదర్శించి ఎక్కువ గుర్తింపును సాధించగలుగుతున్నాడు. శుభ (అధిపత్య) సౌమ్య (నైసర్గిక) గ్రహాలు అన్నీ అదృశ్య చక్రార్థంలోనే ఉన్నప్పుడు జీవితంలో ముఖ్య సమయాల్లో ఆ గ్రహాల దశలు మాత్రమే వచ్చినప్పుడు ఆ వ్యక్తి యోగ మార్గం (నివృత్తి మార్గం) లో విజేత అవుతున్నాడు. అష్టమ, వ్యయాలు మరణానికి సంకేతంగా భావన చేసినపుడు ఈతని ప్రయాణం అటు వైపు వెళ్ళనందు వల్ల ఆ వ్యక్తి అమృతుడౌతున్నాడు.

# ధర్మార్ధ కామ మోక్షాలు
# భావాలు గ్రహాలు

ప్రాచీన భారతీయ సంప్రదాయంలో మానవులు కోరేవి కోరదగినవి పురుషార్థాలు. అవి నాలుగు ధర్మం, అర్థం, కామం, మోక్షం, ధర్మం ఆచరణకు సంబంధించినది. అర్థం అంటే సంపద, కామం అంటే మనం కోరేది. మోక్షం అంటే దుఃఖ రహితమైన ఆనందం. ఈ నాల్గు అంశాలను మనం భావాలతో అనుబంధం చేసి పరిశీలించవచ్చు. ధర్మం ప్రవర్తనకు, ఉపాసనకు, పుణ్యానికి సంబంధించిన అంశం అయిన మీదట, 1,5, 9, భావాలు ధర్మం అనే పురుషార్థానికి ప్రతీకలుగా మనం గుర్తించవచ్చు. అర్థం అంటే డబ్బు, ద్వితీయ భావంలో డబ్బు ఉంది. షష్ఠంలో ఉద్యోగం ఉంది. ఉద్యోగం ధనార్జనకు ఉపకరించే అంశమే దశమంలో వృత్తి ఉంది. అది కూడా ధనార్జన ప్రధానంగా కలదే అయినందువలన 2,6,10 భావాలు అర్థ పురుషార్థానికి చెందినవిగా మనం భావించవచ్చు. కామం అంటే కోరిక. అందరూ తనకు అనుకూలంగా సహకరించాలని మనిషి కోరుకుంటాడు. భార్యా సుఖం అనేది సాక్షాత్తూ కామ పురుషార్థానికి చెందినదే. లాభం అందరూ కోరుకునేదే కావడం వలన 3,7,11 భావాలు కామ పురుషార్థానికి చెందినవిగా మనం గమనించవచ్చు. చతుర్థంలో సుఖం ఉంది. అష్టమం ఆయుస్థానం, కొందరు దర్శనకర్తలు ఆయువు పూర్తి కావడాన్ని మోక్షంగా భావించారు. ఆ స్థానంలో ఆకస్మిక సంఘటనలు కూడా ఉన్నాయి. ఆత్మహత్యాప్రయత్నం చేసే వ్యక్తి ప్రస్తుతం ఉన్న సమస్యలనుండి మోక్షం లభించడానికి ఆత్మహత్యే శరణ్యమని భావించడం గూడా ఉంది. వ్యయ కేతువు మోక్షదాయకుడనే భావన ప్రసిద్ధమైనదే కావడం వలన 4,8,12 భావాలు మోక్ష పురుషార్థానికి చెందినవిగా భావించడం సహేతుకమే. రవి, గురులు ధర్మం అనే పురుషార్థానికి కారకులుగా మనం గ్రహించవచ్చు. చంద్ర బుధులు అర్థం అనే పురుషార్థానికి చెందిన వారు కావడం సహేతుకమే (చంద్రుడు వ్యాపారస్థుడనే వివరణ కొన్ని సందర్భాల్లో కనిపిస్తోంది.) కుజ, శుక్రులు, కామపురుషార్థానికి చెంది గ్రహాలు అనడం న్యాయం (కుజుడు, అతి కామ కారకుడు).

శని, రాహు కేతువులు మోక్ష పురుషార్థానికి చెందిన గ్రహాలు అనడం సంయుక్తికంగానే ఉంటుంది. (వ్యయ రాహువు గూడా మోక్ష కారకుడు అనే భావన కొన్ని చోట్ల కనిపిస్తోంది.)

|  | భావాలు | గ్రహాలు | ఫలితం |
|---|---|---|---|
| ధర్మం | 1,5,9 | రవి, గురుదు | ధర్మ పురుషార్థ ప్రాధాన్యం |
| అర్థం | 2,6,10 | చంద్ర బుధులు | ధనం ప్రధానం అని భావిస్తారు. |
| కామం | 3,7,11 | కుజ, శుక్రులు | కోరికలు తీర్చుకోవడం ప్రధానమని భావిస్తారు. |
| మోక్షం | 4,8,12 | శని రాహు కేతువులు | మోక్షం ముఖ్యమని భావిస్తారు. |

ధర్మం ప్రధానం అని భావించే వ్యక్తులు కర్తవ్య నిర్వహణలో వెనుకంజ వేయకుండా లాభ నష్టాలకు ప్రధాన్యం ఇవ్వకుండా కృషి చేస్తారు.

అర్థం ప్రధానం అనుకొన్న వారు నష్టాలను సహించలేరు. ఆర్థిక ప్రయోజనం లేని పని ఎంత గొప్పదైనా చేయడానికి అంగీకరించరు. కామం ప్రధానం అనుకొనేవారు తాము కోరినది సాధించడానికి డబ్బులు లెక్క చేయరు మంచి చెడ్డలను గూడా ఆలోచించరు. మోక్షం ప్రధానం అని గుర్తించే వ్యక్తులు ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశిస్తే మంచిది. తాము లౌకిక విషయాలలో సమస్యలనుండి దూరంగా తొలగే ప్రయత్నం చేస్తారు. అని గుర్తించవచ్చు. ఈ కోణంలో జాతక పరిశీలన ద్వారా వ్యక్తి యొక్క లక్ష్యాలను ప్రవర్తనను అధ్యయనం చేయవచ్చు

కారులో ప్రయాణం చెయ్యి.
కాపురం ఉండాలనుకోకు
జీవిత లక్ష్యం మోక్షమే
జీవనమేనని భ్రమించకు

# భావాలు - వాక్కులు

## పర, పశ్యంతి, మధ్యమ-వైఖరి

వాక్కు - వాయురూపంలో బొడ్డు దగ్గర ప్రారంభమై హృదయ స్థానాన్ని చేరుకొని కంఠకుహరం ద్వారా పయనించి వైఖరీ రూపంలో వ్యక్తీకరించబడుతుందని శబ్ద శాస్త్రజ్ఞులు అభిప్రాయపడతారు. ఈ క్రమంలో మణిపూర చక్ర స్థానంలో (బొడ్డుదగ్గర) ఉన్నప్పుడు ఆ వాక్కు పర అని పిలువబడుతుంది. హృదయ స్థానాన్ని (అనాహత చక్ర స్థానాన్ని) చేరుకున్నప్పుడు పశ్యంతి అని పిలువ బడుతుంది. కంఠ స్థానాన్ని (విశుద్ధ చక్ర స్థానాన్ని) చేరుకున్నప్పుడు మధ్యమ అని పిలువ బడుతుంది. ముఖం ద్వారా వ్యక్తీకరించబడినప్పుడు వైఖరి అని పిలువబడుతుంది. ఈ వివరణ జ్యోతిశ్శాస్త్రరీత్యా పరిశీలించినప్పుడే ఒక క్రమతను సహేతుకతను కలిగి ఉంటుంది. సార్థకమైన వివరణను పొందుతుంది. జ్యోతిశ్శాస్త్ర రీత్యా రెండవ భావం వాక్కును స్థానం. తృతీయంకంఠ స్థానం కలది చతుర్థం హృదయ స్థానీయం పంచమం ఉదర స్థానీయం పంచమంలో ఆలోచన ఉంది. వాక్కుకి మూల స్థానం ఆలోచన ఆలోచనారూపంలో ప్రారంభం అయిన వాక్కు. చతుర్థ స్థానాన్ని చేరుకుంటుంది. చతుర్థస్థానం విద్యాస్థానం. తానింతవరకూ తెలుసుకొన్న విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని తనకు వచ్చిన ఆలోచనను సంస్కరించుకుంటాడు. అందుకనే దాని పేరు పశ్యంతి. తరువాత కంఠ స్థానంలో విశుద్ధ చక్రం ఉంది. విశుద్ధత ఉన్నప్పుడు ఉచ్చారణలో స్పష్టత మనసులోని భావానికి అనుగుణమైన కంఠ ధ్వనిని పొందుతాడు.

వ్యక్తి మనసులోని భావాన్ని మరుగుపరచి మట్లాడే సందర్భంలో విశుద్ధత లోపిస్తుంది. అలాంటి స్థితిలో కంఠ ధ్వనిలో వక్రత తొంగిచూస్తుంది. ఏదో కృత్రిమ భావన వినేవారిలో ఏర్పడుతుంది. తృతీయ భావంలో పరాక్రమం చెప్పబడింది. పరాక్రమ శబ్దానికి అర్థం చెప్పే సందర్భంలో ఆ శబ్దగతమైన అర్థాన్ని పరిశీలించవలసిన అవసరం ఉంది. పర+ఆక్రమ ఇతరులను ఆక్రమించేదం, మనస్సుద్వారా ఆత్మీయతను పెంచుకోవడం అనే అర్థాన్ని చెప్పాలి. రాజు పరాక్రమవంతుడు. అతడు విజయాన్ని సాధించాడు. ఆ విజయానికి మూలకారణం సైనికుల మనస్సులను ఆక్రమించడం. ఆ సైనికులు అతనికోసం ప్రాణం సైతం లెక్క చేయకుండా పోరాడారు. ఆ సైనికులు పరాక్రమవంతులు వారు ఇతరుల రాజ్యాలను ఆక్రమించారు అలాగే వారి విజయం వల్ల సంతోషించే ప్రజల మనసులను ఆక్రమించారు. ఇలా ఆలోచిస్తే పరాక్రమ శబ్దానికి జన సహకారం పరమార్థం అవుతుంది. ఇతరుల సహకారం విశుద్ధునికి మాత్రమే లభిస్తుంది. విశుద్ధ

# భావాలు - వాక్కులు

## పర, పశ్యంతి, మధ్యమ-వైఖరి

వాక్కు - వాయురూపంలో బొడ్డు దగ్గర ప్రారంభమై హృదయ స్థానాన్ని చేరుకొని కంఠకుహరం ద్వారా పయనించి వైఖరీ రూపంలో వ్యక్తీకరించబడుతుందని శబ్ద శాస్త్రజ్ఞులు అభిప్రాయపడతారు. ఈ క్రమంలో మణిపూర చక్ర స్థానంలో (బొడ్డుదగ్గర) ఉన్నప్పుడు ఆ వాక్కు పర అని పిలువబడుతుంది. హృదయ స్థానాన్ని (అనాహత చక్ర స్థానాన్ని) చేరుకున్నప్పుడు పశ్యంతి అని పిలువ బడుతుంది. కంఠ స్థానాన్ని (విశుద్ధ చక్ర స్థానాన్ని) చేరుకున్నప్పుడు మధ్యమ అని పిలువ బడుతుంది. ముఖం ద్వారా వ్యక్తీకరించబడినప్పుడు వైఖరి అని పిలువబడుతుంది. ఈ వివరణ జ్యోతిశ్శాస్త్రరీత్యా పరిశీలించినప్పుడే ఒక క్రమతను సహేతుకతను కలిగి ఉంటుంది. సార్థకమైన వివరణను పొందుతుంది. జ్యోతిశ్శాస్త్ర రీత్యా రెండవ భావం వాక్కును స్థానం. తృతీయంకంఠ స్థానం కలది చతుర్థం హృదయ స్థానీయం పంచమం ఉదర స్థానీయం పంచమంలో ఆలోచన ఉంది. వాక్కుకి మూల స్థానం ఆలోచన ఆలోచనారూపంలో ప్రారంభం అయిన వాక్కు. చతుర్థ స్థానాన్ని చేరుకుంటుంది చతుర్థస్థానం విద్యాస్థానం తానింతవరకూ తెలుసుకొన్న విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని తనకు వచ్చిన ఆలోచనను సంస్కరించుకుంటాడు అందుకనే దాని పేరు పశ్యంతి. తరువాత కంఠ స్థానంలో విశుద్ధ చక్రం ఉంది. విశుద్ధత ఉన్నప్పుడు ఉచ్చారణలో స్పష్టత మనసులోని భావానికి అనుగుణమైన కంఠ ధ్వని పొందుతాడు.

వ్యక్తి మనసులోని భావాన్ని మరుగుపరచి మాట్లాడే సందర్భంలో విశుద్ధత లోపిస్తుంది. అలాంటి స్థితిలో కంఠ ధ్వనిలో వక్రత తొంగిచూస్తుంది. ఏదో కృత్రిమ భావన వినేవారిలో ఏర్పడుతుంది. తృతీయ-భావంలో పరాక్రమం చెప్పబడింది పరాక్రమ శబ్దానికి అర్థం చెప్పే సందర్భంలో ఆ శబ్దగతమైన అర్థాన్ని పరిశీలించవలసిన అవసరం ఉంది పర+ఆక్రమ ఇతరులను ఆక్రమించడం, మనస్సుద్వారా ఆత్మీయతను పెంచుకోవడం అనే అర్థాన్ని చెప్పాలి. రాజు పరాక్రమవంతుడు. అతడు విజయాన్ని సాధించాడు. ఆ విజయానికి మూలకారణం సైనికుల మనస్సులను ఆక్రమించడం ఆ సైనికులు అతనికోసం ప్రాణం సైతం లెక్క చేయకుండా పోరాడారు. ఆ సైనికులు పరాక్రమవంతులు వారు ఇతరుల రాజ్యాలను ఆక్రమించారు అలాగే వారి విజయం వల్ల సంతోషించే ప్రజల మనసులను ఆక్రమించారు. ఇలా ఆలోచిస్తే పరాక్రమ శబ్దానికి జన సహకారం పరమార్థం అవుతుంది. ఇతరుల సహకారం విశుద్ధునికి మాత్రమే లభిస్తుంది. విశుద్ధ

ప్రాప్తి చేరుకొన్న వాక్కు. ఇతరుల సహకారం లభించేలా ఇతరుల మనస్సుల నాక్రమించేలా సంస్కరించబడుతుంది. అప్పుడే ఆ వాక్కు మాటలాడువారికి వినేవారికి మధ్య సంబంధాన్ని ఏర్పరుస్తుంది. అలా ఇతరులపై ప్రభావాన్ని, చూపే శక్తి విశుద్ధమైన (ఉచ్చారణ, మానసిక స్థితి) పుడు ఏక పక్షమైనది కాకుండా మధ్యమ అని పిలువబడుతుంది.

ద్వితీయం వాక్ స్థానం కావడం వలన అక్కడ నుండి వెలువడిన వాక్కు వైఖరి రూపాన్ని పొంది ఆ వ్యక్తి యొక్క వైఖరిని వ్యక్తీకరించేది అవుతుంది.

ఇలా జాతకంలోని 2,3,4,5, భావాలలో ఉన్న శక్తులను సమన్వయం చేస్తేనే పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనే నామాలు సార్థకాలౌతాయి.

ఉపాసనాస్థానం పంచమం కావడం వలన ఉపాసన ద్వారా ఆలోచననే సంస్కరించుకొన్నప్పుడు ఆలోచనలోనే ప్రస్తుత శక్తి ప్రవేశించి ఆ వాక్కు శక్తి వంతమౌతుంది. అని అంగీకరించవచ్చు. జ్యోతిషం అన్ని శాస్త్రాలలో అంతర్లీనంగా వెలిగే జ్యోతి అని అర్థం చేసుకోవలసిన అవసరం కనిపిస్తోంది.

అందుకనే భారతీయ జ్యోతిషం యథాశిఖామయూరాణాం నాగానాం మణయో యథాతద్వ ద్వేదాంగ శాస్త్రాణాం జ్యోతిషం మూర్ధని స్థితం.

అని ప్రశంసించబడింది. లౌకిక, అధ్యాత్మిక, శాస్త్రాలలో మూర్ధన్యమై, అన్ని వర్గాలవారికి తలలోనాలుకలా ఉంటూ వారి అభివృద్ధికి మూలాధారం అవుతోంది

# క్రూర సౌమ్యగ్రహాలు

ధర్మం ఆచరణకు సంబంధించినది. ఆచరణ ప్రవర్తన, స్వభావంపై ఆధారపడిఉంది. కేంద్రం కృషికి, కోణాలు, ఆలోచనకు సంకేతాలు మనస్సు మంచిదైతే ఆలోచన మంచిదైతే చేసేపని మంచిదౌతుంది. మంచిమనస్సుతో చేసినపనిలో కొంతదోషం ఉన్నా సమాజం తప్పుపట్టదు. చేసేపని మంచిదైనా మనసు మంచిది కాకపోతే చెడ్డ ఉద్దేశంతో చేసిన మంచిపనిమంచి ఫలితాలనివ్వదు.

కేంద్రాలలో క్రూర గ్రహాలుంటే చేసే పని చెడ్డదౌతుంది. సౌమ్య గ్రహాలుంటే చేసేపనిలో సౌమ్యత ఉంటుంది. కోణాలలో క్రూరగ్రహాలుంటే ఆలోచన క్రూరమైనదిగా ఉంటుంది. సౌమ్య గ్రహాలుంటే ఆలోచనసౌమ్యమైనదవుతుంది ధర్మరాజు దాత, కర్ణుడుదాతే దుర్యోధనుడు గూడా దానాలు చేసి దాతననిపించుకుందామనుకున్నాడుకాని భావాలు వేరు ధర్మరాజు భగవదనుగ్రహంకోసం దానాలు చేశాడు అతనికి భగవంతుని అనుగ్రహం లభించింది. కర్ణుడు దాతగా ప్రఖ్యాతిని కోరాడు దానకర్ణుడనే ప్రసిద్ధిలభించింది. తనసామంతుడే దానకర్ణుడనిపించుకుంటున్నాడనే అసూయతోను, ధర్మరాజును మరపించి ప్రజలను ఆకట్టుకోవాలనే తపనతోను దానాలు ప్రారంభించాడు దుర్యోధనుడు దుర్యోధనుడిచ్చేదానాలు స్వీకరించకపోతే కోపంవస్తుంది. అనేభయంతో ప్రజలు దానాలు తీసుకున్నారు మనసు మంచిది కానందు వలన అతడిచ్చే సొమ్ము ధర్మరాజుకు చెందాల్సిందేనని భావించిన ప్రజలు దానంపుచ్చుకుంటు తిట్టుకుంటు ధర్మరాజునే పొగుడుకున్నారు మనస్సులో. ఆకారణం వలన పొందదగిన ప్రఖ్యాతిగాని, దైవానుగ్రహంగాని అతడు పొందలేకపోయాడు.

ప్రస్తుతాంశంలో మనసు ఆలోచన (కోణాలు 5,9) మంచిదైతే చేసేపని (కేంద్రాలు 4,7,10) క్రూరంగా ఉన్నా లోకం మెచ్చుకుంటుంది. ఆలోచన క్రూరమై (5.9) పని (4,7,10) సౌమ్యమైనా పొందదగిన శాశ్వత సత్ఫలితాలు పొందడం సాధ్యంకాదు. కాగా కేంద్రాలలో మంచి గ్రహాలు ఉంటే పని సౌమ్యంగా ఉంటుంది క్రూరగ్రహాలుంటే చేసేపని క్రూరంగా ఉంటుంది. కోణాలలో సౌమ్యగ్రహాలుంటే ఆలోచన సౌమ్యంగా ఉంటుంది. క్రూరగ్రహాలుంటే ఆలోచన క్రూరంగా ఉంటుంది. ఆలోచన సౌమ్యంగా ఉండి పని క్రూరంగా ఉంటే పరవాలేదు గాని ఆలోచన క్రూరంగా ఉండి పని సౌమ్యంగా ఉన్నా మంచి ప్రయోజనాలు సిద్ధించవు.

ఈ సందర్భంలో నైసర్గిక, శుభ, నైసర్గికపాపులనే వ్యవహారాన్ని గూర్చి కొద్దిగా ముచ్చటించుకుందాం. పరాశరుడు క్రూర సౌమ్యగ్రహాలను పేర్కొన్నాడు. గ్రహాలను శుభులు పాపులు అని

విడదీయడం సమగ్రమైన విధానంగా కనిపించదు లోకంలోని మనుషులను గూడా పుణ్యాత్ములు పాపాత్ములు అని గాని శుభులు, అశుభులు అని గాని విడదీయలేం చేసే పనులు అన్నీ ఒకేవర్గానికి చెందినవి కాలేవు. శుభ శబ్దానికి వ్యతిరేక పదం పాప శబ్దం కాదు. అందువలన నైసర్గిక శుభులు నైసర్గిక పాపులు అనే వ్యవహారం సహేతుకంగా కనిపించదు. క్రూరులుగా చెప్పబడే గ్రహాలు శుభాన్ని చేసినా క్రూరంగా (అంటే వ్యక్తిని అధిక శ్రమకు గురిచేసి)చేస్తారు. అనడం న్యాయం సౌమ్యగ్రహాలు చెడ్డచేసినా సౌమ్యంగా చేస్తారని ఎక్కువగా మనస్సును బాధపెట్టరని గుర్తించవచ్చు. కాగా ఓవితండ్రిలాంటివాడు రాత్రిజన్మించిన వారికి శనికూడా కారకుడే. తండ్రిని (పిల్లవానిని మంచిమార్గంలో పెట్టడానికి లేదు శిక్షస్తే) క్రూరుడునవచ్చు. మంచిమాటలతో మంచిమార్గంలో పెట్టడానికి ప్రయత్నిస్తే సౌమ్యుడనవచ్చు. కాని పాపి అని అనలేము కదా!

రవి క్షీణ చంద్రుడు, కుజుడు, క్రూరులతో కలిసిన బుధుడు, శని కేంద్రాలలో ఉంటే జాతకుని పనులు క్రూరంగా ఉంటాయని అంగీకరించవచ్చు. పూర్ణచంద్రుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, కేంద్రాలలో ఉంటే పనులు సౌమ్యంగా ఉంటాయని అంగీకరించవచ్చు. క్రూరగ్రహాలు కోణాలలో ఉంటే ఆలోచనలు క్రూరంగా ఉంటాయని, సౌమ్యగ్రహాలు కోణాలలో ఉంటే ఆలోచనలు సౌమ్యంగా ఉంటాయని గుర్తించవచ్చు. పనిసౌమ్యంగా ఉంటే అందరిపైనా ప్రభావాన్ని చూపకపోవచ్చును సౌమ్యులపైమాత్రమే ప్రభావాన్ని చూపుతుంది. అందరూ సౌమ్యులుగా ఉండరు కదా! అందువలన కేంద్రాలలో సౌమ్యగ్రహాలుండడం కంటే క్రూర గ్రహాలుంటేనే పని నలుగురిపై ప్రభావాన్ని చూపేదౌతుంది. ఆలోచనలో మాత్రం క్రూరత్వం ఉండకూడదు అందువలన కోణాలలో పాపగ్రహాలుండడం మంచిదికాదు. సౌమ్యగ్రహాలుండడమే మంచిది.

ఇదే విధానంలో ఆధిపత్యాలను గూడా అర్థంచేసుకోవచ్చు. క్రూరులకు కేంద్రాధిపత్యం మంచిది. కోణాధిపత్యం మంచిదికాదు (శాస్త్ర గ్రంథాలలో ఈ మాట స్పష్టంగా చెప్పబడి నట్లులేదు) సౌమ్యులకు కోణాధిపత్యం మంచిది కేంద్రాధి పత్యం అభివృద్ధి కరం కాదు అని గుర్తించవచ్చు.

# సప్తస్వరాలు - సప్తగ్రహాలు - సప్తవర్ణాలు

సూర్యకిరణాలలోని సప్తవర్ణాలు ఏడుగ్రహాల శక్తులకు ప్రతీకలు ఏడుగ్రహాల వర్ణాధిపత్యం, ఆ గ్రహాలు విశ్వంపై పంచేకాంతికిరణాలకు ప్రతీకలు, వేరువేరుగ్రహాల కాంతులు ప్రకృతిపై ప్రభావాన్ని చూపిస్తున్నాయి. ఆ గ్రహకాంతులకు ప్రకృతిలోని జీవజాలం స్పందన పొందుతోంది. ఆ గ్రహకాంతులకు స్పందించిన సందర్భాలలో వేరువేరు పక్షులు జంతువులు వేరు వేరు రీతుల్లో స్పందిస్తున్నాయి. ఆలా స్పందించిన సందర్భాలలో వెలువడిన ధ్వనులు విన్నవారిమనస్సులలో స్పందనలనందిస్తున్నాయి. ఆ ధ్వనుల వర్గీకరించిన సత్యద్రష్టలు. ఆ రాగాలకు రోగాలను నయంచేసే శక్తిఉందని గమనిచారు.

గ్రహాలు శుభకాంతికిరణాల ద్వారా స్పందిచినపుడు ఉత్పత్తి అయినరాగాలు గ్రహాల అశుభకిరణాల ద్వారా జనించిన రోగాలను తొలగించడంలో అభ్యంతరం లేదు. మనస్సు ఏకాగ్రం అయినప్పుడు పొందిన ప్రశాంతి ఆరోగ్యరూపమైన ప్రశాంతిని ఇవ్వడంలో ఉన్నసత్యాన్ని పరామనో విజ్ఞాన శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేస్తున్నారు. గ్రహాల శుభ కిరణాల ద్వారా ఉత్పత్తి అయిన రత్నాలు దుష్టకిరణాల ద్వారా ఉత్పత్తి అయిన దోషాలను తొలగించడంలో సమర్ధవంతంగా పనిచేస్తున్నాయి. ఉదాహరణకు కుజునిదోషం ద్వారా ఏర్పడిన ప్రమాదం వల్ల ఎముకవిరిగితే ఆ ఎముకను అతకడానికి కుజుని శుభకిరణాల ద్వారా పుట్టిన పగడాన్ని వినియోగిస్తున్నారు

గ్రహాల శుభ కిరణాల ద్వారా జన్మించిన మూలికలు గ్రహాల దుష్టకిరణాల ద్వారా జనించిన రోగాలను నయం చేస్తున్నాయి ఆధునికులు ద్వాదశలవణాలకు ద్వాదశరాసులకు గల సంబంధాలను గూడా గుర్తిస్తున్నారు.

లవణానికి చంద్రుడు అధిపతి లవణం ప్రేమానురాగాలను ప్రేరేపిస్తుంది. ప్రేమలోని ఉద్రేకం కోపంలోని ఉద్రేకం వేరువేరు గాదు. ఉద్రిక్తతచెందే మనసుకు కారణం చంద్రుడే. లవణానికి అధిపతి చంద్రుడే మానసికోద్రేకాలకు కారణం లవణమే. అందుకే బ్లడ్‌ప్రషర్ తగ్గడానికి లవణం తగ్గించమంటున్నారు వైద్యులు. అదే లవణాన్ని శుభ్రంచేసి సూక్ష్మీకరిస్తే అదే లవణసంబంధమైన అనారోగ్యాలను నివారించగలుగుతోంది.

క్రమబద్ధమైన స్వరాలు ఆయాగ్రహప్రభావాలను సక్రమంచేయడానికి కారణమౌతున్నాయడం సహేతుకంగానే కనిపిస్తుంది. సప్తస్వరాలకు ఏడురంగులను చెప్పారు సంగీత శాస్త్రజ్ఞులు ఆరంగులపై

ఏడుగ్రహాలకు ఆధిపత్యం కనిపిస్తోంది. ఆ రంగుల ప్రభావాలను కూడా రష్యన్ పరిశోధకులు నిర్ధారణ చేస్తున్నారు. ఎరుపురంగుగోడలుగల గదిలో పెంచబడిన పిల్లల్లో ఎముకల ఎదుగుదల రక్తపోటు ఉత్సాహం ఉత్తేజం మొదలైన (కుజ) లక్షణాలను గమనించారు పరిశోధకులు. అదే అవసరానికి మించి ఆగదులలో ఉంచడం ద్వారా ఆ పిల్లలలో హింసాత్మక స్వభావాలు కోపాధిక్యత మొదలైన లక్షణాలను గూడా గమనించారు. కుజుని స్వభావాల్లోనివే పై ఈ లక్షణాలన్నీ. నీలిరంగు గోడలుగల గదులు విశ్రాంతికి అనువైనవి. నీలిరంగుకు ఆధిపత్యగల గ్రహం శని. శని విశ్రాంతికి అధిపతి. ఈ రీతిలో గమనించినప్పుడు స్వరాలు వానికి చెప్పబడినరంగులు గ్రహాలరంగులు - స్వరాల ప్రభావాలు రంగులు ప్రభావాలు అనే వానిని పరిశీలించే అవకాశం ఏర్పడుతుంది.

స,రి,గ,మ,ప,ద,ని, అనే సప్తస్వరాలకు ఏడురంగులు చెప్పారు. (చూ: ఒక యోగి ఆత్మకథ 281 పే)

| | రంగు | పక్షి, జంతు ధ్వని | అధిపతి కాదగిన గ్రహం |
|---|---|---|---|
| స | ఆకుపచ్చ | నెమలి | బుధుడు |
| రి | ఎరుపు | చేతక పక్షి (గోవు) | కుజుడు |
| గ | బంగారు రంగు | మేక | రవి |
| మ | పసుపు కలిపిన తెలుపు | క్రౌంచ పక్షి | చంద్రుడు |
| ప | నలుపు | కోకిల | శని |
| ధ | పసుపు | గుర్రం | గురుడు |
| ని | చిత్ర వర్ణం (అన్ని రంగుల కలిపి) | ఏనుగు | శుక్రుడు |

అమర కోశంలో

షడ్జంమయూరో వదతి గావస్త్వృషభ భాషిణః

అజావికంతు గాంధారం క్రౌంచః క్వణతి మధ్యమం.

పుష్పసాధారణేకాలే పికః కూజతిపంచమం ధైవతం హేషతేవాజి నిషాదంబ్రుంహతేగజః

నాట్యవర్గ 184, 185, అనేవివరణ కనిపిస్తోంది.

బుధుడు ఆకుపచ్చ రంగుకు అధిపతిగా చెప్పబడ్డాడు. అది ఉత్పత్తికి సంకేతంగా భావించబడింది. గదులకు ఆకుపచ్చరంగు వేస్తే ఆహ్లాదం జనిస్తుంది. ఉత్పత్తికి అనువైనదిగా ఉంటుంది. ఈ రంగుకు శుక్రుని ఆధిపత్యాన్ని గూడా కొందరంగీకరించారు. వర్షం వచ్చేసందర్భంలోని మేఘాన్ని చూసి నెమలి ఆనందంతో నృత్యం చేస్తుంది. వర్షం వలన వృక్షజాతులు ఉత్పత్తి నందిస్తాయి. వజ్రం శుక్రునకు సంబంధించిన రత్నం. అందున్న కాంతిని జాగ్రత్తగా గమనిస్తే ఆమెరుపులో అన్నిరంగులు దర్శనమిస్తాయి. తెలుపురంగు అన్నిరంగులసమిష్టి అనేవిషయం అందరు ఎరిగినదే శుక్రునికి గల ఆధిపత్యం అతని రంగుతోను పరిశీలిస్తే మెరిసే తెలుపు అనేది అవగతం అవుతుంది.

ఈ రీతిలో రంగులకు స్వరాలకు గల సంబంధాన్ని, ఆరంగులకు గ్రహాలకు గలసంబంధాన్ని వివిధరాగాలలో ప్రాధాన్యంగల స్వరాలను ఆరాగాలకు అనారోగ్యనివారణలో గల శక్తిని వర్గీకరిస్తే రాగాలకు, రోగాలకు గ్రహాలకు రంగులకు గల అంతరంగ సంబంధం అభివ్యక్తమౌతుంది. ఈ విషయంలో మేధావుల దృష్టిని కేంద్రీకరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. స్వరాల ప్రభావం ప్రకృతిపై ఉందని పలువురు శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేస్తున్నారు. తాన్ సేన్ గానంతో మంటలను పుట్టించాడు, "కాలిఫోర్నియా ప్రకృతి శాస్త్రజ్ఞుడు ఛార్లెస్ కెలాగ్ 1926లో నిప్పుమీద నాదస్పందనకుగల ప్రభావాన్ని న్యూయార్కు, అగ్నిమాపకదళం వారిముందు ప్రదర్శించాడు. పరిమాణాన్ని విస్తృతంగా పెంచి చేసిన ఫిడేలు కామానులాటిదాన్ని ఒక అల్యూమినియం ట్యూనింగ్ ఫోర్క్ కి అడ్డంగా అటూ ఇటూగబగబా ఆడించి తీవ్రమైన రేడియో స్థాయిధ్వనిలాంటి కీచుస్వరాన్ని పలికించాడు. గుల్లగా ఉన్న ఒక గాజు గొట్టంలో ఎగిరి పడుతున్న రెండడుగుల ఎత్తుగల పసుపు పచ్చటి గ్యాస్ మంట ఆరంగుళాల ఎత్తుకు తగ్గి గిలగిలా కొట్టుకొంటూ నీలిమంటగా మారింది. అలాగే ఆకమానుతో మరోసారి చేసేటప్పటికి కీచు స్వరంతో మరోసారిస్పందన వెలువడి మంటని ఆర్పేసింది. (చూ: ఒక యోగి ఆత్మకథ 280పే) "హిందోళరాగం విశ్వప్రేమ భావాన్ని కలిగించడానికి వసంత కాలంలో తెల్లవారగట్ల వినిపిస్తూంటుంది." దీపకరాగం దయా భావాన్ని మేల్కొల్పడానికి వేసవి కాలంలో సాయంత్రంపూట ఆలాపించడం జరుగుతుంది. మేఘరాగం ధైర్యం కలిగించడానికి వానాకాలంలో మిట్టమధ్యాహ్నం ఆలాపించవలసింది. భైరవరాగం ప్రశాంతతను సాధించడానికి ఆగస్ట్, సెప్టెంబరు, అక్టోబరు నెల్లలో పొద్దుటిపూట వినాలి శ్రీరాగం పరిశుద్ధ ప్రేమను పొందడానికి శరదృతువులో మునిమాపు వేళల్లో గానం చేయాలి. మాలోసురాగం శౌర్యం రేకెత్తించడానికి చలికాలంలో అర్థరాత్రి వేళల్లో వినిపించాలి. (అదే 279పే).

హిందూ సంగీతం ఆత్మాశ్రయమైన ఆధ్యాత్మికమైన వైయుక్తిక కళ. (అదే 282 పే.)

మొదలైన అంశాలను పరిశీలనలోనికి తీసుకుంటే సంగీత ప్రభావం స్పష్టమౌతోంది. జ్యోతిష శాస్త్రం ఆధారంగా రోగ వర్గీకరణ, రాగవర్గీకరణ చేసి సంగీతం ద్వారా రోగనివారణను క్రమబద్ధం చేయవలసిన అవసరం కనిపిస్తోంది. గౌ॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు, ఈకోణంలో కృషి ఆరంభించారు. దేశవ్యాప్తంగా ఈ పరిశోధనను వారే ప్రోత్సహించాలని కోరుతూ ఈ ఆలోచనను వారికే అర్పణ చేస్తున్నారు.

# జ్యోతిషం కర్మ సిద్ధాంతం

జ్యోతిషం కాంతులకు సంబంధించిన శాస్త్రం కాంతికి ప్రభావం ఉంది కాంతి మనస్సును ప్రేరేపిస్తుంది. ఉత్సాహంగా ఉన్నపుడు దీపాలంకరణ నిరుత్సాహంగా ఉన్నప్పుడు చీకటి మానవుడు కోరుకుంటాడు. కాంతి రంగు వ్యక్తి మనస్సుపై ప్రభావం చూపడం ఆధునిక వైజ్ఞానికులంతా అంగీకరించిన విషయమే. వ్యక్తి మనస్సులో కలిగిన సంకల్పాలకు అనుగుణంగా ప్రవర్తిస్తాడు దార్శనికులు "బుద్ధిః కర్మానుసారిణీ", అని అంటారు. కాంతికి ప్రభావం ఉన్నమాట వాస్తవమే. పుట్టిన సమయానికి ఏయే కాంతులు ఏయే కోణాలలో భావప్రేరకములై ఉన్నాయో ఆయా కాంతి ప్రభావములకు లోబడి వ్యక్తి ఆలోచిస్తాడు. ప్రతివ్యక్తి తన భావాలకు అనుగుణంగా తాను ప్రవర్తించడమే స్వాతంత్ర్యం అనుకుంటాడు కాని స్వాతంత్ర్యం వేరు స్వేచ్ఛ వేరు. స్వ-ఇచ్ఛ-స్వేచ్ఛ తన కోరిక ప్రకారం నడవడం స్వేచ్ఛ. స్వేచ్ఛగా ప్రవర్తించే వ్యక్తులను సమాజం గౌరవించదు. తంత్రం అంటే ఆలోచన స్వాతంత్ర్యం అను శబ్దానికి తనకు కలిగిన మనోభావాలను సామాజిక న్యాయము, శాస్త్రము, అనుభవము, అను వాటి ఆధారంగా సక్రమమైన రీతిలో ఆలోచన చేసి వివేకముతో నిర్ణయించుకొని దానిని ఆచరణలో పెట్టుట అనే విశిష్టమైన అర్థం ఉంది. ఆ విధంగా వ్యక్తి ప్రవర్తించినపుడు గ్రహముల దుష్ట ప్రభావాలను దాటగల వాడవుతాడు. కర్మ సిద్ధాంతం యొక్క ఆధారంలేకుండ గ్రహాల ప్రభావాలను మాత్రమే అంగీకరించే జ్యోతిష్కులకు "ఒక చెడ్డ సమయంలోగాని మంచి సమయంలోగాని వ్యక్తి పుట్టుటకు కారణమేమి?" అను ప్రశ్నకు సమాధానం లభించదు. భారతీయశాస్త్రాలన్నీ ఒకే విజ్ఞానానికి చెందిన విభాగాలు, శాస్త్రాలు వేరైనా, సిద్ధాంతాలు వేరైనా భారతీయ విజ్ఞానమునకంతటికీ లక్ష్యం మోక్షమే. సిద్ధాంత వైవిధ్యం అనేది కూడ మూల సూత్రాలను భారతీయతను దాటి పోలేనిదే. భాః అంటే కాంతి, కాంతి విజ్ఞానానికి, ఆనందానికి, పరమాత్మకు, సంకేతం దానియందు రతి (ప్రీతి) గలవారే భారతీయులు. కర్మ సిద్ధాంతం అంటే (ఈ జన్మలోకాని పూర్వజన్మలోకాని) తాను చేసిన పనికి ఫలితం తానే అనుభవించాలి అని కొందరి భావన కాని చేసిన కర్మకు ప్రతిఫలము అనుభవించుట సార్వత్రికంగా నియతం కాదు. అప్పుచేసిన వాడు తీర్చకపోతే జైలుకు పోవుట కర్మఫలితంగా భావిస్తే తీర్చుట అనే ప్రక్రియ జైలుకు పోకుండా కాపాడుతుంది అనగా పూర్వం చేసిన కర్మకు అనుభవించటం ఒక మార్గమైతే దానిని విరోధించుట కొరకు మరో కర్మచేయుట మరోమార్గం, కాగా జాతకంలో ఉన్నది తప్పక అనుభవించాలి అనే విధానం సరియైనదికాదు బృహజ్జాతక వ్యాఖ్యాత భట్టోత్పలుడు "జాతక ఫలితాన్ని అనుభవించుటే తప్పనిసరి అయితే దానిని తెలిసికొనుట వ్యర్థం భావిసత్ఫలితాన్ని

ముందుగా తెలిసికొనుటచే క్రియాశీలతలో పెంచడం భావిదుష్ఫలితాన్ని ముందుగా తెలుసుకొనుటవల్ల రాబోయే దుఃఖంకోసం ఇప్పటినుండి దుఃఖించడం అవే నష్టాలుండుటవల్ల జాతక ఫలితం తెలుసుకోడమే నష్టప్రదం అవుతుంది. శాస్త్రప్రయోజనం అదికాదు. జాతకంలో శుభఫలితాన్ని తెలుసుకొని దానికి అనుగుణమైన కృషిచేయుటం ద్వారా ఫలితాన్ని సంపూర్ణంగా సాధించవచ్చు విశేషించి దానాదికములైన పుణ్యకర్మలద్వారా శుభఫలితాన్ని పెంచుకోవచ్చు దుష్టఫలితాన్ని ముందుగా తెలిసికొనుటద్వారా దానికి వ్యతిరేక దిశలో ప్రయత్నించి దుష్టఫలితాన్ని జయించవచ్చు. లేదా తగ్గించుకోవచ్చు. ఆ దోషప్రాబల్యశాతాన్ని గమనించి దాన్ని జయించడం శక్యంకాని పక్షంలో దానికి సిద్ధపడి తన జీవనగమనంలో అనుగుణమైన మార్పులను చేసుకోవచ్చు" అని వివరించాడు కర్మకుఫలితం ఉంటుంది అది దుష్టమైనదైనపుడు దానిని నివారణకు చేసే కర్మకూ ఫలితం ఉంటుంది. కర్మను కర్మచేతనే జయించాలి పూర్వంచేసిన కర్మను దానివల్ల వచ్చు ఫలితాన్ని అదృష్టమని దైవమని పిలుస్తుంటారు. "విహన్యాద్దుర్బలం దైవం పురుషేణవిపశ్చితా" అనే వ్యాసభగవానుని వచనం పూర్వకర్మను ప్రస్తుత కర్మచే జయించవచ్చు. అనే అభిప్రాయాన్ని బలపరుస్తోంది. మనమిదివరలో చేసిన కర్మననుసరించి మన జననం సంభవిస్తుంది. మనజననం మనచేతిలో లేదు అప్పటి గ్రహస్థితి పూర్వకర్మకు అనుగుణంగా ఉంటుంది. ఆ గ్రహస్థితి ప్రభావం కాలక్రమంలో దశాక్రమాన్ననుసరించి ఆయా భావనలను ప్రేరేపిస్తుంది. ప్రేరేపించబడిన భావనకు స్పందించిన వ్యక్తి తన భావాలను అనుసరించి ప్రవర్తించకుండా శాస్త్రం, సామాజిక న్యాయము, అనుభవము ఆధారంగా చేసికొని వివేకముతో ప్రవర్తించి మంచిని పెంచుకోవడం చెడ్డను తొలగించుకోవడం చేయవలసి ఉంటుంది. దోషఫలితం సిద్ధించే సమయాన్ని జాతకం తెలుపుతుంది. అది ముందుగా గుర్తించుటద్వారా దానిని జయించే అవకాశాన్ని జాతకం కల్పిస్తోంది. లఘు జాతకంలో "యదుపచితమన్య జన్మనిశుభా శుభంతస్యకర్మణః పంక్తిం వ్యంజయతిశాస్త్రమేతత్ తమసి ద్రవ్యాణి దీపమివ" అన్నాడు వరాహమిహిరుడు. పూర్వజన్మలో చేసిన శుభాశుభ కర్మల యొక్క ఫలానుభవ కాలాలను ఈ శాస్త్రం సూచిస్తుంది. చీకటిలోని వస్తువులను దీపముయొక్క సహాయంతో గుర్తించినట్లుగా కలుగబోయే శుభాశుభాలను జాతకంద్వారా గుర్తించి అనుకూల వ్యతిరేక ప్రక్రియలద్వారా జీవితాన్ని సుఖవంతంచేసికొనుటకు ఈ శాస్త్రం సహకరిస్తోంది.

కర్మ 3 విధాలు ప్రారబ్ధం సంచితం ఆగామి. ప్రారబ్ధం అంటే పూర్వజన్మలో మనంచేసిన కర్మకు ఫలితం అనుభవించడం ప్రారంభించింది. ప్ర ఆరబ్ధం ఇంతకుముందే ఆరంభించబడినది దాన్ని జయించడం శక్యం కాదు. విడచిపెట్టిన బాణంయొక్క మార్గాన్ని మళ్ళించడం అంత సులభం కాదు. సంచిత కర్మ అంటే పూర్వంచేయబడి నిలవ ఉంచుకొన్నది. ఆగామి అంటే

రాబోయే కాలంలో పరిపక్వమయ్యేది. మన సత్ప్రవర్తన ద్వారా ఆగామిని మంచిగా మలచుకోవచ్చు. మన ప్రతిక్రియలద్వారా దుష్టమైన సంచితకర్మను తొలగించుకోవచ్చు. దుష్టదశవచ్చేవరకు ఆగి దుష్టఫలితాన్ని అనుభవించడం ప్రారంభించిన తరువాత దాన్ని తొలగించుకోవడం అనారోగ్యంచేశాక మందుపుచ్చుకోవటం లాంటిది. జాతకం ద్వారా రాబోయే దుష్ట ఫలితాన్ని ముందుగా గుర్తించి అష్టకవర్గుద్వారా దాని శాతాన్ని గుర్తించి దుష్టఫలితానికి వ్యతిరేకంగా మనం చేయవలసిన కృషిని అంచనావేసికొని ఆధ్యాత్మిక లౌకిక ప్రయత్నాలద్వారా కృషి చేసి దుష్ఫలితాలను అధిగమించవచ్చు. ఉదా|| నిన్న ఒకణ్ణి మనం కొట్టాం ఈ రోజుడతడు మన్నికొట్టడానికి పదిమందిని వెంటవేసికొని వస్తున్నాడు ఈ విషయాన్ని ముందుగా తెలుసుకోనప్పుడు మనమాతన్ని చేతిలో దెబ్బలు తినడం తప్పనిసరి. తెలుసుకున్న పక్షంలో మూడుకోణాల్లో దాన్ని అధిగమించే అవకాశం ఉంది. 1. అతడు ఎన్ని గంటలకు వస్తున్నాడో గమనించడం వలన అతనువచ్చే సమయానికి ముందుగా అతను తీసుకువచ్చే పదిమందికంటే ఎక్కువబలగంతో కూడియుండి అతనికి క్షమార్పణచెప్పడం ఒక మార్గం. జాతకంలో ఉన్న దుష్టఫలితంయొక్క శాతాన్ని గమనించి దానాదుల ద్వారా దానికంటే ఎక్కువ పుణ్యాన్ని సంపాదించి గతంలో తానుచేసిన అపరాధములను క్షమించమని ప్రార్థించడంవంటిది ఇది. దీనిలో సాత్వికత ప్రశాంతి ఉన్నాయి. 2. ఎదుటి వాడు 10 మందితో వస్తుంటే అతన్నే జయించే విధంగా ఎక్కువ బలగంతోకూడిఉండి అతనిని ఎదిరించడం రెండవ మార్గం. జాతకంలో దుష్టసమయాన్ని గుర్తించి లౌకికమైన కృషిని పెంచి దుష్టఫలితాన్ని అధిగమించే ప్రయత్నం చేయడం ఇలాంటిది. దీనిలో ఉద్రేకము, కొంత దెబ్బలు తగలటం వంటి నష్టాలుకూడా ఉన్నాయి. 3. అతను వచ్చేసమయానికి అతనికి కనిపించకుండా దాక్కోవటం. దీనిలో మానసిక భీతి ఆందోళన ఉన్నాయి. మనకు జాతకంలో వచ్చే దుష్టసమయాన్ని గుర్తించి నూతన ప్రయత్నాలు విరమించి సామాన్యమైన జాగర్తలను తీసుకొంటూ ప్రవర్తించుట దీనిలో అశాంతి, దుఃఖభావన నిరుత్సాహం ఉంటాయి. ఆ విధంగా చేసే మూడు ప్రక్రియలలోను రాబోయే దుష్టఫలితాన్ని ముందుగా గుర్తింపగల్గటం తప్పనిసరి. దానికి జాతకం ఒక్కటేమార్గం కాగా కర్మసిద్ధాంతానికి అనుగుణంగా జాతకం ద్వారా మన జీవితాన్ని సుఖమయం చేసుకొనే అవకాశాలను జ్యోతిశ్శాస్త్రం అనే కరదీపిక చూపుతోంది.

# స్థూల సూక్ష్మ భావనలు

## దృశ్యార్థ అదృశ్యార్థాలు - పరస్పర వైరుధ్యాలు - పోలికలు

సూక్ష్మానికి వ్యతిరేక పదం స్థూలం. కాని సూక్ష్మం స్థూలం పరస్పరం పోలికలు, వైరుధ్యాలు కూడా కలిగి ఉన్నాయి. లగ్నంలో తానున్నాడు. సప్తమంలో భార్య ఉంది భార్య తాను కాదు. కాని సంబంధం ఉంది అది కూడా తనకుపకరిస్తేనే. ఆమె మనసంతా తాను మాత్రమే నిండితేనే. సప్తమంలో తానుకాని సమాజమంతా ఉంది ఆ సమాజం తన భావాలను పంచుకుంటే మిత్ర సమాజం, తన భావాలను సమాజంలో పంచ లేకపోతే (తనకు) పనికి రాని సమాజం, అదృశ్యార్థంలోని తాను దృశ్యార్థంలోని సమాజంతో సంబంధం కలిసి ఉన్నాడు. ఎవరికి వారే ఆ సమాజం తనకుపకరించాలని భావించినప్పుడు ఇచ్చిపుచ్చుకొనే ధోరణి ఉన్నప్పుడు మైత్రి. అది లోపించినప్పుడు వైరుధ్యం కనిపిస్తాయి. తానుగా ఉంటే అందరికీ కనిపించడు (అదృశ్యార్థం) సమాజంతో కలిస్తే (దృశ్యార్థం) అందరికీ తాను కనిపిస్తాడు. లగ్నంస్వతంత్రానికి సంకేతమైతే సప్తమం అస్వాతంత్ర్యానికి సంకేతం అనవచ్చు. ద్వితీయంలో ఆర్జన ఉంది. అష్టమంలో ఆకస్మికాదాయం ఉంది. ఆర్జన అందరికీ కనిపించనది ఆకస్మికాదాయం తెల్లగోడపై నల్ల మచ్చలా పెద్దగా కనిపించేది. ఆర్జన సుఖప్రదమే అవుతూ ఆత్మీయతను పెంచుతోంది. ఆకస్మికాదాయం సమాజానికి దూరం చేస్తూ అందరిలో ప్రత్యేకంగా (దృశ్యార్థం) కనిపించేలా చేస్తోంది. ఆర్జన (ద్వితీయం) ఆరోగ్య ప్రదమౌతోంది. ఆకస్మిక లాభ నష్టాలు అనారోగ్య (అష్టమం) కారణమౌతూ ఆందోళనను పెంచుతూ అనుభూతిని ఆత్మీయతను దూరం చేస్తున్నాయి. ఆకస్మికంగా జరిగే సంఘటనలు అందరికీ కనిపించేలా అందరూ గుర్తించేలా (దృశ్యార్థం) చేయడంలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. ఆర్జన సూక్ష్మం అయితే ఆకస్మికం స్థూలం అవుతోంది. రెండింటిలో ధనాదికం సంబంధాన్ని వాటివల్ల వచ్చే ఫలాలు వైరుధ్యాన్ని కలిగిన అంశాలు అవుతున్నాయి.

వివాహంతో స్త్రీ అయినా పురుషుడైనా సగమైనా స్వతంత్ర్యాన్ని తగ్గించుకోక తప్పదు కదా! రాశి వర్గాలను పరిశీలించినా ఈ వైరుధ్యం కనిపించక తప్పదు.

మేషానికి అధిపతి కుజుడు. తుల కధిపతి శుక్రుడు తాను కష్టపడి ఇతరులకు సుఖాన్నందించే వాడు కుజుడు ఇతరుల కష్టాన్ని తన సుఖానికు పయోగించుకొనే వాడు శుక్రుడు. వృషభంలో బాధ్యత వహించడం ఉంటే వృశ్చికంలో (గూఢాచారి) తాను సేకరించిన సమాచారం రాజు కందించి తన బాధ్యతను వదిలించుకోవడం కనిపిస్తుంది.

మిథునంలో ద్వంద్వవైఖరి కనిపిస్తే ధనుస్సులో ఏకాగ్రత కనిపిస్తుంది. కర్కాటకంలో ఎవరేమనుకుంటారో అనే భయం కనిపిస్తే మకరంలో ఎవరేమనుకున్నా తాననుకున్నది సాధించి తీరడం ముఖ్యమనే భావన కనిపిస్తుంది. సింహంలో పాలన కనిపిస్తే కుంభంలో పాలించబడడం కనిపిస్తుంది. (కుంభంలో బద్ధకం బాధ్యతారాహిత్యం కనిపిస్తాయి) కన్యలో జ్ఞాపకశక్తి కనిపిస్తే మీనంలో ఊహాశక్తి కనిపిస్తుంది.

తృతీయంలో దగ్గర ప్రయాణాలున్నాయి. నవమంలో దూర ప్రయాణాలున్నాయి. దగ్గర ప్రయాణాలు (అదృశ్యార్థం) అందరికీ కనిపించేవికావు. అందరి దృష్టినీ ఆకర్షించలేవు దూర ప్రయాణాలు (దృశ్యార్థం) అందరి దృష్టినీ ఆకర్షించేవిగ ఉండి అందరికీ కనిపిస్తాయి. ప్రయాణం పోలిక దాని ఫలాలు పరస్పర విరుద్ధమైనవి. దగ్గర ప్రయాణాలు సహకారాన్ని పెంపొందిస్తాయి. దూర ప్రయాణాలు జన సహకారాన్ని దూరం చేస్తాయి. (అసూయవలన కావచ్చు దూరం కావడం వలన కావచ్చు) సహకారం ద్వారా వస్తు సముపార్జన సుఖ సంపాదన తృతీయంలో ఉంటే అనుభూతి, నేను అనుభవిస్తున్నాననే తృప్తి నవమంలో ఉన్నాయి. సహకారం ఆశించే వాడు నాకు లేనివి కావాలనుకుంటూ ఆర్జిస్తున్నాడు అనుభూతి గలవాడు (నవమం) ఉన్న వాటిని అనుభవిస్తూ తృప్తి పడుతూ లేవి వాటి విషయం ఆలోచించడం మానేస్తున్నాడు.

చతుర్థంలో విద్యార్జన ఉంది. దశమంలో ఆ విద్య వృత్తిగా పరిణమిస్తూ అందరికీ కనిపిస్తోంది (దృశ్యార్థం) చతుర్థంలో ఉన్న వినయం (విద్య వినయమునిచ్చు) అందరికీ కనిపించకపోవచ్చు. (అదృశ్యార్థం) దశమంలో ఉన్న అధికార గర్వం (దృశ్యార్థం) అందరికీ కనిపించేది అవడం సహేతుకమే చతుర్థంలో ఉన్న సుఖం అందరికీ కనిపించదు కాని దశమంలో ఉన్న శ్రమ అందరికీ కనిపించక తప్పదు. సుఖం ఇతరులకు తెలియక పోయినా దశమంలో ఉన్న శ్రమ గౌరవాన్ని పెంపొందించడం ప్రతిష్ఠను తీసుకురావడం గమనించదగినదే. ఈ శ్రమకు, గౌరవానికి, అధికారానికి సూక్ష్మ రూపం లతడార్జించిన విద్య అవక తప్పదు. విద్య అందరికీ కనిపించదు గాని విద్యా ఫలాలు అందరికీ కనిపిస్తాయి. అందుకే విద్య సూక్ష్మం అధికారం స్థూలం కావడంలో సందేహం లేదు.

పంచమంలో ఆలోచనా శక్తి ఉంది. తెలివి తేటలున్నాయి. అవి అందరికీ కనిపించవు (అదృశ్యార్థం, కాని ఆ తెలివి తేటలలో ఆర్జించిన లాభాలు మాత్రం (లాభం దృశ్యార్థం లోనిది) అందరికీ కనిపిస్తాయి. పంచమంలో ప్రేమ ఉంది. అది అందరికీ కనిపించదు. కాని లాభ దృష్టి ఉన్న మనసులో ప్రేమాదరాలకు స్థానం లేదు అలాంటి వ్యక్తి అందరికీ ప్రత్యేకంగా కనిపించ

(దృశ్యార్థం) తీరు తాదు పంచమంలో ఉపాసన ఉంది అది అదృశ్యార్థమే. ఆ ఉపాసన ఆర్జనా ఫలంగలదైనపుదు (లాభం) అందులో అందరికీ కనిపించే పటాటోపం ప్రాధాన్యం వహిస్తుంది. అలాంటప్పుదు ఏకాగ్రతలోపించి లాభమే ప్రధాన మౌతుంది. ప్రేమ వివాహం కట్నానికి ప్రాధాన్యం ఇవ్వదు. లాభ స్థానంలో కట్నానికి ప్రాధాన్యముండి ప్రేమకు ప్రాధాన్యం తగ్గినా ఆర్థిక లాభాలు అధికంగా ఆర్జించిన వాదు సమాజంలో కృత్రిమ ప్రేమలకు స్థానం అవుతూ అనుభూతికి (పంచమం) దూరం అవుతున్నాదు.

షష్ఠం శత్రు రోగ ఋణనిరోధక శక్తికి ప్రాధాన్యం వహిస్తోంది. ఖర్చు తక్కువ పెట్టిస్తోంది. వ్యయస్థానం శత్రు భీతిని, రోగ ములకు ధనవ్యయాన్ని అప్పులు తీర్చడాన్ని అధిక వ్యయాన్ని సూచిస్తుంది. ఇవన్నీ వ్యక్తిని పైకి చూపించేవే (దృశ్యార్థం) షష్ఠం సేవ అది ఎక్కువ మందికి కనిపించదు. కాని వ్యయం ఉద్యోగ విరమణ అందరికీ కనిపించే లంశమే. వ్యయంలో మరణం గూడా ఉంది. అది గూడా అందరికీ కనిపించేదే. వ్యక్తులు పుట్టినప్పుదు కొందరికి మాత్రమే తెలిసినా మరణించినప్పుదు ఎక్కువ మందికి తెలిసే అవకాశం ఎక్కువ.

ఈ విధంగా 1 నుండి 6 వరకు ఉన్న అదృశ్యార్థ చక్రంలోని విషయాలు 7 నుండి 12 వరకూ ఉన్న భావాల్లో (దృశ్యార్థం) అందరికీ తెలిసేవిగా రూపొందుతున్నాయి. 7 నుండి 12 వరకు ఉన్న భావాలలోని విషయాలకు 1 నుండి 6 వరకూ ఉన్న భావాలలోని విషయాలు సూక్ష్మవిషయాలుగా ఉంటూ అవి 7 నుండి 12 వరకూ ఉన్న భావాలలో స్థూల రూపాన్ని పొందుతున్నాయి. అదే స్థితిలో 1 నుండి 6 వరకూ ఉన్న భావాల ఫలాలకు 7 నుండి 12 వరకూ ఉన్న భావాల ఫలాలు విరుద్ధ ఫలాలను గూడా అందిస్తున్నాయి.

# వక్ర గ్రహం

ఒక ఇంటిలో ఎక్కువకాలం నివసించినపుడు అది అద్దె ఇల్లైనా సొంత ఇల్లైనా దానిపై మమకారం ఏర్పడడం సహజం. ఇది లౌకిక సూత్రమే అయినా గ్రహాల విషయంలో కూడా వర్తిస్తుంది. "రాశిలో ఎక్కువ భాగలు నడిచిన గ్రహం ఆత్మకారకుడు" అంటాడు జైమిని, ఎక్కువ భాగలు నడవాలంటే ఆ గ్రహముయొక్క గమన ప్రమాణం దృష్ట్యా ఆ గ్రహం ఎక్కువకాలం నివసించక తప్పదు. అతదు ఉత్తమ ఫలప్రదుడౌతాడు.

రాశిలో ప్రథమద్రేక్కాణంలో ఉన్న గ్రహం దశయొక్క ఆరంభం లోను ద్వితీయ ద్రేక్కాణంలో ఉన్న గ్రహం దశ యొక్క మధ్య భాగంలో, తృతీయ ద్రేక్కాణంలో ఉన్న గ్రహం దశయొక్క చివరిభాగంలోను ఫలితాన్నిస్తాడనే విషయం ప్రసిద్ధమైనదే. దశయొక్క ఆరంభంలో ఫలితాన్నిచ్చిన గ్రహం స్వల్ప ఫలితాన్నివ్వడం దశయొక్క చివరి భాగంలో ఫలితాన్నిచ్చినగ్రహం ఉత్తమఫలితాన్నివ్వడం జాతకాలను పరిశీలించినపుడు గోచరించే విషయమే. దశ ఆరంభంలోనే యోగించేస్తే తరువాత మరల అతడేమి యోగం చేయగలుగుతాడు?

"వదిశంతి శుభం నృణాం స్వదశాసు స్వభుక్తిషు" అనే లఘు పారాశరివాక్యం అర్థవంతమైనదే. స్వదశ - స్వభుక్తిలో యోగించిన గ్రహం తక్కిన అంతర్దశలలో యోగించలేకపోవడం అనుభవంలో కనిపిస్తున్న విషయమే.

గ్రహం ఒక దశలో ఒకసారి యోగించిన తరువాత మరల యోగించలేదనేభావం జ్యోతిష్కులలో వ్యాపించి ఉన్నదే. అతడే సమయంలోయోగించినా ఒకసారి ఒక యోగం ఇచ్చిన తరువాత మరల యోగించక పోవడం సహేతుకంగానే కనిపిస్తోంది. ఒక వ్యక్తి ఒకే వ్యక్తికి పలుమార్లు ఉపకారాలు చేయడం అసామాన్యమే.

ఒక దశప్రారంభమైనపుడు ఆగ్రహానికి సంబంధించిన ఆలోచనలు ప్రారంభం అవుతాయి, విదశం పరిశీలనలో ఈ అంశాన్ని ప్రత్యక్షంగా చూడవచ్చు. అలా ప్రారంభమైన ఆలోచనలు త్వరితంగా ఆచరణలోకి వచ్చేసి ఫలసిద్ధి జరిగితే ఆ ఫలితముయొక్క పరిమితి స్వల్పంగానే ఉంటుంది. ముందువెనకలాలోచించి స్పష్టమైన అవగాహనతో ఉన్నతమైన లక్ష్యంతో కొనసాగించిన కృషి వ్యక్తికి క్రమాభివృద్ధి నిచ్చి ఉత్తమ ఫలసాధనకు కారణం కావడం లోకన్యాయానికి తగినదే.

దశయొక్క ఆరంభంలో ఆలోచనలనిచ్చి అప్పుడే యోగించిన గ్రహం స్వల్పఫలాన్ని దశయొక్క

చివరవరకు కృషిని కొనసాగించి క్రమాభివృద్ధిని సాధించి చివరలో యోగించిన గ్రహం ఇచ్చే ఫలితం చాలా సంవత్సరాల కృషికిఫలంగా ఉండి ఉత్తమోత్తమం కావడం సహజమే.

1. ఒక రాశిలో ఎక్కువ భాగలు నడిచిన గ్రహం ఆత్మకారకుడు ఉత్తమ ఫలదాత.

2. చివరద్రేక్కాణంలో ఉన్న గ్రహం దశచివరలో ఫలితాన్నిస్తాడు.

3. స్వదశ, స్వభుక్తిలో యోగిస్తే తరువాత మరల యోగించడు.

4. చివర నవాంశలో ఉన్న గ్రహం పీడితావస్థను పొందుతాడు.

పీడితావస్థలోనున్న గ్రహం కృషిచేసి చేసి విసిగిపోయి ఆ ఫలితమందు కాంక్షతొలగిన స్థితిలో చిట్టచివరకు ఫలితాన్నిస్తాడు. మొదలైన ఫలసూత్రాలకు కోణాలు వేరైనా చెప్పే మాటలు వేరైనా ఆలోచిస్తే మూలసూత్రం ఒక్కటే అనే విషయం బోధపడుతుంది.

ఈ కోణంలో వక్రగ్రహాన్ని గుర్చి ఆలోచన చేసినపుడు వక్రగ్రహముయొక్క ఫలదాతృత్వ విషయంలో ఒక స్పష్టత ఏర్పడుతుంది. 20 భాగాలవరకు ముందుకు నడచిన గ్రహం, వక్రించి 5 భాగాలు వెనకకువచ్చి 15 భాగంలో ఉన్నాడు. అనుకుందాం. ఆ స్థితిలో ఆ గ్రహంయొక్క విలువను గమనిద్దాం. ఎక్కువ భాగలు నడచిన గ్రహం క్రమంగా పటిష్ఠమవుతూ అందరికంటె ముందున్నవాడు ఆత్మకారకుడౌతున్నాడు. అంటే నడచిన కొలదీ అతని బలం పెరుగుతోంది అని అర్థం చేసుకోవచ్చు. అలాటి స్థితిలో వక్రించి 15 డిగ్రీలో ఉన్న గ్రహం యొక్క విలువను 15 వ డిగ్రీలోనే ఉన్నట్లుగానే గుర్తించడం న్యాయంకాదు. అతడు నడచిన మొత్తం డిగ్రీలు 20+5+25 డిగ్రీల దూరం. ఈ స్థితిలో ఆ గ్రహం ఆ రాశిలో ఎక్కువ దూరం ప్రయాణించినట్లే అందుకే వక్రించిన గ్రహం శక్తావస్థను పొందుతుందని కొందరు అభిప్రాయపడ్డారు. కుజాది పంచ గ్రహాలుకు, చేష్టాబలం వక్రించినపుడే సిద్ధిస్తుందని అందరూ అంగీకరించిన విషయమే.

రాహుకేతువులు ఎల్లవేళలా వక్రించి నడిచేవారే కావడం వల్ల వాళ్ళు చేసే మంచి చెడులు రెండూ తీవ్రంగానే ఉంటాయి అని కొందరి భావన.

వక్రగ్రహ ఫలిత విధానాన్ని గూర్చి పలువురి అభిప్రాయాలు పలువిధాలుగా ఉన్నాయి.

ఉత్తర కాలామృతంలో

"వక్రీ స్వోచ్చ బల, స్వవక్రసహితే మధ్యంబలంతుంగభే

వక్రే నీచ బలస్యు నీచ భవనే వక్రే బలంతుంగజం" (బల సాధన ఖండ 17 శ్లో) వక్రించిన గ్రహం ఉచ్ఛఫలాన్నిస్తాడు. వక్రించిన గ్రహంతో కలిసిన గ్రహం మధ్య బలాన్నిస్తాడు. ఉచ్ఛలో వక్రించిన గ్రహం నీచ బలాన్ని నీచలో వక్రించిన గ్రహం ఉచ్ఛబలాన్ని ఇస్తాడు. అని వివరించడం జరిగింది. కాని భావమంజరిలో

"మహాబలో సత్త్వవరోన్యుజోప్యగో
త్యుగో న్యుజః క్రూరఖగః"

భావగ్రహప్రకరణ - 31 శ్లో

"సౌమ్యగ్రహం వక్రించినట్లైతే మహా బలవంతుడు, క్రూరగ్రహం ఉచ్ఛలో వక్రిస్తే అధ్యుగ్రుడౌతాడు." అని చెప్పబడింది. సారావళిలో కళ్యాణవర్మ. ఉచ్ఛరాశావివోమేవ ఫలం నాన్యైరిహేష్యతే కాలాస్యాతి బహుత్వాచ్చ తస్మాత్ స్వోచ్చేతివక్రితే - 35 - శ్లో 14.

అంటాడు. ఉచ్ఛరాశిలో గ్రహం వక్రించినపుడు ఫలం (మంచి ఫలం) చెప్పడానికి ఇతరాచార్యులు అంగీకరించడం లేదు అని సందేహించడం వల్ల కళ్యాణవర్మకు ఈ విషయంలో సంశయం ఉన్నట్లు అర్థం అవుతోంది. సందేహానికి కారణం జాతక పరిశీలన వలన కల్గిన అభిప్రాయ వైరుధ్యమే.

పై అంశాలను ఉదాహరణ రూపంలో పరిశీలిద్దాం.

శ్రీ మొరార్జీ దేశాయ్ - 29-2-1896 (జ్యోతిష రత్నావళి ద్వితీయ భాగం - 199 పే)

ఈ జాతకంలో అష్టమాధిపతియైన శని, ఉచ్ఛలో వక్రించాడు, సప్తమదశమాధిపతియైన గురుడు శుభఫలప్రదుడు కాలేదు అనడం న్యాయం కాదు. అష్టమ భావకారకత్వాంలో ముఖ్యమైన ఆయువు దశమ భావకారకత్వాంలో ముఖ్యమైన, పదవి, గౌరవం వీరికి పుష్కలంగా ఉన్నాయి. దశమస్థానానికి, దశమాధిపతియైన గురుని దృష్టి ఉంది తక్కిన గ్రహదృష్టులు లేవు. గురుడు వక్రించి ఉన్నారు. అందువలన వక్రగ్రహం బలం పొందుతాడనడం సహేతుకంగా కనిపిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| | | | ల |
| రా | | | గు |
| కుబు<br>శు | | | చకే |
| | | శ | |

29-2-1896

10 5 ర

29-12-1901

10 చ

మిధున లగ్నం ద్వితీయంలో గురుడు వక్రి
తృతీయంలో చంద్ర కేతువులు
పంచమంలో శని వక్రి
అష్టమంలో కుజ బుధ శుక్రులు
నవమంలో రవి రాహువులు

29-12-1991

7 కు

---

29-12-1918

18 రా

---

29-12-1936

16 గు

---

29-12-1952

19 శ

---

29-12-1971

17 బు

---

29-12-1988

7 కే

---

29-12-1995

20 శు

---

29-12-2015

# ఉచ్చ స్వక్షేత్రాదులు - సహేతుకత

జ్యోతిషశాస్త్రాలకు ఆలోచించే కొలది హేతువులు దర్శనమిస్తూంటాయి. మన మనస్సుకు తట్టనంతమాత్రాన హేతువు లేదనడం న్యాయం కాదు. రవి గంభీరుడైన ప్రభువు. అరణ్యంలో నివసించే సకల జీవజాలానికి ప్రభువుగా భావించబడే సింహం రవికి స్వక్షేత్రం కావడం అదే అతనికి మూల త్రికోణం కావడం, సహేతుకమైన పద్ధతి కాదనలేము. రాజు రాణించాలంటే సైన్యం యొక్క సహకారం కావాలి. సైన్యాధ్యక్షుడు కుజుడు. అతనికి చెందిన రాశులు రెండు. అవి మేష, వృశ్చికాలు మేషం సైన్యానికి గోడవార నక్కి ఉండే వృశ్చికం గూఢచారి విభాగానికి సంకేతాలు. అందులో మేషం (అధికారిని) రాజును అనుసరించి కొండనైనా ఢీకొనే గొర్రె యొక్క ధైర్యానికి సంకేతం. అట్టి ధైర్యం గల సైన్యం యొక్క సహకారం గల రాజు అధికంగా రాణిస్తాడు. అందువలననే మేషం గ్రహరాజైన రవికి ఉచ్చక్షేత్రం.

చంద్రుడు అసమర్థుడైన మెతకరాజు, అతనికి భయమెక్కువ, దోవలోంచి మనం నడుస్తూంటే వారగామన్న పీత, కన్నంలో దూరుతుంది. ఎవరేమనుకుంటారో అనే భయంతో తన ప్రవర్తనను మలచుకునే (శ్రీ రాముడు చాకలి మాటకు గూడా విలువిచ్చి భార్యను అడవులకు పంపాడు అతనిది కర్కాటక లగ్నం) వారికి కర్కాటక రాశి సంకేతం, శ్రీ రామచంద్రుడు విష్ణ్వంశగా పూజిందగినవాడే కాని, రాజ్యం ఇస్తానంటే అలాగే అవడం, అరణ్యానికి వెళ్ళమంటే అలాగే అవడం, మొదలైన అంశాలద్వారా తన అభిప్రాయం కంటే ఇతరుల అభిప్రాయాలకు విలువిచ్చే లక్షణం కర్కాటక లగ్నంలో కనిపిస్తుంది. చంద్రునకు సలహానిచ్చే మంత్రి ఉంటే అతని సహకారంతో రాణిస్తాడు. మేధావులు నాల్గు రకాలు 1. లక్ష్యసాధన ధ్యేయంగా కలవారు ధనుస్సు. **2.** ఊహాలోకాల్లో విహరించేవారు (మీనం) 3. అంటీ ముట్టకుండా తీర్పునిచ్చేవారు (తుల) 4. బాధ్యత వహించి కార్యాలను చక్కబెట్టేవారు (వృషభం) బాధ్యత వహించే మేధావి సామీప్యంలో చంద్రుడు రాణిస్తాడు. మరెక్కడా రాణించలేడు అందుచేతనే చంద్రునికి వృషభమే ఉచ్చ, మూలత్రికోణం కూడాను. సేనా నాయకుడు సైనిక బలం దగ్గర రాణిస్తాడు. కుజుడు సేనానాయకుడు. సేవక వర్గం రెండు రూపాల్లో కనిపిస్తుంది. మంకుపట్టుతో కార్యాలను సాధించే వర్గం (మకరం) బద్ధకంతో పని విషయంలో శ్రద్ధ చూపని వర్గం (కుంభం). అందులో మొదటి వారి వద్దే సేనా నాయకుడు రాణిస్తాడు. అందుకే మకరం, కుజునకు ఉచ్చ, మేష వృశ్చికాలు రెండూ స్వ క్షేత్రాలే అయినా, గూఢచారి వర్గం వల్ల (వృశ్చికం) అమితమైన శ్రేయస్సు ఉన్నా

సైన్యం మాత్రమే అధికమైన గుర్తింపును తీసుకువస్తుంది. అందుకే కుజునకు మేషమే మూల త్రికోణం.

బుధుడు వ్యాపారస్థుడు. అతనికి వ్యాపార స్థానమే (స్వక్షేత్రము) రాణించడానికి అవకాశం ఉన్న ప్రదేశం. బుధునకు రెండు స్వక్షేత్రాలున్నాయి. ఏ ఒక్క అభిప్రాయానికి కట్టుబడి లేకుండా సమయానుకూలంగా మార్పులు చెందే స్వభావం మిధునంలో ఉంది. వ్యాపారంలో వస్తువులను కొనే సందర్భంలో ఆ విధమైన ద్వంద్వ వైఖరి అవసరమే - అమ్మే సందర్భంలో జ్ఞాపక శక్తి ఆకర్షణ ప్రధాన పాత్ర వహిస్తాయి. కన్యా రాశిలో రెండూ పుష్కలంగా ఉన్నాయి. అందుకే కన్యారాశి బుధునకు ఉచ్చ, మూల త్రికోణం కూడ అయింది. గురుడు అందరికీ గౌరవింపదగిన వాడే. అతనికి స్వార్థరహితమైన మేధాశక్తి అధికంగా ఉంది. ఆ మేధాశక్తి రెండు రూపాల్లో గోచరిస్తుంది. కవితల్లి ఆనందాన్ని సృష్టించేసే ఊహాశక్తి (మీనం) ఒకటి, ఆలోచించి నూతన వస్తూత్పత్తికి ఉపకరించే లక్ష్యసాధనా చాతుర్యం (ధనుస్సు) మరొకటి. మేధావి శక్తి వస్తూత్పత్తిలో అధికంగా రాణిస్తుంది. అందుకే ధనుస్సు మూలత్రికోణం, మేధావి పోషకుని వద్ద రాణిస్తాడు. ఆ పోషకులు గూడా రెండు రకాలు. ఎదుటివాడు చెప్పినదానికి వెంటనే స్పందించే వ్యక్తి (చంద్రుడు - కర్కాటకం) ఒకడు, ఎదుటివారు చెప్పినదానికి బాగా ఆలోచించి, మరొకరితో గూడా సంప్రదించి, అతి తక్కువగా స్పందించే గంభీరుడు మరొకడు (రవి -- సింహం) స్పందించే వ్యక్తి దగ్గరే మనమేధావి (గురుడు) అధికంగా రాణిస్తాడు. అందుకే కర్కాటకం అతనికి ఉచ్చ.

మరో మేధావి శుక్రుడు ఇతడికి స్వార్థమెక్కువ. ప్రతి పనిలో స్వప్రయోజనం ఉండాలి. ఎదుటివారి వాదనలు విని తీర్పు చెప్పే తీర్పరి (తుల)గా, ప్రతి పనిలో బాధ్యత వహించి కార్యాలను పూర్తిచేయించే సాధించే వ్యక్తిగా (వృషభం) శుక్రుడు దర్శనమిస్తాడు. బాధ్యతలో కంటే తీర్పు చెప్పడంలో సౌలభ్యం, గౌరవం ఉన్నాయి. అందుకే తుల శుక్రునకు మూల త్రికోణం. మేధావి అయిన శుక్రుడు ఊహల్లో విహరించే మరో మేధావి దగ్గర (మీనం) రాణించడం గొప్పగా భావిస్తాడు అందుకే శుక్రునికి మీనం ఉచ్చ.

శని సేవకుడు, ఇతనికి అధికార వర్గానికి చెందిన రవి, చంద్ర కుజులు తనను అణచి వేసేవారుగా భావించినందువలన, వారివద్ద ఆత్మీయత ఉండదు . బుధుడు వ్యాపారి, అతడు శనిచే పని చేయించుకొంటాడు, గాని, శనిని దగ్గర చేరనీయడు, గురువిలో స్వార్థం లేనందువలన

శనిని వెనకేసురావడాని ఇష్టపడదు. స్వార్థంగల శుక్రుడు, శనిని దువ్వి అతనికోసం తన మేధాశక్తి వినియోగించి అతని శారీరక శక్తిని తన పనులకు వినియోగించికుంటారు. అందుచే తీర్పు చెప్పే (తుల) శుక్రుడు శనికి ప్రాణం, శని అక్కడే రాణిస్తాడు కాబట్టి శనికి తుల ఉచ్చ. మంకుపట్టుతో, శ్రమ పడి, కార్యాలను సాధించే (మకరం) స్థానం కంటే బద్ధకంతో విశ్రాంతి తీసుకునే స్థానం (కుంభం) శనికి ప్రీతిపాత్రమైంది. అందుకనే శనికి కుంభం మూల త్రికోణం. అధికారంలో ఉన్న ప్రతి వారికి కోర్టు (తుల) అంటే భయమే. కాగా రవికి తుల నీచ గూఢచారి వర్గం (వృశ్చికం) తీసుకువచ్చిన సమాచారం, తనపై బాధ్యత మంచుతూందని అసమర్థ ప్రభువుకు (చంద్రునికి) భయం, అందుకే వృశ్చికం చంద్రునకు నీచ.

అసమర్థ ప్రభువు అంటే సైన్యాధ్యక్షునికి భయం తన ప్రజ్ఞ గుర్తింపు పొందదని, అందుకే కర్కాటకం కుజునికి నీచ, కర్కాటకం భయానికి సంకేతం అనుకుంటే భయం సైన్యాధ్యక్షునికి రాణింపు నీయదుకదా!

కవిత్వం, ఊహలు (మీనం) వ్యాపారస్థునికి రాణింపునీయవు. ఆర్థిక కోణంలో వాస్తవ దృష్టితో వ్యాపారస్థుడు ముందుకు సాగాలి (కన్య), కాబట్టి, బుధునకు మీనం నీచ, మంకుపట్టుగల (మకరం) సేవకుని వద్ద మేధావి (గురుడు) రాణించదు. అందుచేతనే గురునకు మకరం నీచ. కవిగా రాణించే (మీనం) శుక్రుడు ఉల్లాసంగా జీవించగలడు. సాటి మేధావుల్ని (మీనానికి అధిపతి గురుడు) అలరింపజేయగలడు. కాని వాస్తవ దృష్టితో పైసలు లెక్కించే వ్యక్తి (కన్య) వద్ద రాణించలేడు అందుకే శుక్రునకు కన్య నీచ. తన హక్కుల కోసం వాదించే ప్లీడరు వద్ద (శుక్రుడు, తుల) తనకు అనుకూలంగా తీర్పునిచ్చే న్యాయాధికారి (తుల) వద్ద, సేవకుడు (శని) రాణించినట్లుగా, ఉల్లాసంగా ఆనందాన్ని పొందినట్లుగా తన యజమానికోసం, ప్రాణత్యాగానికైనా సిద్ధపడి ఏ మాత్రం ఆలోచనలేకుండా కొండనైనా ఢీ కొనే తత్త్వం గల (మేషం) సైన్యాధ్యక్షుని వద్ద రాణించలేడు. అందుకే శనికి తుల ఉచ్చ, మేషం నీచ.

ఈ విధంగా ఆయా రాశుల స్వభావాలకు, ఆయా గ్రహాల స్వభావాలకు అనుగుణంగా, ఉచ్చనీచలు స్వక్షేత్రాలు మన వారు ఏర్పాటు చేశారు. వాటిలో క్రమబద్ధత, సహేతుకత మనకు అడుగడుగునా దర్శనమిస్తాయి.

# ఉచ్చ, నీచ, స్వక్షేత్రాదుల సహేతుకత

| రాశులు / గ్రహాలు | మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహం | కన్యా | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | ఉచ్చ | | | | స్వక్షే మూలత్రి | | నీచ | | | | | |
| చంద్ర | | ఉచ్చ మూలత్రి | | స్వక్షే | | | | నీచ | | | | |
| కుజ | స్వక్షే మూలత్రి | | | నీచ | | | | స్వక్షే | | ఉచ్చ | | |
| బుధ | | | స్వక్షే | | | ఉచ్చ మూలత్రి స్వక్షే | | | | | | నీచ |
| గురు | | | | ఉచ్చ | | | | | స్వక్షే మూలత్రి | నీచ | | స్వక్షే |
| శుక్ర | | స్వక్షే | | | | నీచ | స్వక్షే మూలత్రి | | | | | ఉచ్చ |
| శని | నీచ | | | | | | ఉచ్చ | | | స్వక్షే | స్వక్షే మూలత్రి | |

# మారక నిర్ణయం

పాపులు

1. ద్వితీయాధిపతిగాని, ద్వాదశాధిపతిగాని అయిన గురుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, పాపస్థానములలో (3,6,8,11) ఉన్నా, వారి రెండో అధిపత్యం పాపాధిపత్యం అయినా, పాపస్థానాధిపతితో కలిసినా పాపియగును.

2. ద్వితీయాధిపతులైన గురుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, ద్వితీయస్థులైనచో, మారకవిష-యంలో పాపులగుదురు. ద్వాదశాధిపతులైన గురు, శుక్ర, బుధ, చంద్రులు, ద్వాదశస్థులైనచో పాపులగుదురు.

3. సప్తమాధిపతులైన గురు, శుక్ర, బుధ, చంద్రులు సప్తమస్థులైనచో విశేష పాపులగుదురు.

4. ద్వితీయాధిపతిగాని, వ్యయాధిపతిగాని, సప్తమాధిపతిగాని అయిన కుజుడు3,6,8,11, స్థాన-ములందున్నచో పాపియగును.

5. సూర్యుడు తప్ప తక్కిన గ్రహములకు షష్ఠాధిపత్యము వచ్చిన పాపియగును.

6. అష్టమాధిపత్యంగల గ్రహము పాపి. అష్టమాధిపతికి లగ్నాధిపత్యము గూడ సంభవించి లగ్నమందున్నచో పాపి కాజాలదు.

7. 6,8,12 స్థానముందున్న చంద్రుడు పాపియగును.

8. మారకత్వమువిచ్చు గ్రహములలో శని బలవంతుడు.

9. రాహుకేతువులు పాపస్థానములందున్నచో, మారకత్వం విషయంలో పరిశీలించదగినవారు పైన చెప్పిన సూత్రము ననుసరించి పాపియైన గ్రహము మరొక పాపితో కలిసిఉన్నప్పుడు తన మహాదశలో మారక దోషము చేయగలదు. ఒంటరివాడైనచో అరిష్టము మాత్రము చేయగలదు.

పాప గ్రహ సంబంధం విషయంలో కొన్ని నియమాలు

1. ఒక పాపిపై మరొక పాపగ్రహము యొక్క పూర్ణ దృష్టి ఉన్నపుడు.

2. ఇద్దరు పాపులకు పరివర్తన పట్టినపుడు

3. ఇరువురికి **యుతి** కలిగినపుడు

4. **ఆ ఇరువురి** యుతి ఒకని స్వక్షేత్రమందు జరిగినచో (ఇరువురు పాపులు - పాపస్థానము) **మిక్కిలి** దోషమగును.

పైన చెప్పిన నియమాల ప్రకారం పాపియైన గ్రహము మరొక పాపగ్రహము యొక్క దృష్టియుతి, పరివర్తనలు పొందినపుడు మారక గ్రహము అని పిలువబడతాడు అతడు చంద్రుని నుండి గూడ 3,6,8,11, స్థానములందు ఉన్నచో విశేషముగా మారకుడగును.

మారకగ్రహములకు అపవాదము

1. తృతీయ, అష్టమ, షష్ఠ, ఏకాదశములకు అధిపతులైన రవిచంద్రులు మరో పాపగ్రహంతో కలిసినపుడు ఆ మరో పాపగ్రహమే మారకగ్రహమౌతుంది. కాని రవి చంద్రులు మారకులు కారు.

2. సప్తమాధిపతిగాని, ద్వితీయాధిపతిగాని అయిన చంద్రుడు మరోపాపగ్రహంతో కలిస్తే మారకుడు కాగలడు.

3. కేంద్రాధిపతియైన రవి, కోణాధిపతియైన చంద్రుడు, శుభ సంజ్ఞను పొందినా షష్ఠ, అష్టమాధిపతులు ఇద్దరితో సంబంధము కలిగినచో మారకులగుదురు. కాని పాపులు కారు. (అందుచే ఇతర పాపగ్రహములతో వీరికి సంబంధము కలిగినపుడు ఆ పాపిని మారకునిగా వీరు మార్చ్చలేరు) ఉదాహరణ వృశ్చికలగ్నానికి దశమాధిపతియైన రవి, షష్ఠాధిపతియైన కుజునితోడను, అష్టమ లాభాధిపతియైన బుధునితోడను కలిసినపుడు మారకుడు (రవి) కాగలడు.

4. పరమోచ్చాంశము పొందిన గ్రహము పరిస్థితులను బట్టి పాపియైన మారకుడు కాజాలడు.

5. ఉచ్చలో ఉన్న గ్రహము, ఉచ్చాభిముఖుడైన గ్రహము నీచస్థుడైన పాపగ్రహంతో (పరమోచ్చకు 30 డిగ్రీలు లోపులోముందుగా ఉన్న, గ్రహం ఉచ్చాభిముఖుడు) యుతి వీక్షణాలు ఉన్నా, ఎక్కువ మంది పాపులతో సంబంధం కలిగి ఉన్నా మారకుడౌతాడు పాపసంబంధం లేనపుడు మారకుడు గాడు.

6. నీచస్థుడైన పాపగ్రహం ఉచ్చస్థుడైన పాపగ్రహంతో సంబంధం కలిగిఉంటే మారకుడౌతాడు.

7. నీచస్థుడైన పాపగ్రహం నీచస్థుడైన పాపగ్రహంతో దృష్టి సంబంధం కలిగి ఉంటే ప్రబల-మారకుడైతాడు. నీచ - ఆందోళన, ఉచ్ఛ - ప్రశాంతి, (నీచపొందినగ్రహం యోగంచేసినా ఆందోళనతో కూడి ఉంటుంది.

8. పాపిష్టైన గ్రహం (తాను ఉచ్ఛలో లేకుండా) పాపిష్టైన ఉచ్ఛగ్రహంతో సంబంధం కలిగి ఉన్న మారకుడౌతాడు, ఉచ్ఛస్థుడైన పాపగ్రహంపరమోచ్ఛ భాగాలందుంటే, ఈతని సంబంధం ఉచ్ఛస్థుడు కాని పాపగ్రహమునకు దోషముచేయజాలదు.

9. పాపిపరమోచ్ఛాంశగతుడైనప్పుడు మిత్రుడైన మరోపాపితో సంబంధం కలిగి ఉన్నా మారకుడు కాజాలదు. రెండు పాపగ్రహాలు పరమోచ్ఛాంశాలను పొందినప్పుడు నైసర్గిక బలాన్ని అనుసరించి వారిలో బలహీనుడు మారకం చేయవచ్చును.

   1. మిత్రగ్రహముల దృష్టి దోషము చేయజాలదు.
   మిత్రగ్రహములకన్న పరస్పర మిత్రగ్రహముల దృష్టి శుభప్రదము.
   పరస్పర మిత్రులు -
   శని, శుక్రులు - శుక్ర బుధులు, గురు కుజులు, రవిచంద్రులు, రవిగురులు, రవికుజులు.

2. శత్రు దృష్టికన్న పరస్పర శత్రువుల దృష్టి దోషప్రదమైనది రవిశుక్రులు, రవి శనులు, పరస్పర శత్రువులు

3. ఈ క్రింది పరస్పర మిత్రులు ఉత్తరోత్తర బలం కలవారు.
రవి - కుజులు, రవి గురులు, రవిచంద్రులు, బుధశుక్రులు, గురుకుజులు, శని శుక్రులు.

4. కలిసిన రెండు పాపగ్రహములలో ఒకడు శని అయినప్పుడు శని మారకుడౌతాడు రెండవ గ్రహం మారకుడు కాదు అట్టి వానిని అమారకుడు అంటారు.

5. శని పాపియైనా కాకున్నా మరో పాపగ్రహంతో కలిస్తే తానే మారకుడౌతాడు. అనేక పాపగ్రహాలతో కలిస్తే ప్రబలమారకుడౌతాడు.

6. మారకుడైన శని నుండి శుక్రుడు తృతీయంలో కాని దశమంలోగాని ఉంటే శని బదులు శుక్రుడే మారకుడౌతాడు. ఈ శుక్రుడు శుభుడైనా పాపియైనా మారకుడే.

7. అమారకుడైన శని నుండి మారకుడైన శుక్రుడు తృతీయ దశమాల్లో ఉండగా (శని పాపగ్రహ

సంబంధం లేనివాడైతే) ఆ శుక్రుడుగూడా అమారకుడౌతాడు.

8. అమారకులైన శని శుక్రులు పరస్పర సంబంధం కలిగిఉంటే ఒకరిఫలితాలను మరొకరు ఇస్తారు.

9. మారకులైన శని శుక్రులు పరస్పర సంబంధం కలిగి ఉంటే శనిమాత్రమే మారకఫలాన్నిస్తాడు.

10. మరో పాపగ్రహం యొక్క సంబంధం వలన మారకుడైన శని అమారకుడైన శుక్రుడు పరస్పర సంబంధం కలిగి ఉంటే శని మారకత్వలక్షణాన్ని శుక్రుడు గ్రహించి మారకం చేస్తాడు.

11. మారకుడైన శనితో సంబంధంలేనిమారక శుక్రుడు తన ఫలాన్నితానే ఇస్తాడు.

12. మారకుడైన శుక్రునితో మారకుడైన లేక అమారకుడైన శని కలిసిఉంటే శుక్రుడు అమారకుడౌతాడు.

13. పాపగ్రహ సంబంధంగల శని అదే పాపగ్రహంతో సంబంధంగల శుక్రుని మహాదశలో తన ఫలితాన్నిస్తాడు.

14. ఉచ్చస్థుడైనా, మారకశని మారకం చేస్తాడు. ఆ శనినే అమారకశుక్రుడు చూస్తే (పరస్పర దృష్టి) శుక్రుడు మారకుడౌతాడు.

15. కేంద్ర త్రికోణములందున్న రాహుకేతువులు మారకశనితో కలిసినా మారకం చేయరు.

16. 3,6,8,11, స్థానములలో ఉన్న రాహుకేతువులు మారకుడైన శనితోకలిస్తే మారకులౌతారు.

17. గురుని దృష్టి కుజునకు మంచిది.

18. పాపియైన కుజుని పంచమ నవమ దృష్టితో పాపియైన గురుడు చూసినపుడు కుజుడు మారకుడు కావచ్చు, కాకపోవచ్చు, మరోపాపగ్రహం యొక్క దృష్టిగూడా ఉంటే కుజుడు మారకుడౌతాడు. అష్టమాధిపతియైన గ్రహం లగ్నంలో కాని అష్టమంలోగాని ఉండి మరో పాపగ్రహం యొక్క దృష్టికలిగిఉంటే మారకం చేస్తాడు లేదా అధికమైన కష్టాన్నిస్తాడు.

19. లగ్నాత్తు 3,6,8,11, స్థానాల్లో ఉన్న రాహువు చంద్రాత్తు 2,8, స్థానాల్లో ఉండే మారకుడౌతాడు.

20. లగ్నాత్తు 3,6,8,11 స్థానాల్లో ఉన్న రాహువు పాపియైన గురువితోగాని, శుక్రువితోగాని, కలిస్తే మారకుడౌతాడు.

21. వృషభమందున్న రాహువు పాపియైన శుక్రునితో కలిసినా మారకుడు కాదు.

22. మీనమందున్న రాహువు అరిష్టప్రదుడు. అతడే చంద్రుని నుండి 2,8, స్థానాల్లో ఉం మారకుడౌతాడు. ఆ మీనం లగ్నాత్తు. 3,6,8,11, స్థానాలైనచో ప్రబల మారకుడౌతాడు.

23. పై సంబంధాలు లేకుండా లగ్నము నుండి 6,8, స్థానాల్లో (మీనం) ఉంటే అరి మాత్రం చేస్తాడు. రాహువుకు చెప్పబడిన సూత్రాలు కేతువుకు అన్వయిస్తాయి కాని, కేత రాహువంత ప్రబలమారకుడు కాదు.

24. మారకుని మహాదశలో అతనితో సంబంధం గల మరోపాపియొక్క అంతర్దశలోగాని, ఆ సంబంధిగ్రహంయొక్క లేదా నిజసధర్మి గ్రహం యొక్క అంతర్దశలోగాని, మారకం చేస్తా కొన్ని సందర్భాలలో తన అంతర్దశలో గూడా చేయవచ్చు.

25. ఆత్మసంబంధి గ్రహాలు

పరస్పర మిత్రులు / నీచలయందున్న రెండు గ్రహాలు/ఉచ్చలయందున్న రెండు గ్రహాల స్వక్షేత్రమునందున్న రెండు గ్రహాలు/ ఒకరు ఉచ్చస్థుడు మరొకరు శుభుడై కేంద్రాధిప కంవాడు.

26. నిజసధర్మి గ్రహాలు

స్వభావ సారూప్యంగలవారు
త్రిషడాయ (3,6,11) అధిపతి - అష్టమాధిపతి
కేంద్రాధిపతి - కేంద్రాధిపతి
కోణాధిపతి - కోణాధిపతి
ద్వితీయాధిపతి - ద్వాదశాధిపతి

27. రెండు రాసులకు ఆధిపత్యం గల గ్రహాలలో త్రిషడాయాధిపత్యం - కోణాధిపత్యం ఉ గ్రహానికి మరో త్రిషడాయాధిపత్యం కోణాధిపత్యం ఉన్న గ్రహమే నిజసధర్మి అవుతాడు.

28. బుధ శుక్రులు ఆత్మ సంబంధి గ్రహాలు
వారిరువురు పాపులైనప్పుడు పరస్పరసంబంధం కలిగివుంటే బుధుని మహాదశలో శుక్రాంతర మారకాన్ని చేస్తుంది. ఈ శుక్రుడు శనిచే చూడబడితే శుక్రుడు అమారకుడౌతాడు శ

మారుకుడౌతాడు. ఫలితంగా బుధుని మహాదశలో శని అంతరం మారకం చేస్తుంది.

29. మారకుడైన శనికి అత్మసంబంధమైన చంద్రుడు రాహుగ్రస్తుడైతే, శనియొక్క మహాదశ - రాహ్వంతరం మారకాన్నిస్తుంది.

30. మారకుడైన శనితో రాహువు కలిసి శనియొక్క క్షేత్రంలో ఉంటే శని మహాదశ రాహ్వతరం మారకాన్నిస్తుంది.

31. మారకుడైన రాహువు కేతువు యొక్క అంతరంలో మరణాన్నివ్వడు.

32. మారకుడైన శని తనమహాదశలో తన అంతర్దశలోగాని, తనతోపరస్పర దృష్టిగల గ్రహాల అంతర్దశలలోగాని మారకం చేయడు.

33. పరస్పర మిత్రులైన రెండు మారకగ్రహాలు తమలో ఒకరి మహాదశలో మరొకరి అంతర్దశలో మారకం చేస్తారు.

34. పరస్పర శత్రుగ్రహాలు ఆత్మవిరోధులు వారు ఒకరి మహాదశలో మరొకరి అంతర్దశలో మారకం చేయరు. వారే నిజసహధర్ములైనపుడు మారకం చేసే అవకాశం ఉంది.

35. శని అష్టమాధిపతియై, మారకుడైన చంద్రుడు అష్టమస్థుడైనపుడు మారక శనియొక్క మహాదశలో చంద్రుని అంతరంలో మారకం చేస్తాడు.

36. అష్టమచంద్రుడు అన్ని విధాల దోషి.

37. అరిష్టప్రద గ్రహాలు

1. లగ్నాష్టమాధిపతి, లేదా 2. లగ్నాధిపతి అష్టమాధిపతులతో కలిసిన గ్రహం. 3. లగ్నషష్ఠాధిపతులతో కలిసిన గ్రహం 4. షష్ఠాధిపతి, అష్టమాధిపతి 5. షష్ఠాష్టమాధిపతులతో కలిసిన గ్రహం 6. వృషభ, తులాలగ్నాలకు కుజుడు (ఉచ్ఛ స్వక్షేత్రములలో ఉండనిచో) 7. లగ్నాష్టమాధిపతులకు, కేంద్రాల్లోను అపోక్లిమాల్లోను ఉన్న గ్రహం, దుష్టగ్రహాలు. (లగ్నానికి కేంద్రంలో చంద్రునకు ఫణఫరంలో ఉన్న గ్రహం మేలు చేస్తుంది.) 8. గ్రహం లగ్నం నుండి ఎన్నవ స్థానంలో ఉందో, ఆ సంఖ్యకు శని నుండి ఎన్నో స్థానంలో ఉన్నాడో ఆ సంఖ్యకు ఉన్న భేదం 0,1, 2,3,7, సంఖ్యలైనచో అరిష్టప్రదుడు 10,12, సంఖ్యలైనచో శుభుడౌతాడు.

## సింగయార్యుని జాతకరాజంలోని
## కారకత్వవిశేషాలు

లగ్నమేవతనుస్థానం, ద్వితీయం ధనముచ్యతే
ముఖస్థానంచ తద్యుక్తం స్థానంభోజన సత్యయోః
బాహ్యాల్పాహార నేత్రాణాం స్థానందక్షిణ దృక్పరత్.

శరీరమే జన్మలగ్నం, ధనం, ముఖం, భోజనం, సత్యం, అల్పాహారం, కన్నులు, విశేషించి కుడికన్ను, అనే అంశాలు ద్వితీయభావంలో పరిశీలించతగినవి.

ధనస్య మృదుభాషాణాంకారకో గురు రుచ్యతే
నేత్రస్యకారకశ్శుక్రః చంద్రోభోజన కారకః
సత్యవాక్కారక శ్శుక్రో గురు ర్వచనకారకః

ఆ ద్వితీయకారకత్వాల్లో ధనం, మృదుభాషణం, గురుని కారకత్వాలకు చెందినవి, నేత్రకారకుడు శుక్రుడు, భోజనకారకుడు చంద్రుడు, సత్యవాక్కారకుడు శుక్రుడు, వక్తృత్వ కారకుడు గురుడు.

భ్రాతృస్థానం తృతీయంచ కంఠస్థానంచ విక్రమః
పాత్రాభరణ యుద్ధానాం స్థానంతత్కారకా న్శృణు
భ్రాతుర్యుద్ధస్య భౌమస్యాత్కారకో భూషణేరవిః
కంఠస్యకారకస్సౌమ్యో విక్రమస్య శనిస్స్మృతః
పాత్రాణాంకారకోదేవ మంత్రీత్యేవం వినిర్ణయః

తృతీయ భావంలో చూడవలసిన విషయాలలో సోదరుడు, యుద్ధము అనే వాటికి కారకుడు కుజుడు. భూషణకారకుడు రవి, కంఠకారకుడు బుధుడు, విక్రమకారకుడు శని, పాత్రంకు కారకుడు గురుడు.

చతుర్థం వాహనం బంధుర్మాతా సింహాసనంతథా
సుఖంగృహం భూమిమిత్రం బాహుస్థానంతుకారకః
వాహనస్యతు శుక్రశ్చ దివామాతుశ్చభార్గవః
నిశిమాతుశ్శశీ బంధోః సుఖస్యాపి గురుస్స్మృతః

భూకారకః కుజోజ్ఞేయో గృహస్య గురురీరితః .
బాహ్వోశ్చంద్రః కారకస్యాదితి శాస్త్రవినిర్ణయం

చతుర్థకారకత్వాల్లోని విషయాల్లో వాహనకారకుడు. పగలు జన్మించిన వారికి మాతృకారకుడు, శుక్రుడు రాత్రిజన్మించిన వారికి మాతృకారకుడు చంద్రుడు, బంధుకారకుడు సుఖకారకుడు గురుడు భూకారకుడు కుజుడు, గృహకారకుడు గురుడు, బాహుకారకుడు చంద్రుడు (చతుర్థం బాహుస్థానం అని ఒక మతం, తృతీయం బాహు స్థానమని, చతుర్థం హృదయస్థానమని మరో మతం)

పంచమహిసుతస్థానం, బుద్ధిస్థానంతథైవచ
మంత్రాభిచారదేవానాం స్థానంచ హృదయస్యచ
మాతులస్య సుమంత్రస్య స్థానం తత్కార కాఇమే
గురుః పుత్రస్య బుద్ధేశ్చ బుధో మాతులకారకః
ఒభిచా రాది మంత్రాణాం దేవానాంకారకో బుధః
హృదయస్య సుమంత్రాణాం కారకోగురురుచ్యతే,

పంచమ భావకారకత్వాల్లో

గురుడు పుత్రకారకుడు, బుద్ధి కారకుడు, హృదయకారకుడు, యోగ్యమైన ఆలోచనకు కారకుడు, బుధుడు మాతులకారకుడు, అభిచారాదిమంత్రకారకుడు,
దేవతాకారకుడు, రోగస్థానమథారా ర్యస్థానంతత్కారకాః పునః
షష్ఠంస్యాచ్ఛరిపుస్థానం జ్ఞాతిస్థానం ఋణస్యచ
రిపూణాంకారకో భౌమః జ్ఞాతీనాం కారకశ్శనిః
కుజో ఋణస్యరోగస్య కారకశ్చంద్ర ఉచ్యతే.
ఔదార్య కారకోమందః
షష్ఠస్థాన కారకత్వాల్లో కుజుడు రిపు కారకుడు, ఋణకారకుడు, శని, జ్ఞాతికారకుడు, ఔదార్యకారకుడు చంద్రుడు, రోగకారకుడు.

కళత్ర భోగదంతానాం నాభేస్తత్కారకాఇమే,
కళత్ర కారకశ్శుక్రః చంద్రో భోగస్యకారకః
దంతానాం కారకోజీవో నాభేస్సౌమ్యః ప్రకీర్తితః

సప్తమస్థాన కారకత్వాల్లో

శుక్రుడు కళత్రకారకుడు, చంద్రుడు భోగకారకుడు, గురుడు, దంతకారకుడు, బుధుడు నాభికారకుడు.

లాభః

అష్టమం హ్యాయుషస్థానం మరణం గుహ్యమేరితః
ఆయుర్మరణయోర్మందో బుధోగుహ్యస్యకారకః
అష్టమభావ కారకత్వాల్లో

శని ఆయుష్కారకుడు, మరణకారకుడు,
బుధుడు - గుహ్యస్థానకారకుడు.
భాగ్యతీర్థ పితృస్థానం నవమంతపసస్తథా
కవిర్భాగ్యస్య తీర్థస్య కారకస్తపసోగురుః
శనిర్నిశిదివాసూర్యః ప్రోక్తౌ జనకకారకౌ

నవమభావకారకత్వాల్లో

శుక్రుడు - భాగ్యకారకుడు, తీర్థకారకుడు
గురుడు - తపఃకారకుడు
రాత్రిపుట్టినవారికి శని పితృకారకుడు
పగలపుట్టినవారికి రవి పితృకారకుడు.
రాజ్యాఖ్యం దశమస్థానం ఆజ్ఞాయాః కీర్తిమానయోః
స్థానం జీవోరుజామానాంకార కాన్భృగుణతత్త్వమః
రాజ్యాజ్ఞా కీర్తిమానానాం కారకశ్శుక్ర ఉచ్యతే
జీవికా కారకశ్చంద్రః జామార్వోర్గు రురీరితః

దశమభావకారకత్వాల్లో

శుక్రుడు - రాజ్యకారకుడు, ఆజ్ఞాకారకుడు, కీర్తికారకుడు, సన్మానకారకుడు
చంద్రుడు - జీవికాకారకుడు,
గురుడు - మోకాళ్ళు, తొడలు, అనేవాటికి కారకుడు.
లాభజ్యేష్ఠ భాతృజంఘా స్థానమేకాదశ స్మృతః

వామకర్ణ స్యచ స్థానం శనిర్లాభస్య కారకః
జ్యేష్ఠభ్రాతుర్గురుశ్చంద్రోజం ఘాయాః కారకః స్మృతః
బుధోవామస్య కర్ణస్యకారకః

లాభభావకారకత్వాల్లో

శని - లాభకారకుదు,
గురుదు - జ్యేష్ఠభ్రాతృకారుదు
చంద్రుదు - పిక్కలకు కారకుదు
బుధుదు - ఎడమచెవికి కారకుదు
పాపస్య స్వర్గనరకపితౄణాంస్థానమీరితం
వాద్యఘోషస్య సదసద్వ్యయభృత్య పదం స్మృతం
అసద్వ్యయస్య దినకృత్ స్వర్గసద్వ్యయ యోర్గురుః
కారకః పితృభృత్యానాం బుధ ఇత్యుచ్యతే బుధైః
శనిర్వ్యాజ్యే ధ్వజః పాపే నరకేకారకః స్మృతః

ద్వాదశభావకారకత్వల్లో

రవి - అసద్వ్యయకారకుదు
గురుదు - స్వర్గకారకుదు - సద్వ్యయకారకుదు
బుధుదు - పితురులకు, భృత్యులకు కారకుదు
శని - వ్యాజ్య(కోర్టుకేసు)కారకుదు,
కేతువు - పాపకారకుదు, నరకకారకుదు.

కేతువు మోక్షకారకుదు అనేభావనగూడా పలుచోట్ల దర్శనమిస్తోంది. జాతకరాజంలోని ఈ కారకత్వ కథన విధానం భావగ్రహ సమ్మేళనరూపంలో ఉన్నందువలన ఆలోచనాత్మకంగా కొనసాగింది.

# కేంద్రాలు, ఫణఫరాలు, అపోక్లిమాలు
# సహేతుక వివరణ

కేంద్రాలు (1,4,7,10, భావాలు) ఫణఫరాలు (2,5,8,11 భావాలు) అపోక్లిమాలు (3,6,9,12) అనేవి జ్యోతిష శాస్త్ర పరిచయం గలవారందరికి తెలిసినవే. కేంద్రం అనేపదం మధ్యభాగము, ముఖ్య భాగము అనే అర్థాలలో కనిపిస్తోంది. ఉత్తరాదిన బాగా ప్రచారంలో ఉన్న ఈ క్రింది పద్ధతిలో చక్రం వేసినపుడు మధ్యభాగంలోకి కేంద్రాలు రావడం చుస్తున్నాం.




కేంద్రాలను ముఖ్యమైనవి అనడం విషయంలో కొన్ని అభిప్రాయ భేదాలు ఉన్నాయి. పాశ్చాత్యుల అభిప్రాయాన్ని పరిశీలిస్తే కేంద్ర దృష్టులు దోషప్రదాలు కొన్ని ప్రదేశాల్లో కేంద్రాలుగూడ చెడ్డవాటిగానే వ్యవహరించడం జరిగింది.

మన వారు సంహారాత్మాభిమాన్యం, అంతేసిద్ధః సిద్ధాంతః మొదలైన ప్రదేశాల్లో ఘర్షణతరువాత సిద్ధించే అంశాలు ప్రధాన ధాతువులైనవని గుర్తించడం జరిగింది. ఆశ ఉన్నచోట ఆకలి ఉన్నచోట, కాంత ఉన్నచోట, పదవి ఉన్నచోట ఘర్షణ పుట్టడం సహజం ఆఘర్షణ తరువాత విజేత ఆనందిస్తాడు. ఆకలి ఉంటేనే అన్నం ఆనందాన్నిస్తుంది, కోరిక ఉన్నచోటే కాంత ఆనందాన్నిస్తుంది పదవీ వ్యామోహం ఉన్నచోటే అధికారం ఆనందాన్నిస్తుంది. వాటన్నింటిలో ఉన్నది ఆనందమే కాని సంతృప్తి కాదు అసంతుష్టుడే కృషీలుడౌతాడు. సంతుష్టికలవాడు బద్ధకస్తుడౌతాడు కృషీవలునికి సుఖం లభించే అవకాశాలున్నాయి కాని గౌరవంలభించే అవకాశాలు లేవు.

లగ్నంలో ప్రవర్తన ఉంది. శరీరం ఉంది. అది సుందరంకావాలంటే నిరంతరప్రయత్నం. కావాలి సౌందర్యపోషణకోసం చేశారే దివాళాతీస్తున్నారు. చతుర్థంలో సుఖండంది. గృహం ఉంది, విద్య ఉంది, ఆహారం ఉంది వాహనం ఉంది. వాటిలో ఏది సాధించాలన్న ఆశ ఉండాలి, కోరిక

ఉండాలి. పట్టుదల ఉండాలి కృషి ఉండాలి. సాధించాక సాధించామనే ఆనందం ఉండాలి. వీటన్నిటి కోసం చేసే నిర్విరామ కృషిలో అనుభవం (సుఖానుభూతి) ఉందో లేదో దేవునికెరుక కాని వాటిని సాధించామనే తృప్తిఉంది. వాటిని అనుభవించడం వల్ల సంతృప్తి ఉందా అనేది వ్యక్తికి వ్యక్తికి మారేవిషయం. ఇక సప్తమ స్థానంలో సామాజిక సంబంధాలు, భాగస్వాములు, జీవిత భాగస్వామి మొదలైన అంశాలున్నాయి. సామాజికంగా సత్సంబంధాలు ఏర్పడాలంటే నిరంతరకృషి శీలత ఉండాలి. భాగస్వాములతో మైత్రికొనసాగాలంటే వారి భావాలకు తన భావాలకు కలిగే సంఘర్షణ. బాహ్యాఘర్షణగా మారకుండా ఉండాలంటే మానసిక ఘర్షణ చాలా ఉంటుంది. జీవిత భాగస్వామితో కీచులాటలు లేకుండా ప్రశాంతంగా జీవితంసాగాలంటే తనమనోభావాలనెన్నిటినో అణుచుకొని తీరాలి. దానిలోను ఘర్షణ ఉంది. అందమైన భార్య డబ్బున్న భార్య తెలివైన భార్య, అణకువ కలిగిన భార్య కావాలని పరితపించేమగవాడు ఆమెను సాధించడంలో ఎంతటికృషి శీలుడు కావాలో జగమెరిగిన సంగతే. ఆమెకూడా ఆకోరికలన్నీ కోరితే జరిగే ఘర్షణ అందరికీ తెలిసిందే ప్రతిమగవాడు అన్నిగుణాలు కలిగి తనకు వంగి ఉండే భార్య కావాలనుకున్నట్లే ఆమె కూడా అన్నిగుణాలు కలిగి తనకు లొంగి ఉండే భర్త కావాలనుకోవడం అసహజంకాదు అందుకనే లోకంలోని జంటల్లో వివాదాలు ఘర్షణలు వరకట్నం చావులు విడాకులు ఎన్నెన్నో. ప్రస్తుతాంశంలో అనుకూల జీవిత భాగస్వామిని సాధించడంలో ఆశ, ఘర్షణ ఉన్నట్లే ఆ అనుకూలతను కాపాడుకోవడంలో నిరంతరఘర్షణ, నిరంతరకృషి ఉన్నాయి.

దశమంలో పదవి అధికారం గౌరవం ఉన్నాయి. అవి సాధించాలన్నా ఆశ, కృషి, శ్రమ అధికంగానే ఉన్నాయి. ఈ క్రమంలో పరిశీలించినపుడు, కేంద్రాలన్నిటిలోను ఆశ, ఘర్షణ, కృషి, కార్యసాధన అనేవి ముఖ్యాంశాలవుతాయి. జీవితంలో 'అభివృద్ధి సాధించాడానికి అవి-ముఖ్యంకావడంవలన ముఖ్యాంశాలు కేంద్రాలు అనే అర్థం సరిపడుతోంది. సంపాదించేవాడొకడు అనుభవించేవాడొకడు అని సామెత. కష్టపడి సాధించడంలో తృప్తి పడే మానవుడు ఆకార్యసాధనకే కాలాన్ని శక్తినీ యుక్తినీ కేంద్రీకరించడం వలన అనుభవించడానికి వెచ్చించే తీరిక ఉండకపోవడమే సహజం. అందువలన కేంద్రాలు కృషి కేంద్రాలు కృషి ఉన్నచోటే గౌరవం ఉంది.

ఫణఫరాలు

ద్వితీయంలో ధనం ఉంది, మాటవిలువ ఉంది, కుటుంబంఉంది విద్యాప్రకటనాశక్తి ఉంది. వాటన్నింటి సాధనలో కృషికి ప్రాముఖ్యం ఉంది. వాటివల్ల వచ్చే సుఖాలను అనుభవించడంలో అనుభవానికి ప్రాధాన్యం ఉంది. అంటే కృషి, అనుభవం సమపాళ్ళలో విషయాలు.

పంచమంలో ప్లానింగు ఉంది, ఆలోచన ఉంది, సంతానంఉంది, వారి అభివృద్ధి ఉంది, ఉపాసన ఉంది, ఇవిగూడా అభివృద్ధికి కృషి, వాటివలన వచ్చే ఫలానుభవం సమపాళ్ళలో మిళితములైనవే. అష్టమంలో ఆరోగ్యం ఉంది. అనారోగ్యాలు ఆకస్మిక నష్టాలు ఆకస్మికలాభాలు ఉన్నాయి. వీటివిషయంలో గూడా కృషిలో వేసే అడుగులు తప్పటడుగులు ఆయా సుఖదుఃఖాలకు కారణాలౌతుంటాయి. ఈ దృక్పథంతో పరిశీలించినపుడు ఈ భావంతో కూడా కృషికి అనుభవానికి సమప్రాధాన్యం కనిపిస్తుంది. ఆకస్మిక లాభాలు రావాలన్నా (నవమంలోని పిత్రార్జితం వచ్చినంత సులభంకాదు) కొంత కృషి జరగాల్సిందే.

లాభస్థానంలో కృషికి లాభంఉంది. లాభం కలగడం కోసం కృషి చేయాలి అది లభించాక లభించిందనే సంతృప్తి సాధించాలి.

ఆపోక్లిమాలు

తృతీయంలో పరాక్రమం ఉంది ధైర్యం ఉంది జనసహకారం ఉంది అవి సిద్ధించాల్సినవే సాధించేవి కావు అనుభవించి ఆనందించాల్సినవేగాని ఆలవర్చుకొనేవి కావు షష్ఠంలో శత్రురోగఋణాలను జయించేశక్తి ఉంది. అప్పుపుట్టించగలగడంలో కృషి యొక్క ప్రాధాన్యం కంటే పూర్వపుణ్యం యొక్క ప్రాధాన్యం ఎక్కువ. శత్రువులను జయించే సందర్భంలో విజయానికి మూలకారణం పుణ్యబలమే. అదృష్ట బలమే. రోగనిరోధకశక్తి పూర్వపుణ్యబలమే.

నవమంలో సంతృప్తి ఉంది ఉన్నవస్తువులను సంతృప్తితో అనుభవించడం ఉంది. పిత్రార్జితం ఉంది. ఆధ్యాత్మిక వారసత్వం ఉంది. మొత్తంపై కృషి లేని అనుభవం శ్రమలేనిజీవనం ఉన్నాయి. అది అదృష్టమే కదా.

వ్యయస్థానంలో ఖర్చుఉంది ఖర్చుపెట్టుకోవడంలో సంతృప్తిఉంది అనుభవం ఉంది. అది ఉన్నదఖ్ఖుకు మించినదైనా అనుభవం ఉంది.

ఈ క్రమంలో పరిశీలించినపుడు కృషి కేంద్రం నుండి ఆపోక్లిమానికి దిగజారుతూంటే అనుభవం ఆపోక్లిమంనుండి కేంద్రానికి దిగజారుతోంది.

కేంద్రాలు ఆశ, ఘర్షణ కృషి, కార్యసాధన గౌరవం అనే వాటికి ప్రతీకలు అయితే. ఆపోక్లిమాలు కృషిరహితానుభవానికి ప్రతీకలు. పణఫరాలు కృషికి, అనుభవానికి సమప్రాధాన్యం ఇచ్చేవి అవుతాయి. ఈ కోణంతో ఆలోచిస్తే కేంద్రాంలో మాత్రమే గ్రహాలున్నవ్యక్తి కృషిశీలుడుగ

రూపొందుతాడు అపోక్లిమాలలోనే అన్నిగ్రహాలు గలజాతకుడు అనుభవానికి ప్రాధాన్యం ఇస్తాడు. ఫణఫరాలలో మాత్రమే గ్రహాలున్నవ్యక్తి కృషికి, అనుభవానికి, నోచుకుంటాడు. అని అర్థం అవుతోంది. ఈ విషయాలను జ్యోతిశ్శాస్త్ర పారంగతులు, గుణగ్రహణ పారీణులు పరిశీలించి తమతమ అనుభవాలను తెలిపితే నా ఆలోచనాకోణాన్ని మెరుగుపరచుకుంటాను. దోషాలను సహేతుకంగా వివరిస్తే సరిదిద్దుకుంటాను.

## ఉపచయాలు - అపచయాలు సహేతుకవివరణ

ఉపచయం అంటే వృద్ధి అని అర్థం అపచయం అంటే నష్టం అని అర్థంలోకంలో ఉన్న ఈ అర్థాలను దృష్టిలో పెట్టుకొని జ్యోతిశ్శాస్త్రంలోని ఉపచయభావాలను, అపచయభావాలను అర్థం చేసుకుందాం.

3,6,10,11 భావాలను ఉపచయాలు అని, 1,2,4,5,7,8,9,12, భావాలను అపచయాలనీ జ్యోతిశ్శాస్త్రం వ్యవహరిస్తోంది. ఈ దృక్కోణంతో ఆ భావకారకత్వాలను పరిశీలించాల్సిన అవసరం ఉంది.

లగ్నభావంతో వ్యక్తిప్రవర్తన, శరీరశక్తి సామర్థ్యం మొదలైన అంశాలున్నాయి వ్యక్తికి శారీరశ-క్తివృద్ధిచెందాలంటే ఖర్చులు అధికంగా చేసి శరీరాన్ని పోషించుకోవలసిన అవసరం ఉంది.

ద్వితీయ భావంలో వాక్కు విలువ కుటుంబం ఉన్నాయి. ఆకుటుంబంతో సత్సంబంధాలు కలిగి ఉండాలన్నా కుటుంబాన్ని పోషించాలన్నా వ్యక్తి మాటవిలువను పోషించుకోవాలన్నా ఖర్చుతప్పదు.

చతుర్థంలో వాహన సౌఖ్యం, గృహసౌఖ్యం, ఆహారసౌఖ్యం స్థిరాస్తులు విద్య మొదలైనవి ఉన్నాయి అవన్నీ ఖర్చుతో కూడిన పనులే.

పంచమంలో సంతానం ఉంది సంతానాన్ని పోషించాలన్నా అభివృద్ధిలోనికి తీసుకురావాలన్నా ఖర్చులు తప్పవు సప్తమంలో భార్య సామాజిక సంబంధాలు ఉన్నాయి. భార్యను పోషించాలన్నా, సమాజంతో సత్సంబంధాలు కలిగి ఉండాలన్నా ఖర్చులు తప్పవు కదా!

అష్టమంలో ఆరోగ్యంఉంది అదికాపాడు కోవాలన్నా ఖర్చులు తప్పవు.

నవమంలో అనుభవం ఉంది. భోగానుభవం ఖర్చులు లేకుండా సాధ్యపడదు కదా!

12వ స్థానానికే వ్యయం అని పేరు అందులోనివన్నీ ఖర్చులే.

ఈ భావాలన్నిటికి అపచయాలనే పేర్లుండడం సహేతుకమే అవుతుంది.

తృతీయంలో పరాక్రమండుంది దాన్ని సక్రమంగా అర్థంచేసుకుంటే జనసహకారం అనే అర్థం-లభిస్తుంది. అందులో క్రూరగ్రహాలుంటే క్రూరులసహకారం సౌమ్యగ్రహాలుంటే సౌమ్యుల సహకారం లభిస్తాయి. రాజకీయం మొదలైన రంగాలలో అభివృద్ధి చెందడానికి సౌమ్యుల సహకారంతోబాటు క్రూరుల సహకారంగూడా కావాలనే విషయం లోకాన్నిదర్శిస్తే అర్థమయ్యేవిషయం జనసహకారం వ్యక్తికి అభివృద్ధినిస్తుంది.

షష్ఠంలో శత్రురోగ ఋణాలపై విజయం ఉంది ఆవిజయం వ్యక్తి అభివృద్ధిలోనికి రావడా-నికి ఉపకరిస్తుంది. అక్కడక్రూరగ్రహాలున్నాసౌమ్యగ్రహాలున్నా విజయానికి అవిదోహదపడతాయి. అదిగూడా అభివృద్ధినిచ్చేదే.

దశమంలో వృత్తి గౌరవండున్నాయి అందులో క్రూరగ్రహాలుంటే క్రూరమైన వృత్తి సౌమ్యగ్రహా-లుంటే సౌమ్యమైనవృత్తి, వ్యక్తికి అభివృద్ధినిస్తుంది. లాభస్థానంలో ఏగ్రహాలున్నా ఆగ్రహాలకారకత్వాలకు సంబంధించిన లాభాలు అభివృద్ధినిస్తాయి. ఈ రూపంతో ఆలోచించినపుడు ఉపచయాలు వ్యక్తికి సాంఘికంగా అభివృద్ధి నివ్వడంలో తోడ్పడతాయని అపచయాలు ఖర్చులను పెంచేవని అర్థం అవుతుంది. ఆకోణంలో వాటికి ఉపచయాపచయ సంజ్ఞలు సార్థకమైన వవుతాయి.

ఎక్కువ గ్రహాలు ఉపచయరాసుల్లో ఉంటే వ్యక్తి అభివృద్ధికి ప్రాధాన్యమిస్తాడని అభివృద్ధి చెందుతాడని అర్థంచేసుకోవచ్చు అపచయాలలో మాత్రమే గ్రహాలుంటే ఆతడు ఇతరుల అభివృద్ధికి తోడ్పడే వాడవుతాడు స్వయంగా అభివృద్ధి చెందడానికి అవకాశాలు తక్కువ అనేవిషయం స్పష్ట-మౌతుంది. ప్రాచీనులైన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఏర్పరచిన సంజ్ఞలు ఎంత విశిష్టమైనవో వాటి అర్థాలను గూర్చి ఆలోచిస్తే స్పష్టమౌతుంది.

# బ్రహ్మకుపూజ ఎందుకు లేదు?

శ్రీయన గౌరినాబరగు చెల్వకుజిత్తము పల్లవింపభ
ద్రాయిత మూర్తియై హరిహరంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయయని పల్కెదుభక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చమెచ్చుపరతత్వము గొల్చెదనిష్ట సిద్ధికిన్.

త్రిగుణాలు సర్వజగత్కారణాలు త్రిమూర్తులు త్రిగుణాత్మకులు, సృష్టి, స్థితి, లయాలకు అధిష్ఠాన భూతులు, స్థితిలో రక్షణముఖ్యావసరం అట్టిరక్షణనిచ్చే వాడు విష్ణువు కాబట్టి సర్వులకు ఆరాధ్యుడే. జీవనానికి ముఖ్యావసరమైన సంపదకు అధిష్ఠానమైన లక్ష్మీదేవి విష్ణుమూర్తి భార్యేకదా!

శివుడు లయకారకుడు, మరణమంటే అందరికీ భయమే మరణంకావాలని సామాన్యంగా ఎవరూ ప్రార్థించరు కాని అట్టిమరణందూరం కావాలని శివుని ప్రార్థిస్తారు. అట్టివారిలో ఒకడు మార్కండేయుడు.

ప్రార్థనలన్నీ పుట్టినతరువాతే కదా! పుట్టించే దేవుడు బ్రహ్మకదా! ఆయనను ఎప్పుడు ప్రార్థించాలి? పుట్టకముందు పుట్టించమని ప్రార్థించే అవకాశం లేదు. మరణకారకుడైన శివుని మరణంప్రసాదించమని ప్రార్థించట్లేదు. మరణం దూరం కావాలి అని ప్రార్థించడంజరుగుతోంది. పుట్టించే బ్రహ్మను బ్రతికున్న మనిషి తిరిగి పుట్టించమని ప్రార్థించడు తిరిగి పుట్టాలంటే ప్రస్తుతంమరణించాలి కదా! ప్రస్తుతం మరణించడం బ్రతికున్నమనిషికి ఇష్టమైనదికాదు. కాగా మరణించిన తరువాత తిరిగి పుట్టించమని ప్రార్థించే అవకాశం లేదు కాబట్టి బ్రహ్మను ప్రార్థించలేదు బ్రతికి ఉన్నపుడు తిరిగి పుట్టించమని ప్రార్థించడు పుట్టడంగిట్టడం రెండూ దుఃఖమయాలే కాబట్టి ఆ రెండిటిని కోరుకోడు పుట్టిన వాడికి గిట్టడం తప్పని సరిగాబట్టి తిరిగి పుట్టకుండా వుండాలంటే ఏంచేయాలి? అని ఆలోచిస్తాడు ఆఆలోచన నుండి ఏర్పడినదే మోక్షం మోక్ష మనేది పరంబ్రహ్మదర్శనం ద్వారా సిద్ధించేది అట్టి పరంబ్రహ్మదర్శనం కోరికలకు అతీతమైనది కాబట్టి కోరికలన్నింటిని జయించినవాడే పరంబ్రహ్మదర్శనానికి అర్హుడౌతాడు అట్టిస్థితిలో ప్రార్థనకు అవకాశంలేదు. ఎవరైనా మోక్షం కావాలని ప్రార్థించినా మోక్షం ప్రార్థనా మాత్ర సాధ్యంకాదు. బ్రహ్మజ్ఞానం పొందాలి. జ్ఞానం కావాలనే కోరిక ఉన్నంత మాత్రంచేత జ్ఞానం సిద్ధించదు. దానికి ప్రత్యేకమైన కృషి కావాలి దానినే నిష్కామకర్మ అన్నారు. కాగా కోరికలతో భగవంతుని ప్రార్థించే తత్వం గలవారు శివకేశవులను ప్రార్థించే వారుగా విడిపోయారు. విడిపోయినవారు మరోకోరిక కొరకు మరొక దేవుని ప్రార్థించడానికి ఇష్టపడక సంపదకొరకు మోక్షం కొరకు విష్ణువునే ప్రార్థించారు శైవులుగూడ సంపదకొరకు, జ్ఞానం కొరకు శివుని ప్రార్థించడం ప్రారంభిచారు. కాగా బ్రహ్మకు పూజ లేకపోవడం సంభవించింది.

భారతకాలానికి ఒకేదైవాన్ని పూజించే విధానం లేదని భేదభావం అసలే లేదని మనం గుర్తించాలి అర్జునుడు ఆయుధాలకోసం (సంహారకాలు) లేదా అస్త్రశక్తికోసం శివుని గూర్చి తపస్సుచేశాడు, రక్షణ నిమిత్తం కృష్ణుని ఆశ్రయించాడు. ఆంధ్రభారత కాలానికి శైవ వైష్ణవులలో తీవ్రయుద్ధం కొనసాగుతోంది. అదిదేశ శ్రేయస్సుకు భంగం కలిగించే విషయం, ఈ అంశాన్ని గుర్తించిన తిక్కన హరిహరాత్మకమైన మూర్తి (అద్వైతం) ధ్యానం యొక్క అవశ్యకతను గుర్తించాడు. అట్టిమూర్తిని ధ్యానించి అందరికి మార్గదర్శకుడుయి నాడు. "శ్రీ" శబ్దము మిక్కిలి విశిష్టమైనది. శ్రీ శబ్దానికి లక్ష్మి పార్వతులతోబాటు సరస్వతి అనే అర్థంగూడ ఉంది. సరస్వతి అప్రస్తుతం శ్రీ శబ్దం చేతనే లక్ష్మి పార్వతులను వివక్షించినారు తిక్కన "శ్రీయన గౌరినాబరగు చెల్వ" చెల్వల అనే పాఠం ఉందిగాని అది సమంజసంగాలేదు. హరిహరాత్మక మూర్తి ఒక్కటే అయినప్పుడు వేరువేరు మూర్తుల అవశ్యకతలేదు.

"శ్రీ" అని "గౌరి" అని వేరువేరు పేర్లు ఒకే మూర్తికి ఉన్నాయనడం సమంజసం కాదు ఒకే మూర్తికి హరినామము, హరనామము ఉన్నాయని తిక్కన భావించలేదు హరిహర నాథుడొక్కడే ఆతని భార్య ఒక్కతే ఆమె "శ్రీ" శ్రీశబ్దం లక్ష్మివాచకము అవుతుంది గౌరీవాచకం గూడ అవుతుంది.

శ్రీయనన్ గౌరి 1 అనునట్లుగా ఒప్పెచెల్వ అంటే "శ్రీ" అనే శబ్దానికి లక్ష్మిఅనేసామాన్యార్థంతో బాటు గౌరి అనే విశిష్టార్థంతో గూడిన మూర్తి ఒక్కటే నామంగూడ ఒక్కటే అట్టి లక్ష్మిపార్వతీ రూపమైన శ్రీమూర్తి హరిహరనాథుని భార్య "శ్రీసనాథ హరిహరనాథా" 2.
అనేసంబోధన ఈ విషయాన్నే ధృవపరుస్తోంది.

ఇట్టిదేవైదిక ధ్యానం సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే శరణ్యేత్ర్యింబకే దేవి నారాయణీవ మోస్తుతే3

శివా, త్ర్యింబకా, నారాయణీ, అనే విసమానార్థకాలుగా వాడబడిన మంత్రాధిష్ఠానభూత మైనమూర్తి శ్రీమూర్తియే అందుకనే అది శ్రీసూక్తం అట్టి అద్వైతమూర్తిని ధ్యానించే తత్త్వం వేదసమ్మతమైనది అందుచేతనే తిక్కనగారు "వైదికధ్యాయిత" అని పేర్కొన్నారు.



1 శబ్దార్థ చంద్రిక
2 ఆంధ్ర విరాట ప్రథమ 40 ప
3 శ్రీసూక్తం

ఌ

గ్రహాలు వేరువేరు రాసుల్లో సంచరిస్తూంటాయి ఒకరాశిలో గ్రహంప్రవేశించినప్పుడు ఒకేరాశిలో జన్మించిన వారికి వేరువేరు రీతుల్లో ఫలాలనివ్వడం కనిపిస్తూంటుంది. దానికి కారణం అష్టకవర్గంలోని భేదమే. ఒక వ్యక్తి పూర్తిగా మంచివాడుగా ఉండడం లేక పూర్తి చెడ్డవాడుగా ఉండడం ఎలా అసంభవమో అలాగే ఒకగ్రహం పూర్తిగా మంచిగ్రహంగాని, పూర్తి చెడ్డగ్రహంగాని ఉండడం అసంభవం, ప్రతిగ్రహం, ఏదో రూపంలో మంచి చేయడం, మరో రూపంలోచెడ్డచేయడం గమనిస్తూంటాము. అలా వేరువేరు కోణాల్లో మంచి చెడ్డలను పరిశీలించడానికి ఉపకరించేది అష్టకవర్గు. ముహూర్త శాస్త్రంలో మంచి చెడ్డలను పరిశీలించడానికి ఉపకరించే సూత్రాలు ముహూర్తగ్రంధాలలో చాలా ఉన్నాయి. వానిలో అతిముఖ్యమైనది అష్టక వర్గు, రాజమార్తాండుని వచనంగా.

"అష్టవర్గేణ యేశుద్ధాస్తేశుద్ధాః సర్వకర్మసు
సూక్ష్మాష్టవర్గసంశుద్ధిః స్థూలాశుద్ధిస్తుగోచరే
అభావతోగోచరశోభనానాం శుద్ధింవదేద్భా గురిరష్టవర్గాత్
వైధృవ్యకన్యాక్షయ హేతుయోగేజీవాష్టవర్గస్య వదేత్తుశుద్ధిం.

అనేది ప్రసిద్ధమైనది లఘుజాతకంలో
"విఫలం గోచరగణితం హ్యాష్టకవర్గేణనిర్దేశేత్ పుసాం
రేఖాధిక్యేశుభదంబింద్వధికేనైవ శోభనం ప్రాయః

అని వివరించడం జరిగింది. అష్టకవర్గులేకుండా దశాఫలాలు చెప్పరాదని ప్రృధుయశస్సు హోరాసారంలో వివరించాడు పై అంశాలు ఆధారంగా పరిశీలిస్తే జాతకం, గోచారం, ముహూర్తం మొదలైన విషయాలలో గ్రహాలశుభఫల దాతృత్వం అష్టకవర్గు ఆధారంగానే నిర్ణయించాలనీ, అష్టకవర్గులేని గ్రహచారఫలాలు స్థూలమైనవనీ సూక్ష్మపరిశీలన, విశ్వసనీయత అనేవి అష్టకవర్గు ద్వారా మాత్రమే సాధ్యాలనీ అర్థమౌతోంది.

ప్రస్తుతం అష్టవర్గువేసే విధానాన్ని గుర్తిద్దాం

రవ్యష్టకవర్గు. బిందువులు 48

రవితాను ఉన్న స్థానం నుండి 1,2,4,7,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాదు
చంద్రుదు తాను ఉన్న స్థానం నుండి 3,6,10,11 భావాల్లో బిందువులనిస్తాదు
కుజుదు తాను ఉన్న స్థానం నుండి 1,2,4,7,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాదు -
బుధుమదు తాను ఉన్న స్థానం నుండి 3,5,6,9,10,11,12 భావాల్లో బిందువులనిస్తాదు

గురుడు తాను ఉన్న స్థానం నుండి 5,6,9,11 భావాల్లో బిందువులనిస్తాడు
శుక్రుడు తాను ఉన్న స్థానం నుండి 6,7,12 భావాల్లో బిందువులఇస్తాడు
శని తాను ఉన్న స్థానం నుండి 1,2,4,7,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
లగ్నం తాను ఉన్న స్థానం నుండి 3,4,6,10,11,12 భావాల్లో బిందువులనిస్తుంది

చంద్రాష్టకవర్గు బిందువులు 49

రవితాను ఉన్న స్థానం నుండి 3,6,7,8,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
చంద్రుడు తాను ఉన్న స్థానం నుండి 1,3,6,7,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
కుజుడు తాను ఉన్న స్థానం నుండి 2,3,5,6,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
బుధుడు తాను ఉన్న స్థానం నుండి 1,3,4,5,7,8,10,11, భావాల్లో బిందువులనిస్తాడు
గురుడు తాను ఉన్న నం నుండి 1,4,7,8,10,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
శుక్రుడు తాను ఉన్న నం నుండి 3,4,5,7,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
శని తాను ఉన్న స్థానం నుండి 3,5,6,11 భావాల్లో బిందువులనిస్తాడు
లగ్నం తాను ఉన్న స్థానం నుండి 3,6,10,11, భావాల్లో బిందువులనిస్తుంది

కుజాష్టకవర్గు బిందువులు 39

రవితాను ఉన్న స్థానం నుండి 3,5,6,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
చంద్రుడు తాము ఉన్న స్థానం మండి 3,6,11 భావాల్లో బిందువులవిస్తాడు
కుజుడు తాము ఉన్న నం మండి 1,2,4,7,8,10,11 భావాల్లో బిందువులవిస్తాడు
బుధుడు తాము ఉన్న నం మండి 3,5,6,11 భావాల్లో బిందువులవిస్తాడు
గురుడు తాము ఉన్న స్థానం మండి 6,10,11,12 భావాల్లో బిందువులవిస్తాడు
శుక్రుడు తాము ఉన్న స్థానం మండి 6,8,11,12 భావాల్లో బిందువులవిస్తాడు
శని తాము ఉన్న స్థానం మండి 1,4,7,8,9,10,11 భావాల్లో బిందువులవిస్తాడు
లగ్నం తాము ఉన్న స్థానం మండి 1,3,6,10,11, భావాల్లో బిందువులవిస్తుంది

బుధాష్టకవర్గు బిందువులు 54

రవితాము ఉన్న స్థానం మండి 5,6,9,11,12 భావాల్లో బిందువులవిస్తాడు
చంద్రుడు తాము ఉన్న స్థానం మండి 2,4,6,8,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
కుజుడు తాము ఉన్న స్థానం మండి 1,2,4,7,8,9,10,11 భావాల్లో బిందువులవిస్తాడు
గురుడు తాము ఉన్న స్థానం మండి 6,8,11,12 భావాల్లో బిందువులవిస్తాడు

శుక్రుడు తాను ఉన్న స్థానం నుండి 1,2,3,4,5,8,9,11 భావాల్లో బిందువులనిస్తాడు
శని తాను ఉన్న స్థానం నుండి 1,2,4,7,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
లగ్నం తాను ఉన్న స్థానం నుండి 1,2,4,6,8,10,11 భావాల్లో బిందువులనిస్తుంది.

గుర్వష్టకవర్గు బిందువులు 56

రవితాను ఉన్న స్థానం నుండి 1,2,3,4,7,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
చంద్రుడు తాను ఉన్న స్థానం నుండి 2,5,7,9,11 భావాల్లో బిందువులనిస్తాడు
కుజుడు తాను ఉన్న స్థానం నుండి 1,2,4,7,8,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
బుధుడు తాను ఉన్న స్థానం నుండి 1,2,4,5,6,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
గురుడు తాను ఉన్న స్థానం నుండి 1,2,3,4,7,8,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
శుక్రుడు తాను ఉన్న స్థానం నుండి 2,5,6,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
శని తాను ఉన్న స్థానం నుండి 3,5,6,12 భావాల్లో బిందువులనిస్తాడు
లగ్నం తాను ఉన్న స్థానం నుండి 1,2,4,5,6,7,9,10,11 భావాల్లో బిందువులనిస్తుంది

శుక్రాష్టకవర్గు బిందువులు 52

రవితాను ఉన్న స్థానం నుండి 8,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
చంద్రుడు తాను ఉన్న స్థానం నుండి 1,2,3,4,5,8,9,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
కుజుడు తాను ఉన్న స్థానం నుండి 3,5,6,9,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
బుధుడు తాను ఉన్న స్థానం నుండి 3,5,6,9,11 భావాల్లో బిందువులనిస్తాడు
గురుడు తాను ఉన్న స్థానం నుండి 5,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
శుక్రుడు తాను ఉన్న స్థానం నుండి 1,2,3,4,5,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
శని తాను ఉన్న స్థానం నుండి 3,4,5,8,9,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
లగ్నం తాను ఉన్న స్థానం నుండి 1,2,3,4,5,8,9,11 భావాల్లో బిందువులనిస్తుంది.

శన్యష్టకవర్గు బిందువులు 39

రవితాను ఉన్న స్థానం నుండి 1,2,4,7,8,10,11 భావాల్లో బిందువులనిస్తాడు
చంద్రుడు తాను ఉన్న స్థానం నుండి 3,6,11 భావాల్లో బిందువులనిస్తాడు
కుజుడు తాను ఉన్న స్థానం నుండి 3,5,6,10,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
బుధుడు తాను ఉన్న స్థానం నుండి 6,8,9,10,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
గురుడు తాను ఉన్న స్థానం నుండి 5,6,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
శుక్రుడు తాను ఉన్న స్థానం నుండి 6,11,12 భావాల్లో బిందువులనిస్తాడు
లగ్నం తాను ఉన్న స్థానం నుండి 1,3,4,6,10,11 భావాల్లో బిందువులనిస్తుంది.

ఈ ఏడు గ్రహాలకు ఉన్న అష్టకవర్గు బిందువులు అతి ముఖ్యమైనవి. ఏడు గ్రహాలు లగ్నం మొత్తం ఎనిమిదింటి ద్వారా ఏర్పడే బిందువులు కాబట్టి అష్టక వర్గు బిందువులు అనివ్యవహరిస్తున్నారు. ఈ మొత్తం 337 బిందువులు శుభప్రదమైనవి అని వ్యవహరిస్తారు. ప్రతి భావంలో ఒక్కొక్క గ్రహానికి సంబంధించిన అష్టకవర్గులో గరిష్ట బిందు సంఖ్య 8 ఎన్ని బిందువులుంటే తక్కినవి రేఖలు అవుతాయి. బిందువులు శుభమునకు సంకేతములు రేఖలు దోషమునకు సంకేతములు.

కొందరు బిందు శబ్దం ఉన్నచోట రేఖాశబ్దాన్ని రేఖాశబ్దం ఉన్న చోట బిందుపదాన్ని వాడుతున్నారు ఈ పుస్తకంలో మాత్రం బిందువులు శుభసంకేతములుగాను రేఖలు దోషసంకేతములుగాను వాడడం జరుగుతుంది.

పై అంకెలు ఆధారంగా 7 గ్రహాలకు అష్టకవర్గులను నిర్మించిన తరువాత సముదాయష్టక వర్గును నిర్మించాలి.

అష్టక వర్గు నిర్మాణానికి భావ చక్రం గ్రహించాలా ? రాశిచక్రం స్వీకరించాలా? అనే విషయంతో పండితవర్గంలో భిన్నాభిప్రాయాలున్నాయి.

ప్రాచీన గ్రంథాలలో చెప్పబడిన భావ ఫలాలు భావచక్రాన్ని అనుసరించి చెప్పబడ్డాయా? రాశిచక్రం ఆధారంగా చెప్పబడ్డాయా? అనే విషయంలో గూడా అభిప్రాయభేదాలున్నాయి.

భావాలకు గల బలపరిమాణాన్ని నిర్ణయించడానికి అష్టకవర్గును, ఉపయోగించే పక్షంలో ఆధారంగా అష్టక వర్గునిర్మించడమే సహేతుకమౌతుంది.

# వలయ చక్రనిర్మాణం

అంగుళం వెడల్పుగల గుండ్రని రేకు, దానికంటె కొద్దిగ పెద్దది మరో రేకు ఈ విధంగా తొమ్మిది రేకులు తయారుచేసి వాటిన్నిటిని కలిపి ఒక శీలకు బిగించాలి ఆ మొత్తము చక్రములను 12 సమాన భాగాలుగా విభజన చేయాలి మొదటి రేకుపై సున్న పన్నెండు భాగాలలో మేషాది ద్వాదశరాశులనామాలు లిఖించాలి. రెండవరేకుపై సూర్యాష్టక వర్గులోని బిందువులను ఆయా గ్రహనామాలతో గుర్తించాలి. ఆ తరువాతి దానిపై చంద్రాష్టకవర్గులోని బిందువులను విభించాలి. ఈ విధంగానే కుజాది పంచగ్రములయొక్క బిందువులకు సంబంధించిన రేకులపై రవ్యాదిగ్రహముల నామాలను ప్రత్యేకంగా లిఖించాలి. బిందువులను సూచించు గ్రహనామములకు గ్రహము సూచించు గ్రహనామమునకు భేదము తెలియుటకై గ్రహమును సూచించు గ్రహనామమునకు అక్షరము చుట్టూ వలయము లిఖించాలి. స్పష్టత కోసం ఈ క్రింది చక్రమును పరిశీలించండి ఉదాహరణ చక్రంలో అన్ని గ్రహాలను మేషములో చూపడం జరుగుతోంది. అవి పామారిన రాసులకు అనుగుణంగా ఒక్కొక్క గ్రహమును ఆయా గ్రహాలున్న రాసులలోనికి మార్చుకోవాలి లగ్నముగూడ ఏరాశిలో ఉన్నదో ఆ రాశిలోనికి మార్చుకోవాలి. అలా సిద్ధపరచుకొనిన చక్రము ఆధారంగా సులభంగా అష్టకవర్గువేయడం సాధ్యమౌతుంది.

పై ఉదాహరణ చక్రంలో లగ్నంలో రవ్యష్టకవర్గులో 3 బిందువులు ఉన్నవి రవివలన వచ్చిన బిందువు కుజునివలన వచ్చిన బిందువు శనివలన వచ్చిన బిందువు చంద్రాష్టకవర్గులో లగ్నంతో చంద్రుని వలన ఒకటి, బుధని వలన ఒకటి, గురుని వలన ఒకటిమొత్తం మూడు కుజుని అష్టకవర్గులో 3 బుధుని అష్టక వర్గులో 5 గురుని అష్టకవర్గులో 5 శుక్రుని అష్టకవర్గులో 3 శని అష్టకవర్గులో 2 మొత్తం 24 బిందువులు వచ్చాయి. ఇదే విధంగా తక్కిన భావాలలో వచ్చిన బిందువులను ఏర్పరచాలి.

# జ్యోతిర్దర్శనం

దర్శనం అంటే, ఆత్మ సందర్శనం తనను తాను తెలుసుకోవడం దర్శన శాస్త్రం

యొక్క లక్ష్యం తననుతాను తెలుసుకోవడానికి మార్గాలను దర్శనకర్తలు వ్యక్తీకరించారు.

భా: అంటే కాంతి దానియందు ప్రీతిగలవారు భారతీయులు కాంతి ఆనందానికి సంకేతం. ఆనందం ఆత్మసిద్ధమైనదే తప్పవస్తు సాధ్యమైనదికాదు. మనసు ఉల్లాసంగా వున్నప్పుడు ఇష్టంలేని విషయం కష్టాన్ని కలిగించదు. మనసు చికాకుగా వున్నప్పుడు ఇష్టమైన విషయం కూడా ఆనందాన్ని కలిగించలేదు. భారతీయ సంప్రదాయంలో తత్వశాస్త్రాన్నే దర్శనం అనిపిలుస్తారు. తత్త్వం అంటే తత్=అది త్వం-నీవు. అదే తత్త్వ వాస్తవం అనే వ్యవహారంలో వుంది. అంటే పరమాత్మ నీవు అనే ఉపదేశమే తత్వమనే వాస్తవం అదొక్కటే కాబట్టే తత్వమంటే వాస్తవం అనే వ్యవహారం వచ్చింది. తక్కినవన్ని సాపేక్షసత్యాలైతే పరమాత్మ వస్తువు నిరపేక్ష సత్యం.

సాపేక్షసత్యాలని, నిరపేక్షసత్యాన్ని వివరించేవి దర్శనాలు దర్శనం అంటే చూడటం చూపు కాంతికి సంబంధించినది. ఆత్మతేజ స్వరూపం తన ఉనికిని తాను తెలుపుతూ తన చుట్టూ వుండేవాటి ఉనికిని తెలియజేయగలగడమే తేజస్సు యొక్క ముఖ్యస్వభావం.

ఆత్మతేజస్సు పరమార్థ సత్యం, మూడు కాలాల్లో మార్పులేనిది కాలానికి లొంగదు. కాబట్టే ఆద్యంతాలు లేవు. ఆ సత్యం అనుభవించవలసినదే తప్ప వాక్కులకు అందేదికాదు. యతో వాచోని వర్తంతే అప్రాప్య మనసాసహ అనే శ్రుతి వాచామగోచరత్వాన్ని ఆలోచనా అతీతత్వాన్ని నిర్దేశిస్తోంది. భా అనే శబ్దంతో పిలువబడే కాంతి సర్వవ్యాపి. సకలవస్తు సముదాయాము నందును అంతర్లీనమై వుంది. ఆ కాంతి భౌతిక రూపాన్ని దాల్చినప్పుడు త్రిమూర్త్యాత్మకుడైన సూర్యుని ద్వారా చెట్లలో వ్యాపించి, ఆహారంగా పరిణమించి, శరీరంగా, మనస్సుగా రూపొందుతూ సర్వవ్యాపిగా విరాజిల్లుతోంది. ఆ కాంతిని పంచే సూర్యుడే కాలానికి కూడా కారణమవుతున్నాడు.

వ్యక్తి కాంతి వేగంతో ప్రయాణించగలిగితే కాలానికి అతీతుడౌతాడని, వైజ్ఞానికుల వచనం. పదార్థం ఒక్కటే. అయినా చూసేవాళ్ళదృక్కులను బట్టి వేర్వేరు రూపాలలో దర్శనమిస్తూంటుంది. అలాగే చూసేవారి దృక్కోణాన్ని బట్టే దర్శనాలు కూడా వేర్వేరయ్యాయి.

భారతీయులు ప్రాచీనకాలంలో గణితం, భౌతికశాస్త్రం, ఖగోళశాస్త్రం, వైద్యశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం మొదలైన శాస్త్రాలలో విశిష్టమైన కృషి చేశారు ముఖ్యంగా ఆలోచనను ఆధారంగా చేసుకొని పరిపూర్ణమైన విజయాల్ని సాధించారు ఈ రహస్యాలను తెలుసుకోవడంలో పరిపూర్ణమైన సాధనచేశారు ప్రతి శాస్త్రానికి ఆధ్యాత్మిక వికాసంతో సంబంధాలను ఏర్పరచారు. ఆధ్యాత్మిక రంగంలో చేసే కృషి ఆనాటి కాలంలో తీవ్రస్థాయికి చేరుకుంది. క్రమక్రమంగా ఆధ్యాత్మిక శాస్త్రాలు వేరుగాను భౌతిక శాస్త్రాలు వేరుగాను విడిపోవడం జరిగింది. ఇలా విడిపోవడంవలన భౌతిక శాస్త్రాలకు ఆధ్యాత్మిక ప్రయోజనం ఉంది అనే విషయం మరచిపోతువచ్చారు. కాని జాగ్రత్తగా ఆలోచిస్తే వ్యాకరణశాస్త్రజ్ఞులు స్ఫోటవాదం ద్వారా ఆధ్యాత్మీరుకత్వం ముఖ్యప్రయోజనం అని భావించారు. తార్కికులు భౌతిక వస్తువుల స్వరూప జ్ఞానం కలిగిన వారైనప్పటికీ దుఃఖ ధ్వంస అనే మోక్షానికి ప్రాధాన్యం ఇచ్చారు. వైద్యశాస్త్రం ఆరోగ్యాన్ని కలిగించమే లక్ష్యం గాగలదైనప్పటికి ఆధ్యాత్మికమైన ఔన్నత్యానికి మార్గాలను సుగమం చేస్తూవచ్చింది. ఈ శరీరమే దేవాలయం అని ఆ దేవాలయాన్ని కాపాడడం బాధ్యత అని తెలియజేయడంతో పాటు, మానసికారోగ్యాలను కాపాడుకోవడం ద్వారా సహజమైన ఆత్మానందానికి ఓషధికారణమౌతుందని గుర్తించారు. ఆయుర్వేదంలో మనస్సుప్రశాంతిని పొందడం ముఖ్యమౌతుంటుంది. అదేరీతిలో మనం జ్యోతిశ్శాస్త్రాన్ని గూర్చి కూడా ఆలోచించాలి. ఆక్రమంలో పరిశీలించినపుడు జ్యోతిశ్శాస్త్రం గూడా భౌతికంగాను ఆధ్యాత్మికంగాను సుఖసందర్శనానికి కారణమౌతున్న జ్యోతిషదర్శనాన్ని గుర్తించవచ్చు. వ్యక్తితన జీవనంలోని, శ్రమ, కాలం, ధనం వ్యర్థం కాకుండా కాపాడుకోవడానికి సద్వినియోగం చేసుకోవడానికి ఏ విధమైన కృషి చేయాలో తెలుపుతోంది. జ్యోతిశాస్త్రం కాంతి చైతన్యం ఉన్న సకల ప్రదేశాల్లోను వికసించినప్పటికి భారతదేశంలోని జ్యోతిశ్శాస్త్రానికి ఒక ప్రత్యేకత ఉంది. ఇతర దేశాలలోని జ్యోతిశ్శాస్త్రం దోషసూచన నందించి విరమిస్తోంది. భారతీయ జ్యోతిషం దోషనిరూపణతో బాటు దోష నివారణకు ధ్యానదాన జపాది కాన్ని సూచించి వ్యక్తిని మంచి మార్గంలో ప్రవేశపెట్టి సంస్కరిస్తోంది రోగనిదానంలో సమర్థుడైన వైద్యుడు పరిపూర్ణతను సాధించలేడు. రోగనిర్ధారణతో బాటు నివారణ చాతుర్యంకూడా వైద్యునకు తప్పనిసరి, ఆనంద ప్రదమౌతూ జ్యోతిషం శాస్త్రంగానే కాక దర్శనంగా వెలుగొందుతూ మోక్షకాంక్షులకు జ్యోతిర్దర్శనాన్నందిస్తోంది.

# ప్రశ్న శాస్త్ర పరిచయం

**నిర్వచనము :** జాతకములేని వ్యక్తులకు గాని జాతకమునకు సహకారముగా కాని ఒక కార్యము యొక్క శుభాశుభ ఫలములను తెలుపునది ప్రశ్న.

**విధములు :** ప్రశ్నించు విధానమునను సరించి ఫలితములు చెప్పు పద్ధతులననుసరించి పలు రకములుగా విభజింపబడినవి. అవి (1) కాల ప్రశ్న (2) సంఖ్యా ప్రశ్న (3) స్వరప్రశ్న (4) వాక్య ప్రశ్న (5) చేష్టా ప్రశ్న (6) కుండలీ ప్రశ్న (7) తాంబూల ప్రశ్న (8) పంచ పక్షి ప్రశ్న (9) ఆరూఢ ప్రశ్న (10) అంజన విద్య (11) పుష్ప ఫలాది ప్రశ్న (12) రమల ప్రశ్న.

**కాల ప్రశ్న :** ప్రశ్నవేసిన సమయమునకు ఉన్న గ్రహస్థితిని, తత్కాల లగ్నమును ఆధారముగా చేసికొని గ్రహ, భావ బలాదులననుసరించి ఫలనిర్ణయము చేయు విధానమును సమయ ప్రశ్న లేక కాల ప్రశ్న అంటారు.

**సంఖ్యా ప్రశ్న :** 108 లోపుగ ఒక సంఖ్యను పృచ్ఛకుని నుండి స్వీకరించి - 108 పాదములరాశి చక్రములో ఆ సంఖ్యకు సరియగు నవాంశలగ్న, లగ్నములను పరిగ్రహించి తత్కాల గ్రహ స్థితి నాధారముగా శుభా శుభములను నిర్ణయించు పద్ధతిని సంఖ్యా ప్రశ్నయందురు. 108 సంఖ్యకు బదులుగా 19,24,27, 249, 72 0 మొదలగు సంఖ్యలను గరిష్ఠ సంఖ్యలుగా పరిగణించి ప్రశ్న చెప్పువిధానములు వున్నవి.

**స్వర ప్రశ్న :** ప్రశ్నించు సమయానికి ప్రశ్న ఫలితం చెప్పే దైవజ్ఞునియొక్క ఇడ పింగళ, సుషుమ్ననాడుల స్థితిని అనుసరించి శుభాశుభములను చెప్పు పద్ధతిని స్వరప్రశ్నలందురు.

**వాక్యప్రశ్న :** పృచ్ఛకుని యొక్క ప్రశ్న వాక్యములో మొదటి అక్షరం, వాక్యములోని అక్షర సంఖ్య ఆధారముగా చేసికొని శుభా శుభములను చెప్పు విధానము.

**చేష్టా ప్రశ్న :** ప్రశ్నించువాని శరీర, అవయవ, ముఖ చేష్టలనాధారముగాను, పరిసర వస్తువుల స్థితి, ఉపశృతులు (చుట్టుప్రక్కల వినిపించు మాటలు) మొదలగువాని నాధారముగా ప్రశ్న యొక్క శుభాశుభ ఫలములను చెప్పు పద్ధతి చేష్టా ప్రశ్నలేక అంగ విద్య అందురు.

**కుండలీ ప్రశ్న** : వివిధ సంఖ్యలు గాని అక్షరములు గాని చిత్రములు గాని నిండి వున్న గళ్ళకల చిత్రపటముపై వ్రేలితో గాని పుల్లతో గాని పృచ్ఛకుడు స్పృజించుటననుసరించి శుభాశుభ ఫలములు చెప్పు పద్ధతి

**తాంబూల ప్రశ్న** : పృచ్ఛకుడు దైవాజ్ఞనివద్దకు తీసుకొని వచ్చి తమలపాకులు వక్కలు, పువ్వులు, దక్షిణ, ఫలాదులననుసరించి వాని సంఖ్య నాధారముగా చేసికొని శుభాశుభములు చెప్పు పద్ధతి.

**పంచపక్షి ప్రశ్న**: అయిదు రకముల పక్షులు యొక్క అవయవ విశేషముల నాధారముగా ప్రశ్న శుభా శుభములను చెప్పు పద్ధతి.

**ఆరుధ ప్రశ్న** : ప్రశ్నలగ్నారూఢము నాధారము చేసికొని తత్కాలగ్రహస్థితి ననుసరించి శుభాశుభములను వచించు విధానము.

**అంజన విద్య** : పోయిన వస్తువుల, కనుపించని వ్యక్తుల వివరములను తెలిసికొనుటకు అంజనం వేసి బాలునిచే చూపించి ఫలితములు చెప్పు విద్య

**రమల**: ప్రత్యేకముగా తయారు చేయబడిన చెక్క పలకలతో కూడిన పరికరమునుపయోగించి ప్రశ్న శుభాశుభములను చెప్పు పద్ధతి.

**పుష్పఫలాది ప్రశ్న**: పృచ్ఛకునికి అత్యంత ప్రీతి పాత్రమయిన పుష్పఫలాదుల నామములను చెప్పించి వానినాధారముగా ప్రశ్న శుభాశుభఫలముల చెప్పు పద్ధతి.

వీటి అన్నింటియందు సూత్రజలముకంటె మనో బలం దైవబలం సత్యస్ఫూర్తి ముఖ్య పాత్ర వహిస్తాయని అనుభవజ్ఞుల అభిప్రాయము.

## ప్రశ్న సమయ నిర్ణయం

ప్రశ్నయొక్క ఉత్పత్తి మానసిక చర్య పృచ్ఛకుడు ఏదో ఒక కార్యములో నిమగ్నుడైయుండగా ప్రశ్నించవలెనను సంకల్పము ఉదయించును. అట్టి సంకల్పసమయమే సరియగు ప్రశ్నసమయము కాని దైవజ్ఞాని వద్దకు పృచ్ఛకుడు వచ్చినప్పుడు అతను ప్రశ్నించిన సమయము నాధారముగా ఫలితములు చెప్పుట

జరుగుచున్నది. దైవజ్ఞుడు కూడ ఆధునిక కాలమాన పరిస్థితుల ననుసరించి పృచ్ఛకుడు వచ్చుటకు ప్రత్యేకమైన కాలాన్ని నిర్ధేశించటం జరుగుచున్నది. ఈ పరిస్థితులవలన షుమారు 20 దినములు నిర్ధేశించబడిన సమయమునకు ఏక లగ్నము, గ్రహములు, స్థితులలో పెద్ద మార్పు లేక యుండుట సంభవించును. తద్వారా ఫల నిర్ధేశములో లోటులు ఏర్పడును. అందువలన కొందరు దైవజ్ఞులు సమయ ప్రశ్నకు బదులు సంఖ్యాప్రశ్న మొదలగు వానిననుసరించి ఫల నిర్ణయం చేయుచున్నారు. పృచ్ఛకునికి కూడ ఈ విషయ పరిజ్ఞానము కలిగించిన యెడల అతడు ప్రశ్న సంకల్ప సమయమును గుర్తించుకొని దైవజ్ఞునకు చెప్పు అవకాశం కలుగును.

"ప్రశ్న-సంకల్ప ప్రధానమైనది. మనశ్శక్తిపై ఆధారపడినది". అను విషయము గుర్తించుట ద్వారా ఎక్కువగా సత్య ఫలితాలను సాధించు అవకాశం కలదు.

# వాస్తు-వైజ్ఞానిక వివరణ

వసనివాసే ధాతువు నుండి పుట్టిన పదమే వాస్తువు. నివాసానికి అనుకూలమైన నిర్మాణ విధానాలను అందించేది వాస్తు శాస్త్రము. శాస్త్రమనే శబ్దానికి హితవును శాసించేది అనేది ప్రాచీన నిర్వచనము. వాస్తవాలను వివరించేది సైన్సు. సైన్సుకు సమానార్థంగా విజ్ఞానశాస్త్రమనే పదాన్ని మేధావులు వాడుతున్నారు. ఆ కాలానికి దొరికే హేతువులను వివరాలను స్వీకరించడంవల్ల ఆ వాస్తవాలు సామాన్యంగా సాపేక్షాలే అవుతున్నాయి. సాపేక్ష వాస్తవాలను నిత్యసత్యాలుగా భ్రమించడం కూడ కొన్ని వేళల్లో జరుగుతుంది. వాస్తవముకన్న దానిని గురించిన అవగాహన సులభంగా కలుగుతుంది. అయితే ఆ వాస్తవానికి అవగాహనకు మధ్యనున్న తేడా మరచిపోయి మనము ఏర్పర్చుకొన్న సంకేతాల్ని ఊహాల్ని వాస్తవం అనుకొని భ్రమిస్తూ ఉంటాము.

అబ్రహాం మెస్లో అనే సుప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త "నీ చేతిలో ఉన్న పనిముట్టు కేవలం సుత్తి మాత్రమే అయినపుడు నీకు ఎదురయ్యే ప్రతివస్తువును మేకులాగనే చూస్తావు." అంటారు. సుత్తి పుచ్చుకొని పిడేలును బద్దలు కొడితే లోపల ఉన్న రాగం కనిపించదు. ఒక కోణంలో అన్ని శాస్త్రాలను అర్థం చేసుకుంటాము అనడం న్యాయం కాదు. కణముక్కలు

తీగలు లెక్కలు నిష్పత్తులు నిర్మాణాలు ఇవన్నీ కలిసి ఫిడేలు అవుతాయి. కాని దానినుండి వచ్చే సంగీతము కొలతలకు అందదు. మనం ఒక్క విజ్ఞానాన్ని తెలుసుకొనడానికి సాధనాలు అవసరమే. మనం ఒక చోటుకి వెళ్ళడానికి వాహనం అవసరమే. వాహనం లోనే నివాసం ఉండడం జీవిత లక్ష్యం కాకూడదు. కాగా హేతువు అనేది వాస్తవాన్ని తెలుసుకొనడానికి మార్గమే తప్ప హేతువే పరమార్థముకాదు. హేతువుకు మాత్రానికి లొంగని వాస్తవాలు ఎన్నో ఉంటాయి. హేతువు మనకు అందనంత మాత్రాన మొత్తము అంతా తప్పే అనే భావాన్ని విడనాడ వలసిన అవసరం ఎంతైనా వుంది.

సౌకర్యం, ఆరోగ్యం, మనశ్శాంతి, అనేవి లక్ష్యాలుగా మన శాస్త్రాలన్నీ ప్రవర్తిస్తున్నాయి. వీటన్నిటితో బాటు ఆధ్యాత్మిక జీవన వికాసం అనేది ప్రధాన లక్ష్యం.గా మన శాస్త్రాలు ఆలోచన కొనసాగించాయి. ప్రాచీనులైన ఋషులు పై లక్ష్యాలతో ఆయా కాలములందలి పరిస్థితులు ఆధారంగా నిర్వచనాలు చెప్పారు. మారుతున్న కాలంతో బాటు పరిస్థితులను కూడా అవగాహన చేసుకోవడం ప్రాచీన శాస్త్రజ్ఞులకు కూడా అవసరమే.

## "పురాణ మిత్యేనవ నసాధు సర్వం
## నచాసికావ్యం నవమిత్యపద్యం"

అన్నట్లుగానే పాతదంతా మంచిదికాదనే భావనకూడా ఏకపక్షనిర్ణయమే అవుతుంది. వాస్తవానికి మన ప్రాచీన శాస్త్రాలు విశేష విజ్ఞానంతో నిండి ఉన్నాయి. చాలా వరకు అతీంద్రియ సత్యాలతో ప్రకాశిస్తున్నాయి. ఇహపర సుఖాలకు ప్రాధన్యమిస్తున్నాయి. ప్రత్యక్షంగా కనిపించే హేతువులకు వెనుక నిగూఢమైన రహస్యాలు గూడ ఎన్నో ఉన్నాయి. ఒక దృక్కోణంతో కాకుండ పలు విధాలైన దృక్కోణాలతో పరిశీలించవలసిన ఆవశ్యకత కలిగి ఉన్నాయి. వాస్తవాన్ని హితవును గుర్తించడంలో మనస్సుకున్న శక్తి విశిష్టమైనది. ఆ గుర్తించే శక్తిని సాదనతో పెంపొందించుకోవచ్చని పరామనో విజ్ఞాన శాస్త్రజ్ఞులు అంగీకరిస్తున్న వాస్తవం. అలా పెంపొందించుకున్న శక్తి కలవారిని ప్రాచీనులు ఋషులుగా అంగీకరించారు. ఆ ఋషులు చెప్పిన శాస్త్రాలలో వాస్తు శాస్త్రం ఒకటి.

వాస్తు శాస్త్రానికి ఉపదేశకులుగా "భృగురత్రిర్వశిష్ఠశ్చ విశ్వకర్మా మయస్తథా నారదోనగ్న జిచ్చైవ విశాలాక్షః పురందరః బ్రహ్మకుమారో నందీశశ్శౌనకో గర్గ ఏవచ వసుదేవోని రుద్ధశ్చతథా శుక్ర బృహస్పతీ అష్టాదశైతే విఖ్యాతా వాస్తు శాస్త్రోపదేశకాః (మత్స్యపురాణము. అ 252) అనే పద్దెనిమిది మందిని మత్స్య పురాణం పేర్కొంటోంది. వీరు కాక అగస్త్యుడు, నంది, నారదుడు, తిమ్యలోకుడు, కాశ్యపుడు, కాత్యాయనడు, మరీచి, చిత్రతోయకుడు, పాలకాప్యుడు, పుండరీకుడు, దీర్ఘదర్శి పునర్వసు, యోగసారుడు మొదలగు మహర్షులను విశ్వకర్మ వాస్తుశాస్త్రం పేర్కొంటోంది. ఇవికాక కామికాగమ, సుప్రబేధాగమ, వైఖాన సాగమాది పలుగ్రంథాలలో ఈ శాస్త్రానికి సంబంధించిన పలు అంశాలు దర్శనిమిస్తున్నాయి.

నివసించడానికి సౌకర్యం అనే అంశంతో పాటు మనస్సుకు ప్రశాంతి ఆరోగ్యం, ఆధ్యాత్మిక వికాసం అనేవి పరమ ప్రయోజనాలు. ప్రథమంగా భూమికి సంబంధించి ఎత్తు పల్లాలను పరిశీలిద్దాం. మలయ మారుతం అనే పేరు సుప్రసిద్ధమైనది. ఇది దక్షిణ దిక్కుకు సంబంధించిన గాలి. ఆ గాలి ఆరోగ్యానికి ప్రశాంతికి కారణమౌతూ ఉంటుంది. దక్షిణం వైపు ఎత్తుగా ఈశాన్యం వైపు పల్లంగా ఉండడం వల్ల దక్షిణం పొడిగా ఉండడం సంభవిస్తుంది. దానితో ఆటువైపు నుండి వచ్చే గాలి ఆరోగ్యవంతమౌతుంది. దక్షిణాన నీరు నిలవుండే అవకాశం ఉండదు. అదే దక్షిణ పశ్చిమాలలో రాజమార్గమున్నపుడు ఈశాన్యం నుండి నీళ్ళు వెళ్ళడానికి అవకాశం ఉండదు. దీని విషయంలో వాస్తు శాస్త్రం ఆగ్నేయ వాయువ్యాలను అంగీకరించింది. అంటే నైరుతిని ఎత్తుగా ఉండడాన్ని తప్పనిసరిగా పాటించవలసిన నియమంగా శాస్త్రం చెపుతోంది. దీనిలో వాయు సంచారమనేది ప్రధాన పాత్ర వహిస్తోంది. మనకు ముఖ్యమైనవి నైఋతి ఋతుపవనాలే ఆ వాయువులు సక్రమంగా సంచరించడానికి నైఋతి ఎత్తుగా ఉండడం ఉపకరిస్తుంది.

రెండవ ప్రధానాంశం దిక్కులు సక్రమంగా ఉండడం. పెద్ద పెద్ద నగరాలలో స్థలాభావం వల్ల నగర విస్తరణ విషయంలో ఒక క్రమమైన పద్ధతిని (ప్లానింగ్) పాటించనందు వల్ల దిక్కులను గమనించడం లేదు. ఉత్తరాయణ దక్షిణాయనాలలో సూర్య కాంతి ప్రసరణలో వచ్చే భేదాన్ని దృష్టిలో పెట్టుకుంటే మనం సరియైన తూర్పునకు ఇల్లు కట్టుకున్నప్పుడు సూర్యకాంతిని పూర్తిగా వినియోగించుకోగల్గుతాం. కాంతి ప్రసరణ సక్రమంగా ఉన్నప్పుడు అది ఆరోగ్య విషయంలో చేసే మేలు అందరికీ తెలిసిందే. ప్రాచీన

కాలంలో నిర్మించబడిన పిరమిడ్‌లు దిక్ సంబంధమైన క్రమతను చక్కగా పాటించాయి. కాంతి వాయువుల రెండింటి ప్రయోజనాన్ని పూర్తిగా పొందాలంటే దిక్కులను పాటించి తీరాలి. కొంత పరిమితి దాటిన జనాభాగల పట్టణాలలో వాస్తు యొక్క అవసరం లేదనే మాట సరిపెట్టుకునే మాటే తప్ప సరియైన మాట కాదు.

గుమ్మాల పొర్లు: గుమ్మానికి గుమ్మం ఎదురుగా ఉన్నప్పుడు కిటికీకి ఎదురుగా కిటికీ ఉన్న వాయు ప్రసరణలో క్రమత పాటించబడుతుంది. అవి సక్రమంగా లేనప్పుడు వాయు ప్రసరణకు అంతరాయం ఏర్పడుతుంది. సహజ వాయు ప్రసరణకు అవకాశాన్ని కల్పించడం ఆరోగ్యానికి మంచిది. గోడ పొర్లు గూడా ఈ విధమైన కాంతి వాయు ప్రసరణలకు సరియైన అవకాశాన్ని యిస్తాయి. సూర్యకాంతి వృక్ష జాతుల్లోని పిండి పదార్థం యొక్క ఉత్పత్తికి హేతువౌతూ ఆ కాంతే వృక్షములుగా పరిణామము చెందుతోంది. వాటిని ప్రత్యక్షంగా పరోక్షంగా (జంతు మాంసాదుల రూపంలో) ఆహారంగా స్వీకరించినందు వల్ల మానవుని శరీరం వృద్ధి చెందుతోంది. ఆ ఆహార రూపమైన కాంతే మానవ శరీరంగా పరిణమిస్తోంది. అదే ఆహారం వల్ల మనస్సుకూడా వికసిస్తోంది. కాగా కాంతి యొక్క పరిణామమే మానవ శరీరం మనస్సు అవుతున్నాయి. ఆ సూర్యునికి ఒక పరిమితి గల దూరంలో భూమి ఉన్నందువల్ల ఇక్కడి వాయువు సక్రమంగా ప్రేరేపించబడి వాతావరణం సక్రమంగా పనిచేస్తోంది. కాగా ప్రకృతిశక్తులైన కాంతి వాయువు ఉష్ణం అనే వాటిని సక్రమమైన రీతిలో మానవుడు వినియోగించుకున్నందువల్ల అతని మనస్సు, శరీరము సక్రమైనరీతిలో వికసించి ఒక క్రమబద్ధతను అవపరచుకొనుట ద్వారా లౌకిక ఆధ్యాత్మిక ఔన్నత్యములను సాధించగల్గుతాడు. కాగా ఉదయ కాలం కార్యక్రమాల్లో వంట ఇల్లు పూజా మందిరం కొంత సమాయాన్ని గడపవలసిన ఆ రెండు గదులు తూర్పున ఉండడం సహేతుకమే నైఋతి నుండి ఈశాన్యానికి వాయు ప్రసరణ ఉన్న సందర్భాలలోను ఈశాన్యము నుండి నైఋతికి వాయువు ప్రసరణ ఉన్న సందర్భాలలోను ఆగ్నేయం మూలంగా వంటిల్లు ఉంటే ఆ గదిలోని వాయువులు మిగిలిన ఇంటిలో ప్రవేశించకుండా బహిర్గతాలౌతాయి. ఈశాన్య వాతావరణం ప్రశాంతిగా ఉంటుంది. అందువలన ఈశాన్యాన దేవుని మందిరం ఆగ్నేయాన వంటిల్లు ఉండడం సహేతుకమౌతుంది. వాయువ్యంలో పశువుల (వాయువ్యం-పశుమందిరం) నివాసం ఉన్నందువలను గూడా వాటి నుండి వచ్చే వాయువు ఇంటలో ప్రవేశించదు. ఆగ్నేయానికి ఎదురుగా ఉన్న దిక్కు

వాయువ్యం కావడం వలన ఆ పశువులు వాటి ఆహారం అగ్నికి దూరంగా ఉండడం సంభవిస్తుంది. అది గూడా క్షేమం తరమే అన్నిటికంటే పల్లంగా ఉన్న ఈశాన్యం నీటి స్థావరమైతే (నుయ్యి) తక్కిన ప్రదేశమంతా పొడిగా ఉండే అవకాశం లభిస్తుంది ఇటువైపు వంటింటికి అటువైపు పశువులకు నీరు అందించడానికి అనువుగా వుంటుంది అదే ఈశాన్యం నీటి వాడకం శ్రేష్టమని భావించడం వలన స్నాన మందిరం కూడా అదే దిక్కున శాస్త్రజ్ఞులచే విధింపబడింది.

ప్రతిశాస్త్రంలోను సామాన్య నియమాలతో బాటు విశేష నియమాలు ఉంటాయి ఆ విశేష నియమాలను గుర్తించకుండా ఉండడం వలన ఇబ్బందులు ఎదురౌతాయి.

1. స్థలం దీర్ఘ చతురస్రంగాని, చతురస్రంగాని ఉండాలి. దీర్ఘ చతురంలో దక్షిణోత్తరముల పొడవు తూర్పు పడమరల పొడవు కంటె ఎక్కువ వుండడం మంచిది (సూర్యకాంతి ప్రసరణ ఎక్కువగా ఉంటుంది.)

2. తూర్పు, ఉత్తరం, ఈశాన్యం దిక్కుల నుండి నీరు బైటకు పోవడం మంచిది పశ్చిమాన మాత్రమే రాజవీధి ఉంటే వాయువ్యం నుండి దక్షిణాన మాత్రమే రాజవీధి ఉంటే ఆగ్నేయం నుండి నీరు వీధిలోనికి పోవచ్చును నైఋతి నుండి నీరు బైటకు పోరాదు

   ఈ విధానం స్థలానికి చెందినది ఇంటిలోని గదులలో ఎటు నుండి నీరు పోయినా ఇబ్బందిలేదు

3. గర్భం కంటె వసారాలు ఎత్తు ఉండరాదు సమానంగా ఉండవచ్చు. పశ్చిమ దక్షిణాల్లో వసారాలు గర్భం కంటె ఎత్తు పెట్టే పద్ధతి, ఇప్పుడు వాడుకలో కనిపిస్తోంది. దాని వలన యజమాని అభివృద్ధి కుంటుపడుతుంది.

4. ఇంటి ముఖ ద్వారానికి ముందున అరుగులు మాత్రం గర్భంకన్నా ఎత్తుగా ఉండడం మంచిది

5. వసారాలన్ని సమానమైన ఎత్తుతోనే ఉండాలి గర్భం యొక్క వెడల్పుతో సమానంగా ఎత్తు పెట్టాలి తక్కువ ఎత్తు నిర్మాణం నిషేధించబడింది.

   గోడల పొర్లు ముఖ్యమైనవి. గర్భం వెడల్పును తగ్గిస్తూ గోడలు పెట్టరాదు

సింహ ద్వారం ముందు వెనుకలలోనున్న గుమ్మాలకు పొరు పాటించాలి

తక్కిన ద్వారాలకు ఎదురుగా ద్వారాలు లేకున్నా మంచిదే గుమ్మాల లెక్క ఇంటి మొత్తానికి పరిగణించాలి

10,20,30 మొదలుగా సున్న ఉన్న సంఖ్య పనికి రాదనుటకు ప్రామాణిక గ్రంథాధారం లేదు సరి సంఖ్యలో ఉండడం శాస్త్రీయం

స్థలమును నాలుగు వైపుల 9 వ డిచి ఇల్లు కట్టాలి.

వ్యక్తులను బట్టి కొందరికి దక్షిణ పశ్చిమాలలో కాళీ స్థలం ఉండడం పనికి వస్తుంది.

నిర్మాణ విషేషాలను అనుసరించి, పశ్చిమాన గూడా బోరింగు, నుయ్యి మొదలైనవి పనికి వస్తాయి.

ఇలాంటి విశేష విధులను దృష్టిలో పెట్టుకొని గుణదోష విచారణ, సహేతుక చర్చ కొనసాగించాలి. గాని ఏక పక్ష నిర్ణయాలు సరియైనవి కావు. ఈ రీతిలో వాస్తు శాస్త్రాన్ని సర్వులు అర్థం చేసుకొని ఆచరణలో పెట్టుకోవడం అందరికీ హితవును కల్గిస్తుంది.

# జ్యోతిర్వైద్యం

భాః అంటే కాంతి. కాంతి యందు ప్రీతి గలవారు భారతీయులు కాంతి జ్ఞానానికి ఆనందానికి సంకేతం ఆనందం ప్రశాంతి నుండి ఉద్భవిస్తుంది జ్ఞానం ఆనందాన్నిస్తుంది. అంటే ఆ మూడింటి మూలస్వరూపం ఒకటే. తెలుసుకోదగిన జ్ఞానమే కాంతి. వ్యక్తి యొక్క సహజ స్థితి ఆనందం. సత్ అంటే ఉనికి చిత్ అంటే జ్ఞానం, ఆనందం, ఈ మూడింటి స్వరూపమే సచ్చిదానంద స్థితి, వేదం భారతీయుల జ్ఞానభాండాగారం విద్ జ్ఞానే అనే ధాతువునుండి పుట్టిన వేద శబ్దానికి తెలుసుకోదగిన జ్ఞానం అని అర్థం. లౌకిక సుఖ జీవనానికి ఆధ్యాత్మికమైన సహజానందానికి మార్గాలను సుగమం చేసేదే వేదం.

ప్రాచీనకాలంలోని విజ్ఞానమంతా వేదమందే నిక్షిప్తమైఉంది. అందున్న సూత్రాలను ఆధారం చేసుకొని విజ్ఞాన శాఖలు వర్ధిల్లినాయి. వర్ధిలుతున్నాయి.

జ్యోతి అంటే కాంతి సూర్యుని కాంతిలో ఏడు రంగులున్నాయి. ఆ కాంతులను ప్రతిఫలించే గ్రహాలు సూర్యునితో సహా ఏడు రంగులకు ఆధిపత్యం వహిస్తున్నాయి. సూర్యుని కాంతి వృక్షాల ఎదుగుదలకు దోహదపడుతోంది. కాంతే కిరణజన్య సంయోగక్రియ ద్వారా వృక్షంగా రూపొందుతోంది. ఆ వృక్షాల నుండి ఆహార ద్రవ్యాలు జనిస్తున్నాయి. ఆహారమే శరీరంగా మనస్సుగా రూపొందుతోంది. కాంతి యొక్క సూక్ష్మాతిసూక్ష్మ రూపమే మనస్సు. ప్రతి వస్తువులో మంచి చెడ్డలుంటాయి. ఈ మంచి చెడ్డలు సాపేక్షాలు. ఏవస్తువైనా అవసరమైనపుడు అవసరమైనంతవరకు వినియోగిస్తే మంచిది. అవసరాన్ని మించితే చెడ్డది. లోకంలోని పదార్థాలన్నీ నవగ్రహ కాంతి శక్తి కలిగినవే.

వేదం జ్ఞానాత్మకమని వేరు వేరు విజ్ఞాన శాఖలు శాఖలు మాత్రమేనని గుర్తించాము. అందువలన విజ్ఞానశాఖలన్నీ పరస్పర అవగాహనతో సమన్వయంతో ఆలోచించవలసిన అవసరం ఉంది. ప్రతీవిజ్ఞాన శాఖ పరస్పర సమన్వయంతో ఆలోచన చేసినపుడు మాత్రమే వాస్తవ సత్యాలు వెలువడతాయి. ఒక విజ్ఞాన శాఖ మరో విజ్ఞాన శాఖ కంటే గొప్పది అనే భావనతో ఇతర విజ్ఞాన శాఖలోని వాస్తవాలను అంగీకరించలేక పోవడం, ఒక కన్ను గొప్పది అనే భావన లాంటిది.

ఆహార స్వీకరణలోను, మందులు వాడడంలోను ప్రకృతికి దగ్గరగా వ్యవహరించడం అవసరం ప్రకృతిశక్తికి దూరమైన కొలది వ్యక్తి శరీరం మనస్సు అనారోగ్యాన్ని పొందుతూంటాయి.

"యుక్తాహార విహారస్యయుక్త చేష్టస్య కర్మను

యుక్త స్వప్నావ బోధస్య..."

అన్న భగవద్గీతావచనం ప్రకృతిని అనుసరించి సహజమైన ఆహార విహార, చేష్టాదులను శాసిస్తోంది. లోకంలోని ప్రతి వస్తువు ఉపయోగించే వ్యక్తిని బట్టి ఉపయోగంలోనికి వస్తుంది. అలాగే ప్రతి విజ్ఞాన శాఖలోని అంశాలు పరస్పర సమన్వయంలో పని చేసినపుడే ఆ విజ్ఞానం ఉపయోగపడుతుంది.

కాంతి, పదార్థం, శక్తి, శబ్దం, మొదలైన వన్నీ ఒక పదార్థం మరో పదార్థంగా రూపొందుతూ మూల పదార్థం ఒకటే అనే విషయాన్ని విశదీకరిస్తున్నాయి. ప్రతి

అణువులో ఉండే కణముల స్థితి సౌరకుటుంబానికి ప్రతీకగా నిలుస్తోంది. కాంతి గమనం ఆధారంగా కాలగణన సాగుతోంది.

కాలం, కాంతి, పదార్థం, శక్తి, జ్ఞానం, ఆనందం, అని వేరు వేరు రూపాల్లో భాసించే మూల ప్రకృతి ఒక్కటే. దాని ప్రతిరూపమే మనసు. కాబట్టి మంచి చెడ్డలకు సకల క్రియలకు ఆరోగ్య అనారోగ్యాలకు ఉత్పత్తి స్థానం మనసు. ఆ మనసుని క్రమ బద్ధం చేస్తే ఆనందాన్ని ఆరోగ్యాన్ని సాధించవచ్చు.

స్థూల పదార్థం కంటే సూక్ష్మ పదార్థం శక్తి వంతమౌతూంటుంది. అన్ని పదార్థాల కంటే సూక్ష్మమైన మనస్సును క్రమబద్ధం చేస్తే మనస్సు, శరీరం సక్రమంగా పనిచేస్తాయి. ఇంద్రియ శక్తులు చైతన్యశక్తి వికసిస్తాయి. భారతీయ సంప్రదాయం ప్రకారం ప్రాణాయామం, యోగం, ధ్యానం, జపం, మొదలైన సాధనాల ద్వారా మనసుని క్రమబద్ధం చేయవచ్చు. శరీరాన్ని క్రమబద్ధం చేయడానికి వ్యాయామం, ప్రకృతి సిద్ధమైన అవసరమైన ఆహారం, మూలికలు మొదలైనవి సాధనాలు.

ఆహారాన్ని మందులా తీసుకుంటే మందుల అవసరం ఉండదు. ఆహారాన్ని స్వేచ్ఛగా తీసుకుంటే మందులను ఆహారంగా తీసుకోవలసివస్తుంది. "తినేది తినబడేది అన్నం" అని ఉపనిషత్తు. మితాహారం తినబడుతుంది. అమితాహారం మనిషిని తింటుంది. వ్యక్తి జన్మించినపుడు ఏకాంతుల ప్రభావానికి లోనయ్యాడో ఆయా పాళ్ళలో కాలానుగుణమైన మార్పులలో సమాహారం తీసుకుంటే ప్రశాంతితో ప్రకాశవంతమైన జీవనాన్ని గడుపగలుగుతాడు. ఈ సూత్రాన్ని వివరించేదే జ్యోతిశ్శాస్త్రం.

12 భావాల్లో, 12 రాసుల్లో, నవగ్రహాల ఉనికి ఆధారంగా వేరు వేరు కాలాల్లో వేరు వేరు కాంతులకు శరీరం మనస్సు ప్రతిస్పందించే తీరులను, ఆయా స్పందనలకు తీసుకోదగిన చర్యలను వివరించేదే జ్యోతిశ్శాస్త్రం.

శాసించేది శాస్త్రం అని ప్రాచీన నిర్వచనం వ్యక్తి అవసరాలకు అనుగుణంగా కాలానికి తగిన రీతిలో వ్యక్తి ప్రవర్తనను శాస్త్రం శాసిస్తుంది. అనారోగ్య స్వరూప నిరూపణతో బాటు అనారోగ్య నివారణ వైద్యుని కర్తవ్యం. జ్యోతిశ్శాస్త్రం కాంతికి సంబంధించిన శాస్త్రం ఆ కాంతి సూర్యుని నుండి మనస్సు వరకూ బ్రహ్మాండమునుండి అణువువరకూ వ్యాపించి

ఉంది. కాబట్టి ఆ కాంతిని అధ్యయనం చేస్తే వ్యక్తిలోని లోపాలను గుర్తించవచ్చు ఆ లోపాలను ఆయా ప్రకృతులకు సంబంధించిన పదార్థాలతో పూరించవచ్చు ఆందోళన అనారోగ్యకారణాల్లో ముఖ్యమైనది ప్రశాంతి ఆరోగ్యానికి సంకేతం. అవసరమైన పదార్థాన్ని గుర్తించి అందించడమే లోపపూరణ.

ఒక వ్యక్తికి తలనొప్పి వచ్చింది. దాని వైద్యం రెండురీతుల్లో చేయవచ్చు. ఆ తలనొప్పికి మూలకారణం గుర్తించి దానికి తగిన మందు ఇవ్వడం ఒకటి. తలనొప్పి ఎన్ని రకాలుగా రావచ్చో అన్ని విధాల తగ్గడానికి తగిన మందులన్నీ కలిపి వ–త్రగా వేస్తే ఏకారణం వల్ల వచ్చినా తల నొప్పి తగ్గుతుంది ఇది రెండవ పద్దతి కాని అనవసరంగా పదార్థాలను శరీరంలో జొప్పించడం వలన ఆ పదార్థాలు శరీరంలోని క్రమపద్ధతిని నశింపజేసి వివిధ అనారోగ్యాలకు కారణమౌతూంటాయి. అది అశాంతినిచ్చే తాత్కాలిక ప్రయోజనమే తప్ప అనారోగ్య నివారణ పద్దతి కాదు

రోగాన్ని కారణాన్ని గుర్తించడానికి చాలా ఓపిక కావాలి అందుకే ప్రాచీనులు వైద్యుని నారాయణుడని పూజించారు. అన్నిటా వేగం పెరిగిన నేటి సమాజంలో అటు వైద్యునికీ ఇటు రోగికీ ఓపిక ఉండడంలేదు హితకారి అయిన వైద్యుడు రోగాన్ని గుర్తించి ప్రశాంతికరమైన మందును సూచించే వరకూ ఆగే ఓపిక రోగికి ఉండడం లేదు ఈ రాకెట్ యుగంలో సహనం కోల్పోయిన మనిషికి వెంటనే బాధ తగ్గాలి అది పేలినా సరే

వెనుకటి కొకడు వేడిగా ఉన్న కత్తిని చల్లారడానికి నీటిలో ముంచాడట. అది చూసిన శిష్యుడు ఒక జ్వరం గలవాడిని ప్రాణం పోయేదాకా నీటిలో ముంచి వేడిని పూర్తిగా తగ్గించాడు. మేడమీంచి దిగడానికి మెట్లుండగా వేగం కోసం మేడమీదనుండి దూకడం తెలివికాబోదు.

విశ్వాసం - రోగ నివారణలో మనసు పాత్ర

మిచిగాన్, శాండిగో యూనివర్సిటీల పరిశోధకుల పరిశోధనలు తెలిపే వాస్తవాలు ఇలా ఉన్నాయి.

"చికిత్సా పద్ధతులలో లోపాలున్నా విశ్వాసమున్న రోగులకు మేలే చేస్తున్నాయి. రోగం నయం అయ్యేందుకు కాక రోగి మానసిక తృప్తికోసం ఇచ్చే మందుల వల్లగూడా మూడింట రెండు వంతుల కన్నా ఎక్కువ మందే ప్రయోజనం పొందుతున్నారు.

వంతుల కన్నా ఎక్కువ మందే ప్రయోజనం పొందుతున్నారు (చూ. 16-4-93 ఈనాడు జ్ఞాన నేత్రం)

యోగసాధనద్వారా ఆత్మవిశ్వాసాన్ని పెంచుకున్న మనిషి తన మనశ్శక్తిద్వారా తన రోగాలను నయం చేసుకోవడమే కాదు. ఇతరుల రోగాలను గూడా తగ్గించగలడు ఉదాహరణగా మాష్టర్ సి.వి.వి., శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారలను గుర్తించవచ్చు.

వైద్యము మనసునుండి ఆరంభం కావాలి. అందుకేమనవారు ఓషధులు, దానాలు, జపాలు, హోమాలు, రత్నధారణ, రోగాలను తగ్గిస్తాయన్నారు.

ఓషధులు: ఏ రోగం ఏ గ్రహం వల్ల జన్మించిందో ఆ గ్రహంయొక్క శుభకిరణాలద్వారా జనించిన మూలికలు ఆ అనారోగ్యాన్ని నివారిస్తాయి. స్నానంలో మూలికలు ఉపయోగించే విధానం జ్యోతిశ్శాస్త్రం వివరిస్తోంది.

దానం: ఒక వ్యక్తి ఒక వస్తువును అనుభవించినప్పటి కంటే ఇతరులకు ఇచ్చి వారనుభవించి ఆనందిస్తూంటే చూసినందువలన తానెక్కువ ఆనందించగలడు వస్తువును తాను అనుభవించి నందువలన కలిగే ఆనందానికి పరిమితులున్నాయి. ఇతరులకు దానంచేసి వారనుభవిస్తూంటే కలిగే ఆనందానికి అవధులులేవు. ఏ అనారోగ్యానికి ఏ గ్రహం కారణమో ఆ గ్రహానికి చెందిన పదార్థాలను ఇతరులకు దానం చేస్తూ తాను గూడా అనుభవిస్తే ఆ అనారోగ్యం తగ్గుతుంది. సకల పదార్థ స్వరూపమైన కాంతికి అతి సూక్ష్మరూపమైన మనస్సును పరిశుద్ధం చేయాలి. మనస్సులన్నీ ఒకే పదార్థం కలవి కావడంవలన ఎదుటి మనస్సులో ఆనందాన్ని పుట్టిస్తే ఈ మనసు పరిశుద్ధం కావడం ఆనందం పొందడం సంభవిస్తుంది.

జపం: అనారోగ్యం మొదట మనసులో ఆరంభం అవుతుందనే వాస్తవం అందరూ అంగీకరించేదే. వైద్యం గూడా మనసునుండే ఆరంభం కావాలి. జపంద్వారా మనసు ఏకాగ్రం అవుతుంది. ఆ శక్తి చాలా విశిష్టమైనది. మనసు అనారోగ్యాన్ని నివారిస్తుంది. తాము చేసిన జపం తన అనారోగ్యాన్ని నివారించగలదు. (తన కా శక్తి లేనపుడు) ఇతరులు చేసిన జపంగూడా ఏకాగ్రతా శక్తి వలన తన రోగాలను నివారించగలదు. కారణం మనసులన్నిటిలోను పదార్థం ఒకటే అత్యాశకులోముకాని వ్యక్తి ఇతరుల మేలు కోరగలడు అలాటి వ్యక్తి చేసిన జపం, ప్రార్థన, స్తోత్ర పారాయణ వీనివలన కలిగిన ఏకాగ్రతా శక్తి వలన ఆ అనారోగ్యం నివారించబడుతుంది. హిప్నోథెరపీలో గూడా ఉపయోగపడుతూన్నది మనశ్శక్తితో గూడిన శబ్ద శక్తేనని మనం గుర్తించాలి.

హోమం : ఏగ్రహం అనారోగ్య కారణమైందో ఆగ్రహానికి చెందిన మూలికలను ఆగ్రహం యొక్క మంత్రం (శబ్దశక్తి) ద్వారా ధ్యానించి (సంకల్పశక్తి) హోమం చేస్తే ఆ మూలికలు సూక్ష్మ రూపంలో(పొగద్వారా) వాతావరణంలో ప్రవేశించి అనారోగ్యాలను నివారించగలవు.

మొక్కల పెంపకం : జన్మ నక్షత్రానికి చెందిన వృక్షాలను పెంచి వాటిపైనుండి వచ్చే గాలిని పీల్చడం ద్వారా సూక్ష్మీ కృతమైన ఆ వృక్షశక్తి వ్యక్తికి ఆరోగ్యాన్ని మానసిక ప్రశాంతిని అందిస్తుంది.

అశ్విని-అడ్డసరం, భరణి - దేవదారు, కృత్తిక - అత్తి, రోహిణి - నేరేడు, మృగశిర - చంద్ర, ఆర్ద్ర - రేల, పునర్వసు - వెదురు, పుష్యమి - పిప్పలి, అశ్లేష - నాగకేసరం, మఖ - మర్రి, పుబ్బ - మోదుగ, ఉత్తర - జువ్వి, హస్త - కుంకుడు, చిత్త - తాడి, స్వాతి - మద్ది, విశాఖ - నాగకేసరం, అనూరాధ -పొగడ, జ్యేష్ఠ - విప్ప, మూల - వేగిన, పూర్వాషాఢ -నెమ్మి, ఉత్తరాషాఢ - పనస, శ్రవణం - జిల్లేడు, ధనిష్ఠ - జమ్మి, శతభిషం - అరటి, పూర్వాభాద్ర - మామిడి, ఉత్తరాభాద్ర - వేప, రేవతి -విప్ప,

ఈ వృక్షాలను పెంచడం ఆ వృక్షాలను పూజించడం, ఆ వృక్షాలకు చెందిన పదార్థాలను ఆహారంగా స్వీకరించడం శరీరంలో రోగనిరోధక శక్తిని పెంచి మానసిక ప్రశాంతి గూడా ఇస్తాయి.

ఏకాగ్రత : జబ్బులను మనశ్శక్తితో జయించగలం, అసలు జబ్బుకు కారణం అవసరానికి మించి మందులు వాడడమేనని గుర్తించాలి. శరీరానికి సహజంగా ఉండే రోగనిరోధకశక్తిని మందులు తగ్గిస్తాయి ఆసనాల ద్వారా, సూర్యనమస్కారాల ద్వారా శరీర శక్తిని, ఏకాగ్రత, జపం, ప్రాణాయామం మొదలైన వాటి ద్వారా మనశ్శక్తిని కేంద్రీకరించడం వలన మనశ్శక్తిని పెంపొందించుకుంటే అనారోగ్యాల ప్రవేశమే ఉండదు. ఒక వేళ అనారోగ్యం ప్రవేశించినా శీఘ్రంగా నివారించబడుతుంది. విశేషించి సూర్యుని ఆరోగ్యం కోరాలని (ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్) భారతీయ శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. రష్యా పరిశోధకులు సూర్యకాంతిని ఒక పరిమితి గల భూతద్దం ద్వారా శరీరంపై అనారోగ్యం ప్రాంతంలో ఒక్క క్షణ కాలం ప్రసరింపజేసి కొన్ని రోగాలను నయంచేశారు.

# సూర్యనమస్కారాల వైశిష్ట్యం

సూర్యనమస్కారాల ద్వారా సూర్యుని కాంతి శక్తిని, ఆ సమయంలో ఉచ్చరించే మంత్రాల ద్వారా మంత్ర శక్తిని, ఆ ప్రక్రియల ద్వారా (వ్యాయామం) శరీర శక్తిని కేంద్రీకరించడం జరుగుతోంది.

సంగీతం: సప్తగ్రహాలు - సప్తస్వరాలు. ఏడు గ్రహాలకు గల కాంతి కిరణ ప్రసారంవలన స్పందించిన పశుపక్ష్యాదులు ఆ గ్రహాల ప్రత్యేక ప్రభావాలననుసరించి ప్రత్యేక స్వరాలను ఉత్పత్తి చేశాయి. ఆ స్వరాలకు సంగీత శాస్త్రజ్ఞులచే చెప్పబడిన వర్ణాలు గ్రహ వర్ణాలు ఏకీభవించడం జరుగుతోంది.

| గ్రహాలు | స్వరాలు | వర్ణాలు | జంతు/పక్షిధ్వని |
|---|---|---|---|
| రవి | గ | బంగారు రంగు | మేక |
| చంద్రుడు | మ | పసుపు కలిసిన తెలుపు | క్రౌంచపక్షి |
| కుజుడు | రి | ఎరుపు | చేతక పక్షి |
| బుధుడు | స | ఆకుపచ్చ | నెమలి |
| గురుడు | ధ | పసుపు | గుర్రం |
| శుక్రుడు | ని | చిత్రవర్ణం | ఏనుగు |
| శని | ప | నలుపు | కోకిల |

గ్రహాల శుభ కిరణాల ద్వారా స్పందించినపుడు ఉత్పత్తి అయిన రాగాలు గ్రహాల అశుభకిరణాల ద్వారా జనించినరోగాలను తొలగిస్తాయి. మనస్సు ఏకాగ్రం అయినపుడు పొందిన ప్రశాంతి ఆరోగ్యరూపమైన ప్రశాంతిని ఇవ్వడంలో ఉన్న సత్యాన్ని పరామనోవిజ్ఞానశాస్త్రవేత్తలు నిర్ధారణ చేస్తున్నారు. లవణానికి అధిపతి చంద్రుడు, లవణం ప్రేమానురాగాలను ప్రేరేపిస్తుంది. ప్రేమలోని ఉద్రేకమే కోపంలోని ఉద్రేకంగా పరివర్తన చెందుతుంది. తీరని కోరిక కోపంగా పరిణమిస్తుంది. ఉద్రిక్తత చెందే మనస్సుకు కారణం చంద్రుడే మానసికోద్రేకాలకు కారణం లవణమే. అందుకే బ్లడ్ ప్రెషర్ తగ్గడానికి లవణాన్ని తగ్గించమంటున్నారు వైద్యులు. అదే లవణాన్ని సూక్ష్మీకరించి వాడాలంటున్నారు మరో వైద్యులు.

క్రమబద్ధమైన స్వరాలు ఆయా గ్రహ ప్రభావాలను సక్రమం చేయడానికి కారణమౌతాయనడం సహేతుకమే. ఈ రీతిలో రంగులకు స్వరాలకు గల సంబంధాన్ని ఆ రంగులకు గ్రహాలకు గల సంబంధాన్ని వివిధ రాగాలలో ప్రాధాన్యం గల స్వరాలను ఆ రాగాలకు అనారోగ్యనివారణలో గల శక్తిని పరిగ్రికరిస్తే రాగాలకు రోగాలకు గ్రహాలకు రంగులకు గల అంతరంగ సంబంధం అభివ్యక్తమౌతుంది. హిందోళ-ప్రేమభావాన్ని, దీపకరాగం - దయాభావాన్ని, మేఘరాగం - ధైర్యాన్ని, భైరవరాగం ప్రశాంతతను, శ్రీరాగం - నిస్వార్థప్రేమని పెంపొందిస్తాయి.

రత్నాలు: సుర్యునికాంతి ఓజోన్ పొరద్వారా సూక్ష్మీకృతమై వ్యక్తంగా ఆహారంగా, శరీరంగా మనసుగా రూపొందుతోందని మనం తెలుసుకున్నాం. సూర్యునికాంతి తక్కిన గ్రహాలపై ప్రసరించి ప్రతిఫలించి సూక్ష్మీకృతమై వ్యక్తిమనసుపై ప్రభావాన్ని చూపుతోంది. అలా సూక్ష్మీకృతమైన కాంతిలోని వ్యతిరేకశక్తిని ఇంకా సూక్ష్మీకృతమైన కాంతితో ఎదుర్కోవాలి ఆయా గ్రహ శుభకిరణాలవలన జన్మించి దోషరహితాలైన రత్నాలపై ప్రసరించి ప్రతిఫలించిన కాంతి అలా ఎదుర్కోవడానికి దుష్టఫలాలను నివారించడానికి ఉపకరిస్తుంది.

మనశరీరంలోని ప్రతి జీవాణువులోను సప్తకిరణాలు సమ్మిశ్రితమై ఉన్నాయి. వీటి శక్తి సమపాళ్ళలో పనిచేసినపుడు వ్యక్తి ఆరోగ్యంగాను శక్తివంతుడుగాను ప్రకాశవంతునిగాను ఉంటాడు ప్రశాంతంగా జీవించగలుగుతాడు వాటిని సమపాళ్ళల్లో ఉంచేశక్తి నవరత్నాలకు ఉంది. కొన్ని సందర్భాలలో లోపించిన కిరణాలకు సరిపడేవిధంగా ఒకటి రెండు రత్నాలను దశలననుసరించి ధరించడంగూడా ఆరోగ్యదాయక మౌతుంది. జీవితాంతం ఒకే రత్నాన్ని ధరించే పద్ధతిని కొందరు ఆధునిక జ్యోతిష్కులు సూచిస్తున్నారు. ఈ పద్ధతి సరికాదు. ఆ విధానానికి శాస్త్రీయమైన ఆధారాలు లేవు. ఔషధాలు మూలరూపంలో అపకారం కలిగించినా పొటెన్సీల రూపంలో సూక్ష్మీకృతమైనపుడు ఉత్తేజకరాలుగా వ్యాధినివారకాలుగా పనిచేసినట్లే, అవసరమైనరత్నాలద్వారా సూక్ష్మీకృతకాంతి రోగనివారకమౌతూ ప్రశాంతిని ప్రసాదిస్తుంది.

రంగులు - జ్యోతిషం

సోవియట్ [illegible] పరిశీలనాఫలితాలను బట్టి చూస్తే

ఎరుపురంగు గదులో ఉంచిన వ్యక్తిలో కండరాల ఉద్రిక్తత, గుండెదడ శ్వాసక్రమం, రక్తవేగం పెరుగుదల కనిపిస్తున్నాయి. అదే అవసరమైన సందర్భంలో తగినంత మోతాదులో ప్రసారం చేసినప్పుడు ఉత్సాహశక్తి పెరుగుతోంది. తనచుట్టూ ఉన్న ప్రజలను గురించిన బాధ్యత పెరుగుతోంది.

పైన చెప్పిన లక్షణాన్నీ జ్యోతిశ్శాస్త్రరీత్యా కుజుని ఆధిపత్యంగలవే.

ఎర్రరక్తకణాలు తక్కువగల పిల్లలలో ఈ ఎర్రని కాంతి ఎర్రరక్తకణాలను పెంచుతోంది వాని అధిపతి కుజుడే అతడు వెదజల్లే కాంతి కూడా ఎర్రనిదే.

నీలిరంగు కాంతి రక్తవేగాన్ని తగ్గించి గుండెదడ శ్వాసలోని ఇబ్బంది మొదలైన ఇబ్బందులను తగ్గించి విశ్రాంతినందిస్తోంది. శని నీలిరంగుకు విశ్రాంతికి అధిపతి. అది అతి అయితే బద్ధకం పెరుగుతోంది అది శనైశ్చరుని (నెమ్మదిగా నడిచేవాడు) లక్షణమే.

రెస్టారెంటులలో తెల్లటికాంతిలో భోజనం రుచికరంగా ఉంటుంది. ఈ కాంతికి అధిపతి చంద్రుడు అతడే ఆహార ద్రవ్యాలకు అనుభూతికి అధిపతి. ఒకేరంగు కాంతిలో ఎక్కువగా గడిపితే. దానిపాలు పెరిగి ఆరోగ్యం పాడవుతుందని ఆ పరిశోధకులు గమనించారు. అంటే ఏ కాంతైనా అవసరానికి తగిన రీతిలో ఉండాలి.

ఎరుపు కాంతి వెచ్చదనాన్ని, నీలి కాంతి చల్లదనాన్ని ఇస్తున్నాయి. అని పరిశోధకులు గుర్తించారు. కుజుని ప్రకృతి ఉష్ణతత్త్వం శనిదివాతతత్త్వం ఇన్ఫ్రారెడ్ కిరణాలు మానసిక వైద్యానికి హార్మోనుల క్రమబద్ధీకరణకు వినియోగిస్తున్నారు. వీటికి అధిపతి సూర్యుడు ఎక్స్‌కిరణాలకు ఛేదించే శక్తి అధికం. ఇవి కేన్సరును పుట్టిస్తాయి. ఎముకలలోని పగుళ్ళను గుర్తిస్తాయి. వీటికి అధిపతి కుజుడు విరిగిన ఎముకలకు పగడపు మేకులు వాడడం అత్యాధునిక వైద్యం, ఎముకలకు, అవివిరిగే ప్రమాదాలకు, పగడానికి కూడ అధిపతి కుజుడే, ఈ అంశాలన్నిటిలో విశ్వాసమే మూలకారణమైనా అనారోగ్యనివారణలో విశ్వాసమే మూలమౌతోందన్నది అధునిక వైద్యులు గుర్తిస్తున్నారు.

శరీరంలో నెప్పివచ్చినపుడల్లా మందుబిళ్ళతో, నిద్రపుచ్చితే ఆనందం అనుభవంలోనికి వచ్చినపుడు గూడా నాడీమండలం సగం నిద్ర సగం మెలుకువగానే ఉంటుంది. అందువలన సహజసిద్ధమైన ప్రక్రియలతో రోగనిరోధక శక్తిని, ఆరోగ్యాన్ని పెంపొందించుకుంటే ఆరోగ్యం ఆనందదాయమౌతుంది.

గర్భధారణ:

ఉత్తమ సంతానోత్పత్తికి అనువైన సమయాన్ని జ్యోతిశ్శాస్త్రంద్వారా గమనించవచ్చు. జ్యోతిశ్శాస్త్రంద్వారా గర్భధారణను నియంత్రించవచ్చు. 1968లో చెకొస్లోవేకియా వైద్యులు 1252 మందిపై ఈ ప్రయోగాలు చేస్తే 1224 మంది గర్భాన్ని ధరించలేదు. అక్కడే మరో వైద్యుడు మరో అడుగు ముందుకు వేసి 8000 మందికి పుత్రసంతానానికి జ్యోతిశ్శాస్త్రంద్వారా ముహూర్తాలు నిర్ణయిస్తే 95% మందికి పుత్రసంతానమే కలిగింది.

(చూ|| ఆంధ్రప్రభదినపత్రిక 3-6-1979)

**మేషం** : ఈ రాశివారికి శిరస్సు, ఉదరం, మూత్రపిండాలు, పైత్యం, నత్తి, కఫ్ర, అగ్ని మొదలైన వాని ద్వారా ఇబ్బందులు వ్రణములు చర్మసంబంధమైన అనారోగ్యాలు, జ్వరతత్త్వము కలిగే అవకాశాలున్నాయి. అండవ్యాధులు, ఉష్ణముతో గూడిన కఫము, రక్తసంబంధమైన అనారోగ్యాలు, కలిగే అవకాశం ఉంది ధ్యానం, చల్లని వాతావరణం వీరికి మంచిది భావావేశాలను అదుపులో ఉంచుకొని, కాలీఫ్లాను, గులాబి పువ్వు వాడడం మంచిది పసుపు + తేనె ఉదయానవాడాలి కందిపప్పు ఆహారంలో వాడాలి.

**వృషభం** : కంఠం, హృదయం స్వరపేటిక, మలసంబంధమైన బాధలు, అపస్మారసంబంధమైన బాధలు కలిగే అవకాశం ఉంది కఫము, టాన్సిల్స్, డిఫ్తీరియా, పైయోరియా మొదలైన అనారోగ్యాలకు గూడా అవకాశం ఉంది. గుహ్యావయవములు, మూత్రపిండములు, గొంతు, నాభి ప్రదేశములను గూడా ఆరోగ్యవంతముగా రక్షించుకోవాలి. మూత్రవ్యాధులు. కీళ్ళవాతం, రక్తక్షీణత ఉబ్బువ్యాధి కలిగే అవకాశాలున్నాయి. వ్యాయామం వీరికి తప్పనిసరి ధ్యానం, చేయడం, నేత్రనల్ప్ వాడడం మంచిది.

**మిథునం** : విశ్రాంతి లేకపోవుట, మనోవ్యధ, ఊపిరితిత్తులు, ప్రాణవాయువు, నరములకు సంబంధించిన అనారోగ్యాలు, న్యూమోనియా ప్లూరసీ, క్షయ, అండవ్యాధులు, మానసిక వ్యాధులు, నత్తి, చెముడు, తలనొప్పి, ఉన్మాదం, మొదలైన అనారోగ్యాలకు అవకాశం ఉంది. పౌష్టికమైన ఆహారం సమయానికి తీసుకోవడం, గాలి వెలుతురు సక్రమంగా ఉన్న (వాస్తు దోషాలులేని) గృహమందునివసించడం మంచిది. క్రీడలు, వ్యాయామం, ధ్యానం, కాలీమూరు వాడడం, మంచిది. శరీరారోగ్యానికి ప్రాధాన్యం ఇమ్మూ మొక్కలు వచ్చిన పెసలు తినడం మంచిది.

**కర్కాటకం** : రొమ్ము, హృదయ నాళాలు, జీర్ణకోశం, నీరుపట్టడం, నంజు, కేన్సరు, హిస్టీరియా కఫం, కీళ్ళనొప్పులు, శోష, గళగ్రంథులలో బాధ, మానసిక శారీరక బలహీనతలు, మూర్ఛ, పక్షవాతం, ఉన్మాదం, కంటికి అనారోగ్యములు, అజీర్ణం, రక్తవిరోచనములు, ఉబ్బసం, వరిబీజం, గొంతు జబ్బులు, వచ్చే అవకాశం ఉంది. వ్యాయా ~, ధ్యానం వీరికి మంచిది వీరు కాల్క్ ఫ్లోరు వాడడం మంచిది తమను గురించి ఇతరులు ఏదో అనుకుంటారనే భావన విడనాడాలి.

**సింహం** : వీపు, వెన్నెముక, హృదయం, హృదయదౌర్బల్యం, గుండెదడ, రక్తప్రకోపం, నడుము నెప్పి, కడుపునెప్పి, వండ్లనెప్పి, గుండెజబ్బు, ముఖవ్యాధులు, మూర్ఛవ్యాధి, కంటిజబ్బు, రక్తవేగముకు సంబంధించిన అనారోగ్యములకు అవకాశముంది.

తమమనుసులోనిభావాలు బహిరంగపరచడం, సూర్యనమస్కారాలు, ప్రాణాయామం, వీరి ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తాయి. అపక్వాహారం, తమపనులుతామే నిర్వహించుకోవడం ద్వారా ఏర్పడే వ్యాయామం, చేయడం, ద్వారా ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చును మేగ్‌ఫాస్ వాడడం మంచిది.

**కన్య:** పొట్ట, నాభి ప్రదేశం, వెన్నెముకకు క్రింది భాగం మలజాడ్యం అజీర్ణవిరోచనాలు, బంక విరోచనాలు, ఆంత్రశూల, అతిసారం, జీర్ణకోశవ్యాధులు వీరికి, కలిగే అవకాశం ఉంది సమయానికి మితాహారం తీసుకోవడం, వ్యాయామం, మొక్కలు వచ్చిన పెసలు తీసుకోవడం వీరి ఆరోగ్యాన్ని పరిరక్షిస్తాయి. ఆహారంలో కొవ్వు పదార్థాలు తగ్గించాలి ఆత్మ విశ్వాసం పెంచుకోవాలి. కాలీసల్ఫ్ వాడడం మంచిది.

**తుల :** ఆందోళన, మూత్రపిండములకు సంబంధించిన వ్యాధులు, మధుమేహం మూత్రనిరోధం, మలబద్ధకం, శోష, పైత్యం, శిరోసంబంధమైన అనారోగ్యాలు, గుహ్యావయవములు, మూత్రవ్యాధులు, కీళ్ళవాతం, రక్తక్షీణత, ఉబ్బువ్యాధి కలిగే అవకాశాలున్నాయి. వ్యాయామం, సమయానికి మితాహారం తీసుకోవడం, బొబ్బర్లు ఆహారంలో తీసుకోవడం మంచిది. నేట్రంఫాసు వారిలోపాలను సవరిస్తుంది. అందరూ మీరు చెప్పినట్లే వినాలి అనే భావాన్ని విడిచి పెట్టాలి యోగాసనాలు సత్ఫలితాలనిస్తాయి.

**వృశ్చికం:** గుహ్యేంద్రియములు, తొడలు, అంటువ్యాధులు, చర్మవ్యాధులు, ముఖవ్యాధులు, దురద, భగందరము, కంఠము హృదయమునకు సంబంధించిన వ్యాధులు, అండవ్యాధులు, ఉష్ణముతో గూడిన కఫము, రక్తవేగమునకు సంబంధించిన అనారోగ్యాలు, కలిగే అవకాశముంది. కందిపప్పు, పసుపు ఆహారంలో వాడడం, ధ్యానం, చల్లని వాతావరణం, వీరికి మంచివి. కాల్కేసల్ఫ్ వాడడం, ఇతరులలో తప్పులు పట్టడం మాని ప్రేమానురాగాలను పెంచుకుంటూ తప్పుచేయనివారు లోకంలో ఉండరని గుర్తించి సర్దుకోవడం అవసరం.

ధనస్సు : ప్రమాదాలకు గురికావడం, తొడలు, పిరుదులు, నరములు వీనికి సంబంధించిన అనారోగ్యాలు, వ్రణములు, గాయములు, రక్తదోషము, మొదలైన అనారోగ్యము, చర్మవ్యాధులు ఊపిరితిత్తులకు సంబంధించిన అనారోగ్యము, మధుమేహం స్థూల శరీరం వలన కలిగే ఇబ్బందులు మొదలైన వానికి అవకాశం ఉంది. వ్యాయామం, ప్రాణామం, మితాహారం, మొక్కలువచ్చిన సెనగలు, పసుపు ఆహారంలో తీసుకోవడం, అపక్వాహారం తీసుకోవడం వీరికి మంచిది. వీరికి సైలీషియా మంచి ఫలితాలను ఇస్తుంది. ఎక్కువ బాధ్యతలను తలపై వేసుకోకుండా మానసిక ప్రశాంతికోసం ఉదయం సాయంకాలం ధ్యానం అలవర్చుకోవాలి.

మకరం:- అజీర్ణం, రక్తదోషాలు, కీళ్ళవాతం, కీళ్ళనొప్పులు, చర్మవ్యాధులు, జలుబు, పైత్యం, ఉన్మాదరోగాలు, వాత సంబంధమైన అనారోగ్యాలు, మలమూత్రవ్యాధులు, చలి, జలుబు, చెవుడు, పంటి వ్యాధులు, వెన్నెముకకు సంబంధించిన రోగాలు, కేన్సరు, పక్షవాతం, మొదలైన అనారోగ్యాలకు అవకాశం ఉంది. వంటికి నువ్వులనూనె పట్టించుకోవడం, వ్యాయామం, నూపాడిఆహారంలో వాడడం, ప్రాణాయమం సూర్యనమస్కారాలు చేయడం అపక్వాహారం తీసుకోవడం వీరికి ఆరోగ్యాన్నిస్తాయి. కాల్కఫాసు వాడడం మంచిది

కుంభం: వంజావ్యాధి, కంటిజబ్బులు, నరముల బలహీనత రక్తక్షీణత, రక్తదోషం, రక్తప్రసార దోషాలు, గుండెజబ్బు బెణుకు నొప్పులు, కాళ్ళుసీలమండలు, పంటి వ్యాధులు, గుండెజబ్బు, అంటువ్యాధులు, చర్మవ్యాధులు, జలోదరం, కీళ్ళవ్యాధులు, మలేరియా, రక్తపోటు, నిద్రపట్టకపోవడం, కీళ్ళవాతం, మొదలైన అనారోగ్యాలకు అవకాశం ఉంది. వ్యాయామం, నువ్వులనూనె శరీరానికి పట్టించడం, ఆహారంలో నూపాడివాడడం, సూర్యనమస్కారాలు వీరికి ఆరోగ్యరక్షణ కల్పిస్తాయి. వీరు శ్వేటంమూరు వాడడం మంచిది. ప్రతి పవిలోను చురుకుదనం అలవరచుకోవడం ద్వారా శరీరానికి అవసరమైన శక్తిని సమకూర్చుకోగలరు.

మీనం: భావోద్రేకం, బలహీనత, వంజావ్యాధి, కీళ్ళజబ్బులు, నరముల బలహీనత, జీర్ణవ్యాధులు, పాదములు, కాలివేళ్ళు, నీరుపట్టడం, మద్యపానాదులవల్ల వచ్చే అనారోగ్యాలు. రక్తదోషం, కణుతులు, మలకోశం, ఆమకోశం, మొదలైన వాటికి సంబంధించిన అనారోగ్యాలు కలిగే అవకాశం ఉంది. వ్యాయామం ప్రాణాయామం, మితాహారం, మొక్కలు వచ్చిన సెనగలు, పసుపు ఆహారంలో తీసుకోవడం, అపక్వాహారం తీసుకోవడం వీరికి మంచిది. కవితారచన భావోద్రేకాలను అదుపు చేస్తుంది. ఫెర్రంఫాసు వీరికి మంచిది.

ప్రతివ్యక్తికీ రోగనిరోధక శక్తిని పెంచుకోవడం అత్యావశ్యకం తనకుగల లోపాలను ముందుగా గుర్తిస్తే వాటిని పరిష్కరించుకునే అవకాశాలు అధికమౌతాయి. అలా రాబోయే లోపాలను గుర్తించడానికి జ్యోతిశ్శాస్త్రం చక్కని ఉపాయాలనందిస్తోంది. వాని ప్రకారం ఆచరించి సత్ఫలితాలను సాధించడం శ్రేయస్కరం ఆనందకరం.

# జాతక భావ ఫలాదేశం

ఫలిత జ్యోతిష సంప్రదాయాన్ని అనుసరించి పూర్వక్షితిజానికి సమీపరాశిని (తూర్పున సూర్యుడు ఉదయించే ప్రదేశంలో ఆకాశం, భూమి కలిసినట్లు కనిపించే ప్రదేశాన్ని) లగ్నం అని వ్యవహరిస్తారు ఆ క్షితిజ బిందువును కలిసినట్టు కనిపించే ఖగోళీయమైన రాశిచక్రంలోని రాశి, భాగ, లిప్తలే లగ్న స్ఫుటమని వ్యవహరింప బడుతుంటాయి. అన్ని రాశులు తూర్పున క్షితిజము వద్ద ఉదయిస్తూ పైకి పయనిస్తూ ఉంటాయి. ఆలా పైకి పయనించిన రాశులు ఆకాశంలో మనకు కనిపిస్తూంటాయి. ఈ విధంగా కనిపించడానికి మూలకారణం భూమి తూర్పువైపుకు తిరుగుతూ ఉండటమే. సూర్యాది గ్రహాలు ఆలా రాశులతో సహా వెనుకకు కదలూతున్నట్లు కనిపిస్తాయి. అందు వలననే సూర్యుడు తూర్పున ఉదయించి పశ్చిమాన అస్తమిచడం మనకు కనిపిస్తోంది. సూర్యోదయ సమయంలో సూర్యస్ఫుటమే లగ్నస్ఫుటమవుతుంది. రాశి చక్రాన్ని వర్తులాకారంగా మనం దర్శిస్తూంటాము. అందుచేత ఆ రాశిచక్రంలోని ఏభాగమైనా రెండు ప్రదేశాల్లో క్షితిజం వద్ద దర్శనమీయదు. ప్రదేశ భేదాన్నిబట్టి, లగ్నస్ఫుటంలో భేదం వస్తూంటుంది. రాశికి 30 డిగ్రీలు చొప్పున 12 రాశులు 4 నిమిషాలకు ఒక డిగ్రీ చొప్పన జరుగుతుంటుంది. భూమియందలి అక్షాంశలను బట్టి రాశుల ఉదయ మానంలో గూడా భేదాలు కలుగుతుంటాయి.

భావం అనేది ఖగోళీయ పరిభాష. జాతకుడు జన్మించిన ప్రదేశం నుండి తూర్పుకు చూచినపుడు పూర్వక్షితిజము, క్రాంతి వృత్తము కలిసినట్లు కనిపించే ప్రదేశంలోని రాశి, భాగ, లిప్తలే లగ్నస్ఫుటంగా గుర్తించడం జరుగుతుంది. లగ్నస్ఫుట ప్రదేశము నుండి వెనుకకు (దశమాన్ని కలుపుకుంటూ) 180 డిగ్రీలవరకు ఆకాశంలో కనిపిస్తూంటుంది. అందుచేత ఆ భాగాన్ని దృశ్యార్ధ చక్రం అంటారు. లగ్నస్ఫుటం నుండి ఇంకను ఉదయించని భాగమైన 180 డిగ్రీలు భూమికి క్రింది భాగాన ఉండడం వలన మనకు కనిపించదు. అందుచేత లగ్నస్ఫుటం నుండి (చతుర్థభావాన్ని కలుపు కుంటూ) సప్తమస్ఫుటం వరకు 180 డిగ్రీలు అదృశ్యార్ధచక్రం క్షితిజమునకు క్రిందిభాగంలో అదృశ్యచక్రార్ధంలో 15 డిగ్రీలు కలిపి, 30 డిగ్రీలు లగ్నభావంగా గుర్తించడం జరుగుతుది.

లగ్నం పూర్తి అయిన తరువాత 30 డిగ్రీలు కలిపితే ద్వితీయభావం పూర్తి అవుతుంది. ఆలా 30 డిగ్రీలు ఒక భావం చొప్పన విభజించుకుంటూ ముందుకు సాగితే 12 భావాలు ఏర్పడతాయి. విధంగా ఏర్పడే భావాలు, రాశుల డిగ్రీలతో సమానంగా విభజింపబడవు. ఉదాహరణకు లగ్నస్ఫుటం 15 డిగ్రీలో ఉన్నపుడు మాత్రం రాశి విభజన, భావ విభజన ఏకీభవిస్తాయి. తక్కిన అన్ని

సమయాల్లోను రాశివిభజన, భావ విభజన విభేదిస్తాయి. ప్రతిరాశిలోను రెండుభావాల ప్రభావం కనిపిస్తూంటుంది. అట్టి స్థితిలో ప్రతిభావానికి రెండు రాశుల స్థానం ఉండి ఆ భావం పై రెండు గ్రహాల అధిపత్యం కలుగుతూంటుంది. ఇది లగ్నస్ఫుటాన్ని భావమధ్యంగా పరిగణించే పద్ధతి. ఒక భావంపై రెండు గ్రహాల ఆధిపత్యాని గ్రహించినట్లు ప్రాచీన గ్రంథాలలో ఆధారాలు కనిపించడం లేదు. జైమిని భావస్ఫుట పద్ధతిని స్వీకరించినట్లులేదు. అతని ఫలాదేశ మంతా రాశులను బట్టి మాత్రమే కనిపిస్తోంది. లగ్నస్ఫుటం (చివరైనా మొదలైనా) ఏరాశిలో ఉంటే అదే లగ్నంగా భావించబడింది.

పాశ్చాత్య జ్యోతిష్కులలో కొందరు లగ్నస్ఫుటం నుండి 30 డిగ్రీలు క్షితిజం యొక్క క్రింది భాగాన్ని లగ్న భావంగా గుర్తిస్తున్నారు. ఈ పద్ధతిలో లగ్నభావం ప్రారంభం నుండి షష్ఠ భావం చివరి వరకూ అదృశ్య చక్రార్థంలోనే ఉంటుంది. సప్తమభావం ప్రారంభంనుండి ద్వాదశభావం చివర వరకు దృశ్య చక్రార్థంలోనే ఉంటుంది. ఈ రెండు పద్ధతుల్లోనూ భావముల యొక్క పరిధులు విభేదిస్తూంటాయి. జ్యోతిషం కాంతులకు సంబంధించిన శాస్త్రమైనందువలన కాంతి యొక్క పరిధి రెండువైపులా సమానంగా పంచుకుంటుందని మనం ప్రత్యక్షంగా చూస్తున్నందువలన భావస్ఫుటం నుండి ఆ భావం యొక్క ప్రభావం రెండు వైపులకు సమానంగా విస్తరిస్తుంది. అనడం సహేతుకంగాను న్యాయంగాను కనిపిస్తోంది. ఫల విచారణలో కూడా భావ స్ఫుటాన్ని భావ మధ్యంగా భావించడమే సరియైన ఫలితాలనిస్తున్నట్లు పలువురు అభిప్రాయపడుతున్నారు.

దశమ స్ఫుటాన్ని గుర్తించి, లగ్నస్ఫుటానికి ఉన్న దూరాన్ని ఆరు భాగాలుగా విభజించి త్రైరాశిక పద్ధతిలో భావగణన చేసే పద్ధతిని, శ్రీపతి, కేశవుడు, నీలకంఠుడు మొదలైన పండితులు సక్రమము అయినదిగా భావిస్తున్నారు.

**ఈ పద్ధతులను విశ్లేషిస్తే 4 పద్ధతులుగా కనిపిస్తాయి**

1. లగ్నస్ఫుటమును లగ్న మధ్యంగా భావించి దానికి 15 డిగ్రీలు ముందు, 15 డిగ్రీలు వెనుక కలిపి మొత్తం 30 డిగ్రీలను లగ్న భావంగా గుర్తిస్తూ, ఒక్కొక్క భావం 30 డిగ్రీలుగా విభజించే పద్ధతిని భావమధ్యం, సమవిభజన అనే పద్ధతిగా గుర్తిస్తారు.
2. లగ్నస్ఫుటమును భావారంభంగా గుర్తించి 30 డిగ్రీలు ఒక్కొక భావము అనే పద్ధతిలో సమవిభజనచేసే పద్ధతిని భావారంభం, సమవిభజన అని గుర్తిస్తారు.
3. దశమ స్ఫుటమునకు లగ్నస్ఫుటమునకు గల మధ్యదూరాన్ని ఆరు

సమానభాగాలుగా చేసి త్రైరాశిక పద్ధతి ద్వారా భావవిభజన చేస్తూ లగ్నస్ఫూటాన్ని భావ మధ్యంగా గుర్తించే పద్ధతిని భావమధ్యం త్రైరాశిక విభజన, అని గుర్తిస్తారు.

4. లగ్నదశమాలకు మధ్య దూరాన్ని ఆరు భాగాలుగా విభజించి త్రైరాశిక పద్ధతిద్వారా భావాలను విభజించి భావస్ఫుటాన్ని భావారంభంగా గుర్తించే పద్ధతిని, భావారంభం త్రైరాశిక విభజన అనే పద్ధతిగా గుర్తిస్తారు.

ఈ విధంగా నిర్ణీతమైన భావములకు సంబంధించి శుభా శుభములను పరిశీలించడానికి కొన్ని సూత్రాలపై ఆధారపడవలసి ఉంటుంది.

1. ఏ భావ ఫలమైనా సాధించడానికి తగిన కృషి చేయడానికి లగ్నం యొక్క బలం ముఖ్యంగా పరిశీలించాలి.

2. సాధించిన ఫలితాన్ని అనుభవించగల పరిస్థితి చంద్రబలంపై ఆధారపడి యుంటుంది చంద్రుడు బలహీనుడైతే సాధించిన ఫలితాన్ని అనుభవించకపోవడంగాని, అనుభవంలో తృప్తిలేకపోవడంగాని సంభవిస్తుంది.

3. సూర్యుడు బలవంతుడైన జాతకులకు ఆ వ్యక్తి యొక్క పరోక్షంలో గూడా అందరూ అతనికి సహాకరించే ధోరణిలో ప్రవర్తిస్తారు.

4 ఏ భావమైనా భావాధిపతితోగాని, ఆ భావాధిపతికి మిత్రుడైన గ్రహంతోగాని యుతి, దృష్టులు కలిగి ఉంటే ఆ భావాకారకత్వాలు అనుకూల ఫలితం కలవి కాగలవు.

5. 6,8,12 భావధిపతులు నైసర్గిక పాపులైనా, వారున్న భావాల (స్వక్షేత్ర ఉచ్ఛక్షేత్రాలు తప్ప) ఫలితాలను, వారు చూసే భావాల ఫలితాలను తగ్గిస్తారు.

6. గురుబుధులు పాపులైనా వారి దృష్టి మంచిది.

7. 6,8,12 భావాలకు అధిపతియైన గ్రహం మరో అధిపత్యం గూడా కలిసిన సందర్భంలో ఆ మరో అధిపత్యం కేంద్ర కోణములకు (1,4,5,7,9,10) సంబంధించినదైతే ఆ దోషఫలితం బలహీనపడుతుంది. 6,8,12 భావాల అధిపతి దుర్బలుడై (శత్రుక్షేత్రస్థితి, అస్తంగతత్వం మొ.) తే అతని దుష్టఫలం బలహీనపడుతుంది.

8. 6వ భావంలో గురుస్థితి, 8వ భావంలో బుధ స్థితి 12వ భావంలో శుక్ర స్థితి (శని యొక్క రాశి నవాంశలు మకర కుంభాలు కారాదు) శుభఫలితాన్నిస్తుంది.

9. శుక్రుడు 12వ భావంలో ఉంటూ మకర, కుంభాలకు చెందిన రాశి నవాంశలలో ఉంటే జాతకుడు వ్యసనపరుడయ్యే అవకాశం ఉంది.

10. 6,8,12 భావాలలో నున్న ఇతర గ్రహాలు (చూడు 8,9 సూత్రాలు) మేలు చేయలేవు.

11. 6,8,12వ భావాలలో స్వక్షేత్రాదులలో (స్వ, ఉచ్ఛ, మిత్ర) ఉన్న వారిచ్చే శుభఫలం తక్కువ. వారివ్వదగిన దోషఫలం తగ్గుతుంది.

12. 6,8,12 భావాలకు అధిపతులు అస్తంగతులైనా, శత్రుక్షేత్రంలో ఉన్నా, శత్రుగ్రహాలతో కూడి ఉన్నా నిర్బలులై దుష్ట ఫలితాన్ని గూడా చేయలేని అసమర్థులవుతారు.

13. 6,8,12,వ భావాలకు అధిపతులు ఏ భావంలో ఉంటే ఆ భావాన్ని పాడు చేస్తారు.

14. 6,8,12వ భావాలకు అధిపతులైన గ్రహాలు ఆ భావాధిపత్యంతోపాటు, లగ్నాధిపత్యం కూడా కలిగివున్న పక్షంలో దోష ఫలితాన్నివ్వరు.

15. విశేషించి అష్టమాధిపత్యదోషం సూర్య చంద్రులకు లేదు. వీరు మారకస్థావాధిపతులైనా (2,7 స్థావాలకు అధిపతులు) మారకం చేయలేరు.

16. అశుభఫలితాన్నిచ్చే గ్రహాలు ఎన్ని శుభగ్రహాలచే చూడబడితే (వారు మిత్రులు కావడం విశేష శుభప్రదం) అంతగా వారి దుష్టఫలితాలను ఇవ్వడం మానేస్తారు. ఆ చూసే గ్రహాలను యోగ యూష్య గ్రహాలు అని పిలుస్తారు.

17. ఆయుష్కారకుడైన శని అష్టమంలో ఆయువుకు మంచివాడు.

18. భావఫలితాన్ని పరిశీలించే సందర్భంలో భావం, భావాద్భావం, భావాధిపతి, భావకారకుడు భావస్థిత గ్రహం, భావాన్ని చూసే గ్రహం, భావధిపతిని చూసేగ్రహం అనే వాటిని పరిశీలించి భావఫలాన్ని( బలాన్ని)అంచనా వేయాలి.

| భావం | భావకారకులు |
|---|---|
| 1 | రవి |
| 2 | గురుడు |
| 3 | కుజుడు |
| 4 | చంద్ర, బుధులు |
| 5 | గురుడు |
| 6 | శని, కుజులు |
| 7 | శుక్రుడు |
| 8 | శని |
| 9 | గురు, రవులు |
| 10 | గురు,బుధ,రవి,శనులు |
| 11 | గురుడు |
| 12 | శని |

20. "భావకారకుడు ఆ భావంలో ఉంటే భావాన్ని నాశనం చేస్తాడు" (కారకో భావనాశాయ) అనే సూత్రం ప్రసిద్ధమైనదే గాని ఫలితాలలో ఆ సూత్రానికి ప్రాముఖ్యం కనిపించడంలేదు.

21. 1,9 భావాలలో రవి, 12వ భావంలో శని, 5వ భావంలో గురుడు సత్ఫలితాలను ఇవ్వడం లేదు.

22. సప్తమ శుక్రుడు (భార్య ఆకర్షణీయంగా ఉంటుంది) దోషి అనే మాట ప్రచురంగా వినిపిస్తుంది. కాని, నేటి కాలంలో భార్య ఆకర్షణీయంగా ఉండడాన్ని నేటి తరం వారు అభిలషిస్తున్న కారణం వలన, సప్తమ శుక్రుడు శుభఫల ప్రదాత అని గుర్తించ వలసి ఉంది.

23. గ్రహానికి బలం నిర్ణయించడానికి షష్ట్యంశ అతి ముఖ్యమైనది.

24. ఉచ్చ నీచల్లో ఉన్న గ్రహాలకు షష్ట్యంశ చూడకుండా ఫలనిర్ణయం చేయరాదు. శుభ షష్ట్యంశలో ఉన్న గ్రహం శుభుడైనా, పాపియైనా ఉచ్చలో ఉన్నా, నీచలోఉన్నా మేలే చేస్తున్నాడు.

పాప షష్ట్యంశలో ఉన్న గ్రహం, ఆధిపత్య, నైసర్గిక శుభుడై మేలు చేసినా అది జాతకునకు ఆనందప్రదం కావడం లేదు.

25. ముఖసౌందర్యం, వాక్ సౌష్ఠవం, విద్యాప్రకటనా శక్తి, వినయం మొదలైన ప్రవర్తనా పద్ధతులవలన వచ్చే గౌరవం ద్వితీయంలోను, అధికారం, కృషిశీలత, మొదలైనవాని ద్వారా వచ్చే గౌరవం దశమంలోను పరిశీలించాలి.

26. జీవితానంతర కీర్తిని వ్యయస్థానం ద్వారా పరిశీలించాలి.

27. ధనవృద్ధి, ఆదాయం, వృత్తి మొదలైన భావఫలాలను పరిశీలించే సందర్భంలో లగ్నబలాన్ని గూడా పరిశీలించి ఫల నిర్ణయం చేయాలి

28. లగ్నం బలహీనమైనపుడు తానుగా సాధించలేని శుభఫలితాలను, తృతీయం బలంగా ఉంటే ఇతరుల సహకారం వలన పొందుతాడు.

29. జన్మ కుండలి శారీరకమైన కృషిశీలతను సూచిస్తుంది.

30. చంద్రకుండలి వ్యక్తి యొక్క ఆలోచనా శక్తిని సూచిస్తుంది.

31. రవి కుండలి (రవి ఉన్న స్థానాన్ని లగ్నంగా భావించి ఫలితాలను నిర్దేశించే పద్ధతి) జీవితంలో జరిగే ముఖ్య సంఘటనలను (స్వయంకృషి ప్రాముఖ్యంలేని సంఘటనలు) సూచిస్తుంది. ఈ కుండలి ద్వారా ఫలితాలు చెప్పే సందర్భంలో రవి స్ఫుటాన్ని అనుసరించి దశాశేషం కట్టి ఆ దశలకే ఫలితాలను చెప్పవలసి ఉంటుంది.

32. చలిత కుండలి (భావ చక్రం) లో భావ మధ్యానికి సమీపంలో ఉన్న గ్రహం సంపూర్ణ ఫలితం ఇస్తాడు. భావ మధ్యానికి దూరం అయిన కొలదీ త్రైరాశిక పద్ధతిలో బలాన్ని తగ్గించాలి.

33. నవాంశ కుండలి అనుభవించే సంపదను, సుఖాలను, వ్యక్తీకరిస్తుంది. నవాంశ కుండలి నవాంశ లగ్నానికి ఎన్నవ స్థానంలో గ్రహం ఉన్నాడు? ఏ గ్రహాన్ని చూస్తున్నాడు? అనే విషయాల్ని పరిశీలించడం న్యాయం కాదు. నవాంశ చక్రంలో మిత్ర, స్వ ఉచ్చాది నవాంశంలో ఉన్న గ్రహం మంచి ఫలితాన్ని ఇస్తుంది అనీ శత్రు నవాంశలలో ఉన్న గ్రహం దుష్ట ఫలితాల్ని ఇస్తుందనీ గుర్తించాలి.

34. షోడశ వర్గుల ద్వారా గ్రహం యొక్క బలాన్ని నిర్ణయించవచ్చు. షడ్బలాలలో మొదటిదైన స్థానబలంలో భాగమే షోడశవర్గు.

35. గోచారం చూసే సందర్భంలో రవిగోచారం జరగబోయే సంఘటనలను

సూచిస్తుంది చంద్రగోచారం మానసిక వికాసాన్ని వ్యాకులతను నిర్దేశిస్తుంది.

36. సుదర్శన చక్ర పద్ధతిలో గోచారాన్ని గమనించడం మంచిది జననాది 12 సంవత్సరాల వరకు 12 భావాలను క్రమంగా గోచార లగ్నంగా భావించాలి. 13 వ సంవత్సరం నుండి 24 సంవత్సరం వరకు చంద్రరాశి నుండి క్రమంగా 12 రాశులను గోచార లగ్నంగా భావించాలి. 25వ సంవత్సరం నుండి 36వ సంవత్సరం వరకు సూర్యుడున్న రాశి నుండి 12 రాశులను గోచార లగ్నాలుగా భావించి గోచారం చూడాలి. ఇదే వరుస పునరావృత్తం అయ్యే పద్ధతిని సుదర్శన చక్రపద్ధతి అంటారు.

37. అష్టకవర్గం లేకుండా దశా ఫలాలను, నిర్ణయించరాదని పృథుయశస్సు (వరాహ మిహిరుని కుమారుడు) చెప్పాడు. ప్రస్తుతం నడచే మహాదశాధిపతి మరియు అంతర్దశాధిపతి ఏయే భావాలలో 4 బిందువుల కంటే అధికంగా ఇచ్చారో అయా భావాలకు పుష్టిని, 4 కంటె తక్కువ బిందువులను ఇచ్చిన భావ కారకత్వాలకు అశుభ ఫలితాన్ని ఇస్తారు. ఈ విధంగా భావములకు సంబంధించిన శుభాశుభములను నిర్ణయించడానికి ఉపయోగించే అష్టక వర్గును భావచక్రం ఆధారంగా చేసుకుని వేయడం మంచిదని అనుభవంలో తేలుతోంది.

38. రాశిచక్రం ఆధారంగా చేసుకుని వేసిన అష్టక వర్గు గోచార ఫలాలను చూడటానికి బాగా ఉపకరిస్తుంది. ఏ రాశిలో ఎక్కువ బిందువులను ఇచ్చాడో ఆ రాశిలో గ్రహం గోచారం రీత్యా సంచరించే కాలంలో శుభ ఫలితాలను ఇస్తాడు. తక్కువ బిందువులిచ్చిన రాశిలో సంచరించే కాలంలో శుభ ఫలితాలను ఇవ్వలేడు.

39. కక్ష్యా క్రమాన్ని అనుసరించి గోచార ఫలితాలను పరిశీలించే పద్ధతిని మిక్కిలి సూక్ష్మమైనదిగా భావించవచ్చు. ఉదాహరణకు

ప్రతి రాశిలోను 1 డిగ్రీ నుండి 3 డిగ్రీలు 45 ని.ల వరకు శని కక్ష్య

3డి. 45ని.ల నుండి 7 డిగ్రీల 30 ని.ల. వరకు గురుకక్ష్య

7 డిగ్రీల 30ని.ల నుండి 11 - డిగ్రీల 15 ని.ల వరకు కుజ కక్ష్య

11 డి. 15 ని.ల నుండి 15 డిగ్రీల వరకు రవి కక్ష్య

15డి. నుండి 18 డిగ్రీల 45ని.ల వరకు శుక్ర కక్ష్య

18డి 45 ని ల నుండి 22 డి. 30 ని.ల వరకు బుధ కక్ష్య

22 డి 30 ని.ల నుండి 26 డి. 15 ని.ల వరకు చంద్ర కక్ష్య

26 డి. 15 ని.ల నుండి 30 డి. వరకు లగ్న కక్ష్య

అష్టక వర్గ రీత్యా ఒక రాశిలో నున్న బిందువులు, 'ఏయే గ్రహాలచే ఇవ్వబడినవో గుర్తి ఆయాడిగ్రీలలో గ్రహం సంచరించే కాలంలో శుభఫలితాన్ని, బిందువు లేని కక్ష్యలో సంచరి కాలంలో అశుభ ఫలితాన్ని ఇస్తాయి అని గుర్తించవచ్చు.

ఉదా. గుర్వష్టక వర్గులో మేషరాశిలో శని బిందువు ఇవ్వని సందర్భంలో 1 డిగ్రీ నుండి డిగ్రీల 45 ని.ల వరకు గురుడు సంచరించే కాలంలో గురుడు మేలు చేయలేదు. దుష్టఫలితాన్నిస్తా ఆ దుష్టఫలితాలు గురుశనికారకత్వాలపై ఆధారపడి ఉంటాయి.

40. జన్మకాల గ్రహస్థితిని పరిశీలించే సందర్భంలో బిందువున్న కక్ష్యలో నున్న గ్రహం శ్ర సత్ఫలితాన్నిస్తుంది. బిందువులేని చోట నివసించే గ్రహం శ్రమకు తగిన ఫలితాన్నివ్వదు.

41. కేంద్రాధిపతి తానిచ్చే ఫలితాన్ని ఘర్షణ ద్వారా ఇస్తాడు అంటే అతడిచ్చే శుభఫలిత సాధించడానికి విశేషమైన పరిశ్రమ చేయాలి.

42. నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యం మంచిది కాదు, కేంద్రస్థితి మంచిది.

43. నైసర్గిక పాపులకు కేంద్రాధిపత్యం మంచిది, కేంద్ర స్థితి గూడ మంచిదే గాని ఉపచయ (3,6,10,11) మిక్కిలి మంచిది.

44. నైసర్గిక శుభులకు కోణాధిపత్యం, కోణస్థితి మంచివే.

45. నైసర్గిక పాపులకు కోణ స్థితి మంచిది కాదు.

46. కేంద్రం క్రియకు, కోణం భావనకు సంకేతాలు. మంచి భావంతో చేసే చెడ్డపని చెడ్డదికా చెడ్డ భావంతో చేసే మంచి పని, మంచి పని కాదు. కాగా మంచి భావంలో (కోణ నైసర్గిక శుభులు) చేసిన చెడ్డపని (కేంద్రాలలో పాపగ్రహాలు) మేలును చేస్తుంది. చెడ్డభావ (కోణాల్లో పాపగ్రహాలు) చేసే మంచి పని (కేంద్రాలలో శుభగ్రహాలు) మంచి ఫలితాన్నివ్వలే ఏ పని ఎలాంటిదైనా (కేంద్రాల్లో శుభులున్నా పాపులున్నా భావం మాత్రం మంచిది (కోణ శుభ గ్రహాలు) కావాలి.

47. గురుశుక్రులు మారకాధిపతులైనా లేక మారక స్థానాల్లో ఉన్న (2,7 భావాలు మారక స్థానాలు) విశేష మారకులౌతారు.

48. ఏ భావానికి శుభార్గళ (ఆభావానికి 2,12 స్థానాల్లో శుభగ్రహాలు ఉండడాన్ని శుభార్గళ అంటారు). పట్టిందో ఆ భావ ఫలాలు పరిపుష్టం అవుతాయి.

ఉదాహరణకు: 5,7,9 స్థానాల్లో శుభులుంటే ఆ భావాలకు సంబంధించిన మేలు జరగడంతో బాటు ఆ శుభులున్న రాశులకు మధ్య నున్న 6,8 రాశులకు సంబంధించిన ఫలితాలుకూడా శుభ ఫలితాలే అవుతాయి.

49. ఏ భావానికి పాపార్గళ పట్టిందో ఆ భావానికి అశుభ ఫలితాలు సిద్ధిస్తాయి.

50. ఆధిపత్య శుభగ్రహం వక్రిస్తే విశేష శుభఫలం, అశుభగ్రహం వక్రిస్తే అధిక దోష ఫలం సిద్ధిస్తుంది. ఉచ్ఛలో ఉన్న గ్రహం వక్రిస్తే నీచ ఫలం, నీచలో ఉన్న గ్రహం వక్రిస్తే ఉచ్ఛఫలం ఇస్తాయి అనే సూత్రం సార్వత్రికంగా సత్యం కావడంలేదు. అక్కడ కూడా ఆ గ్రహం శుభఫలదాయి అయితే అధిక శుభం దుష్టఫలదాయి అయినపుడు అధిక దుష్ట ఫలం చెప్పవలసి ఉంటుంది.

51. లగ్న స్ఫుటం నుండి 22వ ద్రేక్కాణం 64వ నవాంశ అష్టమ భావంలోనికి వస్తాయి. వాటికి అధిపతులను అనుసరించి మరణకారణాన్ని, అనారోగ్యాన్ని ఊహించవచ్చు ఆ గ్రహాలకు చెందిన దశాంతర్దశలు దుష్టఫలితాలనిస్తాయి.

52. ఛిద్ర గ్రహాలు:

1) అష్టమాధిపతి 2) అష్టమభావ స్థిత గ్రహం, 3) అష్టమాన్ని చూసే గ్రహం 4) 22వ ద్రేక్కాణాధిపతి, 5) 64వ నవాంశాధిపతి (లగ్నంనుండి, చంద్రుని నుండి ద్రేక్కాణ నవాంశాధిపతులను పరిశీలించాలి) 6) అష్టమాధిపతితో కలిసిన గ్రహం, 7) అష్టమేశుని అతి శత్రువు.

వీరిని ఛిద్ర గ్రహాలంటారు. వీటి మహాదశలలో అంతర్దశలలో ధననష్టం, ఆరోగ్యనష్టం గ [illegible]గంగం, గండాలు మొదలైన దుష్ట ఫలితాలు సంభవిస్తాయి.

53. 6,8,11,12, స్థానాధిపతుల దశలలో కష్టఫలితాలు సంభవిస్తాయి.

54. అంగ భంగం వికలాంగత 1,6,12 స్థానాలను బట్టి పరిశీలించాలి.

55. లగ్నంగా భావించి పరిశీలించవలసిన భావాలు:

1. లగ్నం 2. చంద్రలగ్నం 3. రవిఉన్న రాశి 4. మహా దశాధిపతియున్న రాశి (ఆదశా ఫలం చూసే సందర్భంలో) 5. ఆరూఢ లగ్నం 6. ఉపపదం 7. కారకాంశ లగ్నం 8. పరిశీలించేభావం 9. భావాధిపతి ఉన్న రాశి 10. భావకారకుడున్న రాశి 11. రాశి దశలను పరిశీలించే సందర్భంలో ఏ రాశి నడుస్తోందో ఆ రాశి.

అవే హానివి ఆ యా సందర్భాలలో లగ్నాలుగా పరిగణించవలసి ఉంటుంది.

56. మహాదశా నాధునికి అంతర్దశా నాధునికి గోచారంలో ద్విర్ద్వాదశం గాని, షష్ఠాష్టకం గాని ఏర్పడిన సమయంలో సత్ఫలితాలు సిద్ధించవు.

57. జన్మ కాల దశ నుండి 3,5,7, దశలు శుభ ఫలితాల నీయవు 7వ దశను వైధనతారా దశగా ఆయుర్విషయంలో జాగ్రత్తగా పరిశీలించాలి.

58. జన్మ నక్షత్రం నుండి 3,5,7 తారలలో గోచారరీత్యా సంచరించే గ్రహం మేలు చేయదు.

59. స్థాన బలం:

ఉచ్ఛ, స్వక్షేత్ర, మిత్ర క్షేత్ర, మూల త్రికోణ, స్వనవాంశ, స్వహోర, స్వవార, స్వద్రేక్కాణ ములలో ఉంటే స్థానబలం సిద్ధిస్తుంది. చంద్రుడు, శుక్రుడు సమరాసులలోను, ఇతరగ్రహాలు విషమరాశులలోను ఉండగా స్థానబలం సిద్ధిస్తుంది రవి: ఉచ్ఛ స్వక్షేత్రమిత్రక్షేత్ర ములందుండి, స్వద్రేక్కాణ, స్వహోరా స్వవార (ఆదివారం) స్వనవాంశ, ఉత్తరాయణ, మధ్యాహ్నకాలాలలోను, రాత్రి మొదటి జాములోను మిత్రాది నవాంశలలోను ఉన్నచో రవి స్థానబలం కలవాడగును.

60. జన్మరాశి నుండి జన్మ లగ్నాత్తు, తృతీయాధిపతి దశ, అష్టమరాశ్యధిపతి ఉన్న భావాధిపతి దశలో, అష్టమస్థిత గ్రహదశ, శని దశ, అష్టమరాశిని చూసేవానిదశ, 22వ ద్రేక్కాణాధిపతి దశ, దుర్బల గ్రహంతో కూడిన రాహువు దుస్థాన స్థితుడైతే వానిదశ, మాంది గ్రహాలు ఉన్న రాశ్యధిపతి దశ యోగించవు.

61. లగ్నాధిపతి ఏ భావంలో ఉంటే ఆ భావం అభివృద్ధి చెందుతుంది.

62. లగ్నాధిపతితో చేరిన గ్రహాలు ఏ భావానికి ఆధిపత్యం వహిస్తాయో ఆ భావం అభివృద్ధి చెందుతుంది.

63. లగ్నాధిపతిచే చూడబడు భావములు లగ్నాధిపతి ప్రభావానికి లోబడి ఉంటాయి.

64. సప్తమంలో నీచగ్రహం మంచిది కాదు. వృషభానికి సప్తమ గురుడు మంచివాడు కాదు.

65. ద్విస్వభావరాశి సప్తమమై అందు పాపగ్రహాలు - చంద్రగ్రహం ఉంటే సప్తమానికి అపకారం చేస్తాయి. విశేషించి మీనరాశిలో (సప్తమంలో) చంద్రుడు మొదలైన గ్రహాలతో పాపగ్రహం కలిస్తే సప్తమం చెడిపోతుంది. (మీనరాశి దుర్బల రాశి)

66. రక్షణ రెండు విధాలు. శుభగ్రహ దృష్టి రక్షిస్తుంది. 1) వ్యసనాలు లేకుండా గురు దృష్టి రక్షిస్తుంది. 2) వ్యసనయుక్తునికి శిక్ష లేకుండా శుక్ర రక్షణ లభించవచ్చు.

67. కర్కాటకంలో చంద్ర గురుల యుతి మంచిది.

68. శని యోగించవలసిన దాంట్లో 90 శాతమే యోగిస్తాడు.

69. లగ్నాధిపతి దుస్థానంలో ఉండకూడదు.

70. లగ్నాధిపతి సహజ పాపియైనా తానున్న భావానికి మేలు చేస్తాడు.

71. మేష లగ్నానికి సింహంలో కుజుడుంటే లేదా వృశ్చిక లగ్నానికి మీనంలో కుజుడుంటే శీఘ్ర పుత్రోత్సాహం.

72. బుధుడు, అస్తంగతుడైనా, నీచుడైనా సద్యస్ఫురణ ఉండదు. సమయస్ఫూర్తి లోపిస్తుంది.

73. ఆయా మూహుర్త విషయాల్లో ఆయా భావాలు గ్రహ రహితంగా ఉండడాన్ని శుద్ధి అంటారు. గృహప్రవేశానికి 12వ స్థానం, అన్న ప్రాశనకు 10వ స్థానంలో ఏ గ్రహం ఉండరాదు. చౌలమునకు 9, ఉపనయనమునకు 8, వివాహానికి 7. నూతన వస్త్రధారణకు 6, ప్రయాణమునకు 5, విద్యారంభమునకు 4, ఔషధ సేవకు 3, నామకరణమునకు 2, ధన సంగ్రహమునకు 2, గర్భధానమునకు 1 భావములు గ్రహ రహితములై శుద్ధిగా ఉండాలి.

74. ఏ వస్తువునైనా అమ్ముటకు పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, కృత్తిక, ఆశ్లేష భరణి, మంచి నక్షత్రములు.

75. ఏ వస్తువులైనమా కొనుటకు అశ్విని, స్వాతి, చిత్త, శ్రవణం, శతభిషం, రేవతి మంచి నక్షత్రములు.

76. చేతినుండి వెళ్ళిన, పోయిన ధనము తిరిగిరాని నక్షత్రములు, ఇంటి నుండి వెళ్ళిన వ్యక్తులకు గూడ ఈ నక్షత్రాలు మంచివి కావు. అనగా ఈ నక్షత్రాలలో ఇల్లు విడచి వెళ్లిన వారు తిరిగి రావటానికి ఇష్టపడరు. ఇతరుల కృషి అధికంగా అవసరమవుతుంది. అవి అర్థం చేసుకోవాలి. ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, రోహిణి, కృత్తిక, మఘ, ఆర్ద్ర, భరణి, ఆశ్లేష, మూల.

77. రోహిణి, పుష్యమి, ఉత్తర, విశాఖ, పూర్వాషాఢ, శతభిషం, అశ్విని అనే ఆరు నక్షత్రాలు అంధ నక్షత్రాలు అంటారు. ఈ నక్షత్రాలలో పోయిన వస్తువులు తూర్పు దిక్కున సులభంగా లభిస్తాయి.

78. మృగశిర, ఆశ్రేష, హస్త, అనూరాధ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర, భరణి. ఈ నక్షత్రములలో పోయిన వస్తువులు దక్షిణ దిక్కున అతి ప్రయత్నం పై లభిస్తాయి.

80. ఆర్ద్ర, మఘ, చిత్త, జ్యేష్ఠ, శ్రవణం, ఉత్తరాభాద్ర, కృత్తిక, అనే 7 నక్షత్రాలు చిబిట నక్షత్రాలు అని అంటారు. ఈ నక్షత్రాలలో పోయిన వస్తువులు పశ్చిమ దిక్కున ఉండే అవకాశం ఉంది గాని దొరకటం కష్టం.

81. పునర్వసు, పుబ్బ స్వాతి మూల, ధనిష్ఠ, రేవతి అనే నక్షత్రాలను సులోచన నక్షత్రాలు అంటారు. ఈ నక్షత్రాలలో పోయిన వస్తువులు ఉత్తరాన ఉండే అవకాశం, ఉంది కాని దొరకటం కష్టం.

82. అరిష్ట దశలు: అశ్విని, మఘ, మూల నక్షత్రాల వారికి 5వది అగు కుజ దశ దోషప్రదమైంది భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్రాలవారికి 6 వది యగు గురుదశ దోషప్రదమైంది. కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రాల వారికి 4 వది యైన రాహుదశ దోష ప్రదమైంది. మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రాల వారికి 4వది యైన శనిదశ దోష ప్రదమైంది.

83. బాలారిష్టాలు:

8వ స్థానంలో చంద్రుడు, 7 వస్థానంలో కుజుడు, 9వ స్థానంలో రాహువు, 1వ స్థానంలో

శని, 3వ స్థానంలో గురుడు, 5,2 స్థానాల్లో రవి, 6 వస్థానంలో శుక్రుడు, 4,12 స్థానాల్లో బుధుడు బాలారిష్టాలను కల్పిస్తారు. ఈ గ్రహాలకు చెందినమహా దశ జననకాలానికి పడడం మంచిది కాదు.

84. గోచారంలో: రవి - 3,6,10,11 భావాల్లో శుభుడు, చంద్రుడు 1,3,6,7,10,11 భావాల్లోను, కుజుడు 3,6,11 స్థానాల్లోను, బుధుడు 2,4,6,11 స్థానాల్లోను, గురుడు 2,5,7,9,11 స్థానాల్లోను, శుక్రుడు 1,2,4,5,8,11 స్థానాల్లోను, శని 3,6,11, స్థానాల్లోను శుభప్రదులౌతారు.

85. గురుడు 5 స్థానాలలోను, చంద్రుడు 6 స్థానాలలోను, శుక్రుడు 7 స్థానాలలోను మేలు చేస్తున్నారు. తక్కినవారు 4 గాని అంతకంటె తక్కువ గాని స్థానాల్లోనే శుభ ప్రదులౌతున్నారు. కాగా శుక్ర, చంద్ర, గురులు నైసర్గిక శుభులౌతున్నారు.

86. సమస్తకార్యాలకు: మఘ, మృగశిర, హస్త, స్వాతి, మూల, అనురాధ, రోహిణి, రేవతి, ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, అశ్విని, చిత్ర, ధనిష్ఠ, శ్రవణం, అనే నక్షత్రాలు మేలును చేస్తాయి. ఈ నక్షత్రాలలో ఏ కార్యాలనైనా తన తారాబలం చూసుకొని ప్రారంభించవచ్చు.

87. నీటికి సంబంధించిన పనులకు ఉత్తమ మైన నక్షత్రాలు అనూరాధ, హస్త, రోహిణి, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, ధనిష్ఠ శతభిషం, పూర్వాషాఢ, రేవతి, పుష్యమి, మృగశిర.

88. ఏ భావాధిపతి శత్రుక్షేత్రంలో లేదా శత్రునవాంశలో ఉంటే ఆ భావ సంబంధ విషయంలో శత్రుత్వం ఉంటుంది.

89. ఉపచయాలలో (3,6,10,11) గ్రహాలు లేకుంటే అభివృద్ధి ఉండదు.

90. రవి, బుధ, శనులకు నీచ సంభవిస్తే మానసికమైన చీకాకులు ఎక్కువగా ఉంటాయి. కారణం అవి వాని స్వభావానికి విరుద్ధమైన క్షేత్రాలు. తక్కిన గ్రహాలు ఉచ్చ ఆదర్శాన్ని నీచస్వార్థభావనను పెంచుతాయి.

91. నైసర్గిక పాపి, లగ్నాధిపత్యం పొంది లగ్నంలో ఉన్నా కేంద్రాధిపత్యం కలిగినా, శుభాన్నే చేస్తాడు.

92. ఎక్కువ గ్రహాలు కేంద్రాలలో ఉంటే ఆ జాతకుని కృషిశీలత పెరుగుతుంది. కోణాలలో శుభగ్రహాలుంటే ---ని భావంలో ఉంటాడు.

93. శుభగ్రహానికి చెందిన మహా దశలో చివరిగా వచ్చిన పాపగ్రహ దశ రాణించదు ఉదా గురు మహా దశ - రాహు అంతర్దశ

94. పాపియైన శుక్రుడు అభివృద్ధినిచ్చి పతనం చేస్తాడు లేదా మారకం చేస్తాడు.

95. శుక్రుడు అర్హత లేని వాడిని కూడా అందల మెక్కిస్తాడు.

96. మేష లగ్న జాతకులకు ధనాధిపతి యైన శుక్రుడు వ్యయమందు (ఉచ్చలో) ఉన్నపుడు కూడా, అభివృద్ధినే ఇస్తాడు.

97. మేషలగ్నానికి పంచమంలో ఉన్న కుజుడు యోగ్యప్రదుడు.

98. వృషభలగ్నానికి నవమ, దశమాధిపతియైన శని, రవి, బుధులలో ఏ ఒక్కని తోనైనా కలిస్తేనే బాగా యోగిస్తాడు.

99. గురు, బుధులు, శుక్రుడు లగ్నంలో ఉంటే సౌమ్యత ఉంటుంది.

100. వృషభలగ్నానికి అష్టమంలో కుజుడుంటే జాతకుని భార్యకు ధనలాభం, జాతకునికి అనారోగ్యం.

101. సింహ, తుల, వృషభ, కుంభాలలో రాహువు మేలు చేస్తాడు.

102. రెండు గ్రహాలకు మధ్యనున్న గ్రహం ఆ రెండు గ్రహాల ఫలితాలను ఏకం చేసి ప్రసాదిస్తుంది.

103. శని, బుధులు కర్కాటకంలో ఉంటే ఏ లగ్నజాతకులకైనా సాంసారిక సుఖం లోపిస్తుంది.

104. బుధుడొక్కడు కర్కాటక రాశిలో గాని, కర్కాటక నవాంశలో గాని ఉంటే సాంసారిక సుఖం లోపిస్తుంది.

105. తాజక దృష్టులు:

5 - 9 ప్రత్యక్ష స్నేహ దృష్టులు మంచివి
4 - 10 గుప్తారి దృష్టి అధిక దోషకారి, 1 - 7 ప్రత్యక్ష వైర దృష్టి సత్య సిద్ధి లభిస్తుంది.
3 - 11 గుప్త స్నేహ దృష్టి - మంచిది.

106. కేంద్ర దృష్టులు లేకుండా అన్నీ కోణ దృష్టులుంటే సోమరి అవుతాడు. కృషిశీలత లోపిస్తుంది.

107. షష్ఠంలోని శుభగ్రహం పాప దృష్టి షష్ఠంలోని పాపగ్రహం శుభదృష్టి మిశ్రమంగా **ఉంటాయి.**

108. ఒక జాతకంలో మహా దశ అధిపతి నుండి వ్యయంలో ఉన్న రవి యొక్క అంతర్దశ**లో** రవి దావాగ్ని షష్ట్యంశలో ఉండగా ఇన్‌కంటాక్స్ రైడింగ్ జరిగింది.

109. వృశ్చిక కేతువు, కుంభ కేతువు, మేష కేతువు యోగిస్తారు.

110. హృద్రోగ మరణాల్లో 75 శాతం సోమవారం ఉదయం సంభవించినవే.
చంద్రుడు మనః కారకుడు కదా! (24.3.91 ఆదివారం ప్రత్యేక సంచిక)

111. వశిష్ఠ సంహిత ఫలాలు భవిష్యత్తుకు
గర్గ సంహిత ఫలాలు భూతకాలానికి,
జైమిని ఫలాలు వర్తమాన కాలానికి ఉపకరిస్తాయి అని సత్యనాడి.

112. చంద్రబలం: జన్మరాశి నుండి 1,3,6,7,10,11 స్థానాల్లో గోచార వశాత్తు చంద్రుడు సంచరించే కాలం శుభప్రదమైనది. శుక్ల పక్షంలో 2,5,9 రాసులు కూడా మంచివే. కృష్ణ పక్షంలో 4,8,12 స్థానాలు కూడా మంచివే.

# శకునం - హేతుబద్ధత

శకునం గురించి లోకంలో పలు విధాల అభిప్రాయాలు ఉన్నాయి. శకునం మూఢనమ్మకం అనే కొందరు, సూచకం అని మరికొందరు విశ్వసిస్తారు. ఒక దేశంలో శుభసూచకం మరోదేశంలో అశుభసూచకంగా ఉండడం గూడ ఉంది కాబట్టి విశ్వసనీయం కాదని మరికొందరు వాదిస్తారు. కొందరు దుష్టశకునం చూడగానే తిట్టుకుంటారు. తమకు పనికాకపోవడానికి శకునమే కారణమని భావిస్తారు. శకునం సూచకమే కాని కారణంకాదు శకునాన్ని తిట్టడం మరణవార్త తీసుకువచ్చిన టెలిగ్రాం బంట్రోతునో, ఉత్తరాల బంట్రోతునో తిట్టడంలాంటిది. ఆ వ్యక్తిని తిడితే ఉత్తరమో, టెలిగ్రామో ఆ వ్యక్తికి తిరిగిచ్చేస్తే మరణించిన వ్యక్తి తిరిగి బ్రతుకుతాడా? శకునాలు సూచిస్తాయనే అభిప్రాయంలో మనల్ని హెచ్చరించి మనకి మేలే చేస్తాయన్నమాట కాగా శకునాన్ని తిట్టుకునే ధోరణి సరికాదు. ఆ భావన సర్వవర్గాల వారు ఖండించదగినదే.

ఒక దేశంలో శుభసూచకం మరొకదేశంలో అశుభసూచకమయినపుడు వీరి దృష్టిలో వారి అభిప్రాయం వారి దృష్టిలో వీరి అభిప్రాయం అసత్యాలే కాబట్టి రెండూ అసత్యాలే అని మరో వాదన. అలాగే శకునం మూఢ విశ్వాసం అనేవారి దృష్టిలో శకునం వాస్తవసూచకం అనే వారి భావం అసత్యం శకునం వాస్తవసూచకం అనేవారి దృష్టిలో శకునం మూఢవిశ్వాసం, అనేవారి విశ్వాసం అసత్యం. కాబట్టి రెండు అసత్యాలే అని మరో వాదన, పై రెండు భావాలను ఒక పద్ధతి ప్రకారం విశ్లేషించ వలసిన అవసరం ఉంది.

మనస్సుకు అపరిమితమైన శక్తి ఉంది. మనస్సుకున్న శక్తులలో మనం వినియోగంలో పెట్టుకునే శక్తులు 10 శాతం మాత్రమే అనేది ఆధునిక వైజ్ఞానికులందరూ విశ్వసించే సత్యమే. మనస్సుకున్న శక్తులలో జరగబోయే సంఘటనలు స్ఫురించడం గూడా ఒక భాగమే అన్నది పేరాసైకాలజీ పరిశోధకులు అంగీకరిస్తున్న వాస్తవం. మన మనస్సును పరిశీలించినా, మన జీవితంలోని సంఘటనలను పరిశీలించినా ఈ విషయంలోని వాస్తవికతను మనం గుర్తించవచ్చు, అతిసామాన్య పౌరుడుకూడా జరగబోయే సంఘటనలను ముందుగా గుర్తించడం అనే అనుభవాన్ని గమనించవచ్చు. అయితే మనకు స్ఫురించిన ప్రతి అంశం వాస్తవంగా జరిగేదే అనే నిర్ణయంలేదు.

మనకున్న మానసిక శక్తిని సక్రమసాధనతో సాత్వికస్థితితో పెంపొందించుకొనే అవకాశం ఉంది. ఆ సాధనకు విశ్వాసం అతి ముఖ్యమైనది. ఆ విశ్వాసం ఏ కోణంలో ఉంటే ఆ కోణంలో

శక్తిని విస్తృత పరచుకొనే అవకాశం ఉంటుంది. ఈ శక్తిని విస్తృతంచేసుకొనే సాధనలో ఆధారం అనేది కాదా ముఖ్యమైనదే. మన మనస్సు ఏకాగ్రంకావడానికి ఒక వస్తువు ఆధారంగా ఉండాలి. ఏ వస్తువు ఆధారంగా లేకుండా మన మనస్సు ఏకాగ్రం కావడం క్లిష్టమైన వ్యవహారం. ఆ ఆలోచనను దృష్టిలో పెట్టుకొని పైభావాలను పరిశీలిద్దాం.

కొందరు పిల్లిశకునం మంచిదనే అభిప్రాయంతో ఆ సాధన ప్రారంభించారు వారు శుభఫలితాన్ని గుర్తించారు మరికొందరు పిల్లిశకునం చెడ్డదని భావించి సాధన ప్రారంభించారు వారు అశుభఫలితాన్ని గుర్తించారు. ఈ రెండు వర్గాలలోనూ భావి శుభాశుభాలను గుర్తించింది వారి మనస్సే కాని, పిల్లికాదు. పిల్లి ఒక ఆధారం మాత్రమే. మనస్సు సూచనను గుర్తించడానికి ఆధారంగా, ఏ వస్తువును పరిగణించారు అనే దానిపై విచారణ చేసే కంటే, మనస్సుయొక్క సూచనను గుర్తించడం ద్వారా ప్రయోజనాన్ని సాధించడం అనేది ముఖ్యమైనది. మనం పనిపై బయలుదేరే సందర్భంలో మన మానసిక స్థితి ఆహ్లాదకరంగా ఉందా? శంక, భయం, అనుమానం అనే భావాలు పొందుతోందా? అనే విచారణ ముఖ్యమైనది. అందుకే "మనోజయంతు మాండవ్యః" అన్నారు పెద్దలు. మనదేశంలో మంచి శకునాల జాబితాలో ఈ సమాజం ఏయే వస్తువులను ఆహ్లాదకరాలుగా భావించిందో, ఆ వస్తువులుంటాయి. మరోదేశంలో మరోప్రజలు మరోవిధంగా భావించవచ్చు. ఆ సమాజానికి ఏ వస్తువులు ఆహ్లాదకరాలుగా ఉన్నాయో అవి వారికి సుశకునాలే అవుతాయి, ఈ సుశకున, దుష్టశకునాల్లో వస్తువుకు ప్రాముఖ్యం అనటంకంటే అప్పటి మానసిక స్థితికి ప్రాముఖ్యం అనడం సమంజసం. ఆ మనస్సుయొక్కస్థితిని, ఆమనస్సుచేసే భావిసూచనను గుర్తించడం అలవాటుచేస్తే సాత్వికస్థితిని సంపాదిస్తే ఆ వ్యక్తి సుసాధ్యమైనవిషయంలో తన శక్తి, యుక్తులను వినియోగించి కార్యసాధకుడుగా తయారుకావడమే కాకుండా ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకొని అసాధ్యాలను సుసాధ్యాలుగా మలచుకొంటాడు. ఈ సాధనలో మనస్సుకు ప్రాముఖ్యం ఉందని గుర్తించాలి.

ఇక శకునాలను మూఢవిశ్వాసాలుగా భావించే వ్యక్తియొక్క మానసిక సాధన, మనస్సుకున్న శక్తి, శకునాలు మూఢవిశ్వాసాలని నిరూపించడానికి వినియోగపడతాయి. అట్టి స్థితిలో అతనికి శకునాలు మూఢవిశ్వాసాలు అనే విశ్వాసం బలపడడానికే ఆధారాలు లభిస్తాయి.

శకునాలు మూఢవిశ్వాసం అనే విశ్వాసానికి శకునం విశ్వసనీయం అనే విశ్వాసానికి విశ్వాసం అనే దృష్టిలో వ్యత్యాసం లేదు కాని శకునం ద్వారా మానసికస్థితిని గుర్తించే వ్యక్తి తన శక్తియుక్తులు వ్యర్థంకాకుండా, సమయం వృథాకాకుండా [illegible] వినియోగంచేసుకోవడానికి వినియోగిం[illegible] అవకాశం

ఉంది. ఇంటిముందు కుక్కను కట్టాం అది అపరిచితుడైన వ్యక్తి ఎవరువచ్చినా మొరుగుతోం దొంగలు వస్తే అది మొరగడం ద్వారా మనం జాగ్రత్త పడే అవకాశం ఉంది. వచ్చినవారు దొంగ కాకపోయినా కుక్క మొరుగుతోందని అలా మొరగడంవల్ల నిద్రాభంగమౌతుందని కుక్కపై అవిశ్వాస పెంచుకొని కుక్కనే తొలగించడంగాని, కుక్క మొరిగినా, వచ్చినవారెవరో చూడడం మానేసి ని పనుల్లో మనం ఉండడంగాని చేస్తే అన్నివేళల నష్టంవస్తుందని నిర్ధారణచేయలేం, కొన్ని కొన్ని సందర్భాలలో నష్టపోయే ప్రమాదం ఉంది అలాగే శకునాన్ని విశ్వసించకపోవడం వల్ల ఆ వ్యక్తి అన్నిసందర్భాలలో నష్టపోతాడనే నిర్ణయం చేయనవసరంలేదు. కాని ఆ కుక్కకు ఆత్మీయులను వేరుగా, దొంగను వేరుగా గుర్తించడం నేర్పడానికి సాధనచాలాకావాలి అలాంటిసాధనచేసి దొంగను పట్టుకోవడానికి వినియోగిస్తూ ఉపయోగించుకున్న సందర్భాలు అధికంగానే ఉన్నాయి. అదే విధంగా మనస్సు ఇచ్చే సూచనలను సాధనద్వారా (శకునాల ఆధారంతో) గుర్తించడం అలవర్చుకుంటే శకునాలవల్ల ప్రయోజనాన్ని సాధించవచ్చు. భావిని గుర్తించడానికి దానివల్ల ప్రయోజనాన్ని సాధించడానికి మనశక్తిని వినియోగిద్దామా? లేక ఆ విషయానికే దూరంగా ఉందామా? లేక ఆ పద్ధతిని వ్యతిరేకిద్దామా? అనేది ఎవరికివారు చేసుకోవలసిన నిర్ణయం, మరొకరి విశ్వాసాన్ని (శకునం అబద్ధం, శకునం నిజం, ఈ రెండింటిలో ఏదైనా విశ్వాసమే) ఖండించడమే లక్ష్యంగా పెట్టుకోవలసిన అవసరం లేదు. మంచిచెడ్డలు అనే కాలస్వరూపాన్ని గుర్తించడానికి చేసే ప్రయత్నం, సాధన అనేవి వట్టి మూఢవిశ్వాసాలుగా భావించడం మానసిక శక్తులను సద్వినియోగం చేసుకునేవారు మూర్ఖులని భావించడం వారి విశ్వాసాలపై దండెత్తడం, మొదలైన కార్యక్రమాలకు తమ శక్తియుక్తులను వినియోగించడం, అలారం గడియారానికి సంబంధించిన కీని విరవడానికి చేసే ప్రయత్నంలాంటిదే. ఈ సందర్భంలో డా. ఆట్లూరి వెంకటేశ్వరరావుగారి వివరణ గమనించదగింది.

"మన నమ్మకాలు మన నిత్యజీవితంపై ఎనలేని ప్రభావం కలిగివుంటాయి. ఉదాహరణకు ఎన్నో మందులకు నయంకాని కొన్ని జబ్బులు దేవునికి ముడుపుకట్టి మొక్కుకుంటే తగ్గుతాయి అలాగే పాముకరిచిన వారి చెవిలో పాముల నరసయ్య టెలిగ్రాం ఇచ్చాడంటే స్వస్థత చేకూరుతుంది. మన శరీరం పనితీరును నమ్మకాల ద్వారా ప్రభావితం చేయవచ్చు లేక కుంటుపర్చవచ్చు. మన నమ్మకాలను దయ్యాలవైపు నడిపిస్తే తీరని నష్టం కలుగుతుంది. కాని దేవునియందు నమ్మకం కలిగి ఆత్మవిశ్వాసంతో ముందుకుసాగితే విజయలక్ష్మిని వరించవచ్చు. మన నమ్మకాలను సద్వినియోగం చేసుకుంటే అభివృద్ధి పథంలో పయనించవచ్చు. నమ్మకాలను దుర్వినియోగం చేసుకుంటే కష్టనష్టాలకు లోనవవలసి వస్తుంది.

ఇది వ్యక్తి విచక్షణ జ్ఞానానికి సంబంధించిన అంశం"

ఆంధ్రజ్యోతి దినపత్రిక 2.9.1990

# పంచాంగం

పంచాంగం అంటే 5 అంశములు కలిగినది. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం.

తిథి: సూర్యుడికి చంద్రుడికి మధ్యదూరాన్ని అనుసరించి తిథి ఏర్పడుతుంది. ఏ వృత్తాన్నైనా 360° గా విభజించడం అందరూ అంగీకరిస్తూన్న మార్గం వాస్తవానికి భూమి సూర్యుని చుట్టొ తిరుగుతున్నా, భూమిపైనుంచి చూచేవారికి భూమి చుట్టూ ఆకాశంలోని గోళాలు తిరుగుతూన్నట్లుగా కనిపిస్తాయి. ఒకగోళం తన చుట్టూ తాను తిరగడం పరిభ్రమణం అంటారు (rotation) దీనినే ఆత్మప్రదక్షిణం అంటారు. ఒక గోళం మరో గోళం చుట్టూ తిరగడాన్ని భ్రమణం అంటారు. (Revolution) దీనినే ప్రదక్షిణం అనిగూడా వ్యవహరిస్తారు. మనం భూమి పై నుండి చూస్తూన్నందువలన భూమి చుట్టూ గ్రహాలు తిరుగుతున్నాయనే దృక్కోణంలో లెక్కలు కట్టడం జరిగింది. గ్రహం అంటే గ్రహించేది. ఆకర్షణ శక్తి కలిగినది అనే అర్థం లో ప్రాచీనులు వ్యవహరించారు. ఈ అర్థంలో స్టార్‌గా, (star) ఆధునికులచే వ్యవహరించబడుతున్న సూర్యుడు, ఉపగ్రహం (Satellite)గా వ్యవహరింపబడుతున్న చంద్రుడు గ్రహాలవడంలో అభ్యంతరం లేదు.

గ్రహం ప్లానెట్ (Planet) అనే పదాలు సమానార్థకాలు కావు.

**గ్రహం** - గ్రహించేది ఆకర్షణ శక్తి కలిగినది.

Planet - కాంతిని ప్రతిఫలించేశక్తి కలిగి తనకు తానుగా ప్రకాశించలేక మరో తార (**star**) చుట్టూ తిరిగేది.

తార - చీకటిని తరింపజేసేది (ప్రకాశించునది).

నక్షత్రం - స్థిరమైన సమానదూరాలలో ఒక ఆకారంగా ఊహించడానికి అనువుగా ఉన్న తారల సముదాయం.

star - తనకుతానుగా ప్రకాశించేది.

పై అర్థాలను పరిశీలిస్తే ఆ పదాల్లో గ్రహం అనే పదంలో ఉన్న అర్థం. Planet అనే పదానికున్న అర్థంలోను star అనే పదానికున్న అర్థం. నక్షత్రం అనే పదానికున్న అర్థంతోను విభేదించడం స్పష్టంగా తెలుస్తుంది. సరిగా ఆలోచించనివ్యక్తులు సూర్యుణ్ణి చంద్రుణ్ణి గ్రహాలు (Planet అనే అర్థంలో) అనడం తప్పని సూర్యుణ్ణి నక్షత్రం. అనాలనివాదిస్తూంటారు. జ్యోతిశ్శాస్త్రం అంటే కాంతిని కాంతి ప్రభావాన్ని వర్ణించే శాస్త్రం అనడం న్యాయం, భూమి గ్రహం అయినా దాని

కాంతి (స్వజకాంతి కాదు ప్రతిఫలించే కాంతి) భూమిపైపడే అవకాశం లేదు. భూమి కాంతి చంద్రమండలానికి ప్రసరిస్తుంది. కాబట్టి భూమిని గ్రహంగా ప్రాచ్యులు పరిగణించలేదు. అలాగే Astrology అనే పదంలో గ్రహ కాంతుల ప్రభావాలను చర్చించే శాస్త్రం అనే అర్థం ఉంది.

Astronamy అనే పదంలో గ్రహాల, చలనాలు, తారల దూరాలు, వాటి స్వరూపాలు వివరించే శాస్త్రం అనే అర్థం ఉంది. జ్యోతిషం అనే పదంలో గ్రహాల చలనాలు లెక్కించే సిద్ధాంత భాగం, గ్రహాల ప్రభావాలు వివరించే ఫలిత భాగంతో బాటు భావిఫలాలకును సూచించే ఇతరాంశాలు సంహితాభాగంగా చోటు చేసుకున్నాయి. కాగా Astrology కంటే జ్యోతిషం అనే పదం చాలా విస్తృతార్థంతో ఉండి Astrologyని Astronamyని జ్యోతిషం తనలో ఇముడ్చుకుంటోంది. భూమిచుట్టూ గ్రహాలు తిరుగుతున్నట్లుగా కనిపించే మార్గం. భూమధ్యరేఖకు రెండువైపులా 8° ఉందని గుర్తించారు. అది మొత్తం 16° దానినే గ్రహపయన మార్గం అని, రాశిచక్రం (Zodiac) అని, క్రాంతివృత్తం (Ecliptic) అని శిశుమార చక్రం (Zodiacal belt) అని వ్యవహరిస్తూంటారు వెడల్పు 16° వృత్తం 360° ఆ వృత్తం 30 భాగాలు అని భావించి సూర్యుడికీ చంద్రుడికీ మధ్య దూరాన్ని 12° లకు ఒక తిథి చొప్పున 360° లకు 30 తిథులను ఏర్పరచారు. చంద్రుడు సూర్యుని విడచి మరల సూర్యుని జేరడానికి పట్టేకాలం 29 రో 12 గం. 44 ని. రెండు అమావాస్యలకు గాని రెండు పూర్ణిమలకు గాని మధ్య ఉండే ఈ కాలమే చాంద్రమాన మాసం (విజ్ఞాన సర్వస్వం 9 వ భాగం 260 పే) అమావాస్య నాడు గూడా ఒక కళ ఉంది అనే భావంతో చంద్రుణ్ణి షోడశకళాపూర్ణుడు అని వ్యవహరించారు. కాంతులలో తేడానుబట్టి ఫలితాలు మారుతాయనే భావంతో తిథులకు గూడా ఫలితాలు చెప్పేపద్ధతి ఏర్పడింది. పూర్ణచంద్రుడు, మధ్యమ చంద్రుడు, క్షీణ చంద్రుడు ఫలితాలనివ్వడంలో తేడాలుంటాయి. కాబట్టి ప్రాచ్యులు తిథికి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, అనే తిథులు సర్వకార్యములకు శ్రేయస్కరములని, ముహూర్త భాగం అంగీకరిస్తుంది. పాడ్యమి, చవితి అష్టమి, చతుర్దశి, తిథులు దుష్టమైనవిగా భావించారు. ఏకాదశి, పూర్ణిమ, గృహారంభప్రవేశాలకు, సీమంతపుంసవనాలకు, డోలారోహణానికి (ఉయ్యాలలో శిశువును పరుండబెట్టడం) నవవస్త్రధారణ, జాతకర్మ నామకరణాలకు కర్ణవేధకు ఏకాదశి కూడా మంచిదని అన్న ప్రాశన కేశఖండనాలకు పౌర్ణమికూడా మంచిదని అక్షరారంభ, విద్యారంభ, ఉపనయన, వివాహాలకు, ఏకాదశి, ద్వాదశి కూడా మంచివని వివాహానికి పూర్ణిమ కూడా మంచిదని వ్యవహరిస్తారు. తమిళసోదరులు అమావాస్యను గూడ సర్వకార్యములకు ఉత్తమమైనదిగా వ్యవహరిస్తారు. చంద్రుడు మనశ్శక్తికి సంబంధించిన వాడు రవి ఆత్మశక్తికి సంబంధించిన వాడు లోకంలో రెండు విధాల అభిప్రాయాలున్నాయి.

కొందరు పవికంటే మానసిక ప్రశాంతి ముఖ్యమని భావిస్తారు. మరికొందరు మనస్సుకంటే పవికి ప్రాముఖ్యం ఇస్తారు. చూసేవారిదృక్కోణాల్లో ఉండే భేదాలను బట్టి, కొందరికి పూర్ణిమ మరికొందరికి అమావాస్య ముఖ్యమైనవిగా కనిపిస్తాయి. పౌర్ణమి ప్రశాంతికి, అమావాస్య పట్టుదలతో గూడన ఆత్మశక్తికి సంకేతాలుగా భావించవచ్చు. షష్ఠి, అష్టమి, పౌర్ణమి, అమావాస్య ద్వాదశి, ప్రయాణానికి పూర్తిగా నిషిద్ధాలుగా భావించారు. అమావాస్యనాడు రవిచంద్రులయుతి సంభవిస్తుంది. చంద్రుడు అస్తంగతుడౌతాడు. చవితినాడు రవిచంద్రులమధ్య అంతరం శుక్లపక్షంలో 45° అర్ధకేంద్ర దృష్టి (semi square) ఏర్పడుతుంది. కృష్ణపక్షంలో చంద్రరవులమధ్య 135° పూర్ణార్ధ కేంద్రదృష్టి (Sesqui-Quadrate) ఏర్పడుతుంది. శుక్లపక్షంలో అష్టమి నాడు రవికి చంద్రునికి, కేంద్రదృష్టి 90° అంతరం (Square) కృష్ణపక్షంలో చంద్రునికి రవికి, కేంద్ర దృష్టి 90° అంతరం. (Square) ఏర్పడుతుంది. శుక్లపక్షంలో ద్వాదశినాడు రవికి చంద్రునికి, పూర్ణకేంద్రదృష్టి (Sesqui-Quadrate) ఏర్పడుతుంది. కృష్ణపక్షంలో చంద్రునికి రవికి అర్ధకేంద్రదృష్టి 45° అంతరం (Semi Square) ఏర్పడుతుంది. అమావాస్యకు రవిచంద్రులకు యుతి 0° (Conjunction) ఏర్పడుతుంది. పౌర్ణమికి విరోధదృష్టి 180° (opposition) ఏర్పడుతుంది. పాడ్యమి మొదలైన తిథులకు క్రమంగా నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ, అనే సంజ్ఞలు ఉన్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| నంద | భద్ర | జయ | రిక్త | పూర్ణ |
| పాడ్యమి | విదియ | తదియ | చవితి | పంచమి |
| షష్ఠి | సప్తమి, | అష్టమి | నవమి | దశమి |
| ఏకాదశి | ద్వాదశి, | త్రయోదశి | చతుర్దశి | పూర్ణిమ |
| | | | | అమావాస్య |

రిక్తతిథులుగా చవితి, నవమి, చతుర్దశి, సామాన్యంగా సర్వశుభ కార్యాలకు విడిచిపెడుతూంటారు. తిథులకు అధిపతులుగా దేవతలను ప్రాచ్యులు భావించారు.

తిథులు ఏర్పడే పద్ధతి

| రవినుండి | చంద్రుడు | | శుక్లపక్షం | |
|---|---|---|---|---|
| | | 1° నుండి | 12° వరకు | పాడ్యమి |
| " | " | 13° " | 24° " | విదియ |
| " | " | 25° " | 36° " | తదియ |

| | | | | |
|---|---|---|---|---|
| " | " | 37° " | 48° " | చవితి |
| " | " | 49° " | 60° " | పంచమి |
| " | " | 61° " | 72° " | షష్ఠి |
| " | " | 73° " | 84° " | సప్తమి |
| " | " | 85° " | 96° " | అష్టమి |
| " | " | 97° " | 108° " | నవమి |
| " | " | 109° " | 120° " | దశమి |
| " | " | 121° " | 132° " | ఏకాదశి |
| " | " | 133° " | 144° " | ద్వాదశి |
| " | " | 145° " | 156° " | త్రయోదశి |
| " | " | 157° " | 168° " | చతుర్దశి |
| " | " | 169° " | 180° " | పూర్ణిమ |
| | | | కృష్ణ పక్షం | |
| " | " | 181° " | 192° " | పాడ్యమి |
| " | " | 193° " | 204° " | విదియ |
| " | " | 205° " | 216° " | తదియ |
| " | " | 217° " | 228° " | చవితి |
| " | " | 229° " | 240° " | పంచమి |
| " | " | 241° " | 252° " | షష్ఠి |
| " | " | 253° " | 264° " | సప్తమి |
| " | " | 265° " | 276° " | అష్టమి |
| " | " | 277° " | 288° " | నవమి |
| " | " | 289° " | 300° " | దశమి |
| " | " | 301° " | 312° " | ఏకాదశి |
| " | " | 313° " | 324° " | ద్వాదశి |
| " | " | 325° " | 336° " | త్రయోదశి |
| " | " | 337° " | 348° " | చతుర్దశి |
| " | " | 349° " | 360° " | అమావాస్య |

వారం: గ్రహకక్ష్యలు, సూర్యునిచుట్టూ వరుసగా బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, ఉన్నాయి నక్షత్రాలమధ్యలో చంద్రుడు కనిపిస్తున్నందువలన అన్ని గ్రహాలకంటే (సూర్యుడుతప్ప) ప్రధానంగా కనిపిస్తుంన్నందువలన చంద్రునకు సూర్యుని స్థానాన్నిచ్చారు అప్పటి వరుస శనినుండి ఆరంభిస్తే శని, గురు, కుజ, భూమి, శుక్ర, బుధచంద్రులు అవుతారు. భూకేంద్రం నుండి గ్రహాలుల పరిగణన జరుగుతోంది. కాని అసలు కేంద్రమైన వాడు రవి కాబట్టి భూమి స్థానంలో సూర్యునికి ఉనికిని కల్పించారు. అప్పటి క్రమం శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్రులు అవుతారు. వరుసగా సూర్యహోరతో ప్రారంభం అయిన రోజు (హోర ఒక గంటకు సమానం) 7 హోరలు మూడు సార్లు సంచరించగా $(7 \times 3 = 21)$ 21 గంటలు అవుతాయి. 22 వ గంటకు రవి, 23 వ గంటకు శుక్రుడు 24 వ గంటకు బుధుడు 25 వ గంటకు (మరువాటి రోజు మొదటి గంట) చంద్రుడు అధిపతులౌతారు. ఈ క్రమంలో ఆ రోజు సోమవారం అవుతుంది. మరల చంద్రుని నుండి 24 గంటలు లెక్కిస్తే 25 వ గంటకు కుజుడధిపతి అవుతాడు ఆ రోజుకు అధిపతి కుజుడు. ఈ విధంగా గ్రహకక్ష్యలు ఆధారంగా సూర్యాదివారాలు ఏర్పడ్డాయి. ఆహోరా క్రమాన్ని ఈ క్రింది పట్టికలో గమనించవచ్చు.

| | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| | ప-రా | ప-రా | ప-రా | ప-రా | ప-రా | ప-రా | ప-రా |
| 1 | ర-గు | చం-శు | కు-శ | బు-ధ | గు-చం | శు-కు | శ-బు |
| 2 | శు-శు | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం |
| 3 | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ |
| 4 | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు |
| 5 | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు |
| 6 | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-కు | కు-శ | బు-ర |
| 7 | కు-శ | బు-ర | గు-చం | శు-శు | శ-బు | ర-గు | చం-కు |
| 8 | ర-గు | చం-శు | కు-శ | బు-ధ | గు-చం | శు-కు | శ-బు |
| 9 | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం |
| 10 | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు | చం-శు | కు-శ |
| 11 | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు | శ-బు | ర-గు |
| 12 | శ-బు | ర-గు | చం-శు | కు-శ | బు-ర | గు-చం | శు-కు |

నక్షత్రం: 360°ల వృత్తంలో చంద్రుడు సంచరించే కాలం సుమారు 27 రోజులు కావడంవల్లన ఆకాశాన్ని 27 నక్షత్రాకృతులుగా గుర్తించడం జరిగింది. 360ని 27చే భాగించగా 13° - 20 చొప్పున ఒక్కొక్క నక్షత్రం ఏర్పడ్డాయి. ఆయానక్షత్రాలలో చంద్రుని సంచారాన్ని బట్టి నిత్య నక్షత్రం ఏర్పడుతూంటుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 1° | నుండి | 13°-20' | వరకు | అశ్విని |
| 13°-21' | నుండి | 26°-40' | వరకు | భరణి |
| 26°-41' | నుండి | 40°-00' | వరకు | కృత్తిక |
| 40°-01 | నుండి | 53°-20' | వరకు | రోహిణి |
| 53°-21' | నుండి | 66°-40' | వరకు | మృగశిర |
| 66°-41' | నుండి | 80°-00' | వరకు | ఆర్ద్ర |
| 80°-01' | నుండి | 93°-20' | వరకు | పునర్వసు |
| 93°-21' | నుండి | 106°-40' | వరకు | పుష్యమి |
| 106°-41' | నుండి | 120°-00' | వరకు | ఆశ్లేష |
| 120°-01' | నుండి | 133°-20' | వరకు | మఖ |
| 133°-21' | నుండి | 146°-40' | వరకు | పుబ్బ |
| 146°-41' | నుండి | 160°-00' | వరకు | ఉత్తర |
| 160°-01' | నుండి | 173°-20' | వరకు | హస్త |
| 173°-41' | నుండి | 186°-40' | వరకు | చిత్త |
| 186°-41' | నుండి | 200°-00' | వరకు | స్వాతి |
| 200°-01' | నుండి | 213°-20' | వరకు | విశాఖ |
| 213°-21' | నుండి | 226°-40' | వరకు | అనూరాధ |
| 226°-41' | నుండి | 240°-00' | వరకు | జ్యేష్ఠ |
| 240°-01' | నుండి | 253°-20' | వరకు | మూల |
| 253°-21' | నుండి | 266°-40' | వరకు | పూర్వాషాఢ |
| 266°-41' | నుండి | 280°-00' | వరకు | ఉత్తరాషాఢ |
| 280°-01' | నుండి | 293°-20' | వరకు | శ్రవణం |
| 280°-21' | నుండి | 306°-40' | వరకు | ధనిష్ఠ |
| 306°-41' | నుండి | 320°-00' | వరకు | శతభిషం |

| | | | | |
|---|---|---|---|---|
| 320°-01' | నుండి | 333°-20' | వరకు | పూర్వాభాద్ర |
| 333°-21' | నుండి | 346°-40' | వరకు | ఉత్తరాభాద్ర |
| 346°-41' | నుండి | 360°-00' | వరకు | రేవతి |

**యోగం** - మేషాది సూర్యుని డిగ్రీలను, చంద్రుని డిగ్రీలను కలిపి, (360 కంటె ఎక్కువ అయితే 360చే భాగించి శేషం తీసుకోవాలి) ఒక్కొక్కయోగము 13° - 20' చొప్పున 27 యోగములు సంభవించును.

1 విష్కంభం, 2 ప్రీతి, 3 ఆయుష్మాన్, 4 సౌభాగ్యం, 5 శోభనం, 6 అతిగండం, 7 సుకర్మ, 8 ధృతి, 9 శూల, 10 గండం, 11 వృద్ధి, 12. ధృవం, 13 వ్యాఘాతం, 14 హర్షణం, 15 వజ్రం, 16 సిద్ధి, 17 వ్యతీపాతం, 18 వరీయాన్, 19 పరిఘం, 20 శివం 21 సిద్ధ, 22 సాధ్యం 23 శుభం, 24 శుక్లం, 25 బ్రహ్మం, 26 ఐంద్రం, 27 వైధృతి. ఇందు విష్కంభం, అతిగండం, శూల, గండం వ్యాఘాతం, వజ్రం, వ్యతీపాతం, పరిఘం, వైధృతి అనే యోగాలు దుష్టములైనవి.

కరణం: ఒక్కొక్క తిధిని రెండు భాగాలు చేయగా రెండు కరణములేర్పడుతాయి.

ఇవి స్థిర కరణములవి, చరకరణములని రెండు విధాలు బవ, బాలవ, కౌలవ తైతుల, గర, వణిక్, విష్టి, అనే 7 చరకరణాలు, శకుని, చతుష్పద, నాగవ, కింస్తుఘ్నం అనే 4 స్థిరకరణాలు.

కృష్ణపక్ష చతుర్దశి యొక్క ఉత్తరార్ధం శకుని
అమావాస్య యొక్క పూర్వార్ధం నాగవం
ఉత్తరార్ధం చతుష్పదం, శుద్ధస్వామి యొక్క పూర్వార్ధం కింస్తుఘ్నం,

ఒక మాసంలో చరకరణాలు - 7 నాలుగు పర్యాయాలు తక్కిన తిధులన్నిటిలోను తిరిగి వస్తూఉంటాయి. తిధి నక్షత్రాలు మాత్రమే దృశ్యమానాలని, తక్కిన వార, యోగ, కరణాలు గణితమాత్రాధారాలని ఆధునికుల అభిప్రాయం. ఈ పంచ అంగములను కాలాంగములుగా వ్యవహరిస్తూ పంచాంగ గణనసాగుతోంది.

# పంచాంగ పదజాలం

వ్యక్తి ప్రవర్తనను శాసించేవి శాస్త్రాలు అనే నిర్వచనం ప్రాచీనమైనది. ప్రస్తుత కాలంలో పరిశీలన, నిరూపణలు అంగాలుగా గల సత్యాంశ వ్యక్తీకరణకు ప్రాముఖ్యం వహించేది శాస్త్రం ప్రతి శాస్త్రానికి ప్రత్యేకంగా కొన్ని పారిభాషిక పదాలుంటాయి. ఆయా **పారిభాషిక** పదాలు ఆయా శాస్త్రజ్ఞుల వ్యవహార భాషలోకి గూడా ప్రవేశిస్తుంటాయి. కాల క్రమాన **అవి** సామాన్యజన వ్యవహారంలోకి గూడా ప్రవేశించి విశాల వాఙ్మయంలో స్థానాన్ని సంపాదించుకుంటాయి.

సకల ప్రపంచానికి ఇంద్రియ శక్తుల వికాసం ఆలోచన అనేది **జ్యోతిషంతోనే** ఆరంభం అయ్యాయి అనవచ్చు. సకల జాతులలో ఆదిమ దైవం సూర్యుడే జ్యోతిషాన్ని వేదాంగంగా ప్రాచీనులు గుర్తించినా వేద కాలానికి పూర్వమందే, అది మానవుడు ఉద్భవించిన తోడనే భాష పుట్టుకముందే పూర్ణ చంద్రుని చూసి ఆనందించడం, సూర్యోదయంతో దిన చర్య ఆరంభించడం చేశాడు. నేటి కాలంలోగూడా పశుపక్ష్యాదులు సైతం సంపూర్ణ సూర్యగ్రహణానికి ప్రతిస్పందిస్తూ తమ దిన చర్యల క్రమంలో ఆకస్మికంగా మార్పులు చేసుకోవడాన్ని గమనిస్తే ఆది మానవుని ఆశ్చర్య పూరితమైన ప్రవర్తన జ్యోతిస్సులకు అనుగుణంగా సాగేదని గుర్తించవచ్చు.

ఈ విధంగా జ్యోతిషం యొక్క ముఖ్య ప్రయోజనాలైన దిక్, దేశ, కాల, పరిజ్ఞానాలు మానవుని నిత్య జీవనంలో అంతర్లీనంగా ఉండి జ్యోతిష జ్ఞానం యొక్క ప్రాచీనతను చాటి చెపుతున్నాయి.

కాగా ప్రస్తుతాంశంలో జ్యోతిష శాస్త్రంగూడా మన భాషా సంపదను పరిపుష్టం చేయడంలో తన వంతు పాత్రను నిర్వహిస్తోంది.

భాషలో ప్రవేశించిన పదజాలాన్ని వర్గీకరించేటప్పుడు పలు విధాల పద్ధతులను ఆశ్రయించవచ్చు. వర్గీకరణ అనేది విషయ గ్రహణను క్రమబద్ధం చేస్తుంది. గ్రహాలకు సంబంధించిన పదజాలం, తిథి నక్షత్రాలకు సంబంధించిన పదజాలం, యోగాలకు సంబంధించిన పదజాలం, రాశులకు సంబంధించిన పదజాలం, సామాన్య పదజాలం, అనే వర్గీకరణ ఒక పద్ధతి.

వ్యవహారికశైలి, అలంకారిక శైలి అని విభజించి, వ్యావహారిక శైలిలో, నామాలు, (వ్యక్తి)స్థల, కాల గుణాదులు నామబంధాలు. అలంకారిక శైలిలో నామాలు, నామబంధాలు, అనే వర్గీకరణ మరొకటి, మరో విధంగా వర్గీకరించినపుడు కృత్రిమ పదజాలం, వాస్తవ పదజాలం, అని గూడా విభజించవచ్చు. సామాన్యంగా ఒకే పదం వ్యావహారిక శైలిలో ఒక అర్థాన్ని **అలంకారిక శైలిలో** మరో అర్థాన్ని ఇవ్వడం జరుగుతూంటుంది.

పాత పంచాంగం అనే పదాన్ని వ్యవహారిక శైలిలో జరుగుతూన్న సంవత్సరానికి పూర్వపు సంవత్సరాలకు చెందిన పంచాంగం అనే అర్థం తీసుకుంటాం. అదే ఆలంకారిక శైలిలో పాత పంచాంగాలు తిరగేస్తున్నాడు. అన్నప్పుడు పాత చరిత్రలు వెలికి తీస్తున్నాడు. అనే అర్థం వస్తుంది. పూర్వకాలం నాటి వ్యవహారం అని శబ్దార్థ దీపిక. అదే ఆకాశ పంచాంగం అనే పదానికి వ్యావహారిక శైలిలో అర్థం కనిపించక పోయినా, ఆలంకారిక శైలిలో ఆధారరహితతమైన చరిత్ర వివరణ (ఆకాశ పురాణంలో) అనే అర్థం వస్తుంది. (చూ. శబ్దార్థ దీపిక) ఆదే బూతులు పంచాంగం విప్పాడు. అనే సందర్భంలో వ్యావహారిక శైలి లోపించి వ్యంగ్య శైలిలో బూతుల సముదాయం అనే అర్థం కనిపిస్తోంది.

ఏదేని విషయానికి సంబంధించిన సమగ్ర విషయ విశ్లేషణకు పూనుకొన్న వానిని ఆక్షేపించే సందర్భంలో పంచాగం విప్పకు అనే మాటలో పంచాగం అనే పదం సమగ్ర విషయ విశ్లేషణ అనే అర్థాన్నిస్తోంది. ఇది గూడా ఆలంకారిక శైలికి చెందినదని అర్థమే.

'నాదగ్గర అందరి పంచాగాలు ఉన్నాయి'. అనే వ్యవహారంలో అందరి పుట్టు పుర్వోత్తరాలు అనే అర్థమే కాక అందరి లోపభూయిష్టకమైన ప్రవర్తనలకు చెందిన వివరాలు అనే అర్థం తొంగి చూస్తోంది.

ప్రొద్దు

తన తేజస్సుచే ఇతర తేజస్సులకు బంధించువాడు (విద్యార్థి కల్పతరువు) అనే వ్యుత్పత్తితో బ్రధ్న అనే సంస్కృత పదం సూర్యుడు అనే అర్థాన్నిస్తోంది. దానికి వికృతి అయిన ప్రొద్దు అనే పదం, "పొద్దు పొడిచింది" "పొద్దు వాలింది" మొదలైన వాక్యాలలో సూర్యుడు అనే అర్థాన్ని సూచిస్తున్నాడు. పొద్దున, పొద్దుట అనే పదాలలో ఉదయకాల వాచకంగా మారి. పొద్దుపోయింది. (కాలం అతిక్రమించింది). (రాత్రివేళ, మధ్యాహ్నం వేళ కూడా ఈ వ్యవహారం ఉంది). అనే వాక్యంలో కాల వాచకంగా కనిపిస్తోంది. పొద్దు అనే పదానికి కల్లు, రాయి అనే పదాలు కలిసి, సూర్యకాంతమణి, అనే అర్థానిస్తున్నాయి. సూర్యుని కొడుకులుగా ప్రసిద్ధులైన యమ, శని, కర్ణ, సుగ్రీవులు పొద్దు కొడుకులు అనే పదం చేత గుర్తించబడుతున్నారు.

సూర్యుడున్న దిక్కును అనుసరించి తిరిగే పూవుకు పొద్దు తిరుగుడు పూవు. అనే పేరు తప్ప మరో పేరు వ్యవహారంలో లేదు. సంస్కృతంలో సూర్యానువర్తిని అనే పేర పిలువబడుతోంది. ఆంగ్లంలో "సన్‌ఫ్లవర్" (Sun Flower) అనే పదం సూర్యునకు చెందిన పూవు అనే అర్థాన్నిస్తు గలిగినా సూర్యుని వైపుకు తిరిగే ఆ పువ్వుయొక్క సహజ క్రియను వ్యక్తీకరించలేకపోతోంది.

అర్కకాంతం అనే సంస్కృత పదం పొద్దు తిరిగుడు పూవు అనే అర్థంలోను, సూర్యకాంతం అనే పదం సూర్యకాంతమణి అనే అర్థంలో నిఘంటువు (శబ్దార్థ దీపిక)లో కనిపిస్తున్నాయి.

పొద్దు గూకులు అనే పదబంధం సమస్త కాలాన్ని బంధించి తనలో ఇముడ్చుకుంటోంది.

వ్యర్థంగా కాలం గడిపే వాడిని. పొద్దు పుచ్చుతున్నాడు (పుచ్చుతున్నాడు = పంపుతున్నాడు) అని, కాలం గడవడం లేదనే భావంతో "పొద్దు పోకుండా ఉంది" అనే పద బంధాన్ని వ్యవహరిస్తున్నారు. పొద్దు పోకుండ ఉంది. అనే పదబంధం నిరుత్సాహంగా ఉంది. అనే అర్థాన్ని గూడా ఇస్తోంది.

పొద్దు తిరుగువేళ అనే పద బంధం మధ్యాహ్నకాలాన్ని సూచిస్తోంది. "ఒక్క పొద్దు ఉండు" అనే వాక్యంలో రోజు అనే అర్థాన్నిస్తోంది. విశేషించి ఒంటి పూట భోజనం (ఏక భుక్తం) అనేఅర్థాన్నిస్తోంది. ఈ పనిని పొద్దు పోక చేశావు. అనే వాక్యం కాలం గడవక పనిలేని పని చేశావు అనే అర్థాన్నిస్తోంది.

పొద్దు జంటలో చంద్రుడు కూడా జేరి పొద్దును కాలవాచకంగా చేశాడు. ఈ విధంగా పొద్దు అనే పదం సూర్యచంద్రులను స్ఫురింపజేస్తూ వచ్చి గ్రహణం అనే అర్థంలో పొద్దు పట్టు అనే పదబంధం వ్యవహారంలోకి వచ్చింది. పొద్దులు అనే బహువచనపదం ప్రసవ దినాలు అనే విశేషార్థాన్నిస్తూ రోజు అనే అర్థంలోనికి మారింది. సూర్యుడే అధిపతిగాగల నక్షత్రం పొద్దురిక్క (ఉత్తరఫల్గుణి) అని వ్యవహృతమౌతోంది.

## సూర్యుని నామాల విశ్లేషణ

12 మాసాలలో ప్రతి మాసానికి ప్రకృతిలో వచ్చే మార్పులననుసరించి సూర్యుని గుణాలు మారుతున్నాయనే భావంతో గుణ, గుణులకు గల నిత్య సంబంధాన్ని దృష్టిలో ఉంచుకొని, సూర్యుడు ద్వాదశాత్ముడుగా గుర్తించబడ్డాడు. విశేషించి సూర్య శబ్దమే 12 సంఖ్యకు వాచకంగా మారింది. పగటి కాలం ఏర్పడడానికి మూలకారణంగా భావించబడే సూర్యుడు, దినమణి,

సూర్యుడున్న దిక్కును అనుసరించి తిరిగే పూవుకు పొద్దు తిరుగుడు పూవు. అనే పేరు తప్ప మరో పేరు వ్యవహారంలో లేదు. సంస్కృతంలో సూర్యానువర్తిని అనే పేర పిలువబడుతోంది. ఆగ్లంలో "సన్‌ఫ్లవర్" (Sun Flower) అనే పదం సూర్యునకు చెందిన పూవు అనే అర్థాన్నిచ్చే గలిగినా సూర్యుని వైపుకు తిరిగే ఆ పువ్వుయొక్క సహజ క్రియను వ్యక్తీకరించలేకపోతోంది.

అర్కకాంతం అనే సంస్కృత పదం పొద్దు తిరిగుడు పూవు అనే అర్థంలోను, సూర్యకాం... అనే పదం సూర్యకాంతమణి అనే అర్థంలో నిఘంటువు (శబ్దార్థ దీపిక)లో కనిపిస్తున్నాయి.

పొద్దు గూకులు అనే పదబంధం సమస్త కాలాన్ని బంధించి తనలో ఇముడ్చుకుంటోంది.

వ్యర్థంగా కాలం గడిపే వాడిని. పొద్దు పుచ్చుతున్నాడు (పుచ్చుతున్నాడు = పంపుతున్నాడు) అని, కాలం గడవడం లేదనే భావంతో "పొద్దు పోకుండా ఉంది" అనే పద బంధాన్ని వ్యవహరిస్తున్నారు. పొద్దు పోకుండ ఉంది. అనే పదబంధం నిరుత్సాహంగా ఉంది. అనే అర్థాన్ని గూడా ఇస్తోంది.

పొద్దు తిరుగువేళ అనే పద బంధం మధ్యాహ్నకాలాన్ని సూచిస్తోంది. "ఒక్క పొద్దు ఉందు" అనే వాక్యంలో రోజు అనే అర్థాన్నిస్తోంది. విశేషించి ఒంటి పూట భోజనం (ఏక భుక్తం) అనేఅర్థాన్నిస్తోంది. ఈ పనిని పొద్దు పోక చేశావు. అనే వాక్యం కాలం గడవక పనిలేని పని చేశావు అనే అర్థాన్నిస్తోంది.

పొద్దు జంటలో చంద్రుడు కూడా జేరి పొద్దును కాలవాచకంగా చేశాడు. ఈ వి... పొద్దు అనే పదం సూర్యచంద్రులను స్ఫురింపజేస్తూ వచ్చి గ్రహణం అనే అర్థంలో పొద్దు పట్టు అనే పదబంధం వ్యవహారంలోకి వచ్చింది. పొద్దులు అనే బహువచనపదం ప్రసవ దినాలు అనే విశేషార్థాన్నిస్తూ రోజు అనే అర్థంలోనికి మారింది. సూర్యుడే అధిపతిగాగల నక్షత్రం పొద్దురిక్క (ఉత్తరఫల్గుణి) అని వ్యవహృతమౌతోంది.

## సూర్యుని నామాల విశ్లేషణ

12 మాసాలలో ప్రతి మాసానికి ప్రకృతిలో వచ్చే మార్పులననుసరించి సూర్యుని గుణాలు మారుతున్నాయనే భావంతో గుణ, గుణులకు గల నిత్య సంబంధాన్ని దృష్టిలో ఉంచుకొని, సూర్యుడు ద్వాదశాత్ముడుగా గుర్తించబడ్డాడు. విశేషించి సూర్య శబ్దమే 12 సంఖ్యకు వాచకంగా మారింది. పగటి కాలం ఏర్పడడానికి మూలకారణంగా భావించబడే సూర్యుడు, దినమణి,

అహస్కరుడు, అహర్మణి, అహర్బాంధవుడు, అహర్పతి, దివాకరుడు, అహస్కరుడు, అహస్కరుడు మొ-లైన పదాలచే గుర్తించబడ్డాడు. మార్తాండుడు అనే పదం సూర్యుని ఉత్పత్తిని గూర్చి వివరిస్తోంది. బ్రహ్మాండము శకలములైనపుడు (మృతి చెందినపుడు) పుట్టిన వాడు ఇదే అర్థం నిస్తున్న మరో పదం అండజుడు ఇక్కడ అండం బ్రహ్మాండమే చిత్రవర్ణాలతో ప్రకాశించేవాడు. చిత్రభానుడు అదితి కుమారుడు అనే భావంతో ఆదిత్యుడు, ఏడు రంగులు ఏడు గుర్రాలు అభివర్ణించగా ఏడు గుర్రములు కలవాడు సప్తాశ్వుడు ఈ భావాన్ని అచ్చ తెనుగుకు మార్చి ఏడు గుర్రాలతేజెక్కుజోదు. ఆకు పచ్చని గుఱ్ఱాలు గలవాడనే భావంతో హరితహరి. (ఇక్కడ హరి శబ్దం అశ్వార్థకం) హరిదశ్వుడు పచ్చగుఱ్ఱాలవజీరుడు, అనే పేరు పొందాడు. హరి హయుడు అనే పదంలో హరిత శబ్దార్థకమే హరిశబ్దం కాగా పై అర్థాన్నే ఇస్తోంది. నీటిని హరించే వాడనే అర్థంలో హరిశబ్దం గూడా సూర్యార్థకంగా ఉంది. జలాన్ని గ్రహించి మేఘ రూపంలో మరల తడుపుచున్నాడనే భావంలో మిహిర శబ్దం సూర్యవాచకం అయింది. ఆకసంలో పయనించే వాడనే అర్థంలో ద్యోయానుడు అనే పదం గూడా సూర్య వాచకం అయింది. ఆకాశానికి మణిలాటివాడు కాబట్టి ద్యుమణి, అంబరమణి, ఆకాశంలో ఉండేవాడుగా ద్యుసదుడు, ద్యుసత్తు ఖద్యోతుడు (ఆకాశంలో కనిపించేవాడు).

అంధకారాన్ని తరింపజేయువాడుగా తరణి అనే సార్థక నామంగలవాడయ్యాడు. మనుష్యుని (నిద్రించేవానిని) ప్రేరేపించేవాడు అనే భావాలతో సవిత అని గుర్తించబడ్డాడు. మనం చేసే పనులకన్నింటికి సాక్షిభూతుడు అనే భావంతో కర్మ సాక్షి అని అతడు లేకుంటే కన్నులు కానరావు అనే భావంతో అందరికీ కన్నులాటివాడు. జగచ్చక్షువు, జగముకన్ను అని పిలువులనందాడు. జగత్తు ప్రాణంలాటివాడు జగత్ప్రాణుడు, జగముచుట్టము, మూడు వేదాలు ఈతని స్తుతులను కలిగి ఉండడం వలన ఆ మూడు వేదాలే శరీరాంగా కలవాడుగా త్రయీ తనువు అని కీర్తించబడ్డాడు.

పద్మినీవల్లభుడు అనే పదానికి అచ్చ తెనుగు రూపమే తమ్మి వాల్గంటి మగడు, విశ్వానికి నేత్రస్థానీయుడు (చక్షోఃసూర్యోఅజాయత) అనే భావంతో వెన్నునివల (కుడి) కన్ను, వేడి కిరణాలు ప్రసరించేవాడుగా వేడి వెలుగు, వేడి వేలుపు. దివకరుడు అనే అర్థంలో పవలు సేయుజోదు చంద్రుని జంట అనేఅర్థంలో రేవెల్గుజోదు అరుణుడు అనే అర్థంలో ఎఱ్ఱని వేలుపు, ద్యుమణి అనే అర్థంలో చదలుమానికము జంటారు మేనల సామి ఆరు జంటలు 12 ద్వాదశాత్మకుడు ఇనముమాదు, చీకటి గొంగ అనే పదాలు చీకటికి శత్రువు అనే అర్థంలో కనిపిస్తున్నాయి. గ్రహరాజు, గ్రహపతి, గాములరేడు అనే పదాలు సమానార్థకాలే. సహస్రాంశుడు అనే అర్థంలోనే వేయి చేతులవాడు అనే పద బంధం కనిపిస్తోంది.

ముప్పేలుల యొక్క మ్రొక్కుదేవర, త్రిమూర్త్యాత్మకుడుగా ఈతడు సృష్టి స్థితి లయాలకు ఆధారభూతుడనే భావంతో ఈ పదం ఏర్పడింది. వెలుగుల యెకిమీడు, వెలుగులకు అధిపతిగా ఈ పదబంధం వ్యవహారంలోకి వచ్చింది. వెయ్యిలసాకిరి లోకంలోని వ్యక్తులందరూ చేసే పనులకన్నిటికి సాక్షీభూతుడు అనే అర్థంలో ఈ పదబంధం సూర్యవాచకం అయింది. జక్కవలరేడు. చక్రవాకములు సూర్యునికాంతిని కోరుతూండడం వలన తమ ప్రభువుగా సూర్యుణ్ణి అవి భావిస్తున్నాయనే అభిప్రాయంతో ఈ పదం ఏర్పడింది.

కిరణ సముదాయంలో వెలుగొందే సూర్యుడు. అంశుమాలి, భానుడు, భాస్కరుడు, ప్రభాకరుడు, విభాకరుడు, విభావసువు, త్విషాంపతి, (కాంతులకు ప్రభువు) ప్రద్యోతనుడు, విరోచనుడు, సహస్రాంశుడు, ధామనిధి భానుమంతుడు, భానేయుడు మొదలైన పదాలతో పిలుపును పొందాడు. ఎండవేడికి కారకుడైన సూర్యుడు తపనుడు, ఉష్ణరశ్మి మొదలైన నామవాచకాలు కలవాడయ్యాడు. చీకటిని కత్తిరిస్తున్నందువలన వికర్తనుడు, తన కాంతులచే అన్నిటిని ఆక్రమించే వాడుగా వివస్వంతుడనీ పేర్లు పొందాడు. పలు విషయాలయందున్న పరిజ్ఞానమే పాండిత్యం, ఆ పాండిత్యానికి ప్రతాపానికి కారకుడు సూర్యుడే, అందుకే సూరి అనే పదం సూర్యుణ్ణి, పండితుణ్ణి గూడా బోధిస్తోంది.

ఇంకా సూర్యోపాసనాదికం చేసే ఋషి, పురోహితుడు, పూజారి, మొదలైన అర్థాలను గూడా ఇస్తోంది. విశేషించి, సూర్యునిలోని తేజస్సును గాయత్రీమంత్రం ద్వారా ధ్యానించడం వలన ("నామనస్సును సక్రమమైన మార్గంలో ఆలోచింపజేయి" అనే గాయత్రి మంత్రార్థం ద్వారా) సక్రమమైన ఆలోచనాశక్తి కలుగుతుందని సంప్రదాయం. పై వారు చేసే పని సూర్యధ్యానమే కదా!.

తెలివి గలది, విద్వత్తుగలది అనే అర్థాలనుగూడా ఈ సూరి అనే పదం కలిగిఉంది. తెలివి పాండిత్యం, అనేవి గూడా పై భావానికి చెందినవే. సూర్యుడు అనే పదం సూర్యవాచకంగా ప్రారంభమై, పాండిత్యానికి పరాక్రమానికి కారకుడు సూర్యుడు కావడంవలన విద్వాంసుడు, శూరుడు అనే అర్థాలనిచ్చి, శౌర్యంగలవాడుగా సామాన్యంగా రాజే కావడం వలన, రాజు అనే అర్థాన్నికూడా ఇస్తోంది. గ్రహరాజ్యంలో సూర్యుడు రాజుగానే గుర్తింపును పొందాడు.

## సూర్యసంబంధిపదాలు:

సూర్యునివలె కాంతిని పంచడంవలన (మెరవడం వలన) తక్కిన గ్రహాలకంటె సూర్యుడు శ్రేష్ఠుడు కావడంవలన "సూర్యపటము" అనే పదం, "మేలైన మొకముల"కు వాచకంగా

మారింది. ఇదే తెలుగులో సూరెపుటము అనే పేర వ్యవహరింపబడింది.

సూర్య, అనే పదం, సూర్యుని భార్య సూర్యుని పుత్రిక, అనే అర్థాలతో బాటు సూర్యుని వివాహసంబంధమైన మంత్రానికి వాచకమై, ఆ మంత్రం వినియుక్తమయ్యే అవకాశం వివాహ సందర్భంలో కావడంవలన క్రొత్త పెళ్ళి కూతురు అనే అర్థాన్ని గూడా ఇవ్వడంలో చరితార్థం అయింది.

కమలం రంగును బట్టి, సూర్యోదయంతో వికసించడాన్ని బట్టి సూర్యునకు బంధువులాటిదే అయినా. సూర్యకమలం అన్నప్పుడు సూర్యపదం ప్రత్యేకతను వ్యక్తీకరిస్తూ పొద్దు తిరుగుడు పూవు అనే అర్థాన్ని ఇస్తోంది. సూర్యకాంతం అనే పదం సూర్యకాంత మణికి, స్వచ్ఛమైన "స్ఫటికానికి" కూడా వాచకమైంది.

సూర్యగ్రహం అనే పదం గ్రహంగా పిలువబడిన సూర్యునకు వాచకంగా ఉండడం న్యాయమే. గ్రహశబ్దం గ్రహణ వాచకంగా కూడా ఉండడం వలన సూర్య గ్రహణం అనే అర్థంతో బాటు ఆ గ్రహణానికి కారణంగా భావించబడే రాహుకేతువులకు కూడా వాచకమైంది. సూర్యసంబంధమైన పర్వదినాలు అయిన గ్రహణ, సంక్రమణాదులు. సూర్యపర్వం అనే పేర వ్యవహారాన్ని పొందాయి. పురాణగాథలలో సూర్యుని కుమార్తెగా యమునానది గుర్తించబడింది. అందుకే సూర్యపుత్రి, సూర్యతనయ అని పిలువ బడుతోంది. సూర్యునిలో ఉండే కాంతి గుణం, లతలో ఉండే వంపులు ఉండడం వలన లతను స్త్రీగా (స్త్రీత్వం వలన) భావించడం వలన, సూర్యపుత్రి అనే పదం. మెరుపుతీగకు గూడా వాచకం అయింది.

సూర్యము అనే పదం, సూర్యునకు సంబంధించిన వృక్షంగా పిలువబడే అర్కవృక్షం, (జిల్లేడు చెట్టు) అనే అర్థంతో బాటు సూర్యుడు ద్వాదశాత్మకుడైన కారణంవలన 12 సంఖ్యకు వాచకంగాను, సూర్యునివలె గుండ్రంగా కనిపించే గోబి (క్యాబేజి) పువ్వునకు వాచకంగా మారడం ఆశ్చర్యకరమైనదే (చూ. సూర్యరాయాంధ్ర నిఘంటువు) సూర్యసంక్రమణం అంటే ఒక రాశినుండి వేరొక రాశికి సూర్యుడు సంక్రమించడం అని అర్థం, అందుకే మనకు మేష సంక్రాంతి, వృషభ సంక్రాంతి మొదలైనవి, 12 మాసాలలోను ఉన్నాయి. విశేషించి మకర సంక్రాంతికి ప్రాముఖ్యం ఉంది. సూర్యసంక్రమణం అనే పదానికి "సూర్యుడు ఒక అయనముమండి వేరొక అయనమున ప్రవేశించుట" (సూర్యారాయాంధ్రనిఘంటువు 8వ సంపుటం 367 పే) అని అర్థం వివరించడం న్యాయం కాదు.

"సూర్యపంజ్రం" అనే పదం "కుంకుమ పువ్వు" అనే అర్థంలో వికసించడం ఆశ్చర్యకరమే అయినా రంగును బట్టి సరిపెట్టుకోవచ్చు ఈ స్తోత్రంవల్ల ఆ దేవుని హృదయం స్తోత్రం చేసినవానికి వశమౌతుంది. (ఎవరి హృదయమైనా స్తుతికి వశం కావడం సహజమే కదా!) అనే అర్థంలో ఆయా దేవతలకు "హృదయం" అనే పేర స్తోత్రాలున్నాయి. అలాగే సూర్యునికి గూడా "ఆదిత్యహృదయం" అనే పేరుతో ఒక స్తోత్రం రామాయణంలో కనిపిస్తోంది. అది అథర్వణవేదాంతర్గతమని ప్రసిద్ధి. దానికే సూర్య హృదయం, అనే పేరు గూడా ఉంది. సూర్యుడు అధిష్ఠానంగా భావించబడే, రాగి (లోహం) పెద్దగోబి (క్యాబేజివంటిది) కూడా, సూర్యాహ్వయం అనే పేరుతో పిలువబడడం విశేషమే. రవి నేత్రంగా కలవాడు రవి నేత్రుడు విష్ణువు కాగా రవిరత్నం కెంపు రవిలోహం రాగి అవి ప్రసిద్ధిని పొందాయి. ఊఢ పెండ్లాము అనే అర్థం ఉంది. సూర్యోఢ అంటే సంధ్య అనే భావంలో పొద్దుగుంకేవేళ అనే అర్థంతో బాటు సూర్యోఢుడు అంటే సాయం వేళ వచ్చిన అతిథి అనే అర్థం గూడా ఉండడం దూరాన్వయమే.

సూర్యచంద్రులు కలిసి ఒకే డిగ్రీలోకి వచ్చే రోజు సూర్యేందు సంగమం, అర్కేందు సంగమం అనే పేర్లతో అమావాస్య అనే అర్థాన్నిస్తోంది. సూర్య చంద్రులు కూడి ఉండడమే అమావాస్యాశబ్దార్థం. ఆ రోజు చంద్రుడు కనిపించని రాత్రి అహోను అని పిలువబడుతోంది. సూర్యుడు నిప్పులా ఎర్రగా ప్రకాశించే సమయాలు ఉదయాస్తమయాలు, ఉదయానికే ఎక్కువ ప్రాముఖ్యం ఉండడం వలన "అంగారిణి" అని తూర్పు దిక్కు పిలువ బడుతోంది.

## అన్య సంబంధంతో సూర్యవాచకాలు

ఆకసానికి మణిగా గుర్తింపు పొందిన సూర్యుడు అంబరమణి అయ్యాడు. సూర్యోదయంతో ప్రకృతి వికసించడం వలన పద్మ వర్గానికి సూర్యుడు అధిపతి అయినందువలన, అంభోజమిత్రుడు అంబుజ మిత్రుడు, అంబుజ బాంధవుడు, సూర్యుడైనాడు. సర్వభూతాలయందు స్నేహయుక్తుడుగా మిత్రుడు సూర్యుడైనాడు సూర్యుడుదయించే సమయానికి కలువలు ముకుళించడంవలన కలువగొంగ, కలువదాయ, కలువసూడు అనే పదాలతో కలువల శత్రువుగా సూర్యుడు పిలువబడ్డాడు. ఎండవేటని అవిరిగా మారుస్తున్నందువలన సూర్యుడు అంబుతస్కరుడైనాడు కిరణాలే చేతులుగా కలిగి, అంశుకరుడు, అంశుహస్తుడు, కిరణ ధారిగా అంశుధరుడు, కిరణాలకు అధిపతిగా అంశుపతి. కిరణాలు కలవాడుగా అంశుమంతుడు, కిరణాలే మాలగా కలవాడుగా అంశుమాలి, కాంతి కలవాడుగా, అర్చిష్మంతుడు, మేరలేక తన కిరణాలతో ప్రపంచాన్ని నింపువానిగా ఆకూపారుడు మొదలైన పేర్లతో పిలువబడాడు.

ఆకాశమార్గాన (ఒంటరిగా కనిపిస్తూ) పయనించే వాడుగా అధ్వగుడు అనే పదం సూర్యుడు అనే అర్థంలో గూడా ఉపయుక్తమౌతోంది. ఆకాశమార్గానికి అధిపతిగా అధ్వపతి సూర్యుడే.

ఎఱ్ఱదనం ముందుగా కనిపించి తరువాత సూర్యుడు (ఎఱ్ఱగానే) కనిపిస్తాడు. ఆ అరుణిమ సారధిలా ముందుగా కనిపిస్తోంది. కాబట్టి అరుణుడు అనే పేరు పెట్టారు. ఆ అరుణిమ సూర్యునిదే అందుకనే అరుణుడు (సూర్యసారధి, సూర్యుడు) అరుణసారధి, సూర్యుడు అనే అర్థాన్నివ్వడం జరిగింది.

సూర్యుడే ఎఱ్ఱని కాంతి గలవాడనే అర్థంలో అరుణార్చి అనే పదం సూర్య వాచకం అయింది. అరుణుడు సూర్యుడే అయినపుడు సూర్యుని కొడుకులు అరుణాత్మజులు, సూర్యుని కుమార్తె యమున కావడం గాథానుగుణంగా ఉంది. ఆ సూర్యుడు అదితి కుమారుడు అంటున్నారు. ఆ అదితికి మిగిలిన దేవతలంతా కుమారులంటున్నా. అరుణానుజుడుగా, (అరుణుని తమ్ముడు) గరుత్మంతుడే ప్రసిద్ధిని పొందాడు. కారణం సూర్యుని రధసారధి అరుణుడు అతడు గరుత్మంతుని అన్న.

అరుణము అనే పదం, ఎఱ్ఱదనం అనే అర్థంలో బాటు, సంధ్యారాగం అనే అర్థాన్నిస్తోంది. విశేషించి సూర్య సంబంధమైన మంత్రసముదాయానికి గూడా వాచకంగా ఉంది. సూర్యోదయానికి ముందు 3 ఘడియల (గం 1-12ని) కాలానికి (సప్తపంచారుణోదయః) అరుణోదయం అని పేరు. కొందరు 4 ఘడియలు (గ. 1-36 ని) అని అభిప్రాయపడ్డారు.

సర్వులచే పూజింపబడువాడు అనేఅర్థంలో అర్కుడు సూర్యవాచకం అయింది. సర్వమతస్థులే కాదు సర్వ ప్రకృతి సూర్యునిపై ఆదరం, కలదే. సూర్యునిలా వేడిగలది అనే అర్థంలో అర్క శబ్దం జిల్లేడు చెట్టుకు వాచకంగా ఉంది "ఆరోగ్యం భాస్కరాధిచ్ఛేత్" సూర్యుడు ఆరోగ్యకారకుడు అని ప్రసిద్ధి.

సూర్యకాంతి సర్వరోగ నివారకం అని ప్రాచీన సంప్రదాయం. ఆధునికుల, పరిశోధనలలో ఒక క్రమంలో ఉపయోగించబడిన సూర్యకాంతి బహువిధరోగ నివారకంగా నిరూపించబడుతోంది. అలాగే జిల్లేడుకూడా పలువిధాలైన అనారోగ్యాలకు మందుగా ఉపకరిస్తుంది. ఆయుర్వేదంలో ఈ అర్కవినియోగాన్ని వివరించే ప్రత్యేక గ్రంథం ఒకటి ఉంది.

అర్క్యవ్రతం: అనే పదబంధం చాలా విశిష్టార్థంగలది. సూర్యసంబంధి వ్రతంగా రథ సప్తమీ వ్రతం అనే అర్థంతో బాటు, సూర్యుడు కొద్దికొద్దిగా నీటిని ఆవిరి చేస్తూ మేఘములకు చేర్చి వర్షరూపంలో అంతటా సమానంగా ప్రసాదించినట్లు రాజు ప్రజలకు ఇబ్బంది తెలియకుండ పన్నులు స్వీకరించడం అర్క్యవ్రతంగా పిలువబడుతోంది. సూర్యుడు గ్రహరాజు, తాగడానికి ఉపయుక్తం కాని ఉప్పునీటిని, మనం వాడటానికి ఇష్టపడని మురికి నీటిని ఆవిరిగా మార్చి అంతటా సమానంగా వర్షించి మేలు చేస్తున్నాడు. అదే విధంగా పరిపాలన చేసే రాజు అన్ని విధాల ఆదర్శపురుషుడే చల్లని కిరణాలను ప్రసరించే శీతాంశువు (చంద్రుడు) ఒక డుండడంవలన వెచ్చని కిరణాలు ప్రసాదించే సూర్యుడు అశీతాంశువు అయ్యాడు. చక్రవాక పక్షులు (దంపతులు) రాత్రి చీకటిలో ఒకదానికొకటి కన్పించక వియోగంతో దుఃఖిస్తాయి. ఉదయకాలంలో వెలుగుకు ఆనందిస్తాయి. అందుచేత ఆ చక్రవాకములకు ఆనందాన్ని అందించే బంధువు చక్ర బంధువు సూర్యుడు.

**అరుష-అరూష**

అరుష (వరోషతి - కృధ్యతి) కోపగించనివాడు. "యుంజన్తిబ్రధ్న మరుషం చరన్తం పరితస్థుషః" అని యజుర్వేదం 2-3-5. అసౌవా ఆదిత్యో బ్రధ్నో రుషః అని శ్రుతి ఈ వాక్యాలను అనుసరించి పరిశీలిస్తే, కోపగించనివాడు సూర్యుడు అనే భావన కలుగుతోంది. జ్యోతిశ్శాస్త్ర రీత్యా కోపం ప్రదర్శించని గాంభీర్యానికి కారకుడు సూర్యుడు రెండవ అర్థం రోచమానుడు (ప్రకాశించేవాడు).

"శ్వేతం సంజ్ఞానమరుషం సహితా" ఋ 3-1-4.

అని శ్రుతి "అరుషం రోచమానం" అని భాష్యం. ఋ-గతౌ- ఉషన్. మూడవ అర్థం గమన శీలంగల అశ్వాదులు "యుక్ష్వాహ్యరుషీరథే" ఋ 1-14-12 "అరుషీ గమన శీలావడవాః" అని భాష్యం హింసారహితుడు అనే అర్థం ఉంది. "జానంతి వృష్ణో అరుషస్యశైవం" "అరుషస్య హింసారహితస్య" అని భాష్యం.

అరుష్ అనే పదానికి నాస్తి రుట్-యస్య అనే, వ్యుత్పత్తి, ప్రకారం క్రోధంలేని గోవు, ఉషస్సు అనే అర్థాలున్నాయి.

అరూష శబ్దానికి (ఋ+ఊషన్)

సర్ప విశేషం, సూర్యుడు అనే అర్థాలున్నాయి. ఇక్కడ మనంగమ... ...సింది.

ఋ అనే ధాతువుకు - ఉషన్, ఊషన్. అనే ప్రత్యాయాలు కలిపి ... ఏ స్వభావాలను, ఆ స్వభావాలతో పోలే అంశాలను అను అర్థాలుగా స్వీకరించాయి అని తోస్తోంది. సూర్యుడు రాజు

క్రూరుడే అయినా గంభీరుడు తన మనోభావాలు బహిర్గతం కాకుండా వ్యవహరింపగల సమర్థుడు. కాగా, కోపం చూపని వాడు కోపగించనివాడే, అతడే హింసారహితుడు, నిరంతరం ప్రకాశించే వాడు అతడే, గమనశీలుడు అతడే.- ఉషస్సుతో సంబంధం గలవాడూ అతడే. అరుష అనే శబ్దంతో సమానంగా ఉన్న అరూష శబ్దం గూడా ఈ అర్థాలలో సూర్యుడు అనే అర్థాన్ని విడవలేదు. ఈ అంశాన్ని మనం గమనించాలి. కాగా, అరుష, అరూష పదాలు ఉషస్సుతో సంబంధం గల సూర్యుడు అనే ప్రధానార్థం ముందుగా పొంది. ఆతని లక్షణాలైన కాంతి, గమనం కోధరాహిత్యం, హింసారాహిత్యం, అనే అర్థాలను ఆ భావాలు గల ఇతరాంశాలను తమ అర్థాలుగా మార్చుకొని, విస్తరించినట్లు అర్థం అవుతోంది. జుగతౌ అనే ధాత్వర్థము ఉషస్సుతో సంబంధము (ఉష-ఊష) గలవాడు సూర్యుడు సూర్యుడు కాంతి గలవాడు కాబట్టి అరుష అనే శబ్దానికి రోచమానుడు అనే అర్థం. సూర్య ప్రభావజనితుడు గంభీరుడు గాబట్టి కోపాన్ని ప్రదర్శించడు కాబట్టి అరూష శబ్దానికి రోషరహితుడు అనే అర్థం. రోషం ప్రదర్శించని వాడు హింసచేయడు కాబట్టి హింసా రహితుడు అనే అర్థం, ధాత్వర్థమైన గతి శీలాన్ని స్వీకరిస్తే అరుషశబ్దానికి గుర్రం, అరూష శబ్దానికి సర్పవిశేషం, అర్థాలుగా రూపొందాయి. ఈ క్రమాన్ని గమనిస్తే సూర్యుడనే ప్రధానార్థం, మిగిలిన అర్థాలను విస్తరించిందని అంగీకరించవచ్చు. ఇలా మన సాహిత్యంలోని జ్యోతిశ్శబ్దార్థాలను గమనించడం ద్వారా గ్రహాల స్వభాలను అర్థం చేసుకోవచ్చు.

## అరవై సంవత్సరాలు అంతరార్థం

రవికి- రాశి గమనకాలం సుమారు 1 మాసం 12 రాసులు పూర్తి చేయడానికి పట్టే కాలం ఒక సంవత్సరం చంద్రునకు రాశి పూర్తి చేయడానికి పట్టే కాలం సుమారు $2\frac{1}{4}$ రోజులు, వృద్ధి క్షయాలద్వారా 12 మాసాలు పూర్తికావడానికి 354 రోజులు పడుతుంది. అధిక మాసం ద్వారా చంద్రమానం సౌరమానంతో కలసిపోతుంది. కుజబుధశుక్రులు సుమారుగా సంవత్సరకాలంలో రాశిచక్రాన్ని చుట్టి వస్తారు. కాబట్టి ఒక సంవత్సరం అంటే రవి, చంద్ర, కుజ, బుధ శుక్రులు గతులను సుమారుగా కొలిచేదయింది.

గురుడు సుమారు 12 సంవత్సరాలలో రాశి చక్రాన్ని పూర్తి చేయగా శని సుమారు 30 సంవత్సారాలలో రాశి చక్రాన్ని పూర్తి చేస్తున్నాడు. 30 సంవత్సరాల శని గతిలో 12 సంవత్సరాల గురుని గతి ఇమడదు. శని గతిని రెండు పర్యాయాలు స్వీకరిస్తే గురుడు 5 పర్యాయాలు రాశి చక్రాన్ని చుట్టి వచ్చేటప్పటికి శని రెండు పర్యాయాలు చుట్టి వస్తాడు. కాగా అరవై సంవత్సరాలకు

ఒక పారి గ్రహాలన్నీ సుమారు తాము బయలుదేరిన ప్రదేశానికి వచ్చే అవకాశం ఉంది. కాగా, 60 సంవత్సరాల పరిగణన లెక్కలోకి వచ్చింది.

# కుజదోషం

## సమగ్ర పరిశీలన

మనం సామాన్యంగా వివాహ సందర్భాలలో కుజదోషం అనే మాట వింటూంటాం. ఆ కుజ దోషాన్ని నిర్వచించే శ్లోకాలు ఆ దోషములు పరిహరించే యోగాలను తెలియజెప్పే శ్లోకాలు చాలా రకాలుగా కనిపిస్తున్నాయి. ఆ శ్లోకాలను అర్థాలు చెప్పే విధానాలు గూడా పలురకాలుగా కనిపిస్తున్నాయి. కుజదోషానికి సంబంధించిన పరిహార వాక్యాలలో కొన్ని సంయుక్తికంగా కనిపించినప్పటికి మరికొన్ని సయుక్తికంగా కనిపించటంలేదు. దొరికే శ్లోకాలను సమన్వయం చేస్తూ వాటిలోని వాస్తవికతను సయుక్తికతను పరిశీలించేందుకు ఉద్దేశింపబడినదే ఈ వ్యాసం.

జ్యోతిష విజ్ఞాన పత్రిక (10-7-1971) 25 వ పేజీలో శ్రీ అన్నాప్రగడ శ్రీ రామమూర్తిగారు పరాశరుని స్త్రీ జాతకాధ్యాయం లోనివిగా కొన్ని శ్లోకాలను ఉదహరించారు.

"లగ్నే వ్యయే, సుఖేవాస్త మేకుజే
శుభదృగ్యోగ హీనేచ పతింహన్తి నసంశయః
యస్మిన్ యోగే సముత్పన్నాపతింహన్తి కుమారికా
తస్మిన్ యోగే సముత్పన్నో పత్నీం హన్తినరోపిచ
స్త్రీ హన్త్రా పరిణీతాచేత్ పతిహన్త్రీ కుమారికా
తథావైధవ్య యోగస్య భంగోభవతి నిశ్చయాత్"

1,12,4,8, స్థానాల్లో కుజుడుండి శుభగ్రహముల కలయిక దృష్టిలేనపుడు ఆ జాతకురాలి భర్త మరణించును. అట్టి యోగము భర్తకు కూడా ఉన్నచో వైధవ్యయోగము భంగమగును. అని పై శ్లోకముల సారాంశం. ఇందు కుజదోషమను మాటలేకున్నను భావము తదనుగుణముగనే యున్నది. మరియు స్త్రీజాతకంలో యే యోగము వైధవ్య యోగమో అది పురుష జాతకంలో విధుర యోగము కాగలదనియు, రెండు జాతకములలోను అట్టి యోగము లున్నప్పుడు ఆ దుష్ట యోగము భంగము కాగలదనియు వివరించుట కనిపించుచున్నది. కాగా దీనిని వైధవ్యయోగము లేదా విధురయోగము అనవలెననియు, అది వినుట కింపుగా లేనందున తరువాతి కాలంలో కుజదోషమను పేర వినవచ్చుచున్నదనియు మనము గుర్తింప వలసియున్నది.

వైధవ్యయోగ విషయమున ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రజ్ఞులగు మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారి వచనము

దృష్టియందుంచుకొనదగియున్నది.

ప్రస్తుత కాలమందు గల స్త్రీ జాతకములలో బాల వైధవ్య యోగములు పట్టినపుడు వివాహము ఆలస్యముగ జరుగుట అట్టి స్త్రీలు ఉత్తమ విద్యావంతులై ఉన్నతోద్యోగములను పొందుట లేక 25-30 సంవత్సరముల మధ్య వయస్సు నందు వివాహితులగుట వంటివి గోచరించుచున్నవి".

భారతీయ ధర్మపద్ధతి ప్రకారము స్త్రీకి 8-12 మధ్య వివాహముగాని, రజస్వలకు పూర్వముగాని వివాహము జరిగినచో అట్టి జాతకములందు గల బాలవైధవ్య యోగములు అనుభవములో గనబడుచున్నవి. అట్లు వివాహము జరుగకుండా ఉన్నప్పుడు బాల వైధవ్యమునకు బదులు విద్యాయోగము గల జాతకులందు విశేష విద్యాప్రాప్తి గనబడుచున్నది. (జ్యోతిష విజ్ఞాన పత్రిక 10-7-1978 - 22 వ పేజీ) జాతక పారిజాతంలో సప్తమ అష్టమ నవమ భావ ఫలాధ్యాయం "కుజేత్ప్రియతే మందే దుర్భగా రాహు సంయుతా (- 12 శ్లోకమునందు) సప్తమమందలి కుజస్థితి భార్యామరణ యోగముగా వివరింపబడినది. ఈ సందర్భంలోనే

సప్తమేవా ష్టమే పాపే వ్యయస్థే ధరణీ సుతే
అదృశ్యేయదితన్నాథే కళత్రాంతరభాగ్భవేత్ - 18 శ్లో

7,8 స్థానాల్లో పాపగ్రహం, వ్యయంలో కుజుడు ఉండి అష్టమమునకు అధిపతి అదృశ్య (1 నుండి 7) చక్రార్థమందుండుట గావి అస్తం గతత్వమందుండుట గావి జరిగినపుడు మరియొక భార్యను పొందువాడగును అవి కలదు.
ఇదే సందర్భంలో,

"విత్తే పాప బహుత్వేచ కళత్రేశేతథా స్థితే
శత్రు స్థాన గతే కేతౌ కళత్ర[illegible] భాగ్భవేత్" - 20 శ్లో

ద్వితీయ మందు పాపగ్రహములెక్కువ[illegible] నుండి కళత్ర స్థానాధిపతి పాపగ్రహములతో కూడి 6వ స్థానంలో కేతు వున్నచో ముగ్గురు భార్యలుందురు. అవి చెప్పబడినది.

ఫలదీపికలో స్త్రీ జాతకాధ్యాయంలో
యద్యత్పుం ప్రసవే క్షమంత దఖిలం స్త్రీణాం ప్రియే వాసదే
వ్యాంగళ్యం విధవాత్ సుతాంశ్చ నవమాల్లగ్నాత్రవోక్తాబహ్రాం
భర్తారం సుభగాత్వ మస్తభవనాత్పుంగం సప్తేస్వం సుఖాత్
సన్త స్త్రే షు శుభప్రదాస్త్వ శుభదాః క్రూరాస్తదీశం [illegible] - అవి కలదు.

పురుషజాతకంలో ఏఏ ఫలితాలు ఏయే భావాలలో పరిశీలిస్తామో ఆయా భావాలను అట్లే స్త్రీ జాతకంలోను పరిశీలించాలి. ఆయా భావాల్లో దుష్టగ్రహాలుంటే దుష్టఫలితము మంచి గ్రహాలుంటే సత్ఫలితము చెప్పదగియున్నది. దుష్టులైనను ఆరాశ్యాధిపతులైనచో దోషము లేదు అని చెప్పబడినది. ఇదే సందర్భంలో,

"సుఖే పాపై ర్యుక్తే భవతి కులటా" - 4 శ్లో

4తు ంలో పాపులుంటే కులట యగును అని చెప్పబడినది.

"అ.· ద్యూర్మదన స్థితైశ్చ విధవా మిశ్రైః పునర్భూర్భవేత్

నృా ష్వా యుషి భర్తృ హంత్ర్యపిధనేసన్తః స్వయం స్త్రీ మృతిః - 3 శ్లోకం

సప్తమంలో దుష్ట గ్రహాలుంటే వైధవ్యం మిశ్రగ్రహాలుంటే పునర్వివాహము, అష్టమంలో దుష్టగ్రహాలుంటే భర్తమరణము, ధనస్థానంలో దుష్టగ్రహాలుంటే స్వయముగా స్త్రీ మృతి ఫలితముగా చెప్పబడినవి.

ఫల దీపికలో కళత్ర భావాధ్యాయంలో

శుభాధిపయుతే క్షితే సుతకళత్ర భేలగ్నతో

విధోరపితయో శ్శుభం త్వి తరథాన సిద్ధిస్తయోః

సితాద్వ్యయ సుఖాష్టగైః ఖల ఖగైరసన్మధ్యగే

సితేష్వథ శుభేతరేక్షితయుతే చ జాయా వధః

లగ్నమునుండి చంద్రుని నుండి 5,7 స్థానములు శుభ యుత దృష్టులైనచో సంతానము, భార్యా సౌఖ్యము ఆమవానికి శుభము కల్గును. శుక్రుని నుండి 4,8,12 స్థానాల్లో దుష్టులున్నను శుక్రుడు దుష్టులచే చూడబడినను దుష్టగ్రహములతో కూడినను పాపగ్రహమధ్యలో శుక్రుడున్నను భార్యా నాశము కలుగును. అని చెప్పబడినది. పై అంశములను పరిశీలించగా ప్రాచీన గ్రంథాలలో కుజ దోషమను పేరు కనిపించకున్నను,

లగ్న, చంద్ర, శుక్రులనుండి, 1,2,4,7,8,12, స్థానాల్లో ( కుజుడును దుష్ట గ్రహమే కాబట్టి) దుష్టగ్రహములు గాని, కుజుడు గాని, ఉన్న యెడల వివాహ జీవితమునకు సంబంధించి దుష్టఫలితములు చెప్పబడినవి అని స్పష్టమగుచున్నది.

స్త్రీ పురుషుల జాతకాల్లో ఆదోషాలున్నచో, దోష పరిహారము కాగలదని స్పష్టపడుచున్నది. స్త్రీ జాతకమునకు 4వ స్థానంలో దుష్టగ్రహములున్నపుడు భర్తృసౌఖ్యరాహిత్యమును, శీల సంబంధమైన

దోషములను, చెప్పబడినవి స్త్రీ శీల ప్రాముఖ్యతను చేర్చినట్లు కన్పించుచున్నది.

కాని సకల దుష్ట గ్రహములకు సామాన్యమైన ఈ దోషమును, కుజునకు మాత్రమే, పరిమితము చేయుట వలన ఒకరకమైన సంకుచిత దృష్టి ఏర్పడుచున్నది? ఉదాహరణకు ఒక జాతకంలో దుష్ట స్థానంలో కుజుడున్నపుడు, మరియొక జాతకంలో మరియొక దుష్టగ్రహము పైన చెప్పబడిన స్థానాల్లో ఉన్నపుడు ఆ దోషము పరిహరింపబడుట న్యాయము కుజ దోషం అని పేరు పెట్టుట వలన పై అవకాశమును కోల్పోవు చున్నాము. శుభగ్రహముల దృష్టి సంయోగాదులన్నపుడు పై దోషములు పరిహరింపబడుచుండుటను మనం గమనించాలి. ఇతర గ్రహాలచే సంభవించే భార్యా నాశయోగములను వేటిని పరిశీలించకుండ, కుజదోషము నొక్కదానినే పరిశీలించుటయు న్యాయం కాదు.

ఇక కుజదోష విధాయక శ్లోకమును, తత్పరిహార, శ్లోకములను, అందలి లోపాలను పరిశీలిద్దాం. నవగ్రహ ప్రదర్శిని అను గ్రంథంలో ఉదహరించబడిన శ్లోకముల పరిశీలన - ఈ శ్లోకమెక్కడిదో చెప్పబడలేదు.

ధనేవ్య యేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే
నరీణాం స్త్రీ వధః కుర్యాత్ పుంసాం భార్యావినాశనం - 15 వ పేజీ

2,12,4,7,8, స్థానాల్లో కుజుడుంటే స్త్రీలకు వైధవ్యం పురుషులకు భార్యావియోగం అని భావం. ఇందలి పాతాళ పదము పురుష జాతకంలో అన్వయిస్తుంది గాని, స్త్రీ జాతకంలో అన్వయించదు. పురుష జాతకంలో ద్వితీయ కుజుడు భార్యా బహుత్వమనే ఫలితాన్ని స్త్రీ జాతకంలో స్వనాశమనే ఫలితాన్ని ఇస్తాడు. కాబట్టి స్త్రీ పురుషులకి జాతకాల్లో ద్వితీయ స్థానంలో కుజదుంటే వారిరువురికి కుజదోషం పరిహారమైనదని, వివాహంచేయుట ప్రమాదకరము కాగలదు.

పరిహార శ్లోకాల్లో
లగ్నేందు శుక్రాదుస్థానే గూర్య స్థితి సంభవః
తద్దశాపాక సమయే దోషమాహుర్మనీషిణః
(ఈ శ్లోకమెచ్చటిదో చెప్పలేదు)

లగ్నము చంద్రుడు, శుక్రుడు అనువారికి పై దుష్ట స్థానాల్లో కుజదుంటే కుజదశవచ్చినపుడు దోషమని పండితులు చెప్పెదరు అని పై శ్లోకానికి భావము.

కాని దుష్టయోగం గల జాతకానికి ఆ మహా దశలోనే జరుగుతుంది. **అవదానికి వీలులేదు.** అంతర్దశలలో కూడ దోషం సంభవించవచ్చు. అందుచేత "**కుజ దశ చిన్నతనంలో వెళ్ళిపోయిన** వాళ్ళకి కుజదోషం చూడనక్కరలేదు" అనే వాదుక న్యాయం కాదు.

చతుస్సప్తమగే భౌమేమేష కర్కాళి వక్రగే

యదారాశౌ శుభం ప్రోక్తం కుజ దోషోన విద్యతే - (నవగ్రహదర్శిని 16 వ శ్లో)

4,7 స్థానాల్లో కుజుడున్నపుడు ఆ కుజుడున్న స్థానం మేష, కర్కాటక, వృశ్చిక, మకరములైనపుడు కుజదోషం లేదని పై శ్లోకము యొక్క భావము.

యద్యుత్సుం ప్రపవే ---- క్రూరాస్తదేశం వినా అని చెప్పబడుటచే మేష, వృశ్చికము లందు స్థితి దోషపరిహారకమే.

చంద్రక్షేత్రములో సప్తమంలో శని, కుజులుండుటచే భార్య పతివ్రత సద్గుణములు కలది యగును. అని ఉండుటచే కర్కాటకము నందలి కుజుడు దోషికాదు ఉచ్ఛయందలి పాపగ్రహమైనా సత్ఫలితములనే ఇస్తుంది. కాబట్టి మకరము, నందు కుజుడున్నను దోషపరిహారకుడు కాగలడు కాని ఏ దుష్ట స్థానాల్లో కుజుడున్నను అతడు స్వక్షేత్రవర్తి యైనపుడు దోషం ఉండదని (క్రూరాస్తదీశం వినా) చెప్పబడుచుండ మేష వృశ్చికములు 4,7, భావాలై నపుడు మాత్రమే అని సంకుచితము చేయుట న్యాయము కాదు కదా?

చరరాశి గతే భౌమే చతుర్థ వ్యయే ద్వయే

లగ్నే పాప వినాశ స్యాత్ శేషాః పాప విశేషతః (నవగ్రహ ప్రదర్శిని - 17 వ పేజి)

4,8,12,2,1, స్థానాల్లో కుజుండుండి ఆ కుజుడున్న స్థానం చరరాశి యైనపుడు పాపం నశించును. మిగిలినవి ఆ పాపగ్రహము యొక్క పాప విశేషమును బట్టి యుండును. అని పై శ్లోకము నందలి భావము.

మేష, కర్కాటక, తులా మకరాలు, చరరాశులు కాని చర రాశులైన మేష, మకరాలకు కుజదోషం లేదనుట న్యాయమే. తులలో నున్నపుడు మేషాన్ని చూస్తాడు కాబట్టి, తుల లగ్నమైతే ఆ లగ్నంలో కుజుడున్నపుడు దోషికాదు కాని అది సార్వత్రికం కాదు. ఉదాహరణకు కన్యాలగ్నం వారికి ద్వితీయ కుజుడు, తృతీయ అష్టమాధిపతి అచ్చట అతడు మేలు ఎలాచేయగలడు?

"సప్తమ భావం కర్కాటకమైనపుడు" చంద్రక్షేత్రే - శోభనా అనే వాక్యం వలన శుభఫలము-నుచెప్పవచ్చును గాని ఇతర స్థానాలైనపుడు మేలు ఏ విధముగా చేయగలడు?

"పంచగ స్థానగే దోషే లగ్నేందు గురు సంస్థితే
బుధ స్థితేన దోషోస్తి దృష్టే దోషం నవిందతి"
ఈ శ్లోకం స్పష్టమైన అర్థం కలిగినదిగా లేదు.

<u>పంచగస్థానగే దోషే</u> పంచమ అయి ఉండవచ్చును కాని పంచమ స్థానం దోష స్థానాల్లో లేదు కదా!

(అర్కేందు క్షేత్ర జాతానాం ---- పీడకోనభవేత్కుజ నవగ్రహప్రదర్శిని - 18వ పేజీ)

సూర్య చంద్రుల క్షేత్రాల్లో జన్మించిన వారికి కుజదోషం లేదు. ఉచ్చమిత్ర క్షేత్రాల్లో, జన్మించిన వారిని పీడించదు కదా? అని పై శ్లోక భావం.

సూర్యచంద్రుల క్షేత్రాలైన కర్కాటక సింహలగ్నాలకు కుజుడు యోగప్రదుడగుట వలన కుజదోషం లేదనవచ్చును. కుజుని మిత్రులలోనివాడైన గురుని క్షేత్రాల్లో, మీన లగ్నం వారికి గూడా శుభుడే (భాగ్యాధి పత్యంచేత) ధనుర్లగ్నం వారికి పంచమవ్యయాధిపతి సముడౌతాడేకాని పూర్తి శుభుడు కాలేదు కదా?

ద్వితీయే భౌమదోషస్తు యుగ్మ కన్యక యోర్వినా - నవగ్రహప్రదర్శిని - 19వ పేజీ
మిధున కన్యలలో కుజుడుండి ద్వితీయ స్థానమైతే దోషం లేదు అని భావం.
సింహలగ్నానికి ద్వితీయం కన్య సింహలగ్నానికి కుజుడు యోగకారకుడు (చతుర్థ, భాగ్యాధిపతి) కావున దోషి కాడనుట న్యాయమే కాని.

వృషభానికి ద్వితీయం మిధునం వృషభలగ్నానికి కుజుడు (సప్తమ వ్యయాధిపతి కావున) సముడు అయినప్పటికిని అతడు ఆయుర్విషయంలో మేలు ఎలా చేయగలడు?
ద్వాదశేభౌమ దోషస్తు వృషతౌళిక యోర్వినా (నవగ్రహ ప్రదర్శిని - 19 వ పేజి)

మిధున లగ్నానికి వ్యయంలో కుజుడు (షష్ఠాధిపతి) సప్తమాన్ని మిత్ర దృష్టితో (ధనుస్సు) చూచినందువలన కొంతమేలు చేయవచ్చును గాని,
వృశ్చికానికి వ్యయంలో తులలో నున్నపుడు లగ్నాధిపతి యొక్క వ్యయస్థితి శుభప్రదం కాగలదా?

చతుర్థే భౌమదోషస్తు మేష వృశ్చిక యోర్వినా (నవగ్రహ ప్రదర్శిని - 19 వ పేజీ) చతుర్థమందు కుజుడుండి అస్థానం మేష, వృశ్చికము లైనప్పుడు కుజదోషముండదు అని భావం కాని,

మేష, వృశ్చికాల్లో కుజుడుంటే అవి ఏ స్థానాలైనా దోషముండదు (క్రూరాస్తదీశం వినా) చతుర్థ, కుజ, దోషము మాత్రమే అని చెప్పుట ఎంత వరకున్యాయం?

సప్తమే భౌమ దోషస్తు నక్రకర్కాట యోర్వినా (నవగ్రహ ప్రదర్శిని - 19 వ పేజీ) సప్తమ కుజ దోషము మకర కర్కాటకములకు లేదు. ఇది న్యాయమే కారణమే మంటే

చంద్ర క్షేత్రగయోర్మదేర్కి కుజయోః పత్నీ సతీ శోభనా

ఫలదీపిక కళత్రభావం (3వ శ్లో)

అని చెప్పుట వలన మకర లగ్నానికి సప్తమ కుజదోషం లేదు. కర్కాటక లగ్నమైనపుడు ఉచ్చ అగును. కాన ఉచ్చస్థుడైన కుజుడు విశేషించి కర్కాటక లగ్నానికి పంచమ దశమాధిపతి గాన దోషికాదు.

అష్టమే భౌమ, దోషస్తు ధనుర్మీన ద్వయోర్వినా

సింహలగ్నానికి (పంచమభాగ్యాధిపతి) అష్టమంలో మీనంలోని కుజుడు దోషికాదు అనుట న్యాయమే కాని వృషభలగ్నానికి, అష్టమంలో కుజుడు దోషి అనుటయే న్యాయము. సప్తమ వ్యయాధిపతిగదా? సప్తమాధిపతి అష్టమంలో ఉన్నప్పుడు సప్తమానికి మేలు ఎలా చేయగలదు?

కుంభేసింహే నదోషస్స్యాత్ ప్రత్యక్షం దేవకేరళే

నవగ్రహ ప్రదర్శిని - 19వ పేజీ

కుంభంలో గాని, సింహంలోగాని, కుజుడున్నపుడు దోషం లేదని దేవకేరళం చెప్పుచున్నదని భావం కాని ఇది సార్వత్రికంగా అంగీకరించేందుకు అవకాశం లేదు. కన్యా, మకర, కుంభాలకు దోషియైన కుజుడు ఆ లగ్న జాతకులకు మేలు చేయలేదు కదా!

గురు మంగళ సంయోగే కుజదోషోనవిద్యతే

నవగ్రహ ప్రదర్శిని 19వ పేజీ

శుభదృష్టి దోషపరిహారకంగా చెప్పబడి యుండుటచే ఇది న్యాయమే కాని కొన్ని లగ్నాలకు గురుడు యోగ ప్రదుడు కాడు కదా! అట్టి గురు సంయోగము శుభఫలితాన్నిస్తుందా? అని సందేహించవచ్చు గాని శుభయుతి దోషపరిహారకము అని చెప్పబడినది.

చంద్ర మంగళ సంయోగే కుజదోషో నవిద్యతే

నవగ్రహ ప్రదర్శిని - 19వ పేజీ

చంద్రయుతి కుజదోష పరిహారకం ఇదియును న్యాయమే
కాని చంద్రుడు క్షీణ చంద్రుడు కారాదు అని చెప్పవలసియున్నది.

ద్వితీయ ద్యూనగే పుంసాం స్త్రీణాంచత్వారి రిఃఫగే
ఉభయో రష్టమం దోషం భౌమ దోషంవదే ద్బుధః

నవగ్రహప్రదర్శిని - 23వ పేజీ

2,7 స్థానాలు పురుషునికి, 4,12 స్థానాలు స్త్రీలకు
8 ఇరువురికి దోషం అని దీని భావం. కాని సప్తమ స్థితి ఇరువునికి దోషమే.

అష్టమ స్థితి స్త్రీ జాతకంలో పురుషునికి పురుష జాతకంలో పురుషునికి దోషం ఆ అంశాన్ని గమనించాలి అనగా స్త్రీ పురుష జాతకాల్లో అష్టమంలో కుజుదుంటే పురుషునికి ఆపద వచ్చును.

ద్వితీయ స్థితి వలన స్త్రీ జాతకంలో తనకే నాశం చెప్పబడింది. పురుషుని జాతకంలో బహు భార్య యోగం మాత్రమే కాన పై శ్లోకం సయుక్తికం కాదు.

దంపతోర్జన్మకాలే వ్యయ ధన హిబుకే సప్తమే రంధ్రలగ్నే
లగ్నాచ్చంద్రా చ్చ శుక్రా దపిఖలు వివసన్ భూమి పుత్రస్తయోశ్చ
దంపత్యోర్దీర్ఘ మాయుర్ధన మతి బహుళం పుత్ర లాభం కరోతి
దద్యాదేకత్ర హీనో మృతి రఖిల భయుం పుత్ర నాశం విధత్తే

23వ పేజీ

దంపతుల కిరువురికి లగ్న, చంద్ర, శుక్రుల నుండి 12,2,4 ,7,8 స్థానాల్లో కుజుదుంటే దంపతులకు దీర్ఘాయువు, ధనం, సంతానం అనునవి కల్గించును. ఒకచోట ఉండి ఒక చోట లేకున్నచో మృతి, సమస్త భయములు పుత్రనాశము కల్గును అని భావం.

పై శ్లోకం న్యాయసమ్మతమే గాని శుక్రాత్తు ద్వితీయ స్థాన స్థితి విషయం పరిశీలింపదగియున్నది.

**వాగంబు** కుందర్ప మృతి వ్యయస్థే కుజేతు పాణిగ్రహణం నకుర్యాత్
**బుధార్క్య**యుక్తే వృథవా నిరీక్షితే తద్దోషనాశం ప్రవదంతి సంతః

నవగ్రహ ప్రదర్శిని 24వ పేజీ

2,4,7,8,12 స్థానాల్లో కుజుడుంటే వివాహం చేయరాదు. బుధ, గురులతో కలిసినా వారిచే చూడబడినా ఆ దోషం నశిస్తుంది. అని పై శ్లోక సారాంశం కాని వివాహము చేయరాదు. అనుట సరిగాదు. ఆ స్థితికి సరిపడినజాతకునితో వివాహం చేయమనుట శాస్త్రీయమైన పద్ధతి కాదా?

బుధుని కలయిక విషయంలో శుభయుతుడైన బుధుడు అని చెప్పాలి. శుభయుతుడు కాని బుధుడు కుజయుతుడైనచో దోషి కాగలడు కాని కుజుని దోషం హరించలేడు కదా?

అగస్త్య సంహిత లోని శ్లోకాలుగా

ధనే వ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే

స్త్రీణాం భర్తృ వినాశాయ పుంసాం భార్యా వినాశనం

నవగ్రహ దర్శిని 25వ పేజీ

అను శ్లోకమును ఉదహరించినారు.

కేరళీయ భావ దీపంలోని శ్లోకంగా

లగ్నవ్యయేచ పాతాళే జామిత్ర చాష్టమే కుజే

స్త్రీణాం భర్తృవినాశస్యాత్ పుంసాం భార్యా వినాశకృత్

నవగ్రహ ప్రదర్శిని 25వ పేజీ

అను శ్లోకమును ఉదహరించినారు.

ఇందు లగ్నము చేర్చబడి ధనస్థానము విడువబడినది.

భావచంద్రికలోని శ్లోకంగా

క్రూరదృగవనీ సూనుః కుటుంబ స్థితశ్చేత్తద్దర్మే

భావావిష్ట కరత్వే కరోతి తద్భావ మన్యథానైవ

నవగ్రహ ప్రదర్శిని 25వ పేజీ

అని ఉదహరించారు.

క్రూర దృష్టిగల కుజుడు కుటుంబ స్థానమైన ద్వితీయము నందున్నప్పుడు ఆ భావానికి అనిష్టము చేయును అట్లుకానిచో దోషము చేయదు అని భావం అనగా ఆ గ్రహమున్న రాశులు గాని ఆ గ్రహము చూచు రాశులు గాని క్షేత్ర ఉచ్చక్షేత్రములైనచో ఆ భావాలకు దోషం చేయదు కదా? ఆ భావము శత్రు, సమ లైనపుడు అధికముగా దోషము చేస్తాడు మిత్ర క్షేత్రమైనపుడు సామాన్య ఫలితము మాత్ర చెప్పవలసివుంది.

"స్వోచ్చే పూర్ణం స్వత్రికోణేత్రి పాదం స్వక్షేత్రేర్ధం మిత్రభేపాదమేవ" ఫలదీపిక గ్రహబలాధ్యాయం 7 వ శ్లోకం

ఉచ్చలో 100% మూలత్రికోణమునందు 75%, స్వక్షేత్రం 50 % మిత్రక్షేత్రం 25% బలము కల్గియుందురని ఫలదీపికలో చెప్పబడింది.

దేవకేరళీయ మందలి శ్లోకముగా

ధనసుత సప్తమ మృత్యువ్యయ గోయది భూమి సుతః పుంసాం
జన్మవిదార వినాశం కురుతే స్త్రీణాంచ వైధవ్యం

నవగ్రహ ప్రదర్శిని 25 వ పేజీ

అను దానిని ఉదహరించారు.

2,5,7,8,12 స్థానాల్లో కుజుదుంటే పురుషులకు భార్యానాశం స్త్రీలకు వైధవ్యం అని పై శ్లోకం భావం.

ఇందలి విశేషమేమంటే 4, స్థానాన్ని విడచి 5వ స్థానం (పురుషజాతకంలో) 9వ స్థానం (స్త్రీ జాతకాల్లో) స్వీకరించినట్లైనది. సంతాన స్థానమునందు కుజ స్థితికి భార్యా నాశవైధవ్యయోగాలకి సంబంధం చెప్పటం సరికాదని భావించాలి.

భావరత్నాకరంలోని శ్లోకంగా

తను ధన సుఖ మదనాయుర్లాభవ్యయగః కుజస్తుదాంపత్యం
విఘటయతి తద్గృహే శోనవిఘటయతి తుంగ మిత్ర గేహేవా

నవగ్రహ ప్రదర్శిని 25వ పేజీ

ఉదహరించారు.

1,2,4,7,8,11,12 స్థానాల్లో కుజుదుంటే దాంపత్యాన్ని వేరు చేస్తారు స్వ, ఉచ్చ, మిత్ర క్షేత్రాల్లో ఉంటే వేరు చేయదు అని పై శ్లోకం సారాంశం. ఇందు 11వ స్థానం కూడ చేర్చబడింది. లాభస్థానమందెంతటి దుష్టగ్రహమైనా మేలే చేస్తుంది. కాని కీడు చేయదు కదా! అందుచే పై శ్లోకము మనం ప్రమాణంగా భావించనక్కరలేదు.

ఇప్పటివరకు వేరు వేరు శ్లోకాల్లో చెప్పిన కుజుదుండరాని స్థానాల్ని ఏకత్ర దర్శిస్తే 1,2,4,5 (పురుషజాతకాల్లో) 7,8,9, (స్త్రీ జాతకాల్లో) 11,12, స్థానాలు తేలినవి.

ఇక మిగిలినవి 3,6,10 స్థానాలు మాత్రమే వాటిని గూడ పూర్తి చేయాలంటే ఈ క్రింది శ్లోకం బాగా ఉపకరిస్తుంది.
వివాహ వనమాలలోని శ్లోకాలుగా
ఆ క్రిందివానిని ఉదహరించారు.

ఆ ర్గ్నిః క్రూర దృగ్వక్రీ కుజః పాప ఫలప్రదః
స్వాధిష్ఠితం స్వదృష్టంచ భావం నాశయతి ధృవం

నవగ్రహప్రదర్శిని 25వ పేజీ

విప్వలాంటి కుజుడు క్రూరదృష్టికలవాడు పాపఫలాన్నిచ్చేవాడు అతడున్న భావాన్ని చూచే భావాల్ని తప్పనిసరిగా నాశం చేస్తాడు అని పై శ్లోకం సారాంశం.
ఉదాహరణకు 3వ స్థానంలో ఉంటే 9వ స్థానాన్ని చూస్తాడు! అది స్త్రీ జాతకంలో **సంతాన స్థానం.**
6వ స్థానంలో ఉంటే 9,12,1, స్థానాల్ని చూస్తాడు.
10వ స్థానంలో ఉంటే 1,4,5 స్థానాల్ని చూస్తాడు ఆ భావాల్ని నాశం **చేస్తాడు**
కాబట్టి పై శ్లోకాలన్నీ ప్రమాణంగా తీసుకుంటే మొత్తం 12 భావాల్లోను **దోషిగావే మిగులుతాడు.**

వివాహ వనమాలలోనే మరికొన్ని శ్లోకాలు **ఉదహరించాడు.**

స్వోచ్ఛ మిత్ర స్వగేహేషు స్వాధిష్టిత శుభప్రదః
చతుర్థం సప్తమం వ పశ్యత్యష్టక మేవచ
దృశ్యరాశీశ శత్రు . దృష్టం నాశయతి ధృవం
దృశ్యరాశీశ మిత్ర . దృష్టం నైవ వినాశయేత్
శుభయోగాది కర్తృత్వే నా శుభం కురుతే కుజః
కుజః కర్కాట లగ్నస్యనకదాచన దోషకృత్
కన్యామిధున యోర్వాపితులా మిధున యోరపి
సంపూర్ణదోషకారీస్యాత్ కిం్నిదూనంశ వేర్గృహే
దోషమర్ధం గురుక్షేత్రే కరోతి ధరణీ సుతః
అర్కేందుక్షేత్ర జాతానాం కుజదోషో నవిద్యతే
జన్మకాలే వివాహేచ స్త్రీణా మార్తవ దర్మనే
కుజదోషం విచార్యైవ భావం మాన్మధ మారయేత్
దోషకారీ కుజోయస్య బలీచే దుక్త దోషకృత్

దుర్బలో శుభదృష్టోవా సూర్యేణాస్తంగ తోపి వా
యుద్ధే పరాజితో వాపి న దోషం కురుతే కుజః
సర్వదా దోష కర్తృత్వే దోషమేవ కరోతిసః
తథా విధానాం జాతానాం దాంపత్యపరి కల్పనే
దంపత్యోరుభయోస్తాదృక్ దోషవత్వేన దూషణం
కుజదోషవతః పుంసః కుజదోషవతీసతీ
ఉభయోర్యది దాంపత్యం దోషోనాస్తీతి నిశ్చితః
అన్యోన్య బాధకౌస్యాతాం కుజదోషా వుభావపి
బల సామ్యేతు దాంపత్యం క్షేమాయ పరికల్పితం
కుజదోషవతే దేయా కుజదోషవతీ తతః
నాస్తి దోషోన చానిష్టం దంపత్యోస్సుఖ వర్ధనం
దంపత్యోర్జన్మకాలే వ్యయధనహిబుకే సప్తమే రంధ్రలగ్నే
లగ్నాచ్చంద్రాచ్చ శుక్రాదిపిఖలు నివసన్ భూమి పుత్రస్తయోశ్చ
దాంపత్యందీర్ఘకాలం సుతధనబహుళం పుత్రలాభంచసౌఖ్యం
దద్యాదేకత్ర హీనో మృతి రఖిల భయం పుత్ర నాశం కరోతి

ఉచ్చస్వక్షేత్ర మిత్ర క్షేత్రాలలో మన్న కుజుడు శుభప్రదుడు దోషము చేయదు.

కుజుడు 4,7,8 స్థానాలను చూస్తాడు తాను చూచే రాశ్యాధిపతి శత్రువైతే దోషం చేస్తాడు మిత్రుడైతే దోషం చేయదు. శుభయోగము నీయవలసిన వాడైనపుడు అశుభము చేయదు. కర్కాటక లగ్నమునకు ఎప్పుడును దోషికాదు కన్యా, మిధున, తులా లగ్నములకు సంపూర్ణముగా దోషము చేయును. కొంచెం తక్కువగా 75% శని గృహమునకు దోషము చేయును. గురు క్షేత్రమునకు సగము దోషము చేయును కర్కాటక సింహములందు జన్మించిన వారికి కుజదోషం లేదు.

జన్మకాలమున, వివాహమున, ప్రథమ రజస్వలాసమయమున కుజదోషము విచారించి సప్తమ భావమును పరిశీలించవలెను.

ఏ లగ్నములకు దోషకారియై బలము కలిగియుండునో వారికి దోషము చేయును.

అతడు దుర్బలుడైనను శుభదృష్టుడైనను అస్తంగతుడైనను దోషము చేయదు.

అన్నివిధముల దోషియైనపుడు దోషమునే చేయును. అట్టి దుష్టయోగము గల వారిరువురికి దాంపత్యంకల్పిస్తే దోషము సంభవింపదు.

కుజదోషం గల పురుషునకు కుజదోషము గల స్త్రీతో వివాహము జరుపుటవలన దోషము ఉండదు. ఆ దోషములు అన్యోన్య బాధకములగును బలసామ్యమున్నపుడు దాంపత్యము క్షేమము కొరకగును.

ఇరువురికి కుజదోషం సమానంగా ఉన్నపుడు ఆ దంపతులకు దీర్ఘాయువు, సంతానం, ధనము, పుత్రలాభము కల్గించును. ఒకచోట దోషములేనిచో మృతి సమస్త భయములు పుత్రనాశము కల్గును. అని పై శ్లోకముల సారాంశము.

ఇందున్న విషయ వివరణ బాగున్నది కాని దుర్బలుడైనను, అస్తంగతుడైనను, యుద్ధమందు పరాజితుడైనను దోషము చేయదు అనుమాట యుక్తముగాదు.

గ్రహమునకు బలమనగా నేమి?

ఉచ్చ, స్వ, మిత్రక్షేత్రవర్తిత్యాదులే కదా?

ఆ క్షేత్రాల్లో ఉన్నప్పుడు బలవంతుడు కాబట్టి కీడు చేయదు మేలే చేస్తాడు దానికి వ్యతిరేక స్థితి దుర్బలత్వం దుర్బలుడైనపుడు, బలవంతుడైనపుడు అతడు కీడుచేయనిచో కీడు చేసే సమయం ఏమిటి?

అస్తగ్రహమునకు ఫలితంగా

గ్రహోమౌఢ్యం ప్రాప్తోమరణ మచిరాత్ స్త్రీ సుతధనైః

ప్రవీణత్వం వ్యర్థే కలహమపవాదం పరిభవం

ఫలదీపికా - రాశి ఫలధ్యాయం 19 వ శ్లో

గ్రహం మౌఢ్యావస్థను పొందినపుడు మరణము లేదా మరణ సమానమైన దుఃఖమును భార్యాపుత్రులతో వియోగం ధనహాని వ్యర్థకలహాలు అపవాదాలు, పరాభవము అను ఫలితాలు చెప్పుట జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయం.

దుష్టగ్రహం అస్తంగతుడైతే మేలు చేస్తాడని కాని కీడు చేస్తాడని కాని వాక్యాలు కనిపించుట లేదు. పై అంశము సరికాదని భావించాలి.

జాతక సర్వస్వం అనే గ్రంథం 1914లో ఆనంద ముద్రాక్షర శాలలో ముద్రింపబడింది.

ఇందలి హోరాను భవ దర్పణంలోని శ్లోకాలు

లగ్నాస్తయోః కుటుంబేచ చతుర్ధేచ వ్యయేష్టమే

కళత్ర భంగస్సకుజే శుక్రేతు విబలే సతి

బలితౌ దృగ్విధామ్శుక్రా దపి చంద్రా న్మహీసుతః

కళత్రభంగ కృత్పుంసాం స్త్రీణాం భర్తృవియోగదః

తథాపి ధనగే జీవే చిరేణ ద్వికళత్రకం

ధనమందే సరాహౌతు సప్తమేద్వికళత్రకం

1,7,2,4,12,8, స్థానాల్లో కుజుడుండి శుక్రుడు బలహీనుడైతే కళత్రభంగము

బలవంతుడైన కుజుడు శుక్రుని నుండి చంద్రుని నుండి పై స్థానాల్లో ఉంటే పురుషులకు కళత్రభంగము, స్త్రీలకు భర్తృవియోగము. అట్టి స్థితిలో గూడ ద్వితీయంలో గురుడుంటే ఆలస్యంగా ద్వికళత్రయోగం.

2వ స్థానంలో శని ఉండి సప్తమంలో రాహువుంటే ద్వికళత్రయోగం అని పై వాని అర్థం

ఇందలి బలవంతుడైన కుజుడు అనుమాటను తొలగించవలసి ఉంది.

ఈ గ్రంధమునందే భావ చంద్రికలో

లగ్నే విత్తే చ పాతాళే జామిత్రే హిధనే వ్యయే

పాపాధికః కుజో భూయాత్ పుంసాం భార్యా వినాశకః

నారీణాం భర్తృ నాశాయ చంద్రా చ్ఛుక్రాత్పరీక్షయేత్

కళత్ర కారకే శుద్ధే భావేశే బలశాలిని

భావేచ శుభసంయుక్తే కుజదోష నివారణం

సత్యేపికుజ దోషస్య శుక్రశ్చేత్సర్వతో బలీ

సప్తమే దేవ పూజ్యేతు దాంపత్యం నైవభజ్యతే

కుజదోషయుతాం నారీం కుజదోషవతేతథా

దద్యాత్పరీక్ష్య తద్యోగే స్త్రీ పుంసో ర్దోషయోస్తయోః

అన్యోన్యప్రతిబంధేవ నిర్దోషత్వంచ సిద్ధ్యతి

నరశ్చవిధురోనస్యాత్ ననారీవిధవాభవేత్

అథవాకుజ దోషస్య శాంతిం కుర్యాద్వి చక్షణః

శుక్ర క్షేత్ర భవానాంతు కుజదోషోనవిద్యతే.

అని కలదు.

కళత్ర కారకుడు శుద్ధుడై కళత్ర భావాధి పతి బలం కలిగి ఉంటే కళత్ర భావంలో శుభగ్రహాలుంటే కుజదోషం పోతుంది. కుజదోషం ఉన్న శుక్రుడు బలంగా ఉంటే సప్తమంలో గురుదుంటే కుజదోషం పోతుంది. లేదా కుజదోషానికి శాంతి చేసుకుంటే సరిపోతుంది.

అనేవి ఈ శ్లోకాల్లోని విశేషాంశాలు కుజదోషమునకు శాంతి విధానం ఏ గ్రంథములో ఉందో వారు తెలుపలేదు. ఇక కుజ జపాదికము దానాదికము చేయాలి అని వారి భావం కావచ్చును.

వర వధూ నక్షత్రమేలాపకమను నిబంధన గ్రంథంలో కొన్ని శ్లోకాలు లభ్యమౌతున్నాయి.
ముహూర్త సంగ్రహదర్పణంలోని శ్లోకాలుగా ఈ క్రిందివానిని ఉదహరించారు.

చంద్రా ద్వాజన్మలగ్నాద్వా బలాబల విమృశ్యతే
అష్టమం పతిమృత్యుః స్యాత్ సప్తమస్థానమేవచ
లగ్నే వ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే
పత్నీభర్తృవినాశాయభర్తా భార్యావినాశదః

ఈ శ్లోకాల్లో విశేషం ఏమిలేదు. ముహూర్తగణపతిలోని శ్లోకాలుగా ఈ క్రిందివానిని ఉదహరించారు.

మూర్తే తుర్యే ష్టమే భౌమే సప్తమేన్త్యే చజన్మని
భర్తుర్యోషి ద్వినాశః స్యాత్ స్త్రీణాం భర్తృ వినాశనం
ఏవం విధేకుజే సంఖ్యే వివాహంనకదాచన
కార్యోవాగు బాహుళ్యేకుజేవాతాదృశేతయోః

ఇందు నక్షత్రముల కలయికలో గుణాలు అధికంగా వస్తే ఒకరికి కుజదోషముండి ఒకరికి లేకపోయినా వివాహం చేయవచ్చు. అనే విషయం ఉంది గాని అది ప్రామాణికంగాను సంయుక్తి-కంగాను కనుపించుటలేదు. గుణములు ఎక్కువ వస్తే మనస్సులు కలియునే కాని కుజదోషం వలన ఏ ఆయుర్భంగం ఫలితంగా చెప్పబడుతుందో ఆ దోషము గుణముల వలన ఎలా నశిస్తుంది? లేదా గుణబాహుళ్యే అను దానికి అర్థం శుక్రాదుల బలము చెప్పవలసి ఉంటుంది.

బృహద్దైవజ్ఞ రంజనంలోని శ్లోకాలు కొన్ని ఉదహరించినారు.

లగ్నా దిందోర్యదా భౌమః సప్తాష్టాన్త్యా ద్యతుర్యగః
పత్యుర్భార్యా వినాశాయ భార్యాయాః పతినాశనం
ద్వ్యాది పాపయుతే భౌమే సప్తమే చాష్టమే స్థితే

.బాలవైధవ్యయోగః స్యాత్ కులన్నాశకరీవధూః
క్రూరవ్యోమచరః స్త్రీణాం అష్టమస్థోవిలగ్నతః
నీచాదిపాప వర్గేషు యది మృత్యుకరః పతేః

లగ్నమునుండి చంద్రుని నుండి 7,8,12,1,4 స్థానాల్లో కుజుడుంటే భార్యకు భర్తృనాశమ: భర్తకు భార్యానాశము కలుగును.

రెండు లేదా అంతకంటే అధికంగా పాపగ్రహములతో కూడిన కుజుడు 7,8 స్థానాల్లో ఉం అది కుటుంబనాశము కల్గించుబాల వైధవ్యయోగము.

క్రూరగ్రహము అష్టమంలో ఉంటే అతడు నీచాది పాపవర్గములను పొందితే ఆ స్థితి భర్తః మృత్యువును కల్గించును.

అని పై శ్లోకముల సారాంశము.

రెండు, మూడు శ్లోకాల్లో వివరించబడిన అంశములు సశాస్త్రీయములై యున్నవి.

కుజదోషమునకు అపవాదముగా

భౌమతుల్యోయదాభౌమః పాపోవాతా దృశోభవేత్
అధవాగుణబాహుళ్యే నదోషో మంగళీభవేత్

అను శ్లోకముదహరించినారు.

కుజుడు రెండు జాతకాల్లోను దోషిగానున్నను లేదా ఒక జాతకంలో కుజుడు దోషిగా నుండి మరియొక జాతకంలో వేరొక పాప గ్రహము దోషిగా నుండినప్పుడును, గుణములు అధికముగానున్నపుడును [illegible] దోషికాదు అని శ్లోకమునకు భావము.

కుజుడు రెండింట సమానమైన దోషిగా నుండుట వేరొక పాప గ్రహము దోషిగా నుండుట సరిగానున్న విషయము లేదా గుణములు అధికముగానున్నచో కుజదోషముండదు అను అంశము సక్రమంగా లేదు.

జ్యోతిషతత్త్వ వివేక నిబంధం అనే గ్రంథంలోని శ్లోకాలుగా కొన్నిటిని ఉదహరించినారు.

చంద్రః పాపేనసంయుక్తః చంద్రోవాపాపమధ్యగః
చంద్రాత్సప్తమగః పాపోజాతకోదారహాభవేత్

చంద్రుడు పాపితో కలిసినా చంద్రుడు పాపగ్రహముల మధ్యలోనున్నా చంద్రునకు ఏడింట పాపి ఉన్నా జాతకునకు భార్యానాశము కలుగును అని పై శ్లోకం సారాంశం

క్షీణ చంద్రుడైన పక్షంలో పై అంశములు వాస్తవములుగానే తోచును కాని పూర్ణ చంద్రుడైన పక్షంలో చంద్రయుతి చంద్ర దృష్టి పాపియొక్క పాపమును హరించును గదా! అందుచే పాపు మధ్యనున్న చంద్రుడు మాత్రమే దోషికాగలడని గుర్తింపవలసియున్నది.

లగ్నాత్పుత్ర కళత్రభే శుభపతౌప్రాప్తే ధవాలోకితే

చంద్రాద్వాయది సంపదస్తిహితయోఃజ్ఞే యోన్యథాసంభవః

లగ్నాత్తు చంద్రాత్తు కళత్ర స్థానంలోను పుత్ర స్థానం

లోను (పురుషజాతకంలో 5 స్త్రీ జాతకంలో 9) శుభస్థానాధిపత్యంగల గ్రహాలు ఆ భావాన్ని చూచినా మేలు చెప్పవలెను. అట్లు కానిచో దోషము చెప్పవలెను అని శ్లోకమునకు సారాంశము ఇది న్యాయమే.

యామి త్రేచయదాసౌరిః లగ్నేవాహిబుకేథవా

నవమే ద్వాదశేచైవ భౌమ దోషోనవిద్యతే

7,1,4,9,12 స్థానాల్లో శని ఉంటే భౌమదోషం నశిస్తుంది అని భావం కాని ఏ జాతకంలో కుజదోషమున్నదో అదే జాతకంలో శని పై స్థానాల్లో ఉంటే కుజ స్థితి మరియొక పాపగ్రహస్థితి కలిసి నందువలన దోషాధిక్యత సంభవించునే గాని గుణము సంభవించదు కాబట్టి ఒక జాతకంలో కుజుడు దోషిగా ఉండి మరియొక జాతకంలో శని దోషిగా ఉంటే ఆ రెండు దోషములు నశిస్తాయి అని చెప్పటం న్యాయంగా ఉంటుంది.

శనిర్భౌమోథవాకశ్చిత్ పాపోవాతాదృశోభవేత్ తేష్వేవ భవనేష్వేవ భౌమదోషవినాశకృత్

శని, కుజుడు, లేదా మరియొక పాపి అలాంటివాడే ఆస్థానంల్లోనే ఉన్నప్పుడు భౌమదోషం నశిస్తుంది అని సారాంశం.

ఇవి కూడా పై వలెనే ఒక జాతకంలో కుజుడు దోషియైనపుడు మరియొక జాతకంలో అటువంటి పాపి అదే స్థానంలో ఉంటే రెండు దోషాలు నశిస్తాయి అని అర్థం చెప్పాలి.

లగ్నే చేత్త రాహుః హిబుదా చాష్ట మేపివా యామిత్రే ద్వాదశే చైవ భౌమదోష వినాశకః

1,4,8,7,12 స్థానాల్లో రాహువుంటే కుజదోషం పరిహారమగును అని శ్లోకసారాంశం.

ఇట్లుకూడ ఒక జాతకంలో కుజుడు దోషియై ఉండగా, మరియొక జాతకంలో రాహువుపై స్థానాల్లో ఉంటే రెండింట ఉన్న దోషాలు నశిస్తాయి అని అర్థం చెప్పాలి.

స్వస్థానే స్వోచ్చగే భౌమే వర్గోత్తమ గతేపివా
బలాఢ్యోపచయస్థానే భౌమస్తత్స్యాన దోషకృత్
స్వ, ఉచ్చ, క్షేత్రాల్లోగాని వర్గోత్తమ స్థితిలోగాని ఉపచయ క్షేత్రాల్లో బలం కలిగిగాని ఉన్నప్పుడు కుజుడు దోషకారి కాడు అని శ్లోక సారాంశం.

ఉపచయములనగా 3,6,10,11 స్థానాలు ఆ స్థానాల్లో ఉంటే అసలు కుజదోషమే ఏర్పడదు. కాబట్టి పైశ్లోకాన్ని కుజ దోషపరిహారకంగా మనం అర్థం చేసుకోకూడదు. సామాన్యంగా పై శుభస్థితి పొందితే కుజుడు శుభప్రదుడు అని మాత్రమే అర్థం చేసుకోవాలి.

అజే లగ్నే వ్యయే చాపే పాతాళే వృశ్చికే కుజః
ద్యూనే మృగే కర్కిరంధ్రే భౌమ దోషోన విద్యతే
లగ్నమైన మేషంలోను వ్యయమైన ధనుస్సులోను చతుర్థమైన వృశ్చికంలోను సప్తమమైన మకరంలోను అష్టమమైన కర్కాటకంలోను కుజ దోషం లేదు అని సారాంశం.

కాని లగ్నమైన మేషం అన్నపుడు లగ్నానికి అతడు శుభప్రదుడే అష్టమాధిపతి గాబట్టి అష్టమానికి అతని దృష్టి మేలు చేస్తుంది కాని చతుర్థ స్థానమైన కర్కాటకం పైన ఈతని దృష్టి నీచయుందలి దృష్టి కాబట్టి ఆ భావానికి మేలు కలుగుట సరిగాదు. అట్లే సప్తమభావమైన తుల పై ఈతని దృష్టి శత్రుక్షేత్ర దృష్టి కాబట్టి మేలు చేకూరుస్తుంది అనలేము అతడు స్వక్షేత్రవర్తి కాబట్టి భార్యా నాశం ఫలితం చెప్పకపోయినా, భార్యా సౌఖ్యంలోపం మాత్రం తప్పనిసరిగా చెప్పవలసి ఉంటుంది.

వ్యయమైన ధనుస్సు అనగా మకరంలో మకర లగ్నంవారికి చతుర్థలాభాధిపతి వ్యయస్థితి అనగా శుభలోపం చెప్పక తప్పదు లాభాధిపతికి వ్యయస్థితి లాభ విషయంలో దోషమే ఇక షష్ఠంపై దృష్టి మంచిదే తృతీయంపై దృష్టి కూడ మంచిదే.

సప్తమ భావమైన కర్కాటకంపై దృష్టివలన భార్యా సౌఖ్యంలో లోపం చెప్పక తప్పదు.

చతుర్థమైన వృశ్చికం అంటే సింహలగ్నం. సింహ లగ్న జాతకులకు యోగకారకుడైన కుజుడు అపకారం చేయడని గుర్తించవచ్చును. అయినప్పటికిని శత్రుక్షేత్ర మైన కుంభాన్ని (సప్తమభావాన్ని) చూడటం వలన భార్యాసౌఖ్యలోపం చెప్పక తప్పదు. సప్తమ భావం మకరంలో కుజుడుంటే అనగా కర్కాటక లగ్నమైతే కుజుడు పంచమదశమాధిపతిగా యోగకారకుడై ఉచ్చక్షేత్రంలో ఉండటం వలన అతని చూపులు గూడ స్వక్షేత్రం (మేషం) మిత్రక్షేత్రాల (కర్కాటక, సింహాలు) పైనున్నందువలన

మేలే చెప్పాలి. అతడు చేసే మేలు దశమ ద్వితీయాలకు చేసినంతగా లగ్నానికి చేయడని చెప్పాలి. నీచ స్థానమందలి దృష్టి కదా! అందుచేత లగ్నానికి కొంత అనారోగ్యాదులను చెప్పినప్పటికిని సాముదాయకంగా మేలే చేస్తాడు.

కర్కాటకము అష్టమ మైనపుడు అనగా ధనుర్లగ్న జాతకులకు పంచమ వ్యయాధిపతిగా సామాన్యుడే గాని శుభప్రదుడుకాడు అతడు ఆయుస్థానంలో నీచ ఉన్నందున ఆ స్థానానికి మేలు చేయలేడు. స్త్రీ జాతకాల్లో భర్త ఆయువుకు పురుష జాతకాల్లో ఆయువుకు మేలు చేయలేడు. స్త్రీ పురుషులిద్దరు ధనుర్లగ్న జాతకులై అష్టమ కుజుడుంటే వివాహం చేయరాదనే చెప్పాలి.

లాభస్థానం పై దృష్టి శ్రమతోగూడిన ధనలాభాన్ని కల్గిస్తాడు. ద్వితీయం పై దృష్టి ఉచ్చయందలి దృష్టియైనను, నీచస్థితుడై చూచున్నందువలన ఆర్థికంగా మేలు చెప్పవచ్చు.

తృతీయం శత్రు దృష్టి కాబట్టి సోదరాదులతో వైరుధ్యం చెప్పినా పరాక్రమవృద్ధి చెప్పవచ్చు.

కాని పై శ్లోకాన్ని యధాతథంగా కుజదోష పరిహారకంగా తీసుకుంటే సత్ఫలితాలు సంభవించవు అని విరాటంకంగా చెప్పవచ్చు.

పై శ్లోకాన్ని ప్రమాణంగా తీసుకోవటం మంచిదికాదు కర్కీరంధ్రే అనే అంశానికి క్రూరవ్యో-మచరః స్త్రీణాం అష్టమస్థోవిలగ్నతః నీచాది పాప వర్గేషు యది మృత్యుకరఃపతేః అను బృహద్దైవజ్ఞ రంజనమునందలి శ్లోకముతో వైరుధ్యం వస్తుంది.

విశేషించి మకర లగ్నజాతకులైన పురుషులకు సప్తమ శనికుజులు శుభఫల ప్రదాతలుగా ఫలదీపికావచనం ఉన్నదిగాని అష్టమస్థితి శుభప్రదంగా చెప్పబడిలేదు.

అష్టమస్థ కుజదోష పరిహారక వాక్యాలుగా మరికొన్నిటిని ఉదహరించారు. అవి ఏ గ్రంథాలలోనివో చెప్పలేదు వాటిని గూడ పరిశీలిద్దాం.

అస్తగే నీచగే భౌమే శత్రుక్షేత్రగతేపివా
కుజాష్టయోద్భవో దోషోన కశ్చిదపి విద్యతే

అస్తమయాన్ని పొందినా, నీచరాశియందున్నా, శత్రుక్షేత్రంలోఉన్నా అష్టమకుజదోషముండదని పై శ్లోకసారాంశం కానీ ఈ అంశానికి గూడ

క్రూరవ్యోమ చరః స్త్రీణాం మష్టమస్థోవిలగ్నతః

నీచాది పాప వర్గేషు యది మృత్యుకరః పతేః

అనే బృహద్దైవజ్ఞ రంజనమందలి శ్లోకం భేదిస్తుంది. వాస్తవిక పరిశీలనలో అస్తమయాన్ని, నీచమ, శత్రుక్షేత్ర స్థితి పొందిన దుష్టగ్రహం దుష్ట ఫలితాన్ని పెంచుతుందేగాని తగ్గించదు విశేషించి అపకారం చేస్తుంది.

సప్తమస్థోయదాభౌమః గురుణాచవిరీక్షితః

తదాతు సర్వం సౌఖ్యం స్యాత్ మంగళీదోషనాశకృత్

సప్తమంలో కుజుడుండి గురుదృష్టిచే చూడ బడినచో సౌఖ్యము కల్గును కుజదోషం తొలగును.

అని శ్లోక సారాంశం శుభ దృష్టి దోషపరిహారకం గాబట్టి పై అంశమును ప్రమాణంగా తీసుకొనవచ్చును.

కుజోజీవ సమాయుక్తో

యుక్తోవా కుజ చంద్రమాః

చంద్రః కేంద్ర గతోయస్య

తస్యదోషోనమంగళీ

కుజ చంద్రులుగాని కుజగురులుగాని కలిసినా చంద్రుడు కేంద్ర స్థితి పొందినా కుజదోషముండదని శ్లోక భావం పూర్ణచంద్రునితో కలయికను దోష పరిహారకంగా భావించవచ్చు. అట్లే గురుయుతి దోష పరిహారకమే చంద్రుని కేంద్ర స్థితిని మాత్రం దోషపరిహారకంగా అంగీకరించగూడదు.

నమంగళీ చంద్ర భృగూద్వితీయే

నమంగళీ పశ్యతి వాగధీశః

నమంగళీ చంద్ర గతశ్చ కేంద్రే

నమంగళీ మంగళరాహుయోగే

వరవధూ నక్షత్ర మేలాపకం - 45 పేజీ

ద్వితీయంలో చంద్ర శుక్రులున్నా కుజుని గురువు చూసినా రాహుకుజులు కలిసినా చంద్రుడు కేంద్రంలో ఉన్నా కుజదోషం లేదని సారాంశం.

చంద్ర శుక్రులు ద్వితీయంలో ఉంటే కుటుంబ స్థానానికి శుభయుతి కలుగుతుంది కాబట్టి కుటుంబ సౌఖ్యం అని అంగీకరించవచ్చు. గురుడు చూస్తే శుభమే కాని చంద్రుడు కేంద్రాల్లో ఉండడం రాహు, కుజులు కలియడం దోష పరిహారకాలుగా అంగీకరించరాదు. రాహుకుజులు కలవడం దోషప్రదంగా భావించాలి.

పాతాళే మదనేలగ్నే వ్యయే నిధనమందిరే

వివాహే విధవానారీగురుయోగే క్షణం వివా

4,7,1,12,8, స్థానాల్లో కుజుడు గురుయుతి వీక్షణాలు లేకుండా ఉంటే స్త్రీ వైధవ్యమును పొందును.

ఈ శ్లోకం వర, వధూ నక్షత్ర మేలాపకం అనే గ్రంథంలో పరిశిష్టం 45 వ పేజీలో ఉదహరించారు. ఇది యుక్తంగానే ఉన్నది.

ఇందే రణ వీరజ్యోతిర్నిబంధంలోనిదిగా

ద్యూవ కుటుంబ గతౌపాపౌ

దార వియోగజ దుఃఖ కరౌతౌ

తౌ దృశయోగజ దారయుతశ్చేత్

జీవతి పుత్ర ధనాది యుతశ్చ

వరవధూ నక్షత్రమేలాపక పరిశిష్టం 46 వ పేజీ

అను శ్లోకము ఉదహరించబడినది 7,2 స్థానాల్లో పాపులుంటే భార్యా వియోగం అట్టి యోగమే ఉన్న స్త్రీతో వివాహం చేస్తే. దోషంలేదు అనిసారాంశం. రెండు జాతకాలలోను దోషాలుంటే దోషం నశిస్తుంది అనే అంశాన్ని పరిశీలించవలసి ఉంది.

వశిష్ఠుని వాక్యంగా

లగ్నాద్విధోర్వాయదిజన్మకాలే

శుభగ్రహోవా మదనాధిపశ్చ

ద్యూనస్థితోహన్త్యనపత్యదోషం

వైధవ్య దోషం చవిషాంగ వాఖ్యం అను శ్లోకాన్ని ఉదహరించారు.

లగ్నాత్తు, చంద్రాత్తు, సప్తమ స్థానాల్లో సప్తమాధిపతిగాని శుభగ్రహంగాని ఉంటే అనపత్యవైధవ్య విషాంగన దోషాలు హరింపబడును అని భావం. కుజదోషమునకు మాత్రం పరిహారకం కాదు. వివాహ సంబంధమైన సర్వదోషములకు పరిహారకంగా చెప్పబడినది దానిని అత్యధిక ప్రమాణముగా మనము గుర్తించవచ్చును.

లగ్నాదిందో శ్శుభోవాయది మదనపతిః ద్యూనయాయీ విషాఖ్యం

దోషం చైవానపత్యం తదనుచనియతంహన్తి వైధవ్యదోషం

ఈ శ్లోకం జాతకాలంకార విషకన్యాధ్యాయంలో 3వ శ్లోకం.

లగ్నము నుండి చంద్రుని నుండి సప్తమాధిపతి సప్తమంలో ఉంటే విషకన్యాయోగము. అనపత్యయోగము వైధవ్యయోగము పరిహారమగును అని ఆ శ్లోక సారాంశం ఇది ఉచితమే.

పై వశిష్ఠ వాక్యంలోగాని, జాతకాలంకారవాక్యంలోగాని కుజదోషమనే మాట వాడబడలేదు. అనే విషయాన్ని మనం గమనించాలి.

దైవజ్ఞ శ్రీరామకవచం, వేంకటేశ్వరశర్మ గారిచే వ్రాయబడిన "కుజగ్రహము" అను గ్రంథము నందలి అభిప్రాయములను గూర్చి కొంత పరిశీలించవలసి యున్నది. వారు 28 వ పేజీలో "ధనేవ్యయేచ ---- పుంసాంభార్యా వినాశనం" అనేది అగస్త్య సంహితలో నున్నది. జాతక పారిజాతం సర్వార్థ చితామణులలోను వున్నది.

శ్లోకాలు వేరైనా అర్థం ఒక్కటే అయితే ధర్మశాస్త్ర గ్రంథము కుజ దోషస్థానములను గూర్చి చెప్పక పోయినా కుజదోషపరిహారకమైన కుంభ వివాహాది శాంతి విధానాలు చెప్పడంలో కుజ దోషమును గుర్తించి చెప్పారనేది స్పష్టమగుచున్నది." అను విషయములున్నవి.

ఇక జాతకపారిజాతంలో

సప్తమేవాష్టమే పాపేవ్యయస్థేధరణీసుతే

అదృశ్యేయదితన్నాధే కళత్రాంతర భాగ్భవేత్

1234 సప్తమంలో గాని అష్టమంలో గాని పాప గ్రహముండి, కుజుడు వ్యయంలో ఉండి సప్తమాధిపతి (తన్నాధే అనుదానికి వ్యాఖ్యాతలు సప్తమాధిపతి అని అర్థం చెప్పారు) అదృశ్య చక్రార్థము నందుండినచో లేదా అస్తంగతుడైనచో (అదృశ్యే అనుపదమునకు అదృశ్యచక్రార్థమం- దుండుట లేక అస్తంగతుడగుట అను అర్థములు వ్యాఖ్యాత చెప్పినవి - 2) అను శ్లోకమునందు సప్తమాష్టమాలలో ప్రాపగ్రహముండి వ్యయంలో కుజుడుంటే అని సమన్వయము చెప్పబడింది కాబట్టి ప్రస్తుత కుజదోష విషయంలో ఈ శ్లోకం వర్తించదు. "వరవధూజాతక సంయోగః" అను శీర్షికతో

"ధనావపాన స్మరయానరంధ్రగోధరాసుతో జన్మవియస్యదారహా "

"తద్దైవకవ్యాజవ జన్మలగ్నాత్ యది క్షమాసూనురవిష్టదః పతేః"

---

1. జాతకపారిజాతం - సప్తమాష్టమ భావ ఫలాధ్యాయం 18 శ్లోక వాఖ్య - 469వ పేజీ జయకృష్ణదాస్ హరిదాస్ గుప్తచౌకాంబా - 1942 ప్రచురణ

2. ------ ఓటో -------

జాతక పా॥జాతం సప్తమ అష్టమనవమ భావ ఫలాధ్యాయం 34 శ్లో 475 అను శ్లోకము గలదు. కాని ఇట్టి శీర్షిక మిగిలిన ఏ ప్రాచీన జ్యోతిష గ్రంథములందు కానరాదు.

వ్యాఖ్యాత శ్రీ కపిలేశ్వర శాస్త్రిగారు కూడా "అత్రోపలభ్యతే విశేషవచనం" అని పేర్కొని

లగ్నేవ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే
కన్యాభర్తృ వినాశాయ భర్తాకన్యావినాశకృత్ అను శ్లోకమును ఉదహరించారు.

ఈ శ్లోకమును ఏ గ్రంథములోనిదో వారును పేర్కొనలేదు.

ముహూర్త చింతామణి పీయూషధార వ్యాఖ్యలో (సంస్కారప్రకరణమందలి 7వ శ్లోకము) అన్యమపి శ్లోకం పఠంతి

"లగ్నేవ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే
కన్యాభర్తృ వినాశాయ భర్తా కన్యా వినాశనః

అని ఉదహరించినారు అనగా వారికిని ఆ శ్లోకము ఎచ్చటిదో తెలియదు అట్టి మహా పండితులైన వ్యాఖ్యాతలకే మూల గ్రంథములందు కనిపించని ఈ శ్లోకమును ఆధునికులు అగస్త్య సంహిత-లోనిదిగా పేర్కొనుట మిక్కిలి విచారించదగిన విషయం అగస్త్య సంహిత అనే జ్యోతిష గ్రంథం రాజస్థాన్ హైదరాబాదు మొదలైన ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారములందు నాకు కనిపించలేదు.

గమ్యస్త్రీవిరణమను శీర్షికలో (జాతక పారిజాతం సప్తమాష్టమనవమ భావఫలాధ్యాయం 39 శ్లో "భూపుత్రేతు రజస్వలాజన రతింవంధ్యావధూమేతివా" అని చెప్పబడినది సప్తమభావంలో కుజుడుంటే రజస్వలా స్త్రీయందు ఆసక్తిని కల్గించును. లేదా వంధ్యా పతియగును. అనిదాని భావం ఇందు భార్యా నాశం చెప్పబడలేదు. వరవధూజాతక సంయోగమను శీర్షికలో

క్రూర వ్యయ చరః స్త్రీణాం మష్టస్థోవిలగ్నతః
నీచారి పాప వర్గేషు యది మృత్యుకరః పతేః
(జాతక పారిజాతం సప్తమాష్టమ నవమ భావఫలాధ్యాయం:- 35 వ శ్లోకం)

స్త్రీ జాతకంలో క్రూరగ్రహం అష్టమంలో నీచ, శత్రు, పాప, వర్గులలో ఉన్నచో భర్తకు మృత్యువు కల్గించును అని అర్థము. ఈ శ్లోకము కుజదోషమునకు మాత్రమే సంబంధించినది కాదు. ఏక్రూరగ్రహమున్నా దోషమే.

ద్యూనకుటుంబ గతౌపాపౌ
దార వియోగజ దుఃఖకరౌతౌ
తాదృశ యోగజదారయుతశ్చేత్
జీవతి పుత్రధనాదియుతశ్చ"

(జాతక పారిజాతం సప్తమాష్టమానవమ భావఫలాధ్యాయం - 36 వ శ్లోకం, 7,2, స్థానాల్లో పాపగ్రహాలుండిన భార్యావియోగం కల్గింతురు. అట్టి యోగమే గల కన్యను వివాహమాడినచో పుత్రధనాదులుతో గూడి జీవించును అని శ్లోకార్థం. ఇది గూడ కుజదోషమాత్రమునకు పరిమితమైనది కాదు. విశేషించి ఈ విధానమును పీయూషధారవ్యాఖ్యానములో కేచిత్పక్షముగా చెప్పిరే కాని స్వ[illegible]మతముగా చెప్పలేదు.

"కేచిత్తు స్త్రీణాంమహత్యరిష్టయోగే
భర్తుశ్చస్వల్పాయుష్యయోగే తత్పరిహారమాహుః
(ముహూర్తచింతామణి సంస్కారప్రకరణం 7వ శ్లోక వ్యాఖ్యలో)

ఒక దోషం ఒక జాతకంలో ఉన్నపుడు ఆ దోషానికి పరిహారం చేసుకోవటం శాస్త్రీయం గాని అదే దోషంగల మరియొక జాతకునితో వివాహం జరపడం వల్ల దోషం బలపడుతుందేగాని దోషం నశించదు. విశేషించి ధర్మశాస్త్ర గ్రంథాలలో వైధవ్యదోష పరిహారకములైన వ్రతాదులు విహితమైనవి. ఇంకను జన్మోత్థంచవిలోక్య బాల విధవాయోగం విధాయవ్రతం సావిత్ర్యాడతస్సై-ప్పలంహి సుతయాదద్యాది మాంవారహః వల్లగ్నే, చ్యుతమూర్తి పిప్పల ఘటైః కృత్వావివాహం స్ఫుటం దద్యాత్తాం. చిరజీవి నేత్రవ భవేద్దోషః పునర్భూభవః
(ముహూర్తచింతామణి సంస్కారప్రకరణం) 7వ శ్లో

అను శ్లోకముగాని వ్యాఖ్యాత ఉదహరించిన సావిత్ర్యాదీని భక్త్యాకుర్వంతియాః స్త్రియః,
సౌభాగ్యంచ సుపుత్రత్వంచ భవేత్తాసాము సంతతిః
(వ్రత ఖండమున [illegible] విధిగా ఉదహరించారు)

అను శ్లోకముగాని

అవైధవ్యకరైర్యోగైర్వివాహపటలోదితైః

వరాయా యుష్మతేదేయాకన్యావైధవ్య యోగజా

(సంహితాసారంలోనిదిగా ఉదహరించిరి)

అను శ్లోకముగాని శాంత్యాదులు చేసి ఆయుష్మంతునితో వివాహము జరిపించమని విధిస్తున్నాయే కాని అట్టి దోషం గలవానిలో వివాహం జరపమని విధించుట లేదు.

మరియొక విశేషం.

ప్రథమ ద్వితీయభావ ఫలాధ్యాయంలో 88 శ్లోకం

"జాయాకుటుంబ గృహపౌసితపాపయుక్తౌ

దుఃస్థౌచతత్సమ కళత్రహరౌభవేతాం

విత్తాధిపే బలవతి స్మరరాశి పేవా

తుంగా దిగేయది సమేతికళత్ర మేకం

7,2 స్థానాధిపతులు శుక్రునితోడను పాపులతోడను కలసి దుస్థానాల్లో వుంటే (6,8,12, దుస్థానములు) ఎన్ని దుష్టగ్రహములతో కలిసి ఉంటే అంతమంది భార్యలు నశింతురు 2,7, స్థానాధిపతులు ఉచ్చాది క్షేత్రాల్లో బలము కలిగియున్నచో ఒక భార్య మాత్రమే ఉండును అని చెప్పబడినదే గాని కుజుని స్థితిని గూర్చి వర్ణించలేదు.

చతుర్థ కుజునకు ఫలితంగా

"నీచ రాశౌ కుజేర్కేవా సుఖేస్యాదగృహో నరః"

నీచ శత్రుక్షేత్రాలైన చతుర్థంలో రవిగాని కుజుడుగాని ఉంటే గృహముండదు (గృహసౌఖ్యముండదు) అని ఫలితం చెప్పబడినదే గాని భార్యానాశనంగాని భర్తృనాశనంగాని చెప్పబడలేదు.

సప్తమభావ ఫలాధ్యాయం 12 శ్లోకంలో

"కుజేతుమ్రియతే (సప్తమంలో కుజుడుంటే భార్య మరణించును) అని చెప్పబడినది.

అనగా ద్వితీయ చతుర్థాలలో కుజుడుంటే భార్యానాశ ప్రసక్తిలేదు.

అష్ట మభావ ఫలాధ్యాయంలో అష్టమస్థితికి ఫలితంగా

సభౌమే మందాఢ్యే ఫణియుజితువేందౌనిధనగే

తృపస్మారాస్త స్మాన్మరణమధవేందౌకుశతనౌ.

(జాతక పారిజాతం సప్తమాష్టమ నవమ ఫలాధ్యాయం 62 శ్లో)

అష్టమంలో కుజుదుగాని, శనిగాని, రాహువు గాని ఉంటే అపస్మారముద్వారా మరణము చెప్పబడినదేగాని భార్యామరణం చెప్పబడలేదు.

దశమైకా దశ ద్వాదశ భావ ఫలాధ్యాయం 81 శ్లో "భౌమేకచ్ఛప దర్శనం (కుజుడు వ్యయంలో) ఉంటే కలలో తాబేలు కనిపిస్తుంది) అని అర్థం చెప్పినారు తప్ప భార్యానాశం ఫలితంగా చెప్పలేదు.

స్త్రీ జాకాధ్యాయం 19 శ్లోకంలో

'లగ్నే య్యైర్విధవాస్తరాశి సహితై"

(పాపగ్రహాలు సప్తమంలో ఉంటే వైధవ్యం కలుగును) అని చెప్పబడినది. కాని పాపగ్రహ వివరణలో ఉత్సృష్టా మదనస్థితే దినకరే శత్రుగ్రహాలోకితే

"విశ్వస్తా వనిజేవధూరమణ యోరన్యోన్య వైరంతువా"

"సౌమ్యాసౌమ్యయుతే కళత్రభవనేజాతాపునర్భూశనౌ

కామస్థారిపువీక్షితేత్వ విధవాజాతాజరాంగచ్యుతి.

రవి సప్తమంలో ఉండి శత్రు గ్రహములచే చూడబడినచో భర్తచే చూడబడనిది అగును. కుజుడుంటే వైధవ్యంగలది అగును లేదా భార్యాభర్తలకు వైరము కల్గును.

పాపశుభ గ్రహములు కలిసి ఉంటే ద్వితీయ వివాహమగును. సప్తమంలో శని ఉండి శత్రు గ్రహములచే చూడబడినచో వివాహం కాకుండగనే ముసలితనం వచ్చును. అను ఫలితములు చెప్పబడినవి.

పాపులైన రవి, కుజ, శనులకు వేరు వేరు ఫలితములు చెప్పిన వైద్యనాథుడు (జాతక పారిజాత కర్త) "ఆగ్నేయైః" అను శబ్దముచే ఏ గ్రహములను వివక్షించి నాడో తెలియుట లేదు అష్టమభావ విచారణలో

"తుంగస్థా గగనాటనాః శుభకరారంధ్రే సపాపేవధూర్వైధవ్యంసముపైతి పాపభవనే పాప గ్రహాలోకితేరంధ్రేశాంశపతౌఖలేచ విధవావిస్రంశయోభామినీ సౌమ్యైరంధ్ర గతైః సమేతితరుణీ ప్రాగేవ మృత్యుంపతేః (జాతక పారిజాతం స్త్రీ జాతకాధ్యాయం 27 శ్లో)

ఉచ్చంగతులైన గ్రహములు శుభప్రదములు రంధ్రంలో (అష్టమంలో) పాపులుంటే వైధవ్యంగలుగును. అష్టమం పాపగ్రహాధిపత్యం కలిగి పాపగ్రహాలచే చూడబడి అష్టమాధిపతి ఉన్న అంశాధిపతి గూడ పాపి అయితే విస్రంశయంగా వైధవ్యం వస్తుంది.

సౌమ్యులు రంధ్ర స్థానంలో ఉంటే ఆమె భర్తకంటె ముందే మరణిస్తుంది అనగా సువాసినిగా మరణిస్తుంది అని చెప్పబడిన దానిని బట్టి చూస్తే పాపి ఉంటే వైధవ్యం తప్పనిసరిగా వస్తుంది అనడానికి వీలులేదు అనే భావం తెలుస్తోంది.

"కుజదోషము" అను పేర ప్రాచీన గ్రంథాలలో ఏ రకమైన వివరణ కనిపించుటలేదని కొన్ని శ్లోకములున్నను అవి ప్రక్షిప్తములుగా కన్పించుచున్నవని అర్వాచీన గ్రంథాలలో కనిపించే కుజదోషమును నిర్వచించే శ్లోకముగాని దానికి పరిహారాలుగా కనిపించే వేరు వేరు శ్లోకాలు గావి సర్వవిధముల సమ్మతింపదగినవిగా లేవని కొన్ని కొన్ని భావాలు మాత్రమే ఆమోదయోగ్యంగా ఉన్నందువలన ఆ శ్లోకాలను యథాతథంగా స్వీకరించడం ప్రమాదకరమని మనం గ్రహించాము.

ఇక పరిశీలించవలసిన విధానమేమి? అను అంశముపై వివిధ ప్రామాణిక గ్రంథకర్తల అభిప్రాయాలను పరిశీలిద్దాం.

ఫలదీపికలో కళత్రభావాన్ని గూర్చిన వివరణ ఈ క్రింది విధంగా ఉంది.

1. లగ్నచంద్ర లగ్నములనుండి సప్తమస్థానాలతో శుభయుతి శుభదృష్టులుండుట మంచిది.

2. శుక్రాత్తు 12,4,8, స్థానాల్లో పాపులుండి శుక్రుడు పాపమధ్య మందుండి (పాపార్గళం) శుక్రునిపై దుష్టగ్రహ దృష్టి ఉండుట భార్యానాశయోగము

   (శుభాధిపయుతే క్షితే సుతకళత్రభే లగ్నతో
   విధోరపితయోశ్శుభం త్వితరథాన సిద్ధిస్తయోః
   సితాద్వ్యయ సుఖాష్టగైః ఖరఖగైరసన్మధ్యగే
   సితేప్యథశుభేతరేక్షిత యుతేచజాయావధః

   ఫలదీపిక కళత్రభావం 1 శ్లో)

3. సప్తమాధిపతి పంచమంలో ఉంటే భార్యానాశం లేదా సంతానదోషం (సప్తమాధిపతి కోణస్థితి మంచిది కదా?)

4. సప్తమంలో పంచమాధిపతి అష్టమాధిపతి ఉంటే భార్యానాశం

5. క్షీణ చంద్రుడు పంచమంలోను 2,7, స్థానాల్లో పాపులు ఉంటే స్త్రీ రాహిత్యం, సంతానరాహిత్యం (5) మూడుభావాల్లోను పాపస్థితి ఉంటేనే పై ఫలితం చెప్పాలి 16 సూత్రం)

6. సప్తమంలో రవి రాహువులుంటే స్త్రీ సంగమూలక ధననాశం (6) (వీరు పాపగ్రహాలే కదా భార్యకు దోషం లేదా?)

7. సప్తమ స్థానమగు వృశ్చికంలో శుక్రుడుంటే భార్యానాశం (లగ్నాధిపతి అంతటి దోషి కాగలడా?)

3. సప్తమ స్థానమగు వృషభంలో బుధుడుంటే భార్యానాశం

1. నీచమైన సప్తమంలో గురుడుంటే భార్యానాశం (శుభగ్రహానికి దేఫలమా?)

1. సప్తమమైన మీనంలో శనిగాని కుజుడు గాని ఉంటే భార్యానాశం.

. సప్తమమైన చంద్ర క్షేత్రంలో శని కుజులుంటే భార్యాపతివ్రత, సద్గుణవతి (కుజుడుంటే దోషమెందుకు కాదు).

మండి 6

దారేశేసుతగాప్రణష్టవనిలో పుత్రో ధవాధీశ్వరే
ద్యూనేవానిధనేశ్వరోపికురుతే పత్నీ వినాశం ధ్రువం
క్షీణేన్దౌసుతగేవ్యయాస్తతనుగైః పాపైరదారాత్మజః
స్త్రీసంగాద్ధన నాశనం మదగయోః స్వర్భాను భావ్యోర్వదేత్ - 2 శ్లో

మండి 11

శుక్రే వృశ్చికగే మదే మృత వధూః కామే వృషస్థేబుధే
స్త్రీనాశస్త్వధ నీచగేమదగురౌద్యూనాధి రూఢే తథా
జామిత్రే ఝషగేశనౌపతి తథాభౌమేధవా స్త్రీమృతిః
చంద్రక్షేత్రగయోర్మదేర్కి కుజయోః పత్నీసతీశోభనా - శ్లో.

2. సప్తంగాని, సప్తమాధిపతి గాని దుష్టగ్రహాలతో కలియుట చూడబడుట దుష్టుల మధ్యముండుట (పాపార్గళం) లేదా సప్తమాధిపతి నీచలో గాని శత్రుక్షేత్రంలోగాని ఉండుట లేదా అస్తంగతుడగుట భార్యానాశహేతువు.

13. 5,9,7, స్థానాల్లో పాపగ్రహంతో గూడిన శుక్రుడుంటే భార్యావైకల్యం.

14. శుక్రుడు, కుజ, శని వర్గాలలో మన్నను వీరిచే చూడబడిన పరస్త్రీరతుడగును (రెండవ సూత్రంతో 14 వ సూత్రాన్నిపోల్చిచూస్తే రెండవసూత్రంలోని మూడు అంశాలు ఏకీభవించినపుడే భార్యానాశమని తోచుచున్నది).

15. కుజ, శనులు చంద్ర శుక్రులకు సప్తమస్థానాల్లో ఉంటే భార్యానాశం గాని సుతరాహిత్యంగాని కలుగును.

16. సప్తమంలో నపుంసకగ్రహము 12వ స్థానంలో రెండు పాపగ్రహాలుంటే ఇద్దరు భార్యలుందురు (12వ స్థానంలో రెండు పాపగ్రహాలుంటే భార్యానాశం అని చెప్పరాదు)

17. ద్వంద్వరాశి యందుకాని అనవాంశమందుగాని సప్తమాధిపతియుశుక్రుడును ఉంటే భార్యాద్వయయోగం వారితోకలిసిన గ్రహసంఖ్యను బట్టి భార్యాసంఖ్యను చెప్పవలెను. (ఇది అనుభవంలో ఇతర స్త్రీ సంబంధముగా గూడకావవచ్చునన్నది).

12 నుండి 14 అస్తే వాస్తపతాసద్గ్రిహయుతే దృష్టేప్యసమ్మధ్యగే
వీచారాతి గృహేర్కకాంత్యభిహ తేబ్రూయాల్కళ త్రచ్యుతిం.
కామేవాసుత భాగ్యయోర్వికలదారోపాసపాపే భృగా
శుక్రేవాకుజమంద వర్గ సహితే దృష్టేపరస్త్రీరతః

4 శ్లో

15 నుండి 17 భౌమార్క్యస్తే భృగుజ శశినో ర్దారహాసుతోవా
క్లీబేస్తే వాభవతి భవగాద్వ్యగ్రహాస్త్రీ ద్వయం స్యాత్
ద్వంద్వర్కాంశేమదపతి సితౌతస్యజాయాద్వయం స్యాత్
తాభ్యాంయుక్తైః గగనవిలయైః దారసంఖ్యాంవదన్తు

5 శ్లో

18. సప్తమందున గ్రహసంఖ్యను బట్టి భార్యా సంఖ్యను చెప్పవలెను. దుష్టగ్రహములైనచో భార్యానాశమును శుభగ్రహములైనచో భార్యల స్థితిని చెప్పవలెను,
(ప్రస్తుత కాలంలో ద్వితీయ వివాహాదులు నిషేధింపబడుటచే సామాన్యముగా బహుభార్యాయోగాలు జాతకములందున్నను ఆచరణలో కనిపించుటలేదు గ్రహస్థితి భావప్రేరకమైనను దేశకాల పరిస్థితులకనుగుణముగా ఆచరణ ఉంటుంది)

19. సప్తమాధిపతి బలవంతుడైశుభుడైనచో భార్యసచ్ఛీలముగలది, సత్పుత్రులు గలదియగును.

20. పాపగ్రహమైనను స్వక్షేత్ర వర్తియైనచో శుభఫలములే ఇచ్చును.

21. 6,8,12 స్థానాధిపతులు తప్ప ఇతర శుభగ్రహములు సప్తమంలో ఉంటే సౌఖ్యప్రదులు కాగలరు.

22. 2,7, స్థానాలు అశుభగ్రహాలతో కలిసినా చూడబడినా భార్యానాశం ఆ దృష్టిగూడ క్రూరదృష్టి అయినచో విశేష పాపఫలితము చెప్పాలి ఇట్లే స్త్రీజాతకంలో 7,8 స్థానాల్లో దోషం ఉంటే (భర్తకు) దోషం చెప్పాలి కాని శుభదృష్టి శుభగ్రహయుతి ఉన్నపుడు ఆ దంపతులు సౌఖ్యము కల్గియుందురు.

18 నుండి 21

స్త్రీ సంఖ్యాంమదగైర్గ్రహైర్మృతి మసత్యే ద్వైశ్చసద్భిః స్థితిం
ద్యూనేశే సబలే శుభేసతివధూః సార్ధీసుపుత్రాన్వితా
పాపోపి స్వగృహం గతః శుభకరః పత్న్యాశ్చకామస్థితా
హిత్వాషడ్వ్యయరంధ్ర పాప్మదవగాః సౌమ్యాస్తుసౌఖ్యావహాః - 6 శ్లో

22. భార్యా నాశస్య్వ శుభసహితౌవీక్షితౌ వార్ధకామౌ
తత్రప్రాహుస్య్వ శుభఫలదాంక్రూరదృష్టేం విశేషాత్
ఏవం పత్న్యా అపిసతి మదే చాష్టమే వాస్తిదోషః
సౌమ్యైర్దృష్టే సతిశుభయుతే దంపతీ భాగ్యవంతౌ - 7 శ్లో

23. చంద్రుడు శని సప్తమంలో ఉంటే స్త్రీ ద్వితీయ వివాహం పొందును. పురుషుడు సంతానం లేనివాడు గాని భార్యలేని వాడు గాని అగును.
(క్షీణ చంద్రుడునలెను పూర్ణచంద్రుడైనచో - శుభగ్రహముగా శనిదోషమును తొలగించును-కదా?)

24. నీచ శత్రుక్షేత్రాలై సప్తమంలో, అశుభగ్రహాలుంటే స్త్రీ పురుషులకు మృతి, రెండు, ఎనిమిది, స్థానాలైనను అట్టి ఫలితమే

25. సప్తమం సమరాశియై సప్తమాధిపతి, శుక్రుడు సమరాశిలో నుండి సప్తమాధిపతి పంచమాధిపతి అస్తంగతత్వంపొందకుండ, బలయుతుడైనచో భార్యాసౌఖ్యం, పుత్రసౌఖ్యం అధికంగా కలుగును.

26. 2,7,12, భావాధిపతులు కేంద్ర కోణములందుండి (వ్యయాధిపతి పంచమంలో ఉంటే సంతానమునకు, సప్తమంలో ఉంటే భార్యకు, ద్వితీయంలో ఉంటే కుటుంబానికి దోషం

సంతానమునకు, సప్తమంలో ఉంటే భార్యకు, ద్వితీయంలో ఉంటే కుటుంబానికి దోషం కదా? సప్తమ మారకాధిపతి పంచమకోణంలో ఉంటే భార్యాపుత్రులకు దోషం కదా? "దారేశే సుతగే ప్రణష్టవనితో పుత్రోధవా" కళత్రభావం 2 శ్లో అనే అంశానికి వ్యతిరేకం అగును) గురునిచే చూడబడి సప్తమాధిపతి 3,2,7,11 స్థానాల్లో సౌమ్యులున్నచో భార్యా పుత్రసౌఖ్యము కల్గును.

23 నుండి 24

చంద్రే సమందే మదగేపునర్భూః
పతిర్భవే ద్వాప్యసుతోవిదారః
నీచారిభస్థైః అశుభైర్మదేస్త్రీ
పుంసోర్మృతిః స్యాన్నిధనే ధనేవా - 8 శ్లో

25. లగ్నాత్కళత్రభవనే సమరాశి సంజ్ఞే
భావాధిపే నీచతదైవగతే సురేడ్యా
మార్యాభితప్తరహితే సుతదారనాథే
వీర్యాన్వితేతు జననం ససుతంకళత్రం - 9 శ్లో

26. కుటుంబదారా వ్యయరాశినాథాః
జీవేక్షితాః కోణ చతుష్టయస్థాః
దారేశ్వరాద్విత్త కళత్ర లాభే
సౌమ్యాః కళత్రం ససుతంసుఖాఢ్యం - 10 శ్లో

27. సప్తమాధిపతి శత్రు, నీచ రాశుల్లో ఉన్నా అస్తంగతుడైనా పాపులచే చూడబడినా సప్తమం పాపులతో కూడినా పాపులచే చూడబడినా కళత్రనాశం.

28. స్త్రీజాతకంలో 8వ స్థానం మాంగళ్యాన్ని 9వ భావం సంతానాన్ని లగ్నం శరీర సౌందర్యాన్ని 7వ భావం భర్తను సుభగత్వాన్ని (భర్తమైత్రి) 4వ స్థానం భర్తృసంగసుఖాన్ని శీలపవిత్రతను సూచిస్తాయి. ఆయా భావాల్లో శుభగ్రహాలుంటే శుభమును పాపగ్రహాలుంటే పాప ఫలితాన్ని చెప్పాలి క్రూరగ్రహమైనను స్వస్థాన స్థితి శుభఫలితమునే ఇస్తుంది. (స్వస్థాన శబ్దము ఉచ్చక్షేత్రమునకును ఉపలక్షణముగా గ్రహించాలి).

29. దుష్టగ్రహాలు 7,8 స్థానాల్లో ఉంటే వైధవ్యయోగం మిశ్రగ్రహాలుంటే పునర్వివాహం.

30. ధన స్థానంలో దుష్టగ్రహాలుంటే స్త్రీకి ఆయుర్భంగం.

27. కళత్రనాథేరిపునీచ సం మూఢె ధవాపాపనిరీక్షితేవా
కళత్రభేపాపయుతే ధద్య -కళత్రహానిం ప్రవదంతి సంతః

- 15 శ్లో

28. యద్యత్సుంప్రపవేక్షమంతదఖిలం స్త్రీణాప్రియేవావదేత్
మాంగళ్యంవిధవాత్సుతాం శ్చవవమాత్లగ్నాత్తనోశ్చారుతాం
భర్తారంసుభగత్వమస్తభవనాత్ - సంగంసతీత్వం సుఖాత్
సప్త స్తేషుశుభప్రదాస్త్వ శుభదాః క్రూరస్తదీశంవినా

- ఫలదీపిక స్త్రీ జాతకధ్యాయం 1 శ్లో

29, 30. ఆగ్నేయైర్మదవస్థితైశ్చ విధవామిశ్రైః పునర్భూభవేత్
క్రూరేష్వాయుషి భర్తృహన్త్ర్యా పిధనేంతః స్వయంస్త్రీమృతిః

- స్త్రీ జాతకాధ్యాయం - 3 శ్లో

ఈ విధంగా సూత్రాలన్నిటిని పరిశీలించడం న్యాయంగాని కుజదోషమనే పేరుతో ఇబ్బంది పడడం న్యాయంగాదని తోస్తోంది.

ప్రాజ్ఞులు సమగ్రంగా ఆలోచించవలసిందని ప్రార్థిస్తున్నాను.

# జాతక పారిజాతంలోని
# కుజదోష శ్లోకాలు, ప్రక్షిప్తాలా?

వధూవరజాతక సంయోగమను శీర్షికతో జాతక పారిజాతంలో 4 శ్లోకాలు దర్శనమిస్తున్నాయి

1. ధనావపాపస్మరయాన రంధ్రగోధరాసుతో జన్మనియస్యదారహా
తథైవకన్యాజనజన్మ లగ్నతో యది క్షమాసూనురవిష్టదః పతేః

2. క్రూరవ్యోమచరః స్త్రీణామష్టమస్థోవిలగ్నతః
వీచారి పాపవర్గేషు యది మృత్యు కరః పతేః

3. ద్యూనకుటుంబ గతౌయది పాపౌ
దారవియోగజదుః ఖకరౌతౌ
తాదృశయోగజదారయ తశ్చేత్
జీవతిపుత్రధనాదియుతశ్చ

4. కళత్రరాశిత్రిత యేధవాప్యాత్
తదీశ సంయుక్త భరాశికోణే
కళత్రరాశిర్యది పుత్రశాలీ
తదన్యరాశి ర్యది పుత్రహీనః

ఇందు మొదటి శ్లోకానికి "2,12,7,4,8,స్థానాల్లో కుజుడుంటే పురుషునికి భార్యానాశం. స్త్రీకి భర్తృనాశం" అని అర్థం. కాని ఈ శ్లోకం గ్రంథకర్తచే రచింపబడినట్లుగా తోచదు. ఒక గ్రంథకర్త ఒక భావాన్ని ఒకచోట ప్రదర్శించినపుడు మిగిలిన ప్రదేశాలలో గూడ తదనుగుణమైన భావాలనే వ్యక్తీకరిస్తాడు. కనీసం కొంతవరకైనా సంబంధం ఉన్న అంశాలనే వివరిస్తాడు. కాని పూర్తి వ్యతిరేకమైన అంశాలను వ్యక్తీకరించడు పై శ్లోకంలో కుజునికి ఆయా భావములందుండుటయే వ్యక్తీకరింబడినదిగాని అతడు ఉచ్చలో లేదా నీచలో లేదా ఇతర శుభాశుభక్షేత్రాలలో ఉండాలనే నిర్దేశం లేదు. దీనిని బట్టి కుజుడుంటేచాలు అతడు ఏ పరిస్థితిలో ఉన్నా భార్యానాశం భర్తృనాశం సంభవిస్తాయి. అనే అర్థం వస్తుంది కాని ఆ అంశాన్ని వ్యతిరేకిస్తూ రెండవ శ్లోకం కనిపిస్తుంది చూడండి.

"క్రూరమైన గ్రహము స్త్రీ జాతకంలో అష్టమస్థానంలో నీచ, లేక శత్రుక్షేత్రము లేదా పాపవర్గాల్లో ఉంటే మాత్రమే భర్తకు మృత్యువును కల్గిస్తాడు" అని రెండవ శ్లోకమువకు భావం. కుజుడు క్రూర గ్రహమే అని భావించినా అతడు నీచారి పాపవర్గ ములందున్నపుడే భర్తకు మరణం కల్గిస్తాడని చెప్పే రెండవశ్లోకంతో ఏ మాత్రము ఏకీభవించట్లేదు. అని మనం గుర్తించాలి. రెండవ శ్లోకమువందలి భావాన్ని అంగీకరించే గ్రంథకర్త మొదటి శ్లోకభావాన్ని అంగీకరించలేదు.

ఇక మూడవ శ్లోకం.

"7,2 స్థానాల్లో పాపులుంటే భార్యావియోగ దుఃఖాన్ని ఇస్తారు. అటువంటియోగమే గల కన్యను వివాహమాడినచో అతడు జీవిస్తాడు. పుత్రధనాదులతో కూడి ఉంటాడు." అనే భావాన్నిస్తుంది. కాని ఈ శ్లోక భావం యుక్తియుక్తంగా లేదు. చరిత్ర, ధర్మశాస్త్రగ్రంథాలుగూడ ఈ విషయంతో ఏకీభవించట్లేదు. గాంధారికి వైధవ్యయోగం ఉండన్న కారణంచేత ధర్మశాస్త్రవిహితమైన మార్గంలో ఆ దోషాన్ని తొలగించి వివాహం చేశారని భారతసారం అనే గ్రంథం తెలుపుతోంది. ధర్మశాస్త్రాలు గూడ వైధవ్య యోగాదులకు శాంతి విధానాలనే బోధిస్తున్నాయి. విశిష్టమైన జ్యోతిషగ్రంథాలలోగూడ ఒక జాతకమందలి ఒక దుష్టయోగం మరియొక శుభయోగంవలన పరిహృతమౌతుంది. అనే బోధిస్తున్నాయి. తప్ప ఒక జాతకము వందలి దుష్టయోగం మరియొక జాతకమందలి దుష్టయోగంచేత పరిహరింపబడుతుంది అని చెప్పటలేదు. విశేషించి ముహూర్తచింతామణిలో ఈ విషయమును గూర్చి

జన్మోత్థంచవిలోక్య బాల విధవాయోగం విధాయవ్రతం
సావిత్ర్యాఉతపైప్పలంకిహి సుతయాదద్యాదిమా వారహః
సల్లగ్నేచ్యుతమూర్తి పిప్పలఘటైః కృత్వావివాహం స్ఫుటం
దద్యాత్తాంచిరజీవినేత్రనభవేద్దోషః పునర్భూభవః - (సంస్కారప్రకరణం - 7 శ్లోకం) అని చెప్పబడింది.

జాతకమందు బాలవైధవ్యయోగండున్నపుడు సావిత్రీ వ్రతంగాని, పిప్పలవ్రతంగాని చేయించాలి. లేదా అచ్యుతమూర్తితో రహస్యవివాహంగాని, పిప్పల వృక్షంతో వివాహంగాని, కుంభవివాహంగాని జరిపించి చిరంజీవియైన (జాతకంలో దీర్ఘాయువుగల) వరునితో వివాహం చేయాలి అలాచేస్తే పునర్భూదోషము ఉండదు.

ఫలదీపిక కళత్రభావం - 7 శ్లో

అని పై శ్లోక భావం.

అనగా వైధవ్యయోగం ఉన్న స్త్రీకి శాంతులు జరిపి దీర్ఘాయుర్యోగవంతునకు ఇచ్చి వివాహం జరిపించాలే గాని మరియొక దోషం ఉన్న వానితో వివాహం చేయాలి అని చెప్పబడిలేదు.

విశేషించి ఇరువురి జాతకాల్లో కుజుడు ద్వితీయస్థానాల్లో ఉన్నాడనుకుందాం. అట్టి స్థితిలో ఫలదీపిక వచనానుసారం స్త్రీ జాతకమందలి ద్వితీయస్థానంలో దుష్టగ్రహాలుంటే ఆత్మనాశనం అనే ఫలితం సంభవిస్తుంది? పురుషజాతకమందలి ద్వితీయస్థానంలోని పాపులు భార్యానాశం అనే ఫలితాన్నిస్తారు. రెండు ఫలితాలు స్త్రీ నాశాన్నే బలపరుస్తున్నాయిగాని పరస్పరదోషాన్ని హరించుటలేదు. ఈ విషయాలను మనం స్పష్టంగా గుర్తించాలి.

1. ఫలదీపిక స్త్రీ జాతకధ్యాయం 3వ శ్లోకం
   ధనేసంతః స్వయం స్త్రీ మృతిః
2. భార్యానాశస్స్య శుభసహితేవాక్పతౌ

ఫలదీపిక కళత్రభావం 7వ శ్లోకం.

ఇక వాల్గవ శ్లోకం.

కళత్ర రాశిత్రితయముగాని సప్తమేశుదున్న రాశికి కోణరాశిగాని (1,5,9,) తధూజన్మరాశి యైనచో జాతకుడు పుత్రవంతుడగును అట్లుకానిచో పుత్రహీనుడగును. అని వివరిస్తోంది. కళత్ర రాశిత్రితయము అను పదమునకు వ్యాఖ్యాత కపిలేశ్వర శాస్త్రిగారు.

1. కళ శుదున్న రాశి, 2 అతని ఉచ్చగాని, నీచగాని, 3. కళత్రరాశి అనే మూడు రాశులు అని అర్థం చె వారు.

దీనికి ఆధారంగా

కళత్రనాధస్థితభం తదీయరాశిం కళత్రస్య విదుర్మహాన్తః
తస్యోచ్చనీచం యదివాకళత్రరాశిం తదంశత్రితయంతదీయం"

అను శ్లోకము అధోజ్ఞాపికతో చూపబడినది. కాని అతనికి ఉచ్చగాని, నీచగాని అనుటన యుక్తికరంగా లేదు. అతని ఉచ్చ, నీచ రెండు స్వీకరిస్తే కళత్ర రాశిత్రితయ మెలా అవుతుంది?

సప్తమం, సప్తమాధిపతి ఉన్నరాశి, సప్తమాధిపతికి ఉచ్చరాశి, నీచ రాశి అనునవి నాల్గు కాని

మూడు కాదుగదా? అందుచేత కళత్రరాశి, కళత్రరాశ్యధిపతి ఉన్నరాశి, కళత్రకారకుడున్నరాశి అను మూడింటిని స్వీకరించుట ఆ శ్లోకము రచించిన వాని అభిప్రాయం కావచ్చును. కాని ఈ పద్ధతి నేను చూచిన చాలా జాతకాలలో కనిపించలేదు. ఒకటి, రెండు ఉదాహరణలు.

| | | | |
|---|---|---|---|
| | | ర | |
| | పురుష జాతకం | | |
| | | | |
| | కు గురా | | |

| | | | |
|---|---|---|---|
| | | | |
| చ | స్త్రీ జాతకం | | |
| శు | | | |
| ర | | | |

ఇందు పురుష జాతకంలో కళత్రరాశి వృశ్చికం తదిపతి ఉన్నరాశి వృశ్చికం ఆ వృశ్చికమునకు కోణములు మీన, కర్కాటకాలు, (వ్యాఖ్యాత అభిప్రాయంలో సప్తమాధిపతికి ఉచ్చ మకరం, నీచ కర్కాటకం) కళత్ర కారకుడున్నరాశి సింహంపై రాశులలో ఏ ఒక్కరాశి స్త్రీ జాతకంలో లగ్నంగాని, జన్మరాశిగాని కాలేదు అయినప్పటికినీ వారికి చక్కని సంతానం ఉంది.

| | | | |
|---|---|---|---|
| | | ర | |
| | పురుష జాతకం | | |
| శు | | | |
| | కు | గురా | |

| | | | |
|---|---|---|---|
| | ర | | |
| చ | స్త్రీ జాతకం | | |
| శు | | | |
| | | | |

ఇందు పురుష జాతకంలో సప్తమం వృశ్చికం సప్తమాధిపతి ఉన్న రాశి వృశ్చికం సప్తమాధిపతి ఉన్న రాశికి పంచమ నవమాలు మీన కర్కాటకాలు, కళత్రకారకుడున్న రాశి మకరం, (వ్యాఖ్యాత అభిప్రాయం ప్రకారం సప్తమాధిపతికి ఉచ్చనీచలు మకర కర్కాటకాలు) పైరాసులలో ఏ ఒక్కరాశియు స్త్రీ జాతకంలో జన్మ లగ్నంకాని జన్మరాశిగాని కాలేదు. ఇటువంటి ఉదాహరణలు కోకొల్లలు పై వాక్యానికి అనుగుణంగా కూడ కొన్ని ఉదాహరణలు దొరకవచ్చుగాని అనియమం సార్వత్రికం

కానపుడు నియమమెలా అవుతుంది? విశేషించి ఈ రకమైన స్థితిని బట్టి సంతాన విషయం పరిశీలించడమే యుక్తియుక్తంగా తోచదు. సంతాన స్థానబలాన్ని బట్టి సంతానం కలుగుతుందిగాని పురుష జాతకంలో సప్తమాధిపతి స్థితిని బట్టి స్త్రీ జాతకంలో జన్మరాశిగాని జన్మలగ్నం ఉంటే సంతానం కలుగుట, కలుగకపోవుట ఆధారపడి ఉంటాయనడం సరిగాలేదు. పై అంశాలను బట్టి ఈ ప్రకరణంలోని నాలుగు శ్లోకాలు వైద్యనాధుని రచన విధానమునకు తగినట్లు గాలేవని గుర్తించవచ్చును.

అంతియేకాక వైద్యనాధుడు ఇతర ప్రదేశాలలో కుజుని స్థితిని గూర్చి చెప్పిన ఫలితాలను విచారణ చేస్తే 1వ శ్లోకంలో చెప్పిన అంశం ఈ గ్రంధకర్తకు ఏ మాత్రము ఇష్టముకాదని తెలుస్తుంది. గమనించండి. జాతక పారిజాత మందలి కుటుంబ విచార ప్రకరణంలో ఈ కుజుని ప్రసక్తిలేదు.

చతుర్ధ కుజుని శుభ ప్రదుడుగానే భావించాడు గ్రంథకర్త.

"యావేశే లాభిరాశిస్థే సుఖేవాలాభగే కుజే

అధవాభౌమరాశిస్థే రాజ్యప్రాప్తిర్న సంశయః

జాతక పారిజాతం చతుర్ధభావ ఫలాధ్యాయం - 105 శ్లో

చతుర్ధాధిపతి లాభంలో ఉండి, 4 స్థానంలోగాని, 11 లో గాని కుజుడుంటే రాజ్యప్రాప్తి కలుగును. లేదా చతుర్ధాధిపతి మేష, వృశ్చికాలలో ఉన్నా రాజ్యప్రాప్తి కలుగును. అని పై శ్లోకభావం. రాజ్యప్రాప్తి కలిగినంత మాత్రంచేత భార్యానాశం ఉండకూడదనే నియమం లేదుకాని గ్రంథకర్తకు చతుర్ధ కుజుడు భార్యానాశకుడు లేదా భర్తృనాశకుడు అనే భావం ఉంటే అట్టి భావాన్ని ప్రత్యేకించైనా చెప్పి ఉండేవాడు గదా.

స్త్రీ జాతకంలో చతుర్ధంలో దుష్టగ్రహములుంటే అధికసంతతి, అని చెప్పబడినదేగాని వైధవ్యం చెప్పబడలేదు.

(క్రూరైర్బంధు గృహో పగైర్బహు సుతప్రాప్తా భవత్యంగనా -

జాతక పారిజాతంలో స్త్రీ జాతకం 28 శ్లో)

ఇక సప్తమ భావం

శుక్రారౌమదగౌ కళత్ర రహితోధర్మాధాత్మజస్థౌతదా

శత్రుస్థానగతౌనిశాకరసితౌయద్యేక పుత్రోభవేత్
లగ్నాస్తవ్యయగేషు పాపఖచరే క్షీందౌసుతే దుర్బలే
వంధ్యా స్త్రీ పతిరేవజాతమనుజోజాయావిహీనోథవా

కుజ శుక్రులు సప్తమంలో ఉంటే కళత్ర రహితుడగును. 9,5, స్థానాల్లో ఉన్నను కళత్ర రహితుడగును. 6లో చంద్ర శుక్రులుంటే ఒకే కుమారుండును. 1,7,12 స్థానాల్లో పాపులుండి 5లో చంద్రుడు దుర్బలుడై ఉంటే వంధ్యాపతిగాని, భార్యావిహీనుడు గాని యగును. అని పై శ్లోకసారాంశం.

కుజ, శుక్రులు అనిఅందువలన శుక్రునకు కుజయుతి, సప్తమస్థితి అను రెండు అంశములు ఉంటేనే కళత్ర రాహిత్యం సంభవిస్తుంది. అని మనం గుర్తించాలి అంటే 5, 9 స్థానాలుగూడ వారుండుటకు మంచివి కావు. 1,7,12, స్థానాలు మూడింటిలోను పాపగ్రహాలుంటేనే రెండవ శ్లోకము నందు చెప్పబడిన యోగం సంభవిస్తుంది. అని మనం గుర్తించాలి.

నీచే గురౌమదనగేసతి నష్టదారః"
"మీనే కళత్రభవనే రవిజేత థైవ"

జాతక పారిజాతం సప్తమ భావాధ్యాయం - 17 వ శ్లో

గురుడు నీచంగతుడై సప్తమంలో ఉంటే భార్యామరణం, సప్తమమైన మీనంలో శని ఉంటే భార్యా మరణం, అని పై శ్లోక భావం. శనికి మీనం సమక్షేత్రమైనా నీచాభిముఖత గుర్తించదగిన అంశం నీచలో ఉంటే గురుడు గూడ దోషియేగదా. స్వక్షేత్రాది బలం ఉన్నప్పుడు కుజుడు దోషికాదు కదా. స్వక్షేత్రమే దోషం కానపుడు అంతకంటే విశిష్టమైన ఉచ్చ దోషంకాదు కదా విశేషించి కుజునకు నీచకూడ దోషంకాదని ఫలదీపికలో

పాపోపి స్వగృహం గతశ్శుభకరః పత్న్యాశ్చ ఫలదీపిక కళత్రభావం 6వ శ్లో
"అశుభదాః క్రూరాస్తదీశం వినా ఫలదీపిక

అని చెప్పబడింది. దీనిని బట్టి చూస్తే కుజునకు ప్రత్యేక దోషం ఉన్నపుడు ఆ విషయమును వాచ్యంగా చెప్పవలసి ఉండగా సప్తమంలో కుజునికి ప్రత్యేక పాపఫలం చెప్పకుండుటను చూడగా మొదటి శ్లోకం వైద్య నాథుడు రచించలేదనే విషయం నిర్ధారణ కాగలదు. విశేషించి స్త్రీ జాతకాధ్యాయంలో -

"ఆగ్నేయైర్విధవాస్తరాశిసహితైర్మిశ్రైః పునర్భూభవేత్
క్రూరేహీనబలే స్తగేస్వపతి నాసౌమ్యేక్షితే ప్రోజ్ఞితా"

జాతక పారిజాతం స్త్రీ జాతకాధ్యాయం - 19 శ్లో అని కలదు.

ఇదే అంశం ఫలదీపికలో

"ఆగ్నేయైర్మదనస్థితైశ్చవిధవామిశ్రైః పునర్భూభవేత్"

ఫలదీపిక స్త్రీ జాతకాధ్యాయం 3 శ్లో అని కలదు.

దుష్ట గ్రహాలు సప్తమస్థానంలో ఉంటే విధవయగును మిశ్రమంగాఉంటే పునర్భువు అగును.

"చంద్ర క్షేత్రగయోర్మదేర్కి కుజయోః పత్నీసతీ శోభనా"

ఫలదీపిక కళత్రభావం 3 శ్లో

సప్తమమైనకర్కాటకంలలో శనికుజులవలన పతివ్రత, శోభన (మంగళప్రదురాలు) అయిన భార్యవచ్చును.

దుర్బలుడైన క్రూరగ్రహం సప్తమంలో ఉండి శుభగ్రహంచేత చూడబడితే భర్తచే పరిత్యక్తయగును. అని జాతక పారిజాతమందలి విశేషం.

"ఆగ్నేయైః అనే శబ్దానికి దుష్టగ్రహములు అంటే ఒక దుష్టగ్రహం ఉన్నా ఆ యోగం చెప్పవచ్చా? అని ఒక సందేహం.

"ధవావసాన ---- పతేః అను కుజదోషశ్లోకం వైద్యనాథుడు వ్రాశాడని అంగీకరిస్తే ఒక దుష్టగ్రహం ఉన్నా ఆ యోగాన్ని చెప్పవలసి ఉంటుంది కాని.

ఉత్సృష్టామదన స్థితేదివకరే, శత్రుగ్రహాలోకితే.
విశ్వస్తావనిజే వధూరమణయోరన్యోన్యవైరంతువా
సౌమ్యాసౌమ్యయుతే కళత్రభవనే జాతాపునర్భూః శనౌ
కామస్థే రిపువీక్షితేత్వ విధవాజాతాజరాంగచ్ఛతి"

జాతక పారిజాతం స్త్రీ జాతకాధ్యాయం 23 శ్లో.

అను శ్లోకంలో

రవి సప్తమంలో ఉండి శత్రుగ్రహములచే చూడబడినచో భర్తచే విడువబడునది. కుజుడు సప్తమంలో ఉండి శత్రుగ్రహములచే చూడబడితే అవిశ్వస్త (నమ్మదగనిది) అనే అర్థం చెప్పాలని తోచుచున్నది

"క్రూరగ్రహైరస్తగతై స్సమస్తైః విలగ్నరాశేర్విధవా భవేత్సా"
క్రూరగ్రహములన్నియు కలిపి సప్తమంలో ఉంటే వైధవ్యము కలుగును. అని పైశ్లోకభావం అనగా ఒక గ్రహం ఉంటే అట్టి దోషం లేదని గ్రహించాలి కదా!

విశ్వస్త = విధవ-అని అర్థం చెప్పుకుంటే వైధవ్యం గలది అగును లేదా భార్యాభర్తలకు విరోధం కలుగును.

శుభగ్రహములు, దుష్టగ్రహములు కలసి సప్తమంలో ఉంటే పునర్భువు అగును. శని సప్తమంలో ఉండి శత్రుగ్రహములచే చూడబడినచో వైధవ్యముండదుగాని ముసలితనమును పొందును. (వ్యాఖ్యాతలు వివాహం కాకుండగనే ముసలితనము వచ్చును అనగా వివాహం కాదు అని అర్థము చెప్పినారు. కాని వివాహము ఆలస్యమగుననుట సమంజసముగా తోచుచున్నది.) అని పై శ్లోక సారాంశము. దీనిని బట్టి రవి, కుజ, శనులు కాక మిగిలిన పాపగ్రహములేమి ఉన్నాయి? విడిగా ఒక గ్రహం ఉంటే వైధవ్యం ఫలితం చెప్పబడలేదు కాబట్టి "ఆగ్నేయైః" అనే శబ్దానికి అన్ని పాపగ్రహాలు కలిసి సప్తమంలో ఉంటే అనే అర్థమే చెప్పాలి. అలా చెప్పినపుడు కుజదోషశ్లోకం వైద్యనాథుడు రాయలేదనే చెప్పాలి.

"పాపర్క్షే మదనస్థితే శనియుతే వైధవ్య మేత్యంగనా"
జాతక పారిజాతం స్త్రీ జాతకం 24 వ శ్లో.

పాపగ్రహరాశిసప్తమమై అందు శని ఉంటే వైధవ్యం కల్గును. అని చెప్పబడింది. కాబట్టి వ్యాఖ్యాత చెప్పిన "వివాహము కాదు" అనే మాటని అంగీకరించే అవకాశం లేదు.

విశేషించి కుజుడుంటే వైధవ్యం అనే మాటకంటే వైరుధ్యం అనే మాటే న్యాయంగా ఉంటుంది. కుజుడు స్వభావాన్ని బట్టి కోపము అధికంగా కలవాడు. సప్తమంలో కుజుడుంటే భర్తృస్థానంలో ఉండి లగ్నాన్ని చూసినందుకు ఇద్దరిలో కోపం ఉండే అవకాశం ఉంది అనే అభిప్రాయం న్యాయం.

ఇక పురుషజాతకంలో సప్తమంలో రవ్యాది గ్రహములకు ఫలితం చెప్పబడింది.

"రవౌవంధ్యాతుశీతాంశౌక్షీణేతువ్యభిచారిణీ
కుజేతుమ్రియ తేమందే దుర్భగారాహుసంయుతే
(జాతక పారిజాతం సప్తమాష్టమనవమభావ. ఫలాధ్యాయం 1 శ్లో)

రవి సప్తంలో ఉంటే భార్య వంధ్యయగును. క్షీణచంద్రుడుంటే వ్యభిచారిణియగును. కుజుడుంటే భార్య మరణించును. రాహువుంటే (గుహ్యావయవసంబంధమైన) అనారోగ్యము కలదియగును. అని పై శ్లోకభావం. కాని గ్రహముయొక్క స్థితినిబట్టియే ఫలితనిర్ణయం చేయుట సక్రమమైనదిగా తోచుట లేదు. పలురకములైన అంశములను బట్టి ఫలితము చెప్పుట వైద్యనాథుని అలవాటు. పై శ్లోకము వైద్యనాథరచితమని అంగీకరిస్తే సప్తమస్థానమందలి కుజుడు భార్యా మరణమును కల్పిస్తాడని అంగీకరించవచ్చునే. మిగిలిన 2,4,8,12, స్థానములో కుజుడుంటే భార్యానాశం అనే ఫలితము మాత్రము వైద్యనాథుడు చెప్పలేదు. అని అంగీకరించికతప్పదు. పురుషజాతకంలో అష్టమంలో కుజుడుంటే భార్య నాశం అనే ఫలితం చెప్పుట ఏ మాత్రము కుదరదు. అష్టమం భార్య ఆయువును గమనించదగిన భావంగా ఆ భావకారకత్వాలలో ఎచ్చటను కనిపించుటలేదు.

"పాపే రంధ్రపతౌతు పాపసహితే రోగప్రమాదాకరః"

(జాతక పారిజాతం అష్టమభావఫలాధ్యాయం - 63 శ్లో)

పాపగ్రహం అష్టమంలో ఉండి మరియొక పాపితో కలిసినచో రోగము, ప్రమాదము కల్గును. అని పై శ్లోకపాదమునకు వ్యాఖ్యాత అర్థము చెప్పినారు". "అష్టమమే పాపగ్రహయుక్త హోతో బహూత్ రోగద" అని విమలాహిందీటీక కాని రంధ్రము పాప గ్రహాధిపత్యము కలదై అందు మరో పాప గ్రహముంటే రోగము, ప్రమాదము సంభవించును అను అర్థము చెప్పుట న్యాయము. ప్రస్తుతాంశంలో కుజుని పాపిగా స్వీకరించి అతడు పాపగ్రహాధిపత్యముగల అష్టమస్థానంలో (ఉచ్చాదులు కాకూడదు) ఉంటే ఆరోగ్యలోపం చెప్పాలి గాని ఆయుర్భంగం చెప్పరాదు. ఈ విచారణ జాతకునకు సంబంధించినదేకాని అతని భార్యకు సంబంధించినది కాదు కదా!

స్త్రీ జాతకంలో అష్టమ స్థానం సౌభాగ్యస్థానం మతాంతరంలో ఆమెకు ఆయుస్థానం గూడ సౌమాంగల్య మనిష్టమష్టమగృహాత్

జాతక పారిజాతం స్త్రీ జాతకాధ్యాయం - 5 శ్లో

అయినప్పటికీ ఈ క్రింది విధానము గమనింపదగినది.

తుంగస్థాగగనాటనాః శుభకరారంధ్రే సపాపేవధూః
వైధవ్యం సముపైతి పాపభవనే పాపగ్రహాలోకితే
రంధ్రే శాంశపతౌఖలేచవిధవావిస్సంశయోభామినీ

సౌమ్యైరంధ్ర గతైః సమేతి తరుణీ ప్రాగేవమృత్యుంపతేః

జా.పా.స్త్రీజాతకధ్యాయం 27 వ శ్లో.

భాగ్యస్థాః శుభఖేచరాః స్మరగతే పాపేష్టమస్థేధవా
భర్తృశ్రీ బహుపుత్ర సౌఖ్య విభవైఃపార్థం చిరంజీవతి
క్రూరైర్బంధు గృహోపగైర్బహుసుతప్రాప్తా భవత్యంగవా
చాపేవా కటకోదయేపతి సుతప్రాప్తా దరిద్రాన్వితా

ఉచ్ఛలో నున్న గ్రహములు (అ ...ంలో) శుభమును చేయుదురు. అష్టమంలో పాపగ్రహముంటే వైధవ్యమును పొందును. ...మం పాపగ్రహభవనమై, పాపగ్రహముచే చూడబడి, అష్టమాధిపతి ...నున్న, నవాంశాధిపతి గూడ ...పియైనచో నిస్సంశయముగా వైధవ్యమును పొందును. (అష్టమంలో పాపగ్రహముంటే వచ్చే వైధవ్యయో...ను సందిగ్ధమైనదనియు పాపభవనమై పాపగ్రహదృష్టమై అష్టమాధిపతి పాపనవాంశయందుండుటవలన ఏర్పడుయోగమునిశ్చితమైనదని ...ను గ్రహించవలెను.) శుభగ్రహము అష్టమంలో ఉంటే భర్త ఆమెకంటె ఎక్కువకాలం జీవించువాడగును.

సప్తమంలోగాని అష్టమంలోగాని పాపగ్రహమున్నప్పటికిని శుభగ్రహములు భాగ్యస్థానంలో ఉంటే భర్త, పిల్లలు, సంపద, సౌఖ్యం, కలిగి చిరం...ని కాగలదు. పాపగ్రహములు చతుర్థంలో ఉన్నప్పుడు అధికసంతానవతియగును. ...టకలగ్నముల వారికి చతుర్థంలో పాపులుంటే భార్యా బిడ్డలు కలిగి దరిద్రురాలగును. అని పై శ్లోక ...ంశము దానిని బట్టి 8వ స్థానంలో పాపిఉంటే బలమైన వైధవ్యయోగంకాదు. 4వ స్థానంలో పాపులుంటే అతిసంతానం ఉండునని విశేషించి భాగ్యస్థానంలో శుభ గ్రహాలుంటే సప్తమాష్టమాలలో పాపులున్నా శుభఫలితమే అని తెలుస్తోంది.

"క్రూరేష్టమేవిధవతావిధవేశ్వరాంశే
యస్యస్థితే వయసితస్య సమేప్రదిష్టా
సత్స్వర్థ గేషుమరణం స్వయమేవతస్యా"

జా.పా.స్త్రీ జాతకధ్యాయం - 43 శ్లో

క్రూరుడు అష్టమంలో ఉంటే అష్టమాధిపతి ఏ నవాంశయందున్నాడో ఆ నవాంశాధిపతి దశ ఏ వయస్సులో వస్తుందో ఆ వయస్సులో వైధవ్యం చెప్పాలి. ద్వితీయంలో పాపగ్రహాలుంటే మారకత్వం చేయటంలో బలమైన పాపగ్రహదశలో ఆమెకు మరణం సంభవిస్తుంది.

పై విషయాలను బట్టి అష్టమంలో పాపులున్నపుడు అష్టమాధిపతిఉన్న నవాంశాధిపతి దశ వివాహోత్పూర్వం అయిపోయినా లేక చివరి వయస్సులో వచ్చినా, వివాహమునకు ఆటంకము లేదు. అనే విషయం స్పష్టమౌతుంది. ద్వితీయంలో పాపి ఉంటే ఆమె ఆయుస్థానమందే కాబట్టి ఆమె ఆయువునకు దోషమేగాని వైధవ్యం దోషం కాదని స్పష్టమౌతుంది. అట్టి స్థితిలో "ధవావసాన --- అనిష్టదఃపతేః" అని శ్లోకం వైద్యనాథుడు రచించాడమట ఏ విధముగను కుదరదు. జాతక పారిజాతమందలి స్త్రీ జాతకంలో వ్యయ భావ విచారణ కనిపించుటలేదు. పురుష జాతకంలో గూడ-

"భౌమేకచ్ఛపదర్శనం"

జా.పా. ద్వాదశభావఫలాధ్యాయం 81 శ్లో.

కుజుడు వ్యయంలో ఉంటే కలలో తాబేళ్ళు కనిపిస్తాయి అని చెప్పబడిందేగాని భార్యావియోగ దోషం చెప్పబడలేదు. 4, 12 స్థానాలకు భార్యానాశభర్తృనాశాలతో సంబంధం ఏమీ లేనట్లు వ్యక్తీకరింపబడింది. స్త్రీ జాతకంలో ద్వితీయం తన ఆయువునకు సంబంధించినదేగాని, భర్త ఆయువునకు సంబంధించినది కాదని స్పష్టమౌతోంది. అట్లే పురుషునకు అష్టమస్థానం తన ఆయువునకు సంబంధించినదేగాని, భార్య ఆయువునకు సంబంధించినది స్పష్టమగుచున్నది. స్త్రీ జాతకంలో అష్టమంలోగాని, సప్తమంలోగానిపాపులు అధికంగా ఉంటే భర్తృనాశం, అనియు, పురుషజాతకంలో ద్వితీయ సప్తమాలలో అధికంగా పాపులుంటే భార్యానాశమని స్పష్టమౌతోంది. కుజునకు అధిక ప్రాముఖ్యం ఏమియులేదు. నీచంగతుడైన గురుడును సప్తమంలో దోషే గదా! ఈరకమైన అభిప్రాయాలుగల వైద్యనాథుడు

"ధవావసాన ----- పతే" అను శ్లోకము రచించాడనడం సమంజసం కాదు కావున ఆ శ్లోకం ప్రక్షిప్తం అనక తప్పదు.

"క్రూరవ్యోమ --- పతేః" అను శ్లోకం పూర్తిగా స్త్రీ జాతకానికి సంబంధించినది. యుక్తియుక్తమైనదేగాని స్త్రీ జాతకాధ్యాయంలో ఉండదగినది.

"ద్యూన కుటుంబ ---- యుతశ్చ" అమనది యుక్తియుక్తంగాదు.

"కళత్ర --- పుత్రహీనః" ఇది యుక్తి యుక్తంగా లేదు.

1. వధూవర జాతక సంయోగమన శీర్షిక తక్కిన గ్రంథములలో కానరాకుండుట

2. ఈ శ్లోకములలో 3 శ్లోకములు యుక్తియుక్తంగా లేకుండుట.

3. ఈ శ్లోకములకు మిగిలిన ప్రకరణమందలి శ్లోకములు వ్యతిరేకముగా నుండుట.

4. వ్యాఖ్యాత "ధనావపాన --- పతేః అను శ్లోకమునకు ఇతర గ్రంథాలలోని ఆధారాన్ని చూపుదామని ప్రయత్నించినను కానరాకుండుటచే లోకంలో వాడుకలోఉన్న శ్లోకమును "అత్రోపలభ్యతే విశేషవచనం లగ్నే వ్యయే చపాతాళే జామిత్రే చాష్టమేకుజే" కన్యాభర్త్రువినాశాయ భర్తుఃకన్యా వినాశనం" ఉదహరించుట.

(వ్యాఖ్యాత జాతక పారిజాతమందలి ప్రతి శ్లోకానికి ఇతర గ్రంథాలలోని ఉద్ధరణలిచ్చినారు. ఈ శ్లోకములోకములో వాడుకలో ఉందే తప్పవారికి ఏ ఇతర ప్రామాణిక గ్రంథంలోను కనిపించక లోకంలో వాడుకలో ఉంది అని ఉదహరించారు. వారికే ఏ గ్రంథములోదో తెలియలేదు. పీయూషధారావ్యాఖ్యానకర్తకును ఈ శ్లోకము ఏ గ్రంథములోను కనిపించలేదు అందువలననే "అన్యేచ శ్లోకం పఠంతి" అని ఉదహరించారు.)

5. భార్యాభర్త్రు మారకత్వం విషయంలో 2,4,12, స్థానములకు కారకత్వము కానరాకుండుట అను హేతువులచే జాతక పారిజాతమందలి వరవధూ జాతకసంయోగః అను ప్రకరణమే ప్రక్షిప్తమని నిర్ణయించవలసి వచ్చినది.

కావున వధూవరుల జాతకాలలోని సప్తమాష్టమభావముల, బలమును, స్త్రీ జాతకంలోని ద్వితీయ భావ బలమును పరిశీలించి, జ్యోతిష్యగ్రంథములందున్న వైధవ్యవిధురయోగాదులను పరిశీలించి, వానికి తగిన విధంగా శాంతి జరిపించి, వైధవ్యయోగం గల స్త్రీకి పూర్ణాయుర్యోగమున్న పురుషునితోడను విధురయోగం గల పురుషుని దీర్ఘాయుర్యోగం గల స్త్రీతోడను వివాహం జరిపించవలెనేగాని, రెండు జాతకములందు కుజదోషమును గమనించి వివాహమునేయుట సక్రమమైన పద్ధతికాదని గుర్తించవలసియున్నది.

# కుజుడు

కుజుని భౌతికరూపం:- భూకక్ష్యకు వెలుపల ఉన్న గ్రహాలలో భూమికి అతి సమీపంలో కుజుడున్నాడు. గ్రహ సామ్రాజ్యంలో ఇతడు సేనానాయకుడు. భూమి నుండి కుజుని సరాసరిదూరం 6574 లక్షల కిలోమీటర్లు. (ఐరెన్ ఆక్సైడ్) తుప్పువల్ల ఎర్రబడిన నేల ఈ గ్రహానికి ఎర్రని రంగునిస్తోంది. సౌరమండలంలో కెల్ల ఎత్తైన అగ్నిపర్వతం. ఒలింపస్ మాన్స్ ఈ కుజమండలంలో ఉంది. ఇది ఎవరెస్ట్ శిఖరం కంటే సుమారు మూడంతలు ఎత్తైనది. ప్రాచీనులు అగ్నిస్వరూపుడుగా కుజుని వర్ణించారు. ఈ గ్రహం పంచభూతాధిపత్యంలో అగ్నికి అధిపతిగా వర్ణించబడ్డాడు.

సౌరమండలంలోని గ్రహాలు ఒకదానికి ఒకటి కొన్నికోట్ల కిలోమీటర్లదూరంలో ఉండడంవలన సౌలభ్యంకోసం ఖగోళశాస్త్రజ్ఞులు ఆ దూరాలను ఆస్ట్రినామిక్ యూనిట్లలో కొలుస్తుంటారు. భూమికి సూర్యునకు గల సగటుదూరం ఒక ఆస్ట్రినామిక్ యూనిట్. ఇది 149,598,500 కిలోమీటర్లు ఉంటుంది. కుజుడు సూర్యుని నుండి 1.52 ఆస్ట్రినామిక్ యూనిట్ దూరంలో ఉన్నాడు. సూర్యునికి అతి తక్కువదూరంలోకి వచ్చినపుడు 1.38 ఆస్ట్రినామిక్యూనిట్ దూరంలోను, దూరంగా వెళ్ళిన పుడు 1.67 ఆస్ట్రినామిక్ యూనిట్ దూరంలోను ఈ గ్రహం ఉంటుంది. భూమికి సమీపంలోనికి వచ్చినప్పుడు కుజుడు 0.38 ఆస్ట్రినామిక్యూనిట్ దూరంలో ఉంటాడు.

ఇతని సగటు కక్ష్యావేగం సెకండుకు 24.1 కిలోమీటర్లు. సూర్యునికి దగ్గరగా ఉన్నప్పుడు వేగం హెచ్చుగా ఉంటుంది. సూర్యునకు దూరంగా ఉన్నపుడు వేగం తగ్గుతుంది. ఈ గ్రహం తన చుట్టూతాను ఒకసారి భ్రమించడానికి మన కాలమానం ప్రకారం 24 గంటల 37 నిమిషాల 22.7 సెకన్లు పడుతుంది. సూర్యుని చుట్టూ పరిభ్రమణకాలం మన లెక్కల్లో 668.6 రోజులు మధ్యరేఖ వద్ద కుజగ్రహ వ్యాసం. 67 95 కిలోమీటర్లు భూద్రవ్యరాశి 1 అని భావించిన పక్షంలో కుజగ్రహం యొక్క ద్రవ్యరాశి 0.11గా ఉంటుంది. అక్కడ ఉపరితల ఉష్ణోగ్రత - 23° డిగ్రీల సెంటీగ్రేడు. భూగురుత్వాకర్షణ 1 అనుకుంటే కుజగ్రహం పై గురుత్వాకర్షణ 0.38 నీటి సాంద్రత 1 అని భావిస్తే కుజునిపై ద్రవ్యరాశి సాంద్రత 3.94. ఈ గ్రహానికి సంబంధించిన వాతావరణంలోని ముఖ్యమైన వాయువు కార్బన్డైఆక్సైడ్. ఈ గ్రహానికి రెండు ఉపగ్రహాలున్నాయి. వాటి పేర్లు ఫోబోస్, డైమాస్. ఈ గ్రహం ఆగస్ట్ 23 (సుమారు)న షడ్భాంతరములో ఉన్నప్పుడు భూమి సమీపానికి వస్తాడు. భూకక్ష్య వెలుపల కుజకక్ష్య కావడం వల్ల భూమికి సూర్యునికి మధ్య ఈ గ్రహం ప్రవేశించదు. కుజుని కాంతి పరావర్తన శక్తి సుమారు 0.15. అక్కడి వాతావరణం భూవాతావరణం

కంటె పలుచగా ఉంటుంది. కుజగ్రహం యొక్క ధృవముల చుట్టూ ధృవము కూటములు అనే తెల్లని ప్రదేశాలు కనిపిస్తాయి. అవి నీటి ఆవిరి ఘనీభవించడం వల్ల ఏర్పడినవి అయినందువలన కుజమండలంలో వాతావరణం ఉందని రూఢీ అవుతోంది. కుజుని వాతావరణంలో కొద్దిగ నీటి ఆవిరి అత్యల్పంగా ఆక్సిజన్ ఉన్నట్లు తెలుస్తోంది. కార్బన్‌డైఆక్సైడ్ మాత్రం భూవాతావరణంలో కంటె రెండు రెట్లు ఉందని క్విపర్ (1947) కనుగొన్నారు.

వికిరణమాపక సహాయంతో పరిశోధనవర్ణమాలక్షేత్ర పరిశీలన నుండి కుజునితాపక్రమాన్ని కనుగొన్నారు. సూర్యోదయభాగం (అంచు)లో తాపక్రమం - 10 డిగ్రీల నుండి - 20 డిగ్రీల వరకు, సూర్యాస్తమయ ప్రదేశాలలో - 10 డిగ్రీల నుండి, + 10 డిగ్రీల వరకు, కేంద్రప్రదేశాలల్లో 20 డిగ్రీల నుండి 30 డిగ్రీలవరకు, ధృవప్రదేశాల్లో - 10 డిగ్రీలు ఉంటుంది.

కుజునకు గల రెండు ఉపగ్రహాలు చాలా చిన్నవి డైమాస్, ఫోబోస్ అనే ఉపగ్రహాల్ని హాల్ (1877) ఆవిష్కరించారు. కుజగ్రహానికి డైమాస్ 23,496 కిలోమీటర్లదూరంలోను, ఫోబాస్ 9,334 కిలోమీటర్లదూరంలోను ఉంది. డైమాస్ వ్యాసం 8 కిలోమీటర్లుకాగా, ఫోబాస్‌వ్యాసం 16కిలోమీటర్లు, డైమాస్ భ్రమణకాలం ఒకరోజుకు 8 గంటల 16 నిమిషాలుకాగా, ఫోబాస్ భ్రమణకాలం 7 గంటల 39 ని. లు మాత్రమే. వాటి దీప్తి చాలా తక్కువ. సౌరకుటుంబంలో గ్రహం యొక్క పరిభ్రమణకాలం కంటె తక్కువ కాలంలో దానిచుట్టూ తిరిగే ఉపగ్రహం ఫోబాస్ ఒకటే. పరిభ్రమణవేగంవల్ల అది పశ్చిమాన ఉదయించి తూర్పున అస్తమిస్తుంది. రెండవ ఉపగ్రహం డైమాస్ తూర్పున 30గంటల 18 ని.లకు ఒకసారి ఉదయిస్తూంటుంది. ఫోబాస్ (భయం), డైమాస్ (భీభత్సం) అనే పేర్లు కుజుని యుద్ధకారకత్వానికి తగినట్లే ఉన్నాయి.

కు అంటే భూమి దాని నుండి జన్మించిన వాడు అనే అర్థంలో కుజశబ్దం వాడబడుతోంది. నవీనపరిశోధనలవలన భూమికి కుజునికి కొన్ని పోలికలున్నట్లు తేలుతోంది. అంగారక గ్రహానికి చెందిన రోజును శాస్త్రజ్ఞులు సోల్ అని వ్యవహరిస్తారు. కుజభ్రమణకాలం 24 గంటల 37 ని.ల 22.9 సెకన్లు భూమి అక్షం, కుజుని అక్షం సమానమైన నిమ్నత కలిగి ఉన్నాయి. భూవాతావరణాన్ని కుజవాతావరణం కొంతవరకు పోలిఉంది.

# కుజుడు స్వరూపం

"క్రూరదృక్ తరుణమూర్తిరుదారః పైత్తికః సుచపలః కృశమధ్యః - (వరాహమిహిరుడు.) క్రూర దృష్టికలవాడు, యువాకృతిగలవాడు, ఉదారుడు, పిత్తప్రకృతి కలవాడు, చపలస్వభావం కలవాడు, సన్నని నడుముకలవాడు.

హ్రస్వః పింగళలోచనోదృఢవపుః దీప్తాగ్ని కాంతిశ్చలో
మజ్జావానరుణాంబరః పటుతరః శూరశ్చ నిష్టన్నవాక్
హింస్రః కుంచితదీప్తకేశతరుణః పిత్తాత్మకస్తామసః
చండః సాహసికోపిఘాతకుశలః సంరక్తగౌరః కుజః

పొట్టివాడు, గోరోజన వర్ణంగల కన్నులుగలవాడు, పటిష్టమైన శరీరం గలవాడు, వెలిగే అగ్నివలె ప్రకాశించేవాడు, చపలస్వభావం గలవాడు, మజ్జగలవాడు (ఎముకలో ఉండే మజ్జ అనే ధాతువునకు అధిపతి) ఎర్రనిబట్టలు ధరించినవాడు (కుజ ప్రభావజనితులు ఎర్రబట్టనిష్టపడతారు) శక్తివంతుడు (కుజ ప్రభావజనితుల శరీరం శక్తిమంతమౌతుంది) శూరుడు, స్పష్టమైన వాక్కు కలవాడు కుజప్రభావంకలవారి వాక్యం సిద్ధాంతరూపంలో స్పష్టంగా ఉంటుంది. హింసాత్మక ప్రవృత్తిగలవాడు, గిరజాల జుట్టుగలవాడు, యువకుడు, పైత్యస్వభావం గలవాడు, తామసస్వభావం గలవాడు, కోపం అధికంగా గలవాడు, సాహసవంతుడు, శత్రువులను చంపే నేర్పు గలవాడు, ఎరుపు, తెలుపు కలిసిన రంగుకలవాడు.

మధ్యే కృశః కుంచితదీప్తకేశః క్రూరేక్షణః పైత్తిక ఉగ్రబుద్ధిః
రక్తాంబరోరక్తతనుః మహీజశ్చండో ప్యుదారస్తరుణోతిమజ్జః - మంత్రేశ్వరుడు.

ఉగ్రమైన బుద్ధిగలవాడు అనే విశేషం చెప్పాడు మంత్రేశ్వరుడు, తరుణశబ్దంవాడడం వలన కుజప్రభావజనితులు. వయసుమీరినా యువకులవలె శక్తివంతులుగా కనిపిస్తారు. అనే భావం వ్యక్తమౌతోంది.

- కోపాగ్నినేత్రః సితరక్త గాత్రఃపిత్తాత్మకః చంచలబుద్ధియుక్తః
  కృశాంగయుక్ తామసబుద్ధియుక్తః భౌమః ప్రతాపీరతికేళిలోలః - వేంకటశర్మ

చిక్కిన శరీరం గలవాడు. ప్రతాపవంతుడు, రతికేళిలోలుడు అనే విశేషాలు ఇందులో ఉన్నాయి. (కుజుడు అతికామానికి కారకుడు అనే విషయం వ్యక్తమౌతోంది).

క్రూరేక్షణః తరుణమూర్తి రుదారశీలః
పిత్తాత్మకః సుచపలః కృశమధ్యదేశః
సంరక్తగౌరరుచిరావయవః ప్రతాపీ
కామీతమోగుణరతస్తు ధరాకుమారః - వైద్యనాథుడు

రుచిరావయవుడు అనే విశేషాన్ని ఈ తడు చెప్పాడు. అవయవాలు తగిన రీతిలో ఉన్నవాడు అని అర్థం. కుజ ప్రభావజనితుడు తగిన అవయవపుష్టి కలవాడౌతాడు అని స్పష్టమౌతుంది.

ఆరోప్యుదారో పిచపీతనేత్రః
క్రూరేక్షణోసౌతరుణాత్మవాంశ్చ
సురక్తగౌరశ్చపలోతిహింస్రః
పిత్తోష్మవాన్ మంజికమానుపారః - జయదేవుడు.

పచ్చని నేత్రాలు కలవాడు, ఆత్మవిశ్వాసం గలవాడు, పిత్తోష్ణప్రకృతి కలవాడు అనే విశేషాలు జయదేవుడు చెప్పాడు. ఆత్మవిశ్వాసం కుజ ప్రభావజనితుల లక్షణం.

మజ్జాసారో రక్తగౌరోప్యుదారః హింస్రః శూరః పైత్తికస్తామసశ్చ. చండః పింగాక్షోయువా ఖర్వగర్వః ఖర్వ శ్చోర్వీసూనురస్మి [illegible] - ధుండిరాజు.

అధికగర్వం కలవాడు, పొట్టివాడు, అనే విశేషాలను ధుండిరాజు చెప్పాడు.

సత్త్వం [illegible] [illegible]
రక్తభౌమోఖౌమః, దేవతాషడ [illegible], భౌమోనరః,
భౌమః, అగ్నిః, [illegible] క్షత్రియః, అరః తమః భౌమః మజ్జా,
భౌమవారః, భౌమః తిక్తః, భౌమః దక్షిణే, కుజః విశాయాంబలీ,
భౌమః కృష్ణేచబలీ, క్రూరః, స్వదివసహోరా, మాస, పర్వ, కాలవీర్యవాన్, కటుకాద్యాన్ధరా

సుతః

వస్త్రే రక్తచిత్రౌకుజస్య, కుజః గ్రీష్మః - పరాశరుడు.

సత్త్వం అనే శబ్దానికి సత్త్వగుణం అనే అర్థం కొందరు చెప్పారు. కాని శక్తి అనే అర్థం వ్యాయం, శరీరశక్తి అనే అర్థం చెప్పాలి. దేవతషడాననుడు అని చెప్పడం ద్వారా కుమారస్వామిని, లేదా సుబ్రహ్మణ్యేశ్వరుని ప్రార్థించడం పూజించడం వలన కుజుని అనుగ్రహం లభిస్తుంది. కుజుడు

నరుడు అని చెప్పడం ద్వారా కుజుని వ్యయస్థితి మరల వరజన్మము ప్రసాదిస్తుంది అనడం న్యాయం. క్రూరగ్రహం రాత్రివేళ బలిష్ఠమైనదని పరాశరుని అభిప్రాయం కాని కుజునికి న్యాయబద్ధుడైన సైన్యాధ్యక్షరూపం, చోరనాయకుని రూపం గూడా ఉన్న దృష్ట్యా మేషకుజుడు పగటివేళ, వృశ్చికకుజుడు రాత్రివేళ బలవంతులనడం ఉచితంగా తోస్తోంది. అగ్ని స్వరూపుడు కావడం వలన అగ్నికి రాత్రిబలం ఉన్నందున కుజునికి రాత్రిబలం ప్రధానమైనదనే భావన సహేతుకమే. కృష్ణపక్షంలో బలవంతుడనం న్యాయమే.

కటుక శబ్దానికి నింబాది వృక్షాలను కొందరు గ్రహించారు కాని సొంటి, పిప్పలి, మిరియాలు, అనే అర్థాలున్నాయి. అవి ఘాటైన పదార్థాలు, ఆ పదార్థాలకు కుజుడు అధిపతి అనడం సహేతుకమే.

రక్తవస్త్రాలకు, చిత్రవస్త్రాలకు కుజుని ఆధిపత్యం చెప్పడం సహేతుకమే కుజ ప్రకృతి గలవారు చిత్రవిచిత్ర వస్త్రధారణ చేస్తూంటారు.

హింస్రోయువా పైత్తికరక్తగౌరః పింగేక్షణో వహ్నినిభోప్రచండః
శూరోప్యుదారః సతమాస్త్రికోగో మజ్జాధికో భూతనయః సగర్వః - పుంజరాజ

ప్రచండుడు - బాగా కోపంగలవాడు

దుష్టదృక్ తరుణః కృశమధ్యః రక్త సితాంగః
పైత్తికశ్చంచలధీరుదారః ప్రతాపీ - - - మహాదేవుడు

దుష్ట దృష్టికలవాడనడం న్యాయంకాదు. జాతకంలో కుజుడు దోషి అయినపుడే అతనిదృష్టి దోషభూయిష్ఠమౌతుంది. యోగకారకుడైన కుజుని దృష్టి గుణప్రదమే అవుతుంది. మిగిలిన గ్రంథాలలో చెప్పినట్లు క్రూరదృష్టికలవాడనడం న్యాయం.

# కుజుడు - కారకత్వాలు

లక్షణాలు : ప్రవర్తనలో వంకరదనం ఉంటుంది. సమమైన ఎత్తుగలవాడు ఎరుపుతెలుపు కలిసిన రంగు కలవాడు. శక్తికలిగిన శరీరంగలవాడు సేనానాయకుడు. ముదురు ఎరుపుకు గూడా ఇతడు అధిపతి. (వలుపు ఎరుపు కలిసిన రంగువలన రజస్తమో గుణప్రకృతిని సూచిస్తుంది). మజ్జ అనగా ఎముకలోపల ఉండే ధాతువునకు అధిపతి అగ్నిస్థానం ఇతనికి చెందిన స్థానం, అగ్ని దగ్ధమైన వస్త్రానికి అధిపతి బంగారానికి కారకుడు గ్రీష్మర్తువు ఈతనికి చెందిన ఋతువు - ఈతనికి చెందిన రుచికారం.

కళ్యాణవర్మ అభిప్రాయంలో ఇతడు కుమారుడు సత్వం ఇతని అధిపత్యంలోనిదే. దక్షిణదిక్కునకు అధిపతి నవగ్రహస్థాపనలో దక్షిణదిక్కు ముఖంగా స్థాపిస్తారు. ఉపాసించదగిన దేవత - అరుణుడు, కార్తికేయుడు, పురుషగ్రహం, క్షత్రియ జాతి, ద[illegible]దవస్త్రానికి కారకుడు, ప్రశ్నకాల గణనలో ఒకరోజు ప్రశ్న కాలపరిమితి సామవేదానికి అధిపతి, [illegible]లోకానికి అధిపతి (వ్యయంలో బలవంతుడైన కుజుడున్నపుడు ఆ జాతకుని మరుజన్మ మనుష్యలోకంలో జరుగుతుంది . అని భావించవచ్చు) వ్యయంలో కుజుంటే ఎక్కువమందికి అప్పు ఇస్తాడు వాళ్ళుతీర్చరు ఆఋణబంధాలను తీర్చుకోడానికి మళ్ళీ మనుష్యుడుగా పుట్టాల్సివస్తుంది అనడం సహేతుకమే.

వైద్యనాథుని అభిప్రాయంలో కుజుడు పాపగ్రహం ఈ గ్రహం ఎల్లవేళలా వెనుకనుండి ఉదయిస్తాడు. (దీనివలన కుజ గ్రహస్వభావ ప్రధానమైన వ్యక్తి ఎదుటి వ్యక్తి మాటలను మరోకోణంలో ఆలోచిస్తాడు తప్ప ఎదుటి వ్యక్తి [illegible]ప్రాయానికి అనుగుణంగా ఆలోచించడు అని అర్థం అవుతుంది) భూమినుండి జన్మించే [illegible] (స[illegible]పాయానికి) వాల్గు కాళ్ళ జంతువులకు అధిపతి (స[illegible]షణ పశువిక్రయం మొదలైన [illegible]లకు కారకుడౌతాడు) పర్వతారణ్యప్రదేశ సంచారి (ఆప్రదేశాలు జీవానికి, జీవికకు అభి[illegible]యి) ఈతని అభిప్రాయంలో కుజుడు బాలుడు. ఈతని రత్నం ప్రవాళం (పగడం) ( [illegible] [illegible]లో దోషిగా ఉన్నా దశదోషప్రదంగా ఉన్నా పగడం ధరించాలి. మేషవృశ్చికలగ్నాలవారు, ఆరాసులు జన్మరాశిగా గలవారు జీవితాంతం, పగడం ధరించే పద్ధతి శాస్త్రీయం కాదు) లంకనుండి కృష్ణానది వరకు గల ప్రదేశానికి ఇతడధిపతి తమోగుణాధిపతి. ఇతడు పురుషగ్రహం, తేజస్తత్వానికి చెందినవాడు ఇతనిది ఊర్ధ్వదృష్టి (కుజుడు ప్రధాన గ్రహంగాగలవారు సామాన్యంగా కాకుండా కొంచెంపైకి చూస్తారు)

కుజుని బలం మంగళవారం, మేష వృశ్చికనవాంశలు, స్వద్రేక్కాణం, మీన, వృశ్చిక, కుంభ, మకర,

రాశులలో, రాత్రి వేళ, వక్రించిన సందర్భంలో, రాశిప్రారంభంలో, దక్షిణ దిక్కున (దశమభావంలో) బలవంతుడౌతాడు

మీన, కర్కాటకాల్లో సుఖప్రదుడౌతాడు.

కుజకారకత్వాలలోని అనారోగ్యాలు ఇబ్బందులు అండవృద్ధి, కఫం, (వేడి చేసి కఫం పెరిగిన సందర్భంలో శ్లేష్మం గట్టి[illegible] [illegible]ంది పెరుతుంది. ఆవిధమైన కఫానికి కుజుడధిపతి) ఆయుధాల ద్వారా, అగ్నిద్వారా కలిగే ఇబ్బందులు, గ్రంధిరోగాలు (ప్రోస్టేట్ గ్రంధివాచుట మొ.) కురుపులు, దారిద్ర్యం, భేతాల (శివగణం) పీడ. మొదలైనవాటికి కారకుడు.

పరాశరుడు ఈతని అభిప్రాయంలో కుజుడు ఎక్కువ పొడవు లేని శరీరంగలవాడు, నరుడు (మను ష్యస్వభావాలు గలవాడు) తమోగుణాధిపతి రుచి-చేదు కృష్ణపక్షంలో బలం కలవాడు. క్రూరగ్రహం (పరాశరుని దృష్టిలో పాపగ్రహాలు లేవు అనిపిస్తుంది. పాపాధిపత్యం పట్టినపుడు ఆధిపత్యపాపులు అంటాం నైసర్గిక పాపులు అనేవ్యవహారం సరికాదు. పరాశరుడు క్రూరశబ్దంవాడాడు పిల్లవాని శిక్షించే తండ్రి దోషిని శిక్షించే రక్షకభటుడు క్రూరులు కావచ్చుగాని, పాపులు కాలేరు.

> క్రూరోరక్తేక్షణో భౌమః చపలోదారమూర్తికః
> పిత్తప్రకృతికః క్రోధీకృశమధ్యతనుర్ద్విజ

(బృహత్పారాశరహోరాశాస్త్రం గ్రహగుణస్వరూపాధ్యాయం 25 శ్లో.) క్రూరస్వభావం కలవాడు, ఎర్రని కన్నులు (చూపులు) కలవాడు, చపలస్వభావం కలవాడు, దాతృత్వం స్వభావంగా కలవాడు, పైత్య ప్రకృతికలవాడు కోపం గలవాడు చిక్కిన మధ్యమ శరీరం గలవాడు లేదా సన్నని నడుముకలవాడు.

గుణాకరుడు వాయుకత్వంగలవాడు సోదరకారకుడు.

సర్వార్థచింతామణి నరపాలకుడు (రాజు) అతిరక్తుడు (ముదురు ఎరుపు) పాపగ్రహం. అగ్ని దగ్ధమైన వస్త్రంలో బాటు క్లిన్నవస్త్రానికి (తడిసిన) ఆధిపత్యం చెప్పారు. రక్తవస్త్రం, చిత్రవస్త్రం(పలు రంగులతో నున్నది) ధాతుగ్రహం (గ్రహాలు ధాతు జీవ, మూల గ్రహాలుగా విభజింపబడ్డాయి మనో ముష్టిచింతాప్రశ్నలో అంటే మనసులోని భావం చెప్పడం, పిడికిలిలోని వస్తువు చెప్పడం ఈ గ్రహం ధాతువుకు చెందిన వాడౌతాడు)

జయదేవుడు స్వర్ణకారుడు, యువకుడు, ఇతరులను పీడించి ఆనందించేవాడు (భౌమః ప్రకృత్యాదుః ఖదోప్పణాం) ధాతువు మణి, ఈ తని దృష్టిలో మధ్యాహ్నంకుజునికి బలప్రదమైన కాలం.

మంత్రేశ్వరుడు చౌర్యకారకుడు, మ్లేచ్ఛజాతికారకుడు, అగ్నిభూమి, యుద్ధ భూమి, ఆయుధధారి, కోడి, నక్క, కోతి గ్రద్ద మొదలైన కారకత్వాలను కూడా చెప్పాడు ఈతని అభిప్రాయంలో శరీరంలో దక్షిణభాగంలో పుట్టుమచ్చ లేదా చిహ్నము (కత్తిగాటు మొ.)నకు గూడా కుజుడే కారకుడు (కుజుడులగ్నం నుండి ఏ భావంలో ఉన్నాడో చూసి ఆ భావానికి సంబంధించిన శరీరస్థానంలో గాని ఆతడున్న రాశికి చెందిన శరీరభాగంలోగాని చిహ్నం ఉంటుందని చెప్పవచ్చు.) కుజుని వయస్సు 16 సం. భూమిపై వచ్చే పంటలు, సాహసం, ద్వేషం, జ్ఞాతి, అస్త్రాలు, పరస్త్రీ కాంక్ష, అసత్యం పలకడం. మొ. వాటికి కారకుడు.

పుంజరాజు దేవతాగృహం, భూమికి అధిపతి (వ్యవసాయాది భూసంబంధమైన వృత్తులకు, కారకుడు, అవే విశేషకారకత్వాలను గూడా చెప్పాడు.

విలియం.లిల్లీ గురువు విద్య చెప్పే ప్రదేశానికి కారకుడు ఆకారంచిన్నది అగ్నివలె ప్రకాశించేతేజస్సుకు కారకుడు 686రోజుల 22 గంటలలో ఇతడు రాశి చక్రాన్ని పూర్తి చేస్తాడు కుజుడు ఉత్తరదిక్కున 4° - 31 వరకు వెడతాడు. దక్షణదిక్కున 6° - 47 వరకు వెడతాడు (భూమధ్యరేఖనుండి దక్షణం వైపుకు ఉత్తరం వైపుకు కదిలే ప్రదేశాన్ని శరం అంటారు). ఇతడు 80 రోజులు వక్రించి ఉంటాడు. 2,3 రోజులు స్థిరంగా స్తంభనలో ఉంటాడు. కర్కాటక, వృశ్చిక మీన రాసుల్లో శుభప్రదుడౌతాడు ఇతడు కలహప్రేరకుడు.

అనుభవాంశాలు కుజుడు, శారీరిక, మానసిక శక్తులకు కారకుడు, మల్లయోధులు, పోలీసులు, సైనికులు, ఇంజనీర్లు, డాక్టర్లు (ఆపరేషన్ చేసే సర్జన్లు) మొదలైన వృత్తుల వారికి ఇతడు కారకుడు.

ఉత్తరకాలామృతం శౌర్యము, భూమి, బలము, శస్త్రధారణ, జనవాయకత్వం, యుద్ధం, విరోధం, శక్తివశించడం, చోరత్వం, యుద్ధం, విరోధం, శత్రువులు, ఔదార్యం, రక్తవస్త్రప్రీతి, తోటలపై ఆధిపత్యం తుర్యధ్వని పైప్రీతి (యుద్ధాదులందు వాయించే వాద్యవిశేషం) చతుష్పాజ్జంతువులు, రాజు, మూర్ఖుడు, కోపం, విదేశయానం, ధైర్యం, బ్రహ్మ, అగ్ని, వాగ్వాదం, పైత్యం, ఉష్ణతత్త్వం, కురుపులు, రాజసేవ, రోజు, పైకిచూడడం, పొట్టి, అనారోగ్యం, విఖ్యాతి, సీసం, కత్తి, కుతాయుధం, సలహాలిచ్చేవారు, మిత్రులు, స్పష్టమైన శరీరాంగాలు, మణులు, సుబ్రహ్మణ్యాజనం, యువకుడు,

కారం, రాజాస్థానం, అవగ్రహం (అంకుశం, దండన, ఇతరులకు అడ్డం పడడం) మాంసభక్షణ, ఇతరులను దూషిడం, శత్రుజయం, చేదు, పరాక్రమం, తెల్లవారుజామున బలం, గాంభీర్యం, పురుషుడు, శీలం, గండ్రగొడ్డలి, వనసంచార శీలం, గ్రామాధికారం, రాజదర్శనం, మూత్రకృచ్ఛ్రం చతురస్రాకారం (ముఖంకోలగా ఉంటుంది.) స్వర్ణకారుడు, ఖలుడు, దగ్ధస్థానం మంచిభోజనం, చిక్కిపోవడం, ధనుర్విద్యా ప్రావీణ్యం, రక్తం, రాగి, విచిత్రవస్త్రాలు దక్షిణదిక్కు గాముఖం పెట్టు కోవడం, దక్షిణ దిక్కు యందుప్రీతి, కామం, కోపం, ఇతరులపై అపవాదులు వేయడం, గృహం, సైన్యాధిపత్యం, శతఘ్నులు, సామవేదం, సోదరులు, గొడ్డలి, దుష్టమృగాలు, నేతృత్వం, స్వతంత్రం కావాలనే పట్టుదల, పొలాలు, దండనాయకత్వం, నాగలోకం, వాక్కు, చిత్తచాంచల్యం, వాహన సౌఖ్యం, రక్త దర్శనం రక్తక్షీణత.

పాశ్చాత్యమతం నాయకత్వం, హక్కులపై పోరాడే తత్త్వం ధైర్యం, శౌర్యం, క్రౌర్యం, ముక్కుకు సూటిగా మాట్లాడడం, ఇతరులను ఆక్షేపించడం, అనవసరంగా స్పందించడం, కలహశీలం, కోపం, పగ, పవివినాశం చేయడం, మంచి చెడ్డల విచక్షణ లేకుండా లాభనష్టాలను లెక్కచేయకుండ, ప్రమాదాల్ని గుర్తించకుండ సాహసం చేయడం, ఓర్పులేకపోవడం, అందరికంటె గొప్పగా ఉండాలనే భావన, విశ్రాంతి లేకపోవడం, పరుషంగా మాట్లాడడం ఆలోచనలేకుండా పనులు చేయడం.

శంభుహోరా ప్రకాశిక గర్వం కలిగి ఉండడం, హింసాప్రవృత్తి కలిగి ఉండడం, అనేవిశేషలక్షణాలను చెప్పికుజుడు త్రికోణాకృతిగలవాడని పేర్కొనడం జరిగింది.

కళ్యాణవర్మ ఎర్రని కమలం, రాగి, బంగారం, రక్తం, పాదరసం, మనశ్శిల, భూమి, రాజు, పతనం, మూర్ఛ, పిత్తం, చోరుడు.

వైద్యనాథుడు సామర్థ్యం, రోగం, గుణం, తమ్ముడు, చెల్లులు, శత్రువు, జాతి,

పరాశరుడు సామర్థ్యం, ఇల్లు, భూమి, పుత్రుడు, స్వభావం, దొంగతనం, రోగం, సోదరుడు, పరాక్రమం అగ్ని, సాహసం, రాజపుత్రుడు.

వెంకట శర్మ పరాక్రమం, విజయం, కీర్తి యుద్ధం, సాహసం సేనాధిపత్యం, పరశువు, కుఠారం మొదలైన ఆయుధాల ప్రయోగంలో నైపుణ్యం, ధైర్యం, కాంతి, గాంభీర్యం, కామవాసన, క్రోధం, శత్రువృద్ధి, ఆగ్రహం, విశ్వయం, పరనింద, స్వతంత్రత, ఉసిరి చెట్టు, భూమి.

మంత్రేశ్వరుడు పరాక్రమం, భూమి, సోదరుడు, క్రూరత, యుద్ధం, సాహసం ద్వేషం, వంటిల్లు, అగ్ని, బంగారం, జాతి, అస్త్రం, చోరుడు, శత్రువు, ఉత్సాహం, పరదారాగామిత్వం, సత్యభాషణం, వీరత్వం చిత్తవికాసం, పాపం, సేనాధిపత్యం వ్రణం.

కుజునికి సంబంధించిన అనారోగ్యాలు: దప్పిక, రక్తసంబంధదోషాలు, హత్యాప్రయత్నం, పడి పోవడం పైత్యం, జ్వరం, అగ్నివిషశస్త్రాదుల భయం కుష్ఠు, నేత్రరోగం, గుల్మం (అపెండిసైటిస్) అపస్మారం, శిరస్సుకు సంబంధించిన అనారోగ్యాలు, దురద, అవయవలోపం, రాజకోపం శత్రు, చోర, భయాలు, సోదరులు, పుత్రులు మొదలైన వారితో విరోధాలు, భూత, పిశాచ, గంధర్వ దోషాలు, మొదలైనవి.

పాశ్చాత్యమతం: వేడి, ఎండిన, వేచిన పదార్థాలు, కాలుట, ఉద్యోగి, వంధ్య, పురుష స్వభావం, సాహసం దాహంపుట్టించే మానెలు, మండే మానెలు, తీవ్రమైన ఓషధులు, రసాయనాలు వేడి పదార్థాలు, దాహం పుట్టించేరుచులు, లోహం చేతికంకణం, కత్తి మొదలైన ఆయుధాలు, చాకు, కొరడా, కలహం దొంగతనం, దెబ్బ, యుద్ధం వల్ల గౌరవం గొప్పవాడను కావాలనే కాంక్ష, పౌరుషం, కామవాసన, కోపం, గర్వం అగ్ని, దుఃఖాదులవలన వచ్చే ఉద్వేగం, పిచ్చి, భయంకరత్వం, ద్రోహం, నింద, పోలీసు, కారాగారం, ముఖం, డాక్టరు, (సర్జన్) రసాయనశాస్త్రం. వైజ్ఞానికులు, యుద్ధసామాగ్రిని తయారుచేసేవాడు మెకానిక్, ఇంజనీర్, టర్నర్, ఫిట్టర్, చర్మసామగ్రిని చేసేవాడు యంత్రాగారాల్లో పని చేసే వాడు, రాగి పాత్రలు చేసేవాడు, కత్తులు చేసేవాడు. గాజులు చేసేవాడు, దంతవైద్యుడు, కసాయివాడు, మాంసవిక్రేత ఉరితీసేవాడు, వాచీలు తయారు చేసేవాడు, బాగుచేసేవాడు, బట్టలు కుట్టేవాడు, క్షౌరవృత్తి చేసేవాడు వంటవాడు, చర్మకారుడు ఆభరణాలు చేసేవాడు, తల, ముక్కు, జననేంద్రియం, పిత్తం, పిత్తాశయం, మూత్రాశయం. స్పర్శశక్తిగల నరాలు, కండలు, చలిజ్వరం, ఆవుపేడ, రక్తప్రసరణ వేగం, తెగడం కాలడం, ఆభరణాలు, ఆయుధాలు, తయారు చేసే స్థావాలు, హోటలు, కార్ఖానాలు, పాత్రలు తయారుచేసే ప్రదేశాలు, సున్నంబట్టీలు మొదలైన ప్రదేశాలలో ఉండే అగ్నిస్థానాలు, రసాయనశాల, యుద్ధభూమి సేనాశిబిరం, ప్రేలుడు పదార్థాలు ఆయుధాలు, ఉంచే ప్రదేశం, యోధులుండే ప్రదేశం విషజంతువులుండే ప్రదేశం సోదరులు, సోదరీలు, ముఖం, దుఃఖం, అన్నదమ్ములబిడ్డలు, సవతి సోదరులు, మేధావులు చేసేపనులు.

కాటవే పి. డబ్ల్యుడి. విభాగం భూమికి సంబంధించిన కొలతలు, చరిత్ర, క్రిమినల్‌లా, జీవశాస్త్రం, ఎముకలకు సంబంధించిన శాస్త్రం, పోలీసుఇన్‌స్పెక్టర్, అజమాయిషీ చేసే వారు. అడవి, కృషి విద్యాలయం, సర్వే విభాగం, బాయిలర్ ఏక్ట్ యంత్ర పరిజ్ఞానం (మెకానికల్) ఇంజనీరింగ్,

బీడిసిగరెట్ ఫ్యాక్టరీలు, ఫ్యాక్టరీ వర్కర్లు సారాబట్టీలు, సారాదుకాణాలు, అబ్‌కారీ ఇన్‌స్పెక్టర్, సిపాయి, పహిల్వాన్, మోటారు విభాగాలను అమ్మేవారు సైకిల్, మోటారు వాహనాలను రిపేరు చేసేవారు టాంకులు యుద్ధ నౌకలు, తాంబూల పేటిక, బాంబులు విమానాలు, పెట్రోలు, స్పి..., రాకెట్ ఇంధనం, ఫాస్ఫరస్, అయోడిన్, కరెంటు ఆర్క్‌కోసం ఉపయోగపడే కార్బన్ (...హేలులోమిషన్‌లో ఉపయోగపడుతుంది). తయారు చేసే కార్ఖానా, అగ్గిపెట్టకార్ఖానా దూదిమిల్లులు, రేసులు, గుర్రాలు, జలగ, సైరింజన్ ద్వారా మంటలనార్పేవారు, ఆపరేషన్, అపెండిసైటిస్, మూత్రకృచ్ఛ్రం, గండమాల, టాన్సిల్స్ మనస్సును రక్తాన్ని పాడుచే... వ్యసనాలు, ఇంగ్లాండు, ఫ్రాన్స్, గ్రీస్, ఇటలీ, జర్మనీ, జపాన్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్ర, కర్నాటక, సౌరాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్, నైట్రిక్ యాసిడ్, ఎసెటిక్ యాసిడ్, హైడ్రోజనిక్ యాసిడ్, ఆర్సెనిక్, గంధకం, విషాన్ని జీర్ణించుకునే శక్తి, కోడి, గ్రద్ద, డేగ, రాబందు, ఎలుగుబంటి, పావురం, పిచుకలు, పిల్లి క్రిష్టియన్, ఆంగ్లోఇండియన్, యూరోపియన్, సిక్కులు, మరాఠీ రాజపుత్రులు, ...లు, లింగాయతులు, గుజరాత్ వారు, సౌరాష్ట్రులు, వారికి సంబంధించిన సామాన్య వర్గాలవారు.

మరికొన్ని విశేషాలు:

గణితశాస్త్రం, వీర్యం, రిపుంజయత్వం ఉద్యోగనాశం కారాగారం, పరస్థలమృతి అంగవైకల్యం, చిత్తవికలత, దీనస్వభావం, జారత్వం, దాంపత్యసౌఖ్యలోపం, నిద్రాభంగం, మదురు, గుహ్యేంద్రియాలు, ముళ్ళ చెట్లు, రాబిస్, చిన్నుల్లి, పొగాకు, బెల్లం, రాతికట్టడాలు ఈతవికార కళ్యాలలోనికి వస్తాయి.

విశ్లేషణ:

మధ్యమశరీరం, కండపుష్టి, సాహసం, యంత్ర, శస్త్ర, పరిజ్ఞానం, ఆయుధాలు, ప్రేలుడు పదార్థాలు మొదలైన వాటిపై ఆసక్తి, రక్షణ శాఖకు సంబంధించిన ఉద్యోగాలలో రాణించగలగడం, యాత్రలు సాహసాలు నడపడంలో ప్రజ్ఞా ఆసక్తి, అగ్నిప్రమాదాలు, దెబ్బలుతగలడం మొదలైన వాటిని లెక్కచేయని మనస్తత్వం, ముఖంపై గాని, తలపై గాని వాటి అవశేషాలు మచ్చలుగా మిగలడం, ధనార్జనలో తొందర ఖర్చుచేయడంలో గూడా సాహసం తనను గౌరవించాలనే తపన అలాగౌరవించే బంధుమిత్రులకోసం ధనం, శ్రమ,కాలం, మొదలైన వాటిని వెచ్చించడం, వారు పూర్ణమైన ప్రేమను చూపడం లేదు నటిస్తున్నారు అని తెలిస్తే ఆ అశాంతిని సహించలేక పోవడం ఆసందర్భంలోనే మద్యపానాదులకు వశమై పోవడం కోపం త్వరగా రావడం వెంటనే తగ్గడం, ఆక్షణకాలంలోనే కొట్టడానికో చంపడానికో వెనుకాడకపోవడం పదవి, లేదా అధికారం ముఖ్యంగా

భావించి దానికై తాపత్రయపడడం, అతికామం, భార్య ఆరోగ్యముకంటే ఆమెవలన సుఖానికే ప్రాధాన్యం ఇచ్చేమానసిక స్థితి, లేక ఇతర స్త్రీ వ్యామోహం హింసాత్మక కామప్రేరణ మొదలైన ఫలితాలు కుజునకు సంబంధించినవిగా కనిపిస్తున్నాయి. నాయకత్వం వహించే వారికి కుజుడు కారకుడు ప్రాణాలకు తెగించి ఆపదను లెక్కచేయకుండా పట్టుదలతో కార్యసాధన కోసం కోసం తెచ్చుకొనే వ్యక్తులమానసిక సామర్థ్యానికి కుజుడు కారకుడు శరీరపటుత్వానికి అవసరమైన మాంస శక్తికి కూడా కుజుడు అధిపతి అవడం న్యాయం కుజునికి చెప్పబడిన స్థానాల్లో అగ్నిస్థానం చెప్పబడింది. అగ్నిదగ్ధ వస్త్రానికి కారకత్వం ఉన్నందువలన కాలుట మొదలైన వాటికి కుజుని కారకత్వం ఉన్నందువలన అగ్ని స్థానం చెప్పడం న్యాయమే చోరులలో గూడ నాయకత్వం మొదలైనవి ఉండడం వలన, చోరులనాయకుడు, సేనానాయకుడు, కార్మికనాయకుడు ఈ ముగ్గురిలో మంచి చెడ్డల భేదంమరచినట్లైతే సామాన్యలక్షణాలు గోచరిస్తాయి కళ్యాణవర్మ చెప్పిన పద్ధతిలో దృఢవస్త్రం ఈతని అధిపత్యానికి చెందినదనడం న్యాయమే సైనికులు మొదలైన వారు మోటుదనం గల వస్త్రాన్ని ధరిస్తారు. లోహాల అధికారం విషయంలో బంగారానికి కుజుని అధిపత్యం చెప్పబడింది. కాని, రాగికి కూడా కుజుని అధిపత్యం ఉత్తర కాలామృతంలో చెప్పబడింది. ఆయుధాలన్నిటిలో ఇనుము వాడబడడం వల్ల, తుప్పు పదార్థం కుజగోళం పై ఉన్నదని, ఆధునిక శైజ్ఞానికులు అంగీకరిస్తున్నందు వలన ఇనుము పై ఆధిపత్యం కూడా కుజునకే ఉండడం ఉచితంగా ఉంటుంది. దేవతల సేనాని స్కందుడు కావడం వలన గ్రహ రాజ్యంలో సేనానాయకునికి అతడు దేవతకావడం సహేతుకమే ఇతని అధిపత్యం గంరుచికారం అవడం న్యాయం కామక్రోధాలకు అధిపతి అయిన కుజుడు ఆలక్షణాలను ప్రేరేపించే కారానికి అధిపతి కావడం సహేతుకమే ఇతనికి పగడంపై అధికారం చెప్పబడింది. దీనివిషయంలో "విరిగిన ఎముకలకు పగడపు మేకులు" అనే అంశం చదవదగింది. అలాగే "ఎముకలకు బదులు కారాల్" అనే అంశంకూడా చదవదగిందే.

# ఎముకలకు బదులు 'కొరాల్'

సముద్రపు కొరాల్‌ను ఉపయోగించి విరిగిన ఎముకలను అద్భుతంగా సరిచెయ్యవచ్చని ఫ్లోరింగ్ మెడికల్ సెంటర్‌కు చెందిన ఆర్థోపెడిటిక్స్ ప్రొఫెసర్ డాక్టర్ ఫిలిప్ స్పీగల్ అంటున్నారు. ప్లాస్టిక్ సర్జరీలో ఎముకల పరిమాణాన్ని పెంచవలసిన అవసరం వచ్చినా, యాక్సిడెంట్లలో ఎముకలు విరిగిపోయినా అదేవ్యక్తి దేహంలోని ఇతర భాగాల ఎముకల నుంచి ముఖ్యంగా పుర్రెపై పొర, తొడ ఎముకల నించి - పై పొరలను తీసి ఉపయోగిస్తారు. చిన్నచిన్న శస్త్ర చికిత్సలకు ఈ విధంగా చేస్తేసరిపోతుంది. కానీ చాలాభాగం పాడైపోయిన ఎముకలను సరిచేయవలసి వచ్చినప్పుడు

ఎక్కువ ఎముక అవసరం కావడంతో మృతదేహాల నుంచి తీసిన ఎముకలను ఉపయోగించవలసి వస్తుంది. ఇందువల్ల ఇన్‌ఫెక్షన్ ప్రమాదం అధికం మరో మార్గాంతరం లేదు కనుక ప్రస్తుతానికి ఈ విధానాన్నే వైద్యులు అనుసరిస్తున్నారు. సముద్రపు కొరాల్‌కు ఎములకు చాలా దగ్గరి సంబంధం ఉన్నదనీ, విరిగిన ఎముకలను సరిచేసేందుకు కొరాల్స్ అద్భుతంగా ఉపయోగపడతాయనీ ప్లాస్టిక్ సర్జన్ డాక్టర్ తియోతీమిల్లర్, ఆర్థోపెడిక్స్ ప్రొఫెసర్ స్ప్రిగెల్ వెల్లడించడం వైద్య రంగంలో సంచలనం సృష్టించింది. జంతువులమీద చేసిన ప్రయోగాల్లో ఫలితాలు అద్భుతంగా ఉన్నాయని వీరు పేర్కొన్నారు. రంధ్రాలతో నిండి ఉండే కొరాల్‌లోకి రక్తనాళాలను ప్రవేశపెట్టడం ఎముకలకు ఎంతో తేలిక. సముద్రపు కొరాల్‌ను ప్రత్యేకమైన పద్ధతిలో వేడి చేసినప్పుడు అది కాల్షియం కార్బోనేట్‌గా రూపాంతరం చెందుతుంది. ఎముకల్లో ఉండే ముఖ్య పదార్థం హైడ్రోజియానెటైట్ కూడా కాల్షియం కార్బోనేట్ రూపాంతరమే ఎముక కన్నా కొరాల్ కాస్త పెళుసుగా ఉన్నప్పటికీ కావలసిన ఆకారంలోకి మలచుకోవడం అంతకష్టం కాదని వైద్య నిపుణుల అభిప్రాయం శస్త్రచికిత్స జరిగిన తరువాత చాలా తక్కువ సమయంలో కొరాల్ ఎముకతో సంబంధ మేర్పరచుకుని కలసిపోతుంది. చిన్న చిన్న ఎముకలకు మాత్రమే కాకుండా తొడ ఎముకలు విరిగినప్పుడు సైతం కొరాల్‌ను ఉపయోగించి శస్త్ర చికిత్స చేయవచ్చు ఎముక పెరుగుదలకు తోడ్పడే రసాయన పదార్థం 'బోన్ మార్ఫియో జెనిక్ ప్రొటీన్‌లో కొరాల్స్‌ను నిలువ ఉంచడం ద్వారా మరింత మంచి ఫలితాలు సాధించవచ్చని డాక్టర్ మిల్లర్ వెల్లడించారు. ఈ పరిశోధనలను మరింత మెరుగు పరిచేందుకు కృషి జరుగుతోంది. 7-11-1991 ఈనాడు.

# విరిగిన ఎముకకు పగడపు మేకులు!

దెబ్బ ప్రమాదవశాత్తు పడినా, ప్రయత్నపూర్వకంగా పడినా ఎముక విరగడంతో తారస్థాయికి చేరుకుంటుంది. విరిగిన ఎముకలను ఏదో ఒక విధంగా అతికించడం వీలవుతుంది. కాని గాయం మూలంగా ఎముకలో కొంత భాగం నాశనమయితే మాత్రం అతికించడం అసాధ్యం. గత ముప్పై సంవత్సరాలుగా, ఇలా నశించిన ఎముకలను మరో ఎముక ముక్కతో అతికించే పద్ధతి ఒకటి వాడుకలో ఉంది. అందుకోసం ఎముకను అదే వ్యక్తి శరీరం నుండి తీయవచ్చు. లేదా మరొకరు కూడా దానం చేయవచ్చు ఎముకలో కూడా రక్త కణాలుంటాయి గాబట్టి ఈ దానం చేసే ముందు, పొత్తు కుదురుతుందా? లేదా? చూచి మరీ చేయవలసి ఉంటుంది. ఈ బాధంతా అవసరం లేకుండా ఫ్రాన్సు దేశం వారు ఈ మధ్యన ఒక కొత్త పద్ధతి తయారు చేశారు. ఎముకలు సున్నంతోనే తయారవుతాయి. కాబట్టి ఎముకలు రిపేరు చేయవలసి వచ్చిన చోట పగడపు

జంతువుల ముక్కలను వాడుకునే విధానాన్ని పోఫమోల్ అనే కంపెనీ వారు మొదలు పెట్టారు. ఈ రకం పగడపు ఎముకలు ఆసియాలో కూడా ఇటీవలే అమ్మకానికి వచ్చాయి.

రక్తదానం చేసినపుడు, ఏదో ఒక రక్తాన్ని యిస్తే, రెండింటికి పొత్తుకుదరకుంటే గడ్డకట్టి తుంది. అలాగే శరీరంలోకి ఇతర పదార్థాలు చేరితే ఇమ్యూన్ సిస్టం పనితనం వల్ల ఆ సంగతి తెలసి పోతుంది. ఈ కొత్త వస్తువు తిరస్కరించబడుతుంది. పగడం జంతువుల శరీరాలతో ఎముకల వైద్యం చేసినపుడు శరీరంలోని ఈ ఇమ్యూన్ సిస్టం ఇతర పదార్థమేదో వచ్చినట్లు గుర్తించలేక పోతున్నదని పరిశోధకులు కనుగొన్నారు. ఇందుకు కారణం, ఎముకలు, పగడపు జంతువుల శరీరాలలోని రసాయనాల కూర్పుయించుమించు ఒకే విధంగా ఉండడమే. కోరల్స్ శరీరాలు అరాగొనైట్‌తో తయారవుతాయి. ఇది కాల్షియం కార్బోనేట్ రసాయనం. ఇక మన ఎముకలు కాల్షియం హైడ్రాక్సీ ఎపటైట్‌తో తయారవుతాయి. ఈ రెంటికీ భేదాల కన్నా సామ్యాలే ఎక్కువ.

ఎముకను మరొక ఎముకతో అతికితే, కొత్తగా పెరిగే ఎముక, అతికిన చోటి వరకు పెరుగుతుంది. తరువాత రెండు కలిసి పోతాయి. అదే కోరల్‌తో అతికితే ఎముక పెరిగిన కొద్దీ కోరల్ కరిగిపోతుంది. చివరకు అతుకు కనపడకుండా మొత్తం ఎముకే వస్తుంది. ఈ విషయాన్ని గమనించే పరిశోధనలు ఫ్రాన్స్‌లో 20 సంవత్సరాల క్రితమే మొదలయ్యాయి. విరిగిన ఎముక పెరుగుతున్నకొద్దీ, కోరల్ పదార్థం కరిగి, కలిసి పోతుందని పరిశోధకులు గుర్తించారు. ఎముకల లాగే పగడపు జంతువుల శరీరాలు కూడా రంధ్రాలు కలిగి ఉండడం వల్ల ఇలా జరుగుతుంది. రక్తం ఈ రంధ్రాలలోకి పోతుంది. రక్తంలోని కార్బోనిక్ అన్‌హైడ్రేజ్ అనే ఎంజైము, కోరల్ శరీరాన్ని కరిగిస్తుంది. ఈ రకంగా యించుమించు మూడు వారాలలో కొరల్ పూర్తిగా మాయమయిపోయి, ఎముక అతుక్కుంటుంది.

1982లో ఈ విధానం అమలులోకి వచ్చినప్పటి నుండి ఇంచుమించు 5000 మందికి పైగా జయప్రదంగా చికిత్స చేయగలిగామని ఫ్రెంచి పరిశోధకులు తెలియజేస్తున్నారు. అయితే ఈ విధానంలో కొన్ని చిక్కులు కూడా ఉన్నాయి. కోరల్ శరీరాలు చాలా సున్నితంగా ఉంటాయి. ఏ పాటి బలం ఉపయోగించినా పొడి పొడిగా రాలిపోతాయి. వీటిని పట్టి పెట్టడానికి మేకులు, మరలు వాడడం ఏ మాత్రం కుదురదు. వీటిని వాడుతున్నప్పుడు డాక్టర్లు చాలా జాగ్రత్తగా పనిచేయవలసి వుంటుంది.

పోఫమోల్ కంపెనీ వారికి, సముద్రం నుండి కోరల్స్‌ను తెచ్చేందుకు మరొక కంపెనీ వారు సాయపడుతున్నారు. పసిఫిక్ సముద్రంలో మొత్తం 500కు పై చిలుకు రకాల పగడపు జంతువులు

పెరుగుతాయి. వాటి ఆకారాలు గట్టిదనాలు కూడా రకరకాలుగా ఉంటాయి. కాబట్టి అవసరమయిన రకం కోరల్‌ను వెతికి పట్టి వాటిని అవసరమయిన రకంగా ముక్కలు కోసి, సరఫరా చేయడం ఈ కంపెనీ వారి పని.

ప్రపంచంలో జరిగే ప్రతి మంచి పనితోపాటు అందో యింతో చెడుపు జరగడం సహజం. ఆ చెడుపు ఎంతగా ఉందో గుర్తించడం అవసరమే. సోఫమోర్ వారికి కోరల్స్ వెదికి పెట్టే ఫలానా కంపెనీ వారు సముద్రంలో నుండి, ఈ జీవులను అదే పనిగా పెకిలించి తెస్తున్నారు. ఇలా చేస్తే కొన్నాళ్ళకు కోరల్స్ మిగలకుండా అవుతాయేమోనని వాతావరణ పరిరక్షణ వాదులు గోల మొదలు పెట్టారు. కోరల్స్, చెట్లలాగే చాలా నెమ్మదిగా పెరుగుతాయి. అయినాసరే, పెరుగుతాయి. గాబట్టి, అవసరానికి చెట్లను అదుపులో ఉండి నరికినట్లే కోరల్స్‌ను కూడా ఏరి తేవచ్చునని జీవ శాస్త్రజ్ఞులు సర్ది చెబుతున్నారు. ఈ విషయంలో జాగ్రత్తగా ఉండాలి ఒకే చోటి నుండి ఒక రకం కోరల్‌ను మొత్తంగా తెచ్చుకోవడం మంచిది కాదని వారు హెచ్చరిస్తున్నారు.

పగడపు పూసలు దండలలోనూ, మిగతా కోరల్స్ అందంగా అలంకరించడానికి అలమారాల్లోను పనికి వస్తాయని అందరికీ తెలుసు. అంతేగాని, వాటిని మరలు, మేకులు క్రింద మలిచి విరిగిన భుజదండాలను, అతికించ వచ్చునంటే అది అలసు సిసలైన సైన్సు సంగతి కాదూ?

-- ఆంధ్రజ్యోతి

కె.బి. గోపాలం

పై అంశాలు విజ్ఞాన శాస్త్రానికి సంబంధించినవే. జ్యోతిషం విజ్ఞాన శాస్త్రమే ప్రమాదాలు జరగడానికి ఎముకలకు సంబంధించినలోపాలు కలగడానికి జ్యోతిశ్శాస్త్రరీత్యా కుజుని దుష్టస్థితి కారణం ఆకుజుని శుభకిరణాల వలన అతని లక్షణాలతో ఎదిగేదే పగడం, కుజుని దోషాలు నివారించబడటానికి పగడం ధరించాలి అనే విషయం వేల సంవత్సరాలకు పూర్వమే జ్యోతిశ్శాస్త్రం గుర్తించింది. దానిని అమలు చేస్తోంది. ఆ ఎముకలకు, పగడాలకు మధ్య సంబంధాన్ని కుజుడే నిరూపిస్తున్నాడు అనడం జ్యోతిశ్శాస్త్రానికి ఉన్న వైజ్ఞానిక విలువను గుర్తించడమే అవుతుంది.

కుజుడు పంచభూతకారకత్వాలలో అగ్నికి కారకుడు కావడం సహేతుకమే పుంజరాజు చెప్పిన భూకారకత్వంగాని భౌమ, కుజాది శబ్దాలలో ఉన్న భూసంబంధంగాని పంచభూతాలలోనికి కాక, భూమి వ్యవసాయం మొదలైన వృత్తులకు కారకుడు అనే అర్థం ఇస్తోందనడం సహేతుకమే.

ఊర్ధ్వదృష్టి అనేకారకత్వం అహంకారం కలిగి ఉండడమే అని భావించవచ్చు. సామాన్యంగా తప్పుచేసిన వాడు ధైర్యం తక్కువ గలవాడు పైకి సూటిగా చూడలేడు. కుజకారకత్వంగల వ్యక్తి ధైర్యం ఎక్కువగా ఉండం వల్ల ఒకవేళ తప్పుచేసినా అది తప్పుకాదు అనే స్థైర్యం ఆత్మవిశ్వాసం ఉన్నందువలన ఊర్ధ్వదృష్టిగలవాడుగా గుర్తించడం సహేతుకమే మోటారువాహనాల్లో పెట్రోలు, లోహం అనే అంశాలకు కుజుని కారకత్వం తగినదే,

మూర్ఛ: భయం వలన, తలకు దెబ్బతగలడంవలన, ఆల్కహాలు ఎక్కువగా త్రాగడం వలన సనాయిదోషం వలన, నరములదోషం వలన కలుగుతుంటుంది. పై అంశాలు కుజునికారకత్వానికి చెందినవేకావడంవల్ల మూర్ఛ ఈతని కారకత్వంలోనికి రావడం సహేతుకమే.

చోరుడు: కుజశనుల సంబంధం చౌర్యలక్షణాలను ప్రేరేపిస్తుంది.

సోదరకారకుడు: కుజుడు ఈ కుజుడు తృతీయంలోగాని నవమంలోగాని ఉన్నపుడు ఆస్థానాలు ఉచ్ఛస్వక్షేత్రాలు అయినపుడు, సోదరసహకారాన్ని, అవి అస్వతంత్ర (స్వక్షేత్రాలకు సప్తమాస్థానాలు) శత్రుక్షేత్రాలైనపుడు సోదరసౌఖ్యరాహిత్యాన్ని ఇస్తూంటాడు.

జాతి విషయంలో కుజుని కారకత్వవిచిత్రమైనది జాతినియమాలను అతిక్రమంచే లక్షణం కుజునికి చెందినది లగ్నేవైనయదాభౌమః అష్టమేచ, రవి, బుధః

బ్రహ్మపుత్రోయదాజాతః సంగచ్ఛేత్ మ్లేచ్ఛమందిరం"

పరాక్రమ శబ్దానికి అర్థంచాలా చిత్రమైనది. శారీరక శక్తి కలిగి శౌర్య వీర్యసాహసాలు కలిగి ఉండడాన్ని పరాక్రమం అని వ్యవహరిస్తున్నారు కాని, ఇతరులను ఆక్రమించడం అనే అర్థం ఆశబ్దాన్నించి వచ్చేనిజమైన అర్థం ఇతరుల రాజ్యాన్ని ఆక్రమించిన సైన్యాధ్యక్షుడు పరాక్రమవంతుడే, ఇతరుల మనసులనాక్రమించే నాయకుడు పరాక్రమవంతుడే మనస్ఫూర్తిగా ఇతరులు చేసే సహకారంగలవాడిని పరాక్రమ వంతుడనడం సహేతుకమే కాబట్టి పరాక్రమ శబ్దానికి ఉన్న అసలైన అర్థాన్ని వ్యక్తీకరించే పదంగా "జనసహకారం" అనే పదాన్ని వాడు కోవడం మంచిది. అలాంటి జనసహకారానికి కుజుడు కారకుడు అనడం సహేతుకమే.

కీర్తి సైనికులంతా సహకరిస్తే విజయాన్ని పొందాడనే కీర్తి సైన్యాధ్యక్షుని వరిస్తుంది.

కండరాల శక్తి, ఎముకలశక్తి అధికంగా ఉన్న వ్యక్తి సామాన్యంగా ధైర్యవంతుడు కావడం, జరుగుతుంది. అమూడింటికీ కారకుడైన కుజుడు దెబ్బలాటలకు వెనుదీయడు, వాటి ప్రతి రూపమే యుద్ధం, యుద్ధానికి దండనాయకుడు కావాలి నాయకుడు కావాలి, అక్కడే శత్రువృద్ధి ఉంటుంది. అట్టి స్థితిలోనే పరనింద ఉంటుంది. ఈ పరనింద 5,7,12 స్థానాలకు సంబంధించిన కుజుని విషయంలోను ద్వితీయస్థానంలో ఉన్న కుజునిలో పరదూషణ అనేది సంబంధించిన విషయం అవుతుంది. కుజుని క్రౌర్యం ఇతర క్రూరగ్రహాలతో సంబంధం ఉన్నపుడు స్పష్టమైతూంటుంది.

పరదారాలోలత్వం గూడా, పంచమసప్తమ క్షేత్రాలతోను వ్యయస్థానంతోను సంబంధం ఉన్నపుడు స్పష్టమౌతుంటుంది. అసత్య భాషణం కుజునికి అస్వతంత్ర, శత్రుక్షేత్రాలతో సంబంధం ఉన్నపుడు వ్యక్తమౌతూంటుంది. 2,4,6,8,12 స్థానాల్లో అధిపత్యశుభుడైన కుజుడుంటే అతనివ్యక్తిత్వం చక్కనిదై నాయకత్వలక్షణాలు కల్గినదే ఉంటుంది. కుజుడు స్థానబలం కలిగి ద్వితీయంలో ఉంటే వివాదాల్లో విజయాలుంటాయి. కుజుడు 2,4,6 స్థానాల్లో అగ్నిరాసుల్లో ఉంటే మాంసాహారప్రీతి ఉంటుంది.

### కుజుడు మేషలగ్నంవారికి

మేష (1) మిధున (3) కర్కాటక (4) కన్యా (6) వృశ్చిక (8) మకర (10) రాసుల్లో యోగిస్తాడు.

వృషభలగ్నంవారికి కర్కాటక (3)తులా (6) ధనుస్సు (8) మేష (12) రాసుల్లో యోగిస్తాడు.

మిధునలగ్నంవారికి సింహ (3) వృశ్చిక (6) మకర (8) మేష (11) వృషభ (12) రాసుల్లో యోగిస్తాడు.

కర్కాటకలగ్నంవారికి సింహ (2) కన్యా (3) వృశ్చిక (5) మీన (9) మేష (10) వృషభ (11) రాసుల్లో యోగిస్తాడు.

సింహలగ్నంవారికి వృశ్చిక (4) ధనుస్సు (5) మేష (9) వృషభ (10) మిధున (11) రాసుల్లో యోగిస్తాడు

కన్యాలగ్నంవారికి వృశ్చిక (3) కుంభం (6) మేష (8) కర్కాటక (11) సింహ (12) రాసుల్లో యోగిస్తాడు.

తులాలగ్నంవారికి ధనుస్సు (3) మీన (6) సింహ (11) కన్య (12) లలో యోగిస్తాడు.

వృశ్చికలగ్నంవారికి మకర (3) మేష (6) మిధున (8) వృశ్చిక (12) రాసుల్లో యోగిస్తాడు.

ధనుర్లగ్నంవారికి కుంభ (4) వృషభ (5) కర్కాటక (8) వృశ్చిక (12) రాసుల్లో యోగిస్తాడు

మకరలగ్నంవారికి మేష (4) వృషభ (5) మిథున (6) కన్య (9) వృశ్చికా (11) లలో యోగిస్తాడు.

కుంభలగ్నం వారికి మేష (3) వృషభ (4) మిథున (5) కర్కాటక (6) తులా (9) వృశ్చిక (10) ధనుస్సు (11)లలో యోగిస్తాడు.

మీనలగ్నం వారికి మేషం (2) మిథునం (4) వృశ్చికం (9) ధనుస్సు (10) మకరం (11) రాశుల్లో యోగిస్తాడు.

యోగించే కుజుడు సాహసం పట్టుదల, కోపస్వభావం, కలహాలకు భయపడకపోవడం నిరంతర కృషిశీలత, ఖర్చుచేయడానికి వెనకాడకపోవడం పలువిధాలైన యుక్తులతో పనులు నెరవేర్చడం, లోకానికి మేలు చేసే పనులలో కృషి చేయడం, కపటంలేక పోవడం, ఔదార్యం కలగి ఉండడం, ప్రేమ కలిగి ఉండడం చింతలేక పోవడం, కాఠిన్యం నిబ్బరం, ధైర్యం ఇతరుల ప్రభావానికి లోను కాకపోవడం వ్యవహార నైపుణ్యం సత్యభాషణం విశ్వసనీయత నియమపాలన ఇచ్చిన మాట నిలబెట్టుకోవడం శీలం విషయంలో పట్టుదల, అనాథులను దీనులను ఆదుకోవడం, ఉద్యమనిర్వహణాసక్తి సుఖాసక్తి, ధర్మశ్రద్ధ, ఇతరుల చే సక్రమంగా పనిచేయించగలగడం, భార్యకు అనుకూలంగా ప్రవర్తించడం, భవిష్యత్తును గూర్చి సరిగా నిర్ణయాలు తీసుకోవడం, వాదంలో ఇతరులను ఓడించడం, తన ప్రభావం ఇతరులపై చూపడం, అందరిని మంచి మార్గంలో నడిపించే ప్రయత్నం చేయడం, మొదలైన సత్ఫలితాలనిస్తాడు.

దుష్టఫలదాతకుజుని ఫలాలు: శుక్ర, శని సంబంధాలు పొందినా, బలహీనుడైనా అస్తంగతుడైనా కుజుడు దుష్ట ఫలప్రదాత అవుతాడు. పరస్త్రీల యందాసక్తి, అతికాముకత్వం క్రోధం తమోగుణం దొంగతనం కలహశీలత, కలహాలలో కొట్టుకోవడం చంపుకోవడంలో భిత్వం స్త్రీకి కష్టాన్ని కలిగించడం, ఇతరులను నిందించడం, బద్ధకం స్వార్థం, ఇతరులను నిరుత్సాహపరచడం, ఇతరులపై దుష్ప్రచారములను చేయడం, ఉపద్రవాలను కల్గించడం ఏకాంత ప్రియత్వం అస్థిరత, అనైకాగ్రత అటవీ ప్రదేశాలలో సంచరించడం మొదలైన దుష్టఫలాలను ఇస్తాడు.

# కుజుని కారకత్వాలు - వర్గీకరణ

జాతకంలో కుజుని కారకత్వాలు: ఆపరేషన్, గండమాల, అపెండిసైటిస్, కాన్సర్, రక్తస్రావం, మూత్రకృచ్ఛ్రం, టాన్సిల్స్, విషమజ్వరం, కృషిశీలత, సాహసం, వంధ్యాత్వం, వైరం, కలహం, దొంగతనం, బందిపోటు, హత్య, యుద్ధంలో కీర్తి, కామం, కోపం, అభిమానం, దుఃఖం, జ్వరం, ఉన్మాదం, తీవ్ర వేదన, ద్రోహం, నింద, పరాపవాదం, మృత్యువు, తల, ముక్కు, జననేంద్రియం, పిత్తం, పిత్తాశయం, మూత్రాశయం, స్నాయువు, మాంసం, ఎముకలు, శరీరంపై ఎర్రనిమచ్చలు, దద్దుర్లు, స్ఫోటకం, రక్తంకారడం, తెగడం, వ్రణాలు కాలడం, ఎముకలు, విరగడం, ప్రమాదాలు, తమ్ముడు, చెల్లెలు, బుద్ధికుశలత, సుఖం, దుఃఖం, బాబాయి కొడుకులు, సవతి తల్లి, ఇల్లు, మనస్సు, మూర్ఛ, శక్తి, రోగం, అప్పులు, భూమి, శత్రులువు, జ్ఞాతులు, జాతి, పౌకర్యం, పుత్ర సంబంధమైన దోషాలు, శీలం, రాజ శత్రువు, (అధికారులతో ప్రభుత్వంతో వైరం) యశస్సు, నేతృత్వం, ధారణ, కాంతి, గాంభీర్యం, శత్రువృద్ధి, రాజకృప, రాజకోపం, స్వాతంత్ర్యం, క్రూరత్వం, గొప్పదనం, ఉత్సాహం, పరస్త్రీలతో సంబంధం, అసత్యవాదిత్వం, చిత్త వికాసం, పాపం, మూర్ఖత్వం, విదేశయాత్ర, వివాదాలు, మాంసాహారం, భోజన ప్రియత్వం, కారాగారనివాసం, వేడి, ఎండిపోవడం, దాహం, మొదలైనవి. జాతకానికి సంబంధించినవి.

## ఇతర గ్రహాల సంపర్కంవలన వచ్చే లక్షణాలు

| గ్రహాలు | రోగ లక్షణాలు |
|---|---|
| కుజ, బుధ, శని, కేతువులు, | అతిసారం, గ్రహణి, |
| కుజ, రాహువులు, | మూలశంక, రాజయక్ష్మ, తలనెప్పి |
| కుజుడు | కలరా |
| కుజ, శని, రాహువులు | ధనుర్వాతం |
| కుజ, శనులు | అపతంత్రకం |
| శని, కుజ, రాహువులు | పరిణామశూల, శుక్రమేహం |
| కుజ, బుధులు | మూత్రకృచ్ఛం, వాతబస్తి |
| కుజ, బుధ, కేతువులు | మసూచి, రోమాంతిక |
| కుజ, శనులు | క్షయోదరం |

| | |
|---|---|
| రవి, కుజులు | కాన్సర్, రక్తప్రదరం |
| కుజ, రాహువులు | చెవిలోధ్వమలు, పోట్లు, స్రావం, చెవిలోచీము. |
| కుజ, శని, బుధులు | వాపాపాకం |
| కుజ, రాహువులు | క్రిమికర్ణము |
| కుజ, శుక్రులు | శ్వేత ప్రదరం |
| కుజ, శని, బుధ, శుక్రులు | వంధ్యాత్వం |
| చంద్ర, కుజులు | పారిగర్భకం, యోని వ్యాపత్తు |
| గురు, కుజులు | ఆర్తకం |

మొదలైన అనారోగ్యాలను కుజుడు ఇతర గ్రహ సంబంధంతో ఇస్తున్నాడు.

వృత్తి కారకత్వాలు: పి.డబ్ల్యు.డి. శాఖ, పోలీసు శాఖ, రక్షణ శాఖ, రేంజర్, పైలెట్, వ్యవసాయశాస్త్రజ్ఞుడు, ఇంజనీర్, మెకానిక్, సిగరెట్ ఫ్యాక్టరీలు, మిల్లు కార్మికులు, కిళ్ళీలు అమ్మేవారు, మద్య అమ్మేవారు, ఆబ్ కారీ ఇన్ స్పెక్టర్, మల్లయోధులు, కార్లు, వాహనాలు వాని స్పేర్ పార్టులు అమ్మేవారు, సైకిళ్ళు అమ్మేవారు, బాగుచేసేవారు, శాస్త్రజ్ఞులు, (యుద్ధ నౌకలు, ఆయుధ సామగ్రి, జలాంతర్గాములు, యుద్ధ విమానాలు మొదలైనవి తయారు చేసేవారు) పెట్రోలు, స్పిరిట్, రాకెట్ ఇంధనం మొదలైనవి అమ్మేవారు, సినిమా హాల్లో ఉపయోగపడే కార్బన్ స్టిక్‌నిర్మించేవారు, ఆపరేషన్‌కి ఉపయోగపడే సాధనాలు తయారుచేసే ఫ్యాక్టరీలు, అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ, దూది మిల్లులు, రేసులు, గుర్రాలు, ఇతరులకు యంత్రసామగ్రి విషయంలో ట్రైనింగ్ ఇచ్చేవారు, టర్నర్, ఫిట్టర్, చర్మవస్తువులను తయారు చేసేవారు, దంత వైద్యులు, కసాయివారు, ఆభరణాలు తయారు చేసేవారు, ప్రేలుడు పదార్థాలు తయారుచేసేవారు, వేడిచేసే మందులు, యాసిడ్లు, లోహాలు, చాకులు మొదలైనవి తయారుచేసే ప్రదేశాలు, సర్జన్ (శస్త్ర చికిత్సకులు) రసాయనశాస్త్రం, బంగారం మొ॥ అన్ని లోహాలు కరిగే ప్రదేశాలు, హోటల్ వంటశాల, మన్నుంబట్టీలు, ఇటుకలు, కుండలు మొదలైనవి కాల్చే ప్రదేశాలు, జాడీలు, శానిటరీ బేసిన్స్ మొదలైనవి తయారు చేసే ప్రదేశాలు, లోహాలతో తయారు చేసే కుర్చీలు, డబ్బాలు, పైపులు, వ్యవసాయానికి సంబంధించిన యంత్రాలు, తయారు చేసే ప్రదేశాలు, రసాయనశాల, సేన, ఆయుధాలయం, హంటర్‌తో శిక్షించేవాడు, వానీలు తయారుచేసే ప్రదేశాలు, వానిరిపేరు చేసేవాడు, బట్టలు కుట్టేవాడు, కత్తులకు పదును పెట్టేవాడు, తాళ్ళుతయారు చేసేవారు, పాలీ తయారుచేసే ఫ్యాక్టరీలు, క్షురకులు, వడ్రంగి, చర్మకారుడు, లోహములతో పనిచేయువాడు, రాళ్ళకు సంబంధించిన పనిచేయువాడు, పెట్రోలు,

గాస్, కట్టెలు మొ॥ వానితో వృత్తులు చేసేవారు. పై వాటికి సంబంధించిన వారు వాటికి సంబంధించిన వృత్తులు, వ్యాపారాలు కుజునికి సంబంధించినవి.

మేదినీయ జ్యోతిషానికి ఉపకరించే కారకత్వాలు: యుద్ధం, అగ్ని ప్రమాదం, సేనానాయకుడు, యుద్ధమునకు సంబంధించిన ప్రేలుడు పదార్థములను ఉపయోగించేవారు. యుద్ధభూమి, సేనాని వేశం, ఆయుధాగారం, ఆయుధాల కర్మాగారం, యుద్ధప్రీతి గల దేశం, సేన పరిస్థితి, ఇంగ్లాండు, ఫ్రాన్స్, గ్రీస్, ఇటలీ, జర్మనీ, జపాన్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్ర, కర్నాటక, గుజరాత్, సౌరాష్ట్రం, గుజరాత్, రాజస్థాన్.

విద్యల కారకత్వాలు: భూమి కొలతలు, చరిత్ర, సైనిక వ్యాయశాస్త్రం, పోలీసు ట్రైనింగ్, అటవీ శాస్త్రం, సర్వే విభాగం, హోమ్ సైన్స్, ఇంజనీరింగ్, విమాన చోదకత్వం, సర్జరీ, యుద్ధ విద్య, మోటార్ డ్రైవింగ్, రైల్వే డ్రైవింగ్, దర్జీ, రంగులు వేయుట, టెక్నాలజీ, కర్మాగారాల్లో ఎప్రంటిస్, క్రిమినల్ లా, తర్కశాస్త్రం.

అన్యకారకత్వాలు: పైకి ఎగిరే పదార్థాలు, ఘాటైన పదార్థాలు, దాహం పుట్టించే రుచులు, ~ టనలు జరిగిన ప్రదేశాలు, దెబ్బలాటలు జరిగే ప్రదేశాలు, పడిపోవడం, ఉసిరికాయ, పాముపుట్ట, ఫా రస్, అయోడిన్, నైట్రిక్‌యాసిడ్, రసాయనాలు, మనశ్శిల, గ్రంధకర్త, పులి, కుక్క, నక్క, తో లు, పిల్లి, ముంగిస, కోడి, గ్రద్ద, డేగ, ఎర్రమూతిగల కోతి, ఎలుగుబంటి, పావురం, పిచ్చుక.

## కుజుడు - గాథలు

భూదేవి విష్ణుమూర్తిని కామించి స్త్రీ రూపం దాల్చి తన కోరికను తీర్చమని కోరింది. విష్ణుమూర్తి అనుగ్రహించాడు. భూదేవి పగడపు రూపంలో ఒక బీజాన్ని విడిచింది. దానినుండి అంగారకుడు పుట్టాడు.

- బ్రహ్మవైవర్తం.

ఒకసారి విష్ణువు యొక్క స్వేదబిందువొకటి భూమిమీద పడింది. అందులో నుండి లోహి తాంగుడగు పురుషుడు జన్మించాడు. తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి అతడు గ్రహమైనాడు.

- పద్మ పురాణం.

దాక్షాయణీ విరహంతో శివుడు చింతిస్తున్నాడు. అతని శరీరం నుండి స్వేదబిందువొకటి రాలి పడింది. దానినుండి లోహితాంగుడగు కుమారుడు పుట్టాడు. అతనిని పుత్రభావంతో భూదేవి గ్రహించింది.

- పూర్వ గాథాల హరి.

పై మూడు గాథలలో చెమట, కామం, పగడం, భూ పుత్రుడు అనేవి కనిపిస్తున్నాయి. ఉద్రేకము, శ్రమ, వేడి అనేవి చెమటకు కారణాలు. ఆ మూడిటికి కుజుని కారకత్వం ఉంది. అతి కామానికి కూడా కుజుడు కారకుడే. పగడం కుజుని కారకత్వాల లోనిదే. భూగోళానికి, కుజ గోళానికి దగ్గర పోలికలు చాలా ఉండడం వలన భూపుత్రుడనే భావన కలగడం సహజమే. ఇతనికి జ్వలిత, జ్వాల అనే పేర్లు గల ఇరువురు భార్యలున్నారు. మరి కొందరు చండి, క్రోధన, అనే భార్యలున్నారని అంటున్నారు. ఆధునికులు ఆవిష్కరించిన ఉపగ్రహాలు. డైమాస్, ఫోబోస్, ఈ గ్రహానికున్నాయి. వాటినే ప్రాచీనులు పై పేర్లతో భార్యలుగా భావించారని గుర్తించవచ్చు. కౌమారప్రాయంగల బ్రహ్మచారి అని కొందరు గుర్తించారు. సేనానాయకునిగా గుర్తించబడిన కుజునికి వైవాహిక జీవన సౌఖ్యానికి అవకాశాలు తక్కువ అనే భావంతో బ్రహ్మచారిగా భావించబడినాడనవచ్చును. ఈతనికి అధిష్ఠాన దేవత షణ్ముఖుడు. ఈశ్వర పుత్రుడే. ఈతనికి సుబ్రహ్మణ్యస్వామి అని మరో పేరు. ఈతనికి కృత్తికలు మాతలు. కృత్తిక మేషంలోనే ఆరంభం అవుతోంది. కృత్తిక ఆరు చుక్కల నక్షత్రం. ఆరు ముఖాలు ఆరుగురు తల్లులు గల షణ్ముఖుడు కృత్తికలతో సంబంధం గల మేషరాశ్యధిపతియైన కుజునకు అధిష్ఠానదేవతగా గుర్తించబడ్డాడు. కృత్తిక అగ్నిదేవతాకమైనది. అగ్ని స్వరూపుడుగా కుజుడు భావించబడ్డాడు.

## కుజుడు ఆధ్యాత్మిక వివరణ

"అగ్నిర్మూర్ధా .... " అనే మంత్రానికి కుజుడు అధిష్ఠాన దేవత
"యామ్యేగదా శక్తి ధరశ్శూలీ, వరప్రదోయామ్య ముఖోతిరక్తః
కుజస్త్వవంతీ విషయస్త్రి కోణ స్తస్మిన్ భరద్వాజకులే ప్రసూతః
రక్తాంబరో రక్తవపుః కిరీటీ చతుర్భుజో మేషగమోగదాభృత్"
ధరాసుతశ్శక్తి ధరశ్శూలీ సదామమస్యాద్వరదః ప్రశాంతః

అనే ధ్యానశ్లోకాలతో కీర్తించబడే కుజుడు దక్షిణ దిక్కున దక్షిణ ముఖంగా ఉండి, గదను శక్తి అనే ఆయుధాన్ని ధరించి, ముదురు ఎరుపురంగు కలవాడై, (లేదా అతి కాముకుడై) అవంతీ

దేశాధీశుడై త్రికోణాకృతి కలవాడై, భారద్వాజ సగోత్రుడై, ఎర్రని వస్త్రాలతో, ఎర్రని శరీరంతో, కిరీటం ధరించి, నాల్గు బాహువులతో, మేష వాహనుడైన (మేషానికి అధిపతి గూడా) ధరానుతుడు ప్రశాంతుడై వరమిచ్చుగాక అని ప్రార్థించబడుతున్నాడు.

రక్తపుష్పధారి, రక్తమాల్యాంబరధరుడు, రక్తచ్ఛత్రధ్వజపతాకాదిశోభితుడు, రాక్షసనామసంవత్సరం, ఆషాఢమాసం శుక్లపక్షదశమీ మంగళవారం అనూరాధా నక్షత్రంలో జన్మించినవాడు అయిన కుజునికి పృథివి అధిదేవత, క్షేత్రపాలకుడు ప్రత్యధిదేవత అని భావించబడుతున్నాడు.

అవంతీదేశమని, భారద్వాజస గోత్రమని, అక్షయనామసంవత్సర శ్రావణ శుద్ధ త్రయోదశీ మంగళవారం పూర్వాషాఢా నక్షత్రంలో జన్మించాడని మరి కొందరి భావన. తండ్రే భరద్వాజుడని మరికొందరి భావన. భరద్వాజుడు వైమానికశాస్త్రకర్తగా ప్రసిద్ధుడు. విమానాలకు కుజునికారకత్వం ఉందని గుర్తించబడుతోంది.

రక్తచందనం, కందులు, ఎరుపు ధాన్యం, గేదెపాలు, పెరుగు, నెయ్యి, మేకపాలు, పిప్పలి, కాయం, పులగం, మిరియాలు, ఈతనికి భక్ష్యాలు (సంతానం కలిగిన తరువాత తల్లీబిడ్డల ఆరోగ్యానికి పిప్పలివాడేవారు) బొప్పాయిపండ్లు ( గర్భస్రావాన్నిస్తాయి) దానిమ్మ, గుమ్మడి, మామిడి, జున్ను, మందారం, కేతకి, గులాబి, రక్తోత్పలం, బిల్వం, ఎర్రగన్నేరు, ఈతనికి ఇష్టమైన వస్తువులు.

హోమద్రవ్యాలుగా, చంద్రసమిధ, రక్తచందనం, మారేడు, పిప్పళ్ళు, మిరియాలు, లవంగాలు, దాసించెక్క, తుమ్మపూలు, రక్తాక్షతలు, పగడాలు ఉపయోగిస్తారు.

షణ్ముఖుని స్వరూపాల్లో సర్పం ఒకటి. పాములు కలలోకి రావడాన్ని మనస్తత్త్వ శాస్త్రజ్ఞులు తీరనికోరికలకు (కామసంబంధమైనవి) ప్రతీకలుగా భావించారు. సంతానం కలగని దోషానికి ప్రతీకగా ప్రాచీనులు భావించారు. సంతతి కలగడానికి, నాగప్రతిష్ఠ, సుబ్రహ్మణ్యోపాసన మార్గాలని ప్రాచీనులు గుర్తించారు.

ఆయుధ సంబంధమైన ఇబ్బందులు, ఉష్ణసంబంధమైన అనారోగ్యాలు, అంటువ్యాధులు, కండరాలకు సంబంధించిన అనారోగ్యాలు. అకారణవిరోధాలు, భూసంబంధమైన కలహాలు, శత్రుబాధలు, ఋణ బాధలు, రక్తస్రావం, అగ్నిప్రమాదాలు, వ్రణాలు, దారిద్ర్యం, దాంపత్యంలో కలతలు, ఉద్రేకం, పోట్లాటలు, మొదలైన ఇబ్బందులు కలిగినపుడు, కుజునకు దోషపరిహారార్థం, కుజజపం చేయించాలి.

అనారోగ్యనివారణకు అంగారకస్తోత్రం రోజుకు 108 పర్యాయములు 41 రోజులు చేయాలి.

మహీపుత్ర మహా భాగ రుద్రవీర్య సముద్భవ
గృహాణార్ఘ్యం మయాదత్తం ప్రసన్న వరదోభవ
అతీతీక్ష్ణ మహాకాయ కల్పాంతదహనోపమ
అంగారక నమస్తుభ్యం సర్వరోగనికృంతవ

రక్తచందనం కలిపిన నీటితో 4 పర్యాయాలు అర్ఘ్యం ఇవ్వాలి. సర్వకార్యాలలో విజయం సిద్ధించడానికి ఈ కుజస్తోత్రం 21 పర్యాయాలు చొప్పన 41 రోజులు పారాయణం చేయాలి.

మహీసుతో మహా భాగః మంగళో మంగళ ప్రదః
సుప్రతీకస్సు తామ్రాక్షో సుబ్రహ్మణ్యస్సుఖప్రదః
వీరభద్రోవిరూపాక్షః నానాభయ నికృంతనః
కమనీయోదయాపారః భక్తాభయవరప్రదః
చతుర్భు జోగదాధారీమేషవాహో మితాశనః
భరద్వాజకులోద్భూతో భూసుతోభవ్యభూషణః
ఏతానికుజనామాని నిత్యంయః ప్రయతః పఠేత్
సర్వకార్య జయంచైవధనం ప్రాప్నోత్యసంశయః

సర్వదోష పరిహారానికి ఈ స్తోత్రం 108 పర్యాయాలు జపించాలి 41 రోజులు జపించాలి

దేవదేవ విరూపాక్ష చండక్రోధ మహీసుత
ఆరోగ్యం దేహిమేదేవ ధనధాన్యసుఖానిచ
ధనందేహి సుఖం దేహి ఆరోగ్యం దేహిమేసదా
మంగళస్నాన కార్యేషు మంగళాహని మంగళ

## రత్న ధారణ:

కుజునిదశలో గాని కుజుడు జన్మ రాశినుండి 1,8,12, రాసుల్లో సంచరించే సందర్భంలో గోచారదోష నివృత్తికి గాని పగడం, వెండి, బంగారం లేక రాగిలో ఉంగరం చేయించుకొని మంగళవారం కుజహోరలో ధరించాలి. కుజునకు శత్రువులైన బుధ, శుక్ర, శని, రాహు కేతుదశల్లో గోచార దోషనివృత్తికైనా పగడం ధరించకుండుట మంచిది అష్టక వర్గులో వ్యయస్థానంలో ఎక్కువ (లాభం కంటె ఎక్కువ) బిందువులున్నప్పుడు పగడం ధరిస్తే ఖర్చు పెరుగుతుంది. పగడం విడిగా ధరించగూడని సమయంలో నవరత్నధారణ చేయవచ్చు.

దానం:

కుజుని దోషశాంతికి ఎర్రని బట్టలు, భోజనం, రక్తచందనం, బెల్లం, పగడం, గోధుమలు, కందులు ఎర్రని ఎద్దు, రాగి, బంగారం, దానం చేయాలి.

అప్పులు తీరడానికి:

రక్తమాల్యాంబరధరః శూలశక్తిగదాధరః
చతుర్భుజో మేషగమోవరదస్స్యాత్ ధరాసుతః
మంగళోభూమి పుత్రశ్చ ఋణహర్తాధనప్రదః
స్థిరాసనో మహాకాయః సర్వకర్మావరోధకః
లోహితో లోహితాక్షశ్చ సామగానాం కృపాకరః
ధరాత్మజః కుజోభౌమోభూతిదో భూమినందనః
అంగారకోయమశ్చైవ సర్వరోగాపహారకః
వృష్టేః కర్తాపహర్తాచ సర్వకామఫలప్రదః
ఏతాని కుజనామాని నిత్యంయః ప్రయతః పఠేత్
ఋణం నజాయతే తస్యధనం ప్రాప్నోతి పుష్కలం

అప్పుతీరేవరకు ప్రతిరోజు అంగారకుని ఎర్రని పువ్వులతో గంధంతో ధూపదీపాదులతో పూజించి బెల్లం నివేదించి, బొగ్గుతో వ్రాసిన ఋణసంఖ్యను ఈ క్రింది మూల మాత్రం చదువుతూ ఎడమకాలితో చెరిపివేయాలి. అంగాకర మహీపుత్ర భగవన్ భక్తవత్సల నమోస్తుతే మమా శేష ఋణమాశువిమోచయ

అర్ఘ్యం: అంగారక మహీపుత్ర భగవన్ భక్తవత్సల
నమోస్తుతే మమా శేష ఋణమాశు విమోచయ
భూమిపుత్ర మహాతేజ స్వే దోద్భవ పినాకినః
ఋణార్తస్త్వాం ప్రపన్నోస్మి గృహాణార్ఘ్యం నమోస్తుతే

అనే మంత్రాలు పఠిస్తూ ఎర్రచందనం కలిపిన నీటితో అర్ఘ్యం ఇవ్వాలి.

# కుజుడు-పర్యాయపదాలు

మంగళుడు, ఆరుడు, వక్రి, క్రూరుడు, ఆవనేయుడు, కుజుడు, భౌముడు, లోహితాంగుడు, పాపి, క్షితిజుడు, అంగారకుడు, క్రూరనేత్రుడు, క్రూరాక్షుడు, క్షితినందనుడు, ధరాపుత్రుడు, కుసుతుడు, కుపుత్రుడు, మాహేయుడు, గోత్రాపుత్రుడు, భూ పుత్రుడు, క్ష్మాపుత్రుడు, భూసుతుడు, మేదినీజుడు - అవనిసుతుడు, నందనుడు, మహీజుడు, క్షోణీపుత్రుడు, ఆషాఢాభవుడు, రక్తాంగుడు, అంగీరసుడు, రేతుడు, కోణుడు, రుధిరుడు, రక్తుడు, మొదలైన పేర్లతో పిలువబడుతున్నాడు. వంకర స్వభావం కలవాడనే అర్థాన్నిచ్చే వక్రశబ్దం ఇతని స్వభావాన్ని సూచిస్తుంది. భూమికి పుత్రుడనే అర్థాన్నిచ్చే పదాలన్నీ భూమి అతనికి గల పోలికలను సూచిస్తాయి. క్రూరుడు అనే పదం అతని ప్రవర్తనను క్రూరనేత్ర అనే పదం అతని చూపులోని క్రౌర్యాన్ని సూచిస్తుంది. కుజమండలం ఎర్రనికాంతి కలిగి ప్రకాశిస్తూండడంవలన లోహితాంగుడు, రక్తాంగుడు మొదలైన పదాలు ఉచితంగా ఉన్నాయి. రక్తం విషయంలో ఎర్రనిరక్తకణాలకు, రక్తదోషాలకు, తద్వారా వచ్చే వ్రణాదులకు కారకుడు కుజుడేకావడం వలన రుధిరుడు, రక్తుడు అనే పర్యాయపదాలు అతని కారకత్వాలను వ్యక్తీకరిస్తున్నాయి. అని కామానికి కూడా అతడే కారకుడన్న విషయాన్ని రక్తుడు అనే పదంలోని మరో అర్థం వ్యక్తీకరిస్తోంది. 'రేతస్సుకు కారకుడు శుక్రుడే అయితే అతి కామంతోబాటు రేతస్సుకు కూడా కుజుని కారకత్వాన్ని రేతుడు అనే నామం వ్యక్తీకరిస్తోంది. అగ్ని స్వరూపుడుగా గుర్తించబడుతున్న కుజునికి అంగారక నామం గూడా సహజంగానే ఉంది. అమంగళకారకుడుగా గుర్తించబడుతున్న కుజుడు వ్యతిరేకార్థకంలో మంగళ నామంతో పిలువబడుతున్నాడని కొందరి అభిప్రాయం. మంగళకారకుడే కుజుడని మరికొందరి భావన నైసర్గిక పాపి కుజుడనే భావంతో ఉన్నవారు పాపి అనే పేర కుజుని వ్యవహరించారు. తీరని కోరిక ఆనందాన్నిస్తుంది. కామకారకుడని గుర్తించబడిన కుజుడు ఆనందాన్నిచ్చేవాడుగా నందనుడు అనే పేరు తగినదే. శివనందనుడైన స్కందుని అపరావతారంగా భావించబడుతున్న కుజుడు నందననామంతో వ్యవహరించబడ్డాడు అనడం గూడా న్యాయమే అంగీరస వంశోద్భవుడని భావించబడిన కుజుడు అంగీరసుడయ్యాడు. కాని అంగీరస శబ్దం గురునికి కూడా వాడబడుతోంది. ఆషాఢ మాసంలో జన్మించాడనే భావన వలన ఆషాఢ భవుడు అనే పేర వ్యవహృతుడౌతున్నాడు. త్రికోణాకృతి కలవాడుగా భావించబడడంవలన కోణుడు అనే పదం [illegible]నికి వాచకం అయింది. ఇలా అతని నామాలు, అతని రీతిని వ్యక్తీకరిస్తూ ఉన్నాయి.

# కుజ దృష్టి

లగ్నంపై కుజదృష్టి: ఆద్యభావగేహేకుజేక్షితే పిత్తకోపగ్రహణీ రుజా
అంఘ్రినేత్ర వికలం కరంవరం జీవతో పితనయాదినాశనం

- బృహద్యవన జాతకం

పిత్తప్రకోపం, గ్రహణి, పాదనేత్రవైకల్యం, సంతానవష్టం.

ద్వితీయంపై కుజ దృష్టి: కుటుంబగేహే యది భౌమదృష్టిః కుటుంబ సౌఖ్యం నభవేన్నరస్య
ద్రవ్యస్య ప్రాప్తే ర్వ్యయోదినేదినే గుదోదరేవ్యాధిరుగర్దితః స్యాత్

-బృహద్యవన జాతకం

కుటుంబ సౌఖ్యలోపం, వచ్చిన డబ్బు వచ్చినట్లే ఖర్చవడం, గుదోదరములందు అనారోగ్యం

తృతీయంపై కుజదృష్టి: తృతీయ భావేయది భౌమదృష్టిః పరాక్రమే సిద్ధిముపైతిమానం
దే..రే రాజగృహే చమాన్యం సహోదరాణాంచ వినాశనం స్యాత్

- బృహద్యవన జాతకం

పరాక్రమసిద్ధి, దేశాంతరలోమ, రాజగృహంలోను గౌరవం. సోదరులకు ఆపద.

చతుర్థంపై కుజ దృష్టి: తుర్య భావగృహ ఆరవీక్షితే మాతృకష్ట మథ తుర్యవర్షకే
భూపతేర్భవతిభూమితః సుఖం దర్శనేవచరిపుర్వినశ్యతి

- బృహద్యవన జాతకం

4వ ఏట తల్లికి నష్టం, భూసౌఖ్యం, చూసినంతనే శత్రునాశం.

పంచమంపై కుజ దృష్టి: సుతగృహేయది భౌమనిరీక్షితే, ప్రథమ సంతతినాశక రశ్చహి.
జఠరగః ఖలువహ్నిరథాధికోభోజనేభ్రమతి చైహ్యగృహే గృహే
ప్రథమ సంతతికి దోషం, ఆకలి ఎక్కువ, భోజనం కోసం ఇంటింటా తిరగడం.

షష్ఠంపై కుజ దృష్టి: భౌమ దృష్టి సమవేక్షితేరిపౌవైరి నాశనకరో నరస్యహి
మాతులీయసుఖ నాశనః సదా లోహ శస్త్ర రుధిరా గ్ని పీడనం

- బృహద్యవన జాతకం

శత్రునాశం, మేనమామ సుఖం ఉండదు, లోహాలు, శస్త్రాలు అగ్ని మొదలైన వాటి వలన పీడ.

సప్తమంపై కుజ దృష్టి: జాయాగృహేభౌమనిరీక్షితేచ జాయావినాశం కురుతేచ పుంసాం

వస్తౌ తథావ్యాధినిపీడిత శ్చస్త్రీతో వివాదోగమనే మహోభయం

భార్యానాశం, పొత్తికడుపులో రుగ్మత, స్త్రీతోకలహం, ప్రయాణం అంటే భయం.

కుజ శని దృష్టి: ప్రసూతి కాలేచకళత్రభావే, యమస్యభూమీతనయస్యవర్గే

తాభ్యాంప్రదృష్టే వ్యభిచారిణీ స్యాద్భర్తా పితస్యావ్యభిచారకర్తా

సప్తమం కుజశని వర్గాలకు చెందినదై సప్తమానికి కుజశనుల దృష్టి ఉంటే అతని భార్య భర్త ప్రోత్సాహంతో వ్యభిచారిణి అవుతుంది. (ఈ యోగం ఉన్నప్పుడు ఆమె జాతకం ద్వారా ఆమె పతివ్రత అయితే అతడు వ్యభిచారి అవుతున్నాడు)

అష్టమానికి కుజదృష్టి: రంధ్రం గృహం భౌమనిరీక్షితం, చ, హర్ష స్తథావస్తి విశేషపీడా

లోహాద్భయం వాధన ధాన్యనాశోమా ర్గేభయం తస్కరతోధనవ్యయః

- బృహద్యవనజాతకం

సంతోషం, పొత్తికడుపులో అనారోగ్యం, లోహంవల్ల భయం,

ధనధాన్య నాశం, ప్రయాణంలో భయం, దొంగల వలన ధన నష్టం.

నవమానికి కుజ దృష్టి: భాగ్యనామ భవనే కుజేక్షితేభాగ్యవృద్ధిరపివైన రస్యహి

శాలకేనసహసత్యనాశనం ధర్మయుక్త దపి చోగ్రతాసుఖం

భాగ్యవృద్ధి, బావమరిదితో కలసి సత్యమును నశింపజేయడం,

ధర్మం ఉన్నా ఉగ్రత్వం కలిగి ఉండడం సుఖం లోపించడం

దశమానికి కుజ దృష్టి: కర్మభావ భవ నేక్షకే కుజే సర్వ సిద్ధి సముపస్థితిః సుఖం

ఆత్మ విక్రమ దశాగమే నృణాం జాయతేఖలు మహోదయోనరః

అన్ని కార్యాలు సిద్ధిస్తాయి. సుఖం, బలంగల తన దశలో కుజుడు జాతకునికి గొప్ప అభివృద్ధి నిస్తాడు.

లాభానికి కుజ దృష్టి: సత్యాయ భావేకుజ వీక్షితేచ ఆయుర్వివృద్ధిః స్త్రియా గర్భనాశః

బుద్ధి కాయసమపే తృతీయకే పుత్ర సౌఖ్యమ పిచతుష్పదాత్ సుఖం -

ఆయుర్వృద్ధి, స్త్రీకి గర్భనాశం సమరాశియైన (వృశ్చికం) పంచమానికి లగ్నానికి ఆధిపత్యం పుట్టినపుడు తృతీయ వయస్సులో పుత్ర సౌఖ్యం చతుష్పాత్సుఖం లభిస్తాయి

లాభాల యే మంగళ యుక్తదృష్టే ప్రభూతభూషామణి హేమవృద్ధిః

విచిత్రయాత్రాబహుసాహసైః స్యాత్ నానాకళాకౌశల బుద్ధి యోగైః

లాభస్థానం కుజయుతమైనా కుజదృష్టమైనా ఆభరణాలు, మణులు, బంగారం వృద్ధి చెందుతుంది. సాహస యాత్రలు కళాకౌశలం, బుద్ధి విశిష్టత లభిస్తాయి.

వ్యయానికి కుజదృష్టి: వ్యయగృహేసతి భౌమవిరీక్షితే పితృసుఖంన కరోతి నరస్యహి

సకల శత్రు వినాశన కరః సదాతదపి చాన్య జనార్ధి సుఖక్షయం

వ్యయానికి కుజదృష్టి ఉంటే పితృ సుఖం ఉండదు. శత్రువులను నశింపజేస్తాడు.

ఆయినా శత్రువులవలన ఆందోళన ఉంటుంది. సుఖం నశిస్తుంది. ద్రవ్యంహరేద్భూమిపతి స్తతస్యవ్యయాలయే వా కుజయుక్త దృష్టే రాజువలన ధననష్టం.

# లగ్న కుజుడు

**కుజుడు మేష లగ్నంలో:** పుష్టి కలశరీరం, ఆత్మబలం, అష్టమ దృష్టివలన ఆరోగ్యలోపం, పూర్ణాయువు. సప్తమ దృష్టితో సప్తమం శుక్ర క్షేత్రం దర్శిస్తూన్నందువలన భార్యకు సంబంధించిన, వృత్తికి సంబంధించిన చికాకులు ఇస్తాడు.

**వృషభ లగ్నంలో:** రక్తదోషాలు, ధాతుక్షీణత, దుర్బలత, ఉన్నా శరీరం శక్తి వంతమౌతుంది. చతుర్థభావాన్ని దర్శిస్తూన్నందువలన తల్లి, భూమి, ఇల్లు, మొదలైన వాటి సుఖంలోపిస్తుంది. స్వక్షేత్రమైన (వృచ్ఛికం) సప్తమాన్ని దర్శిస్తూన్నందువలన భార్యాసౌఖ్యం, మిత్రస్థానమైన (ధనుస్సు) అష్టమాన్ని దర్శిస్తూన్నందువలన ఆయువు ఆరోగ్యం మొదలైన విషయాల్లో చిన్నచిన్న ఇబ్బందులున్నా సుఖమిస్తాడు.

మిథునలగ్నంలో :- శరీరశ్రమద్వారా ధనార్జన శత్రువులపై విజయం, కోపం, కలహశీలం, చతుర్థదృష్టివలన తల్లి, ఇల్లు, భూమి మొదలైన విషయాల్లో అసంతుష్టితో గూడిన లాభం, సప్తమి దృష్టి (ధనస్సు) వలన భార్యకు అనారోగ్యం, ఇబ్బందులు, వృత్తిలో శ్రమతో లాభం, ఉచ్ఛదృష్టి (మకరంపై అష్టమ దృష్టి) వలన ఆయువు, ఆరోగ్యం, ఇస్తాడు.

**కర్కాటక లగ్నంలో:** శరీర సౌందర్యం, ఆరోగ్యం తక్కువ. విద్య తండ్రి, వృత్తి, సంతానం, విషయాల్లో ఇబ్బందులు, చతుర్థదృష్టి వలన తల్లి, భూమి, ఇల్లు మొదలైన విషయాల్లో సుఖం, సప్తమ ఉచ్ఛదృష్టి వలన భార్యవిషయంలో అభివృద్ధి ఉన్నా తృప్తి తక్కువ, వృత్తిలో శ్రమతో

గూడిన అభివృద్ధి అష్టమాన్ని శత్రు దృష్టితో చూచినందువలన (అష్టమం కుంభం శత్రుక్షేత్రం) ఆకస్మికనష్టాలు ఆరోగ్యలోపం.

**సింహ లగ్నంలో:** ప్రభావ శాలిత్వం, భాగ్యం, ధర్మాచరణ, ఈశ్వర భక్తి, చతుర్థం స్వక్షేత్రం దర్శించినందువలన తల్లి, భూమి, ఇల్లు, మొదలైన సౌఖ్యాలు. సప్తమాన్ని (కుంభం శత్రుక్షేత్ర) శత్రుదృష్టితో చూడడంవల్ల వృత్తిలోను భార్య విషయంలోనూ ఇబ్బందులు, అష్టమాన్ని (మీనం మిత్ర క్షేత్రం) మిత్ర దృష్టితో చూచినందువలన ఆరోగ్యం ఆయువు, ఆకస్మిక లాభాలు.

**కన్యా లగ్నంలో:** అష్టమాధిపతి లగ్నంలో ఉన్నందువలన ఆరోగ్యలోపం, శారీరక సౌదర్యం తక్కువ. సోదర సౌఖ్యం (సోదర స్థానానికి లాభంలో) పరాక్రమం. చతుర్థ దృష్టి వలన తల్లి, భూమి, సుఖం తక్కువగా ఉంటుంది. సప్తమాన్ని (మీనం మిత్ర రాశి) మిత్ర దృష్టితో చూసినందువలన భార్య విషయంలోనూ, వృత్తి స్థానంలోను కొన్ని ఇబ్బందులుంటాయి. అష్టమాధిపతి అష్టమాన్ని చూడడంవలన ఆయువు ఆరోగ్యం ఆకస్మికలాభం బాగుంటాయి. కాని మొత్తంమీద జీవనం సంఘర్షణాత్మకంగా ఉంటుంది.

**తులా లగ్నంలో:** శారీరక సుఖం, ప్రతిష్ఠ, బాగుంటాయి. ధనం, కుటుంబ సౌఖ్యం బాగుంటాయి. ఉచ్చదృష్టితో చతుర్థాన్ని (మకరం కుజునికి ఉచ్చ) దర్శించడంవలన తల్లి, భూమి, గృహం మొదలైన సుఖాలు బాగుంటాయి. స్వక్షేత్రమైన సప్తమాన్ని దర్శించినందువలన వృత్తిస్థానంలోను భార్య విషయంలోను సుఖం బాగుంటుంది. అష్టమాన్ని దర్శించినందువలన ఆయువు బాగున్నా, ఉదర సంబంధమైన అనారోగ్యాలుంటాయి.

**వృశ్చిక లగ్నంలో:** శారీరిక శక్తి, అధికంగా ఉంటుంది. శత్రువులను జయిస్తాడు. చతుర్థాన్ని (కుంభం శత్రురాశి) శత్రు దృష్టితో చూడడం వలన గృహసౌఖ్యం తగ్గుతుంది. శుక్రునితో కుజునకు స్వభావ సామ్యం లేనందువలన సప్తమ దృష్టితో వృషభాన్ని చూసినందువలన వృత్తి స్థానంలోను, భార్య విషయంలోను కలతలుంటాయి. అష్టమ స్థానాన్ని దర్శించినందువలన ఆయువు బాగున్నా ఆరోగ్య విషయంలో కొన్ని ఇబ్బందులుంటాయి.

**ధనుర్లగ్నంలో:** శరీర శక్తి, శ్రమించేనైపుణ్యం, విద్య, సంతానం, బాహ్య సంబంధాలు, అభివృద్ధి కరంగా ఉంటాయి. మిత్ర దృష్టితో (మీనం మిత్ర రాశి) చతుర్థాన్ని చూస్తున్నందువలన కొద్ది లోపాలున్నా తల్లి, భూమి, వాహనం విద్య మొదలైన విషయాల్లో సత్ఫలితాలుంటాయి. సప్తమాన్ని చూస్తున్నందువలన వృత్తి స్థానంలోను భార్య విషయంలోనూ కొన్ని ఇబ్బందులుంటాయి. అష్టమాన్ని నీచదృష్టితో (కర్కాటకం నీచ) చూస్తున్నందువలన ఆరోగ్యవిషయంలో కొన్ని లోపాలుంటాయి.

మకర లగ్నంలో: శత్రు క్షేత్రం, మరియు ఉచ్ఛ అయిన మకరంలో ఉన్నందువలన ఘర్షణాత్మమైౖ కృషి. శరీర సౌందర్యం, వ్యాయామాదులచే కాపాడుకుంటున్న శరీరశక్తి ఉంటాయి. స్వక్షేత్రాన్ని (మేష స్వక్షేత్రం) చతుర్థదృష్టితో చూస్తున్నందువలన భూమి, ఇల్లు విద్య మొదలైన రంగాల్లో పరిపూర్ణ సౌఖ్యం లభిస్తుంది. ఆర్భాటం ఎక్కువగా ఉంటుంది. సుఖం ధనం చాతుర్యం ఉంటాయి. సప్తమాన్ని [illegible] దృష్టితో చూడడం వలన భార్య విషయంలోను సామాజిక సంబంధాల విషయంలోను [illegible] ఇబ్బందులుంటాయి. అష్టమాన్ని మిత్రదృష్టితో చూస్తున్నందువలన ఆరోగ్యం, ఆయువు [illegible]టాయి.

కుంభ లగ్నంలో: శారీరక సౌందర్యం, [illegible] శక్తి [illegible]గుంటాయి. ఇతరులపై తన ప్రభావాన్ని చూపే వ్యక్తిత్వముంటుంది. సోదరుల [illegible], పరాక్రమం అభివృద్ధి చెందుతాయి. చతుర్థ దృష్టి వలన తల్లి, భూమి, ఇల్లు మొదలైన వాటి సుఖం సామాన్యంగా ఉంటుంది. మిత్ర దృష్టితో సప్తమం దర్శించినందువలన భార్య, వృత్తి, విషయాల్లో సామాన్య సౌఖ్యం ఉంటుంది. అష్టమాన్ని దర్శించినందువలన ఆయువు ఆరోగ్యం బాగుంటాయి.

**మీన లగ్నంలో:** శరీరశక్తి ప్రభావం బాగుంటాయి. ధనం, కుటుంబం, భాగ్యం, వృద్ధి చెందుతాయి. చతుర్థాన్ని చూస్తున్నందువలన తల్లి, భూమి, విద్య మొదలైన విషయాలు సామాన్యంగా ఉంటాయి. సప్తమ దృష్టి వలన వృత్తి, భార్య విషయాలు సామాన్యంగా ఉంటాయి. అష్టమాన్ని చూస్తున్నందువలన ఆయువు ఆరోగ్యం బాగుంటాయి.

లగ్నంలో కుజుడు: శరీరం ఉష్ణతత్త్వంతో ఉంటుంది. శ్రమను ఓర్చుకోగల శక్తి గల శరీరం కల్గిఉంటారు. కండలు గల శరీరంతో ఉంటారు. గిరజాలు గల పొట్టి బిరుసు జుట్టు కలిగి ఉంటారు. ధైర్య సాహసాలుంటాయి. తన కవసరం ఉన్నా లేకున్నా కల్పించుకొనే చొరవ కలిగి ఉంటారు. ఆలోచన తక్కువ, ఉద్రేకం ఎక్కువ, కలహ ప్రియత్వం, అభిమానం, గర్వం, కార్య సాధనాదీక్ష, తొందరపాటు, తీవ్రమైన కోపం రాగద్వేషాలు కలిగి ఉంటారు. ఆగ్రహానుగ్రహాలు రెండూ విపరీతమే. ఆశ్రితులైన దీనులను ఆదుకోవడం, విద్వేషులను పీడించడం ఉంటుంది. గాయాల వలన, వాహనాలవలన, కలహాల వలన ఇబ్బందులు ప్రమాదాలు ఉంటాయి. రక్తపోటు, తలనొప్పి, రక్త దోషాలు, ఉండే అవకాశం ఉంది. విధేయత తక్కువ. చిన్నదనంలో క్రమశిక్షణ లేనిచో తరువాత దుడుకు తనం కలవారౌతారు. యోగప్రదులు కాని శని, రవుల దృష్టి, యురేనస్ దృష్టి ఉంటే, దొంగల నాయకులు, హంతకులు అయ్యే అవకాశం ఉంది.